# విషయసూచిక


గ్రంథకర్త నుండి ఒకమాట : ఈ వాఖ్యానం మీకు ఎలా సహాయపడగలదు ? 03

మంచి బైబిల్ ద్యానంనకు మార్గదర్శిని : నిరూప సత్యమునకు ఒక వ్యక్తిగత అన్వేషణ 05

ద్వితియోపదేశకాండం పరిచయం 12

ద్వితియో – 1 .......................................................................................... 16

ద్వితియో – 2 .......................................................................................... 42

ద్వితియో – 3 .......................................................................................... 55

ద్వితియో – 4 .......................................................................................... 71

ద్వితియో – 5 .......................................................................................... 81

ద్వితియో – 6 .......................................................................................... 98

ద్వితియో – 7 .......................................................................................... 109

ద్వితియో – 8 .......................................................................................... 122

ద్వితియో – 9 .......................................................................................... 146

గ్రంథకర్త నుండి ఒకమాట : ఈ వాఖ్యానము ఎలా నీకు సహాయపడగలదు ?

## A word from the author : How can this commentary help you

బైబిల్ వాఖ్యానము అనేది ఒక ఆత్మీయ మరయు హేతువాత విదానము ఇది పూర్వకాలమందు గ్రంథకర్తలకు దేవుని నుండి ప్రేరితమైన వర్తమానమును అర్ధము చేసుకుని నేటి దినమునకు అన్వయం చేసుకొనుటకు చేసే ప్రయత్నము. ఆత్మీయ విధానము ప్రాముఖ్యమైనదైనప్పటికి దానిని నిర్వచించటము కష్టతరము ఇది దేవునికి లోబడటమును మరియు తెరువబడటమును సూచిస్తుంది. (1) దేవుని కొరకు, (2) దేవుని తెలిసుకొనుటకు, మరియు (3) దేవుని సేవించుటకు ఆకలి కలిగియుండాలి. ఈ విధానములో ప్రార్థన, ఒప్పుదల మరియు జీవనశైలి మార్పునకు ఇష్టత నిమగ్నమైఉంటాయి. వాఖ్యాన విధానంలో ఆత్మ ముఖ్యమైనప్పటికి, యధార్ధ, దైవిక క్రైస్తవులు బైబిలను వేర్వేరుగా అర్ధము చేసుకోవడము ఒక మర్మము. హేతువాద విధానము వివరించుటకు సులభతరము. మనము మన వ్యక్తిగత లేక వర్గపరమైన అభిప్రాయములచే ప్రభావితం చేయబడకుండా వాక్యము విషయములో ఏకాగ్రతను చూపించాలి. మనము అందరము చరిత్ర పరంగా కట్టుబడిఉన్నాము. మనలో ఎవరము బాహ్య, తటస్థ వాఖ్యాన కర్తలము కాము. ఈ వాఖ్యానము మూడు వాఖ్యాపనమైన సూత్రములు కలిగిన హేతువాద విధానమును ఇచ్చి మన స్వంత అభిప్రాయములను జయించుటకు సహాయపడును.

### 1. మొదటి నియమము

మొదటి నియమము, ఒక బైబిల్ పుస్తకము వ్రాయబడిన చరిత్ర అమరిక మరియు దాని గ్రంథకర్త యొక్క ప్రత్యేక చారిత్రక సందర్భమును గుర్తించటము అసలు గ్రంథకర్త ఒక ఉద్దేశ్యమును తెలియజేయుటకు ఒక వర్తమానమును కల్గియున్నాడు. అసలైన పూర్వపు ప్రేరిత గ్రంథకర్తకు లేని వాక్యపు అర్ధము మనకు ఎటువంటి అర్ధమును కలుగజేయదు. గ్రంథకర్త ఉద్దేశ్యము కాని, మన చారిత్రక, మానసిక, సాంస్కృతిక, వ్యక్తిగత లేక వర్గపు అవసరము మూలముకాదు. అన్వయము వాఖ్యానములో ఒక అంతర్గత భాగస్వామి, కాని సరిఅయిన వాఖ్యానము ఎప్పుడూ ఒక అన్వయమును అనుసరిస్తుంది. ప్రతి బైబిల్ వాక్యము ఒకే ఒక్క అర్ధమను కల్గియుంటుందని మాటి మాటికి చెప్పబడుతుంది. ఈ అర్ధము అసలైన బైబిల్ గ్రంథకర్త ఆత్మనాయకత్వముతో ఆయన యొక్క కాలమునకు తెలియజేయబడుతుంది. ఈ ఏక అర్ధము వేర్వేరు సంస్కృతులకు మరియు పరిస్థితులకు సాధ్యమైన అన్వయములను ఇవ్వవచ్చు. ఈ అన్వయవములు అసలు గ్రంథకర్త యొక్క ముఖ్య సత్యమునకు సంబంధము కలిగియుండాలి. ఈకారణము చేతనే ఈ ధ్యాన మార్గదర్శక వాఖ్యానము బైబిల్ యొక్క ప్రతి పుస్తకమునకును ఉపోద్ఘాతమును ఇచ్చినది.

### 2. రెండవ నియమము

సాహిత్య భాగములను గుర్తించటము రెండవ నియమము ప్రతి బైబిల్ పుస్తకము ఒక ఐక్యపు పత్రము ఒక సత్య దృక్పధమును తీసుకొని వేరొక దానిని విడిచిపెట్టుటకు వాఖ్యనకర్తలకు హక్కులేదు. కాబట్టి ఒక్కొక్క సాహిత్య భాగమును వాఖ్యానించేముందు ఆ పుస్తకమంతటి ఉద్దేశ్యమును అర్ధం చేసుకోవాలి. వేర్వేరు భాగములు – అధ్యాయము వాఖ్యా విభాజనలు లేక వచనములు – ఆ భాగము అంతా చెప్పలేని అర్ధమను చెప్పలేవు. వాఖ్యానము మొత్తమంతటి వ్యవకలనపు విధానము నుండి మిగిలిన భాగములు వ్యాప్తి విధానమునకు వెళ్ళాలి. కాబట్టి ఈ ధ్యాన మార్గదర్శక వాఖ్యానము ప్రతి సాహిత్య భాగపు వాక్య విభజనకు అమరికను ఇచ్చి దానిని విశ్లేషించుటకు సహాయపడును. వాక్య విభజన మరియు అధ్యాయములు ప్రేరితమైనవి కావు గాని ఆలోచన భాగములను గుర్తించుటకు సహాయపడును. వాక్యము లేక పద అంతస్తులో కాకుండా వాక్య సముదాపు అంతస్తులో వాఖ్యానించుట – బైబిల్ గ్రంథకర్త అసలైన అర్ధమును అనుసరించుటకు మూలము. వాక్య సముదాయాలు ఒక వాక్య అంశము లేక సారాంశముపైన ఆధారపడి ఉంటాయి. సముదాయములోని ప్రతిపదము, వాక్యము ఈ ఐక్య అంశమునకు ఎదోవిధంగా సంబంధం కల్గియుంటుంది. అవి ఈ ఐక్య అంశమును పరిమితం చేస్తాయి. వ్యాప్తి చేస్తాయి, వివరిస్తాయి. లేక ప్రశ్నిస్తాయి. సరిఅయిన వాఖ్యానమునకు వాక్య సముదాయము నుండి వాక్య సముదాయములో గ్రంథకర్త యొక్క అసలు అర్ధమును చేసుకొని దాని ద్వారా పూర్తి పుస్తకమును చేసు సాహిత్య భాగములలోనికి వెళ్ళటము ఈ ధ్యాన మార్గదర్శక వాఖ్యానము. ఆధునిక ఇంగ్లీష్ అనువాదములు పోలికను ఇచ్చి ఆకార్యమును చేయుటలో సహాయ పడుతుంది. ఈ అనువాదములు వేర్వేరు అనువాద సిద్దాంతములను తెలియజేయును గనుక ఎన్నిక చేయబడినవి.

1. యునైటెడ్ బైబిల్ సొసైటీ యొక్క గ్రీకు వాక్యపు రివైస్డ్ 4వ ఎడిషన్ (**UBS**[4]) ఈ వాక్యము ఆధునిక వాక్యపు పండితులచే విభజించబడినది.

2. న్యూకింగ్ జేమ్స్ వెర్సన్ (**NKJV**) టెక్సటస్ రీసెప్టస్ అనెడి గ్రీకు ప్రతుల సాంప్రదాయమును అనుసరించి పదమునకు పదముగా అనువదించబడినది. ఇతర అనువాదముల కంటే దీని వాక్య విభజనలు దీర్ఘముగా ఉన్నవి.

3. న్యూరివైస్డ్ స్టాండర్డ్ వెర్సన్ (**NRSV**) అనేది పదమునకు పదము అనువాదమునకు సవరించబడినది. క్రింది ఆదునాతన వెర్సన్‌ల మద్య ఇది ఒక మద్య బిందువును కల్గించినది. దీని వాక్యపు విభజనలు అంశములను గుర్తించుటక సహాయపడును.

4. టూడేస్ ఇంగ్లీష్ వెర్సన్ (**TEV**) యునైటెడ్ బైబిల్ సొసైటీచే ప్రచురింపబడిన శక్తివంతమైన సమానపు అనువాదము. ఇది అదునాత బైబిల్ చదవరీ అర్ధము చేసుకొనుటకు వీలుగా అనువదించబడినది. తరచుగా, ప్రత్యేకంగా సువార్తలలో అంశము కాకుండా గ్రంథకర్తచే వాక్య సముదాయము జరిగినది. ఇది...లో కూడా ఇలానే జరిగింది. వాఖ్యానకర్తల ఉద్దేశ్యమునకు ఇది సరికాదు. **UBS**[4] మరియు **TEV** ఒకే వాస్తవముతో ప్రచురింపబడిన వాక్య సముదాయములు వ్యత్యాసం గలవు.

5. జెరూషలేం బైబిల్ (**JB**) ఫ్రెంచ్ కాథలిక్ అనువాదముల ఆధారిత అనువాదము. యురోపియన్ దృక్పథము నుండి సరిపోల్చుటకు చాలా సహాయకరంగా ఉంటుంది.

6. ముద్రింపబడిని వాక్యము 1995లో నవీనకరించబడిన న్యూ అమెరికన్ స్టాండర్డ్ బైబిల్ (**NASB**) ఇది పదమునకు పదము అనువాదము. వచనముల వాఖ్యానము ఈ వాక్య సముదాయములో జరిగినది.

**3. మూడవ నియమము**

బైబిల్ వేర్వేరు అనువాదములతో చదివి అర్థముల వ్యాప్తిని విరివిగా గ్రహించటము తరచు ఒక గ్రీకు పదము లేక వాక్యము వేర్వేరు రీతులుగా అర్థం చేయబడుతుంది. ఈ వేర్వేరు అనువాదములు అనేక ఎంపికలను తీసుకుని వచ్చి గ్రీకు ప్రతుల వ్యత్యాసమును గుర్తించుటకు మరియు వివరించుటకు సహాయపడును. ఇవి సిద్దాంతములను ప్రభావితం చేయవు గాని అవి పూర్వము ప్రేరిత గ్రంథకర్త యొక్క అసలు వాక్యమునకు మనలను తీసుకొని వెళ్ళును.

ఈ వాఖ్యాన గ్రంథము, విద్యార్ధికి వాఖ్యానములను వేగముగా పరిశీలించుటకు సహాయపడును. ఇది ఖచ్చితమైనదని కాదుగాని, ఆలోచింపజేసేది మరియు సమాచారమును ఇచ్చేది తరుచు ఇతర వాఖ్యానాలు సిద్దాంతపరమైనవిగా, మరియు వర్గ సంబంధముగా ఉండి సహాయపడవు. పురాతన వాక్యము ఎంత సందిగ్ధమైనదో తెలుపుటకు విస్తృత వాఖ్యానపు ఎంపికలు కావాలి. క్రైస్తవులలో కొంతమంది బైబిల్ వారి సత్యము యొక్క వనరు అని వాదించటంను విభ్రాంతిని కల్గిస్తుంది. ఈ నియమములు పురాతన వాక్యములతో వివాదములను జయించుటకు నాకు సహాయపడినవి. ఇది మీకును ఆశీర్వాదకరముగా ఉండాలని నా నిరీక్షణ

**బాబ్‌వుట్లీ,**
**ఈస్ట్‌టెక్సాస్ బాప్టిస్ట్ యూనివర్సిటీ,**
**జూన్ 27, 1996**

# మంచి బైబిల్ ద్యానమునకు మార్గదర్శిని : నిరూపిత సత్యము కొరకు వ్యక్తిగత అన్వేషణ :
# A Guide To Good Bible Reading A Personal Search for Verifiable Truth

మనం సత్యమును తెలుసుకోగలమా? అది ఎక్కడదొరుకుతుంది ? దానిని మనము తార్కికముగా నిరూపించగలమా? సంపూర్ణ అధికరాము ఎదైనా కలదా? మన జీవిఅను, మన లోకమును నడిపించే సంపూర్ణతలు ఎవైనా కలవా? జీవితమునక అర్థము కలదా? మనం ఎందుకు ఒక్కడ ఉన్నాము? మనము ఎక్కడికి వెళ్ళుచున్నాము! ఈ ప్రశ్నలు ప్రతి మానవుని వేదించేవి. ఇవి సృష్టి ఆదినుండి మానవ జ్ఞానమును వేదిస్తున్నవి (ప్రసంగి 1:31-18; 3:9-11) నా జీవితమునకు సంపూర్ణ కేంద్రమును అన్వేషించటము నేను జ్ఞాపకముంచుకోగలను. నీ కుటుంబములోని ఇతరుల సాక్ష్యము ద్వారా ప్రాథమికంగా నేను నా యౌవన కాలములోనే క్రీస్తునందు విశ్వాసముంచినాను. నేన వయస్సునందు ఎదిగినప్పుడు నాగురించి, నాలోకము గురించి ప్రనలు కూడా పెరగినాయి. నేను అనుభవించిన మరియు నేను ఎదుర్కొన్నపోటికి సాధారణ సంస్కృతిపరమైన మరియు మతపరమైనవి అర్థమునివ్వలేవు. నేను జీవించుచున్న లోకములో నా అన్వేషణతో అది అయోమయ వెదుకులాట, ఆశ, అప్పుడప్పుడు నిరాశ సమయము.

ఇటువంటి ప్రశ్నలకు జవాబులు ఉండినట్టుగా చాలామంది చెప్పుదురు. కాని పరిశీలన తరువాతనాకు అర్థమైనది. అవి అన్నియూ (1) వ్యక్తిగత తత్వాలు, (2) పురాతన గాథలు, (3) వ్యక్తిగత అనుభవాలు, లేక (4) మానసిక భావనలు పై ఆధారపడినవి. కొని నిరూపణలు, ఋజువులు, కొన్ని కారణాలు నేను జీవించుటకు, నా జీవితమునకు సంపూర్ణ కేంద్రమునకు కావాలి.

వీటిని నేను నా బైబిల్ ద్యానములో కనుగోన్నాను. బైబిల్ యొక్క నమ్మకత్వమునకు ఋజువులను వెదకటం ప్రారంభిచాను. దానిలో (1) పురాతత్వ శాస్త్రము వలన రూఢజ చేయబడిన బైబిల్ చరిత్ర నిజమును, (2) పాత నిబంధన ప్రవచనాల యొక్క ఖచ్చితత్వమును, (3) 16 సంవత్సరాల యొక్క దాని ఉత్పత్తి మరియు దాని వర్తమానములోని ఐక్యత, మరియు (4) బైబిల్‌ను సంద్రించుట ద్వారా శాశ్వతంగా మార్చబడిన ప్రజల వ్యక్తిగత సాక్ష్యములను తెలుసుకొన్నాను. క్రైస్తవ్యము, నమ్మకము మరియు విశ్వాసముల ఐక్యవ్యవస్థగా మానవజీవిత క్లిష్ట సమస్యలతో వ్యవహరించే సామర్ధ్యత కలది. ఇది కేవలము హేతువాద కారకములను మాత్రమే కాకుండా, బైబిల్ విశ్వాసం యొక్క అనుభవ దృక్పధము మానసిక ఆనందమను మరియు స్థిరత్వమును ఇచ్చింది.

నా జీవితమునకు సంపూర్ణ కేంద్రమును కనుగొనినట్టుగా నేను కనుగొన్నాను. క్రీస్తు లేఖఖనముల ద్వారా అర్థం చేయబడినాడు. ఇది ఒక అనుభవము మరియు ఒక మానసిక విడుదల. కాని ఈ పుస్తకమును గురించిన వేర్వేరు వ్యాఖ్యనములు, ఒకే సంఘముల నుండి మరియు బైబిల్ పరమైన స్కూల నుండి రావటం ద్వారా నాకు కలిగిన విభ్రాంతి నేను ఇంకా గుర్తునకు తెచ్చుకోగలను. బైబిల్ యొక్క ప్రేరణను మరియు నమ్మకత్వమును రూఢిపరుచుకోవటము ముగింపుకాదు గాని అది ఆరంభము మాత్రమే లేఖనములోని క్లిష్టతరమైన వాక్య భాగముల గురించిన వ్యాఖ్యనములను నిరూపించటము మరియు వ్యత్యాస మరియు వివాదస్పద వ్యాఖణములను ఎలా అని ప్రశ్నించటం మొదలు పెట్టాను.

ఇది నా జీవిత గురిగాను మరియు నా విశ్వాస యాత్రగానూ మారినది. క్రీస్తునందు విశ్వాసము (1) గొప్ప సమాధానమును మరియు ఆనందమును తీసుకొనివచ్చినది. నా సంస్కృతి (పోస్ట్-మోడర్న్) మద్యలో నా మనస్సు కొన్ని సంపూర్ణ సత్యములను వెదకటం ప్రారంభించినది, (2) వివాదప్పద మత వ్యవస్తల సిద్దాంతము; మరియు (3) మత వర్గముల యొక్క అహంకారము తెలియజేసినది. పురాతన సాహిత్యముల వ్యాఖ్యానము కొరకైన విదానములు వెదుకులాటలో నా స్వంత చారిత్రక, సాంస్కృతిక వర్గపరమైన మరియు స్వంత అనుభావములను కనుగోనటం ఆశ్చర్యం కలిగించినది. నా స్వంత అభిప్రాయములను బలోపేతం చేసుకొనుటకు బైబిల్‌ను చదువు చుండేవాడను నాస్వంత అభద్రలను మరియు చాలని స్థితిని గుర్తించుచునే ఇతరులను ఎదుర్కొనుటకు బైబిల్‌ను ఆధారము చేసుకొనే వాడను. దీనిని గుర్తించడం నాకు ఎంత బాధను కలిగించింది!

నేను ఎన్నటికి సంపూర్ణిడిని కానప్పటికిని శ్రేష్టమైన బైబిల్ చదవరీతిగా మారగలను. నా స్వంత అనుభవములను గుర్తించుట ద్వారా వాటిని పరిమితం చేసుకోగలను. అయినప్పటికి వాటి నుండి నేను సంపూర్తిగా విడిపింపబడలేక నా స్వంత బలహీనతలను ఒప్పుకున్నాను. తరుచుగా వ్యాఖ్యానకర్త శ్రేష్టమైన బైబిల్ ద్యానమునకు నీచమైన శత్రువుగా ఉండగలడు.

నా బైబిల్ ద్యానములోని కొన్ని పూర్వ ఆటోచనలను నేను మీకు తీసుకొనివస్తాను చదువరీ నాతో బాటు వాటిని పరిశీలించుగలడు.

**1. పూర్వ ఆలోచనలు**

ఎ. బైబిల్, ఏకైక సత్యదేవుని ప్రేరిత స్వయం ప్రత్యేకత అని నమ్ముచున్నాను. కాబట్టి అది అసలైన దైవిక గ్రంధకర్త (ఆత్మ) ఒక ప్రత్యేక సమయంలో ఒక మానవ గ్రంథకర్త ద్వారా ఇవ్వడినదై ఆ వెలుగు ఆశలోనే వ్యాఖ్యానించబడాలి.

బి. బైబిల్ ఒక సమైఖ్య ఉద్దేశ్యంతో అందరికొరకు వ్రాయబడినది అని నేను నమ్ముచున్నాను. ఒక చరిత్రలో మరియు సంస్కృతిక సందర్భంలో స్పష్టంగా మనతో మాట్లాడాలని, దేవుడు తన్నుతాను అర్పించుకొన్నాడు. దేవుడు సత్యమును దాచిపెట్టడు. కాని దానిని మనం అర్ధం చేసుకోవాలని ఆశిస్తాడు. కావునా బైబిల్ ఆదినపు వెలుగులో వ్యాఖ్యానించబడాలి కాని మన కాలపునాటి దికాదు. బైబిల్ మొదటి చదివిన వారు లేక వినిన వారికి చెప్పని విషయము మనకు చెప్పబడకూడదు. ఇది సాధారణ మానవుని మనస్సుకు మరియు సాధారణ మానవ సమాచార పద్దతులలో అర్ధం చేయబడుతుంది.

సి. బైబిల్ ఐక్య ఉద్దేశ్యము మరియు వర్తమానము ఉన్నదని నేను నమ్ముచున్నాడు. అది ఒక దానితో ఒకటి విభేదించుకోదు. కాబట్టి శ్రేష్టమైన బైబిల్ వ్యాఖ్యానకర్త బైబిలే

డి. అసలైన మరియు ప్రేరిత గ్రంథకర్త ఆశించిన ఒకే ఒక్క అర్ధమును ప్రతి వాక్యము కల్గియుంటుంది. అసలైన గ్రంథకర్త ఆశించిన సత్యమును తెలుసుకొనుటకు ఈ క్రిందివి సహాయ పడును.

1. సాహిత్యశైలి
2. చారిత్రక అమరిక
3. సాహిత్య సందర్భము
4. వాక్యపు క్రమపట్టీ
5. వర్తమానమును తెలియజేయుటకు ఉపయోగించిన వ్యాకరణము ప్రత్యేక గుణములు.
6. వర్తమానమును ఇచ్చుటకు ఎన్నుకొనబడిన పదములు
7. సమరూప వాక్యభాగములు

మనము వాక్యభాగమును ద్యానించుటలో ఇవి అన్నియూ ముఖ్యం అగుతాయి. మంచి బైబిల్ ద్యానమును గురించి నా పద్ధతిని వివరించే ముందు నేడు ఉపయోగించుచున్న కొన్ని సరికాని పద్దతులను మీకు తెలియజేస్తాను.

**2. సరికాని పద్దతులు**

ఎ. బైబిల్ పుస్తముల యొక్క సాహిత్య సందర్భమును నిర్లక్ష్యము చేసి, ప్రతివాక్యమును, భాగమును, ఒక్కొక్క పదమును కూడా సత్యమునకు సబందించినట్టు వాడి గ్రంధకర్త ఉద్దేశ్యమునకు సంబంధము లేని వ్యాఖ్యానమును తీసుకొని వచ్చేది.

బి. చరిత్ర సందర్భమును నిర్లక్ష్యము చేయుట

సి. చరత్ర సందర్భమును నిర్లక్ష్యము చేసి నవీన వ్యక్తిగత క్రైస్తవుల కొరకు వ్రాయబడిన దినపత్రికగా బైబిల్‌ను చదవటము

డి. చరిత్ర సందర్భమును నిర్లక్ష్యము చేసి వేదాంత / సిద్దాంత వర్తమానములుగా మార్చి అసలు చదువరులకు సంబంధంలేని వాటిన తీసుకురావటం.

ఇ. ఒకని స్వంత వేదాంతము, స్వంత సిద్దాంతములను, అసలు గ్రంథకర్తతో సంబంధం లేని అనసవర విషయములను తీసుకురావటం.

వ్రాయబడని మానవ సమాచారములో కనీసము మూడు సంబంధిత మూలకములు ఉండును.



గతంలో ఈ మూడింటిలో ఒక్క దానిపైననైనా వేర్వేరు నియములను కేంద్రీకరించేవారు. కాని బైబిల్ ప్రేరణను రూఢిపర్చుటకు సవరింపబడిన చిత్రము సరిఅయినది.




నిజముగా వ్యాఖ్యాన పద్ధతిలో ఈ మూడు కారకములు తప్పక చేర్చబడాలి. నిరూపణ ఉద్దేశ్యము కొరకై నా వ్యాఖ్యానము మొదటి రెండు కారకములపైన దృష్టిని కల్గియుంది. అసలు గ్రంథకర్త మరియు వాక్యము ఆత్మీయతను చేకూర్చుటలో మరియు (2) "చదువరీ స్పందన" వ్యాఖ్యానము (నాకు – అది ఏమి చెప్పుచున్నది). అనువాటికి సంపందిచుచున్నాను. దుర్వినియోగము ప్రతిదశలో కూడా జరుగును మనము ఎల్లప్పుడు మన తలంపును, స్వంత ఆలోచనలను, సూత్రాలను, మరియు అన్వయములను పరిశీలించుకోవాలి.

ఈ సరికాని పద్దతుల వెలుగులో కొన్ని సాద్యామయ్యే పద్దతులను చూసి సత్యనిరూపణ తెలుసుకొందాము.

**3. మంచి బైబిల్ ద్యానమునకు సాధ్యమయ్యేపద్దతులు**

అన్ని బైబిల్ వాక్యములకు వర్తింపజేసే కొన్ని వ్యాఖ్యన సూత్రములను తెలియజేతను హేటూరీడ్ బైబిల్ ఫర ఆల్ ఇట్స్ వర్త్, గార్డెన్ ఫీ మరియు డగ్లస్ స్లూవర్ద్ వ్రాసిన పుస్తకము ఈ విషయమై చాలా మంచిపుస్తకము.

నా పద్దతి ముఖ్యముగా చదువరీ పరిశుద్ధాత్మను బైబిల్‌ను వెలుగించుటకు అనుమతించుటపైన ఉండును.

1. అసలు గ్రంథకర్త
   - ఎ. చరిత్రక అమరిక
   - బి. సాహిత్య సందర్భము
2. అసలు గ్రంథకర్త యొక్క
   - ఎ. వ్యాఖరణ నిర్మాణం (సింటిక్స్)
   - బి. ప్రస్తుతపు పని వినియోగం
   - సి. శైలి
3. మన అవగాహన
   - ఎ. అవసరమైన సమరూప వాక్యభాగములు

మన వ్యాఖ్యానము వెనుక కారణములను మరియు తర్కములను చూపించవసిన అవసరత ఉంది. మన విశ్వాసమునకు మరియు అభ్యాసమునకు బైబిల్ ఒక్కటే వనరు. కాని దుఃఖకరము చాలాసార్లు క్రైస్తవులు దాని బోధను అంగీకరించుటలేదు.

వ్యాఖ్యాన తలంపులను నాలుగు ద్యాన చక్రములు సహాయపడును

**1. మొదటి ద్యాన చక్రము**

1. ఒకేసారి కూర్చుని పుస్తకము నంతా చదవటం, వేర్వేరు అనువాదములతో చదవటం
   - ఎ. పదమునకు – పదము (**NASB, NKJV, NRSV**)
   - బి. సమరూప శక్తివంతం (**TEV, JB**)
   - సి. వాక్యవిభజన (లివింగ్‌బైబిల్, ఆంప్లిఫైడ్ బైబిల్)

2. పుస్తకము అంతటి ముఖ్య ఉద్దేశ్యముకొరకు చూడటము అంశమును గుర్తించడము

3. ఒక సాహిత్య భాగమును వేర్పాటుచేయు, ఒక అద్యాయం ఒక వాక్యభాగము లేక ముఖ్యఉద్దేశ్యమును మరియు అంశమును తెలియజేసే వాక్యమును ప్రత్యేక పరుచుట

4. ఆదిక్య సాహిత్య శైలిని గుర్తించు

ఎ. పాతనిబంధన

(1) హీబ్రూ వృత్తాంతములు

(2) హీబ్రూ కావ్యములు

(3) హీబ్రూ ప్రవచనము

(4) ధర్మశాస్త్రము

బి. క్రొత్త నిబంధన

(1) సువార్తలు, అపొస్తలుల కార్యములు

(2) ఉపమానములు (సువార్తలు)

(3) పత్రికలు

(4) అంత్యకాల సాహిత్యము

**2. రెండవ ద్యాన చక్రము**

1. ఇంకొకసారి పూర్గిఆ మ్తొం పుస్తకములను చదువుట, దీర్ఘఅంశములను మరియు విషయములను గుర్తించుట.

2. ముఖ్య అంశములను క్రమపట్టీచేయుట

3. ఉద్దేశ్య వాక్యములను మరియు క్రమపట్టీని ఇతర సహాయక పుస్తకములలో చూడుము.

**3. మూడవ ధ్యాన చక్రము**

1. ఇంకొక సారి పూర్తిగా మొత్తం పుస్తకములను చదువటం, చరిత్ర సందర్భమును మరియు ప్రత్యేక సందర్భములను గుర్తించుట.

2. ఆ పుస్తకములో ప్రస్తావింపబడిన చారిత్రాత్మక విషయములను గుర్తించుట.

ఎ. గ్రంథకర్త

బి. కాలము

సి. స్వీకరించేవారు

డి. వ్రాయుటకు గల ప్రత్యేక కారణము

ఇ. వ్రాయుటకు గల ఉద్దేశ్యమునకు సంబంధించిన సాంస్కృతిక అమరిక

ఎఫ్. చారిత్రాత్మక ప్రజలకు మరియు సంఘటనలక గల సూచికలు

3. నీవు వ్యాఖ్యన పర్చదలసిన పుస్తకమునకు వాక్య విభాగముల పట్టీని విస్తరించుట. సాహిత్య భాగపు క్రమపట్టీని ఎల్లప్పుడు గుర్తించుట.

4. సహాయక పుస్తకముల ద్వారా నీ చరిత్ర అమరికను గుర్తించుట.

**4. నాలుగవ ధ్యాన చక్రము**

1. ప్రత్యేక సాహిత్య విభాగమును మరల అనేక అనువాదములతో చదువుట.

ఎ. పదమునకు పదము (**NASB, NKJV, NRSV**)

బి. శక్తివంత సమారూపం (**TEV, JB**)

సి. వాక్య విభజన (లివింగ్ బైబిల్, అంప్లెఫైడ్ బైబిల్)

2. సాహిత్య మరియు వ్యాకరణ అమరికలను చూచుట

ఎ. పునరావృత వాక్యములు, ఎఫెసి 1:6, 12,13

బి. పునరావృత వ్యాకరణ అమరికలు, రోమా 8:31

సి. విభేద అంశములు

3. ఈ క్రింది విషయములను వరుసలో ఉంచుట

ఎ. గుర్తింపు పదములు

బి. అసాధారణ పదములు

సి. ప్రాముఖ్య వ్యాకరణ అమరికలు

డి. క్లిష్టపదములు, వాక్యములు

4. సంబంధిత సమరూప వాక్యబాగములను చూసుట

ఎ. స్పష్టమైన బోధ

(1) క్రమానుసార వేదాంత పుస్తకములు

(2) రిఫరెన్సుబైబిల్

(3) కాంకర్డెన్స్

బి. విరుద్ధబావనలతో కూడిన బైబిల్ ద్వంత జతలు. బైబిల్ అంతయు ప్రేరితమైనది. మన వ్యాఖ్యానమునకు వాక్యపు సమతూకం అవసరము.

సి. అదే పుస్తకములోని సమరూప వాక్య భాగములను గుర్తించుట అదే గ్రంథకర్త లేక అదే శైలి. బైబిల్‌నకు ఒకే ఒక్క గ్రంథకర్త పరిశుద్ధాత్మ

5. చరిత్రక విషయములకును, సందర్భము కొరకైన ఇతర సహాయక పుస్తకములను ఉపయోగించుట

ఎ. స్టడీ బైబిల్

బి. బైబిల్ ఎన్‌సైక్లోపెడియా, హేండ్‌బుక్ నిఘంటవులు

సి. బైబిల్ పరిచయములు

డి. బైబిల్ వ్యాఖ్యాన గ్రంథములు

**4. బైబిల్ అనువాదము యొక్క అన్వయము**

ఈ సందర్భములో మనము అన్వయమునకు వెళ్ళుచున్నామా. వాక్యమును అర్థము చేసుకొనుటకు సమయమును తీసుకొనినాదు కాబట్టి అర్థము చేసుకున్న సత్యమును నా జీవితమునకు నీ సంస్కృతికి అన్వయింపజేసుకోవాలి. బైబిల్ అధికారమును నేను ఈవిధంగా నిర్వచిస్తాను. "బైబిల్ యొక్క అసలు గ్రంథకర్త తన కాలమునకు ఏది తెలియజేస్తున్నాడో తెలుసుకొని దాని మన కాలమును పరిస్థితికి అన్వయించటమే.

నీ వివరణ క్రమపట్టీ (రీడింగ్ సైకిల్ 3)నకు మార్గదర్శిని ఉంటుంది. అన్వయం వాక్య బాగ అంతస్తులో జరగాలి కాని పద అంతస్తులోకాదు. సందర్భములోనే పదములకు అర్థము ఉండును వాక్యములు సందర్భములో అర్థమును కల్గియుండును. వ్యాఖ్యాన విధానం పరిశుద్ధాత్మ ప్రేరిత అసలు గ్రంథకర్త ఉన్నాడు. మనము పరిశుద్ధాత్మ నడిపింపును మనము గ్రంథకర్త నుండి పొందుకొంటాము. వెలిగింపబడటము ప్రేరణకాదు.

మన ప్రస్తుత పరిస్థితులు బైబిల్‌ను వ్యాఖ్యానించవద్దు. బైబిల్‌ను మాట్లాడనివ్వండి. మన నియమములు కాకుండా వాక్యపు నియమములను పాటించాలి. అన్వయము స్వీకరించేవారి అవసరతపై ఆదారపడినప్పటికిని అసలు గ్రంథకర్త ఉద్దేశ్యముతో సంబంధము కలిగియుండాలి.

**5. వ్యాఖ్యానము యొక్క ఆత్మీయ కోణము**

ఇంతవరకు వ్యాఖ్యానము మరియు అన్వయవముల విధాన పద్ధతులను చర్చించాను. ఈ క్రింది చెక్‌లిస్ నాకు సహాయపడింది.

ఎ. ఆత్మ సహాయము కొరకు ప్రార్థించుట (1కొరి 1:26-2:16)

బి. వ్యక్తిగత క్షమాపణ కొరకు మరియు తెలియబడిన పాపముల నుండి కడుగబడుట కొరకు ప్రార్థించు (1యెహోను 1:9)

సి. దేవుని తెలుసుకోవాలనే ఆశ కొరకు ప్రార్థించు. (కీర్తన 19:7-14; 42:1; 119:1)

డి. నూతన తలంపును వెంటనే నీ జీవితమునకు అన్వయించుకో

ఇ. దీనుడుగా నేర్చుకొనే వాడిగా ఉండు.

వ్యాఖ్యాన విధానమునకు మరియు పరిశుద్మా ఆత్మీయ నడిపంపునకు మద్య నమతుల్యం ఉంచుట కష్టతరము. ఈ క్రింది మాటలు నాకు సహాయం చేసినది.

ఎ. జేమ్స్ వ్య. సిరే, స్క్రిప్టర్ ట్విస్టింగ్, 17-18

"దేవుని ప్రజల మనస్సునకు వెలుగు వచ్చును కాని ఆత్మీయ ఔన్నత్యులు కాదు. బైబిల్ క్రైస్తవ్యంలో గురు తరగతి లేదు. పరిశుద్ధాత్మ ప్రత్యేక తలాంతులను, జ్ఞానము, వివేచనను అనుగ్రహించును. ఈ తలాంతుకలిగిన వారే వాక్యపు వ్యాకరన కర్తలుగా ఉంచదు. ఇది ప్రజలు నేర్చు కొనుటను బట్టి ఉంటుంది. సంగ్రహపర్చుటకు, బైబిల్ అనేది మానవులందరి కొరకు దేవుని సత్య ప్రత్యక్షత, మన జీవితములకు సంపూర్ణ నిశ్చయతను అది ఇచ్చును. అది సంపూర్తిగా మర్మము కాదు గాని ప్రతి సంస్కృతిలోనూ ప్రజలకు అర్థము చేసుకొనుటకు సరిపోవును.

బి. బెర్నార్డ్‌రామ్, ప్రొటెస్టంట్ బిబ్లికల్ ఇంటర్‌ప్రెటెషన్, 75: "బైబిల్‌ను దేవుని మాటగా చదువుటకు, నోటిలో హృదయముతో చదవాలి, ఆశతో వేచియుండి, దేవునితో సంబాషణకొరకు ఎదురుచూడాలి. ఆలోచించకుండా, ఆ జాగ్రత్తగా మరియు విద్యాపరంగా చదివినట్లుగా బైబిల్‌ను దేవుని మాటగా చదవటం లేదు.

సి. హెచ్.హెచ్. రౌలీ దా రిలెవెల్స్ ఆఫ్ దాబైబిల్

బైబిల్‌ను జ్ఞాన యుక్తముగా అర్థము చేసుకొనటము ద్వారా దాని సంపదను అనుభవించలేము. బైబిల్‌ను సంపూర్తిగా అర్థముచేసుకోవాలి. ఈ పుస్తకపు ఆత్మీయ సందపలు, ఆత్మీయ జ్ఞానమునకు నడిపించాలి. అప్పుడే అది సంపూర్తి అవుతుంది. ఆత్మీయ విషయములు ఆత్మీయంగా వివేచింపబడాలి. బైబిల్ విద్యార్థి, ఆత్మీయ స్వీకరణ స్వభావం కలిగియుండాలి. దేవునికిలోబడి ఆయనను పట్టుకోవాలి.

## 6. ఈ వ్యాఖ్యాన పద్ధతి

ఈ ధ్యాన మార్గదర్శిక వ్యాఖ్యానము ఈ రీతిలో కొనసాగుటకు నీకు సహాయపడును.

ఎ. ప్రతి పుస్తకములను పరిచయము చేయు క్లుప్త చారిత్రాత్మక క్రమపట్టీ.

బి. సందోర్భోచిత తలంపులు ఇవి సాహిత్య విభాగము ఎలా అమర్చబడిందో తెలియజేయును.

సి. ప్రతి అద్యాయము ఆరంభములో వాక్య విభజనలు కలవు

1. యునైటెడ్ బైబిల్ సొసైటీ **UBS**[4]
2. న్యూ అమెరికన్ స్టాండర్డ్ బైబిల్ **NASB**
3. న్యూ కింగ్ జేమ్స్ వెర్సన్ **NKJV**
4. న్యూ రివైస్డ్ స్టాండర్డ్ వెర్సన్ **NRSV**
5. టూడేస్ ఇంగ్లీష్ వెర్సన్ **TEV**
6. జెరూసలేమ్ బైబిల్ **JB**

వాక్య విభజన ప్రేరితమైనదికాదు. అవి సందర్భమునుండి చెప్పబడినది. వేర్వేరు అధునాతన అనువాదములను పోల్చుట ద్వారా చెప్పబడిని అసలు గ్రంథకర్త ఆలోచనను అర్థము చేసుకొనవచ్చును. ప్రతి వాక్య విభజన ఒక విస్తార సత్యమును కల్గియుండును. దీనిని "అంశవాక్యము" అని పిలుచుదురు. ఈ ఐక్య అంశము సరియైన చారిత్రాత్మక మరియు వాకరణ అను పదమునకు ముఖ్యము ప్రతి వాక్యభాగము దాని పరిసర వాక్య భాగములక సంబంధం కల్గియుందని గుర్తుంచుకోవాలి. అసలు గ్రంథకర్త యొక్క ఆలోచనా సరళిని అనుసరించటం మన అవసరము.

డి. బాబ్స్ నోట్స్ వచనము వెంబడి వచన వ్యాఖ్యాన పద్దతి. ఇది అసలు గ్రంథకర్త ఆలోచనను అనుసరించుటలో సహాయపడును.

1. సాహిత్య సందర్భము
2. చారిత్రాత్మక, సాంస్కృతిక తలంపులు
3. వ్యాకరణ సమాచారము
4. పద ధ్యానము
5. సంబంధిత సమరూప వాక్యభాగములు

ఇ. కొన్ని సందర్భములలో న్యూ అమెరికన్ స్టాండర్డ్ వెర్షన్‌తో ఇతర అనువాదములు కలిసివస్తాయి.

1. యునైటెడ్ బైబిల్ సొసైటీ యొక్క గ్రీకు వాక్యపు రివైస్డ్ 4వ ఎడిషన్ (**UBS⁴**) ఈ వాక్యము ఆధునిక వాక్యపు పండితులచే విభజించబడినది.
2. న్యూకింగ్ జేమ్స్ వెర్షన్ (**NKJV**) టెక్సటస్ రీసెప్టస్ అనెడి గ్రీకు ప్రతుల సాంప్రదాయమును అనుసిరించి పదమునకు పదముగా అనువదించబడినది. ఇతర అనువాదముల కంటే దీని వాక్య విభజనలు దీర్ఘముగా ఉన్నవి.
3. న్యూరివైస్డ్ స్టాండర్డ్ వెర్షన్ (**NRSV**) అనేది పదమునకు పదము అనువాదమునకు సవరించబడినది. క్రింది ఆదునాతన వెర్షన్‌ల మద్య ఇది ఒక మద్య బిందువును కల్గించినది. దీని వాక్యపు విభజనలు అంశములను గుర్తించుటక సహాయపడును.
4. టూడేస్ ఇంగ్లీష్ వెర్షన్ (**TEV**) యునైటెడ్ బైబిల్ సొసైటీచే ప్రచురింపబడిన శక్తివంతమైన సమానపు అనువాదము. ఇది అదునాత బైబిల్ చదవరీ అర్థము చేసుకొనుటకు వీలుగా అనువదించబడినది. తరచుగా, ప్రత్యేకంగా సువార్తలలో అంశము కాకుండా గ్రంథకర్తచే వాక్య సముదాయము జరిగినది. ఇది...లో కూడా ఇలానే జరిగింది. వాఖ్యానకర్తల ఉద్దేశ్యమునకు ఇది సరికాదు. **UBS⁴** మరియు **TEV** ఒకే వాస్తవముతో ప్రచురింపబడిన వాక్య సముదాయములు వ్యత్యాసం గలవు.
5. జెరూషలేం బైబిల్ (**JB**) ఫ్రెంచ్ కాథలిక్ అనువాదముల ఆధారిత అనువాదము. యురోపియన్ దృక్పథము నుండి సరిపోల్చుటకు చాలా సహాయకరంగా ఉంటుంది.
6. ముద్రింపబడిని వాక్యము 1995లో నవీనకరించబడిన న్యూ అమెరికన్ స్టాండర్డ్ బైబిల్ (**NASB**) ఇది పదమునకు పదము అనువాదము. వచనముల వాఖ్యానము ఈ వాక్య సముదాయములో జరిగినది.

ఎఫ్. గ్రీకు చదువని వారికి, ఇంగ్లీష్ అనువాదములు పోలికతో వ్యత్యాసము సులభతరము అవుతుంది.

1. ప్రతుల వ్యత్యాసం
2. పరోక్ష పద అర్థము
3. వ్యాకరణ క్లిష్ట పదములు మరియు వాక్యములు
4. సందిగ్ధ వాక్యములు

జి. ప్రతి అద్యాయము చివరిలో చర్చాప్రశ్నలు ఉండి అద్యాయములోని వివిధ అంశములను ఆలోచింపజేస్తాయి.

# రోమీయులకు వ్రాసిన పత్రిక ఉపోద్ఘాతము

**ప్రారంభ వచనములు** (Opening Statements)

ఎ. రోమా పత్రికకు అనేది పౌలు యొక్క క్రమానుసారమైన మరియు వివరణలతో కూడిన వేదాంత పుస్తకము. ఈ పత్రిక రోమా పట్టణంలోని పరిస్థితుల వలన ప్రభావించబడినది. కాబట్టి ఇది "సందర్భోచిత పత్రిక" జరిగిన ఒక విషయ అ.పౌ.పౌలు. ఈ పత్రిక వ్రాయటానికి కారణమైనది. పౌలు పత్రికలలో సమస్యల వ్యవహారములో చాలా తటస్థమైన పత్రిక మరియు స్పష్టమైన సువార్త యొక్క ప్రదర్శన మరియు దైనందిన జీవితమునకు అవసరమైన సూచనలతో కూడిన పత్రిక.

బి. అ.పౌ.పౌలు యొక్క రోమా పత్రికలోని సువార్త ప్రదర్శన అన్ని తరములలోని సంఘ జీవితమును ప్రభావితము చేసినది.

1. రోమా 13. 13-14 వచనములు చదువుట ద్వారా క్రీ.శ. 386లో పరిశుద్ధుడైన అగస్టీన్ జీవితములో మార్పు చెందినవాడు.
2. కీర్తనలు 31.1కిని రోమా 1.17 9హాలు క్కుకు 2.4) తో సరిపోల్చి క్రీ.శ. 1513వ సంవత్సరములో మార్టిన్ లూథర్ యొక్క రక్షణ యొక్క అభిప్రాయము తీవ్రముగా మార్చబడినది.
3. లూథర్ యొక్క రోమా పత్రిక యొక్క పరిచయ ప్రసంగం ద్వారా క్రీ.శ. 1738లో జాన్‌వెస్లీ జీవితంలో మార్పు చెందినాడు.
4. రోమా పత్రికను తెలుసుకోవడం క్రైస్తవమునే తెలుసుకొనుటయే ఈ పత్రిక క్రీస్తు యొక్క జీవితము మరియు బోధను అని తరములలో సంఘమునకు పునాది సత్యముగా మలచినది.

**గ్రంథకర్త :** నిశ్చయముగా అ.పౌ.పౌలు యే గ్రంధకర్త పౌలు యొక్క శుభముల మాదిరి 1.1 కనిపిస్తుంది. అ.పౌ.పౌలు యొక్క "శరీరములోని ముల్లు" తన యొక్క తక్కువ కనుదృష్టి అని. దాని కారణముననే తనంతట తాను వ్రాయలేని కారణము చేత శాస్త్రియైన తెర్తియను వాడుకొనెని కాలము.

రోమా పత్రిక యొక్క సుమారు కాలము క్రీ.శ. 56-58 కొత్త నిబంధన పత్రికలలో ఖచ్చితమైన కాలము చెప్పబడిన పత్రిక ఇది. ఈ కాలము అ.పఔ. కార్యమును 20.2ను రోమా 15.17 తో పోల్చుట వలన ఖచ్చితముగా చెప్పబడింది.

ఈ పత్రిక పౌలు యొక్క మూడవ సువార్త ప్రయాణపు చివరలో యెరుషలేమునకు వెళ్ళే ముందు కొరింథు వద్ద బహుశా వ్రాయబడి యుండవచ్చు. యన్.యన్, బ్రూస్ మరియు ముర్రి హరిస్ యొక్క కొద్దిపాటి దత్తు తీసుకొనుటచే ఏర్పడిన పౌలు కాల పత్రికల కాలక్రమం.

**పుచ్చుకొనువారు**

ఎ. పెంతెకోస్తు రోజున మారు మనస్సు పొందినవారు యెరుషలేము నుండి తిరిగివెళ్ళి అక్కడి సంఘాన్ని స్థాపించి ఉండవచ్చు (అ.పొ.2. 10)

బి. సైపను హతమరణము తరువాత యెరూషలేము లోని సంఘమునకు గొప్ప హింస కలిగినందున చెదరి పోయిన శిష్యులు ఈ సంఘస్థులు కావచ్చును.

సి. పౌలు సువార్త ప్రయాణముల వలన మారుమనస్సు పొందిన వారు రోమాకు వెళ్ళి యుండవచ్చు. పౌలు రోమాకు వెళ్ళవలెనని అనుకొన్న ఈ సంఘమును ఎన్నడు దర్శించలేదు. అ.పౌ. 19.21 అ.పౌ. పౌలునకు అనేకమైన స్నేహితులు రోమాలో ఉండినారు. (రోమా 1.6) యెరూషలేమునకు ప్రేమ కానుకతో చెప్పిన తరువాత రోమా పట్టణము మీదుగా స్పానియాకు వెళ్ళవలెనని పౌలు యొక్క ఆలోచన అయి ఉండవచ్చు (రోమా 15.28) తూర్పు దేశాలలో తన యొక్క పరిచర్య ముగియబడినట్టుగా పౌలు భావించుచున్నాడు. పౌలు క్రొత్త పొలముల కొరకు వెతకుచున్నాడు (16.20–23). గ్రీసులో నున్న పౌలు నుండి రోమాకు ఈ పత్రికను తీసుకొను వెళ్ళు వ్యక్తి. రోమ్ వైపునకు ప్రయాణం చేయుచున్న సంఘ పెద్ద అయిన ఫీచే కావచ్చును. మొదటి శతాబ్దంలో ఒక గుడారము లనేయు వృత్తి కారముదైన ఒక యూదుడు కొరింథి యొక్క వెనుక వీధుల నుండి ఎందుకు వ్రాస్తున్నాడు. అన్న ప్రశ్న ఎంతో విలువైనది. మార్టిన్ లూథర్ ఈ పత్రికను "కొత్త నిబంధనలో ముక్ణ పుస్తకమని మరియు స్వచ్ఛమైన సువార్త" అని పిలుస్తున్నాడు. ఈ పత్రికలోని సువార్త వివరణ మారు మనస్సు పొందిన ఒక రబ్బీ. తార్సిసునకు చెందిన సౌలు. అన్యజనుల కొరకైన అపోస్థులుడైన పౌలులో ఈ పత్రిక విలువ కనిపిస్తుంది. పౌలు యొక్క అనేక పత్రికలు స్థనిక పరిస్థితులు వర్ణనతో నింపబడి ఉంటాయి. కాని రోమా పత్రిక కాదు. ఇది అపొస్తులుని యొక్క జీవితాంతపు విశ్వాసం యొక్క క్రమ ప్రదర్శన. తోటి క్రైస్తనుడా. నీవు గుర్తించావా "విశ్వాశము" నీతికరణ, నీతిమంతులుగా పిలువబడుట. దత్తత చేయబడుట "మరియు "శుద్ధీకరణ" అన్న సాంకేతిక పదములు రోమా పత్రిక నుండి యే వచ్చినవి అని.

**ఉద్దేశ్యం (Purpose)**

ఎ. స్పానిష్ సువార్త ప్రయాణం నిమిత్తము సహాయము చేయమని విన్న తూర్పు దేశాలలో తన అపొస్థులత్వపు పరిచర్య ముగించినట్లుగా చూసినాడు.

బి. రోమ్‌లో ఉన్న విశ్వసించిన యాదులకు మరియు విశ్వసించిన అన్యజనుల మధ్య ఉన్న సమస్యల గురించి చర్చించుట. ఈ సమస్యలు రోమ్ నుండి యాదులను వెలివేసిన తరువాత తిరిగివచ్చిన సమయమునకు యూదా క్రైస్థవ నాయకుల స్థానములో అన్యజన క్రైస్థవ నాయకులు నియమించబడిన కారణము.

సి. రోమా సంఘమునకు తన్ను పరిచయపరుచుకొనుటకు యెరూషలేములోని మారుమనస్సు పొందిన యూదుల నుండి (అపొ. 15లో యెరూషలేము సమాఖ్య), అసత్య యాదుల నుండి (గలతియులకు మరియు 11. కోరింది) 3, 10–13 లోని యాదుల నుండి) అన్యజనుల నుండి, (కొలస్సియులకు మరియు ఎఫెసియులకు) వీరు వారి తప్పుడు సిద్ధాంతములతో మువార్తను మిళితంచేయుట నుండి అధికమైన వ్యతిరేకత ఉన్నది.

డి. యేసు ప్రభువు యొక్క బోధకు ప్రమాదభరితంగా మరియు అజాగ్రత్త బోధను చేర్చుచున్నాడని నిందింపబడుచున్నాడు. రోమా పుస్తకము అనేది తన్నుతాను నిర్దోషి అని నిరూపించుకోవటానికి తన యొక్క సువార్తను ఒక క్రమ పద్ధతి చూపించి తన సువార్త సత్యము అని తెలియజేయటానికి పాత నిబంధనను మరియు యేసుక్రీస్తు బోధ (సువార్తలను) ఉపయోగించుచున్నాడు.

**క్లుప్త క్రమపట్టిక (Brief Outline)**

ఎ. ఉపోద్ఘాతము (1:1–17)

1. శుభములు (1:1–7)
   a. గ్రంథకర్త (1:5)
   b. గమ్యస్థానము (6–7)
   c. శుభాకాంక్షలు (7బి)
2. సందర్భము (1:8–15)
3. అంశం (1:16–17)

బి. దైవ నీతి యొక్క అవసరత (1:18–3:20)

1. అన్య జనాంగము యొక్క క్షీణత (1:18–32)

2. యూదుల యొక్క వేషధారణ (2:1–16)

3. యూదుల యొక్క తీర్పు (2:17:3:8)

4. విశ్వమంతటి మీద ఉన్న శిక్షా విధి (3:9–20)

సి. దైవికనీతి అనగా ఏమిటి (3:21–8:39)

1. విశ్వాసము వలననే నీతి (3:21– 8:39)

2. నీతి యొక్క ఆధారము : దేవుని వాగ్దానము (4:1–25)

ఎ. అబ్రహ మప యొక్క నిలకడ (4:6–8)

బి. దావీదు (4:6–8)

సి. సున్నతితో అబ్రహాము సంబంధము (4:9–12)

డి. అబ్రహామునకు దేవుని వాగ్దానము (4:13–25)

3. నీతిని సంపాదించుట (5:1–21)

ఎ. అంతఃకరణ అస్పదము : కృప మరియు చెప్పనశక్యము కాని సంతోషము (5:1–5)

బి. దృశ్యమైన ఆధారము : దేవుని అద్భుత ప్రేమ (5:6–11)

సి. ఆదాము, మరియ, క్రీస్తుల మధ్య పోలికలు. : ఆదాము దోషము, దేవుని ఏర్పాటు (5:12–21)

4. వ్యక్తిగత నీతితో దైవికనీతి విషయము (6:1–2)

ఎ. పాపము నుండి విడుదల (6:1–14)

1. ఉదపరించబడిన ఆటంకము (6:1–2)

2. బాప్తిస్మము యొక్క అర్ధము (6:3–14)

బి. అపవాదికి దాసుడా లేక దేవునికి దాసుడా : నీ ఎంపిక (6:15–23)

సి. ధర్మశాస్త్రముతో మానవుల వివాపము (7:1–6)

డి. ధర్మశాస్త్రము మంచిది, కాని పాపము మంచిని నిరోధించును (7:7–14)

ఇ. విశ్వాసిలోకొనసాగుతున్న మంచికిని చెడునకు ఉన్న పోరాటం (7:15–25)

5. దైవిక నీతి యొక్క పరిశీలించ గలిగే ఫలితాలు. (8:1–39)

ఎ. ఆత్మయందు జీవిత (8:1–17)

బి. సృష్టి యొక్క విడుదల (8:18–25)

సి. ఆత్మ యొక్క నిరంతర సహాయము (8:26–30)

డి. విశ్వాసము వలనైనా నీతి యొక్క న్యాయపరమైన విజయము (8:31–39)

డి. మానవులందరి కొరకైనా దైవిక చిత్తము (9:1–11–32)

1. ఇశ్రాయేలీయుల ఎంపిక (9:1–33)

ఎ. విశ్వాసం యొక్క నిజమాన వారసులు (9:1–13)

బి. దేవుని సార్వభౌమత్వము (9:14–26)

సి. అన్యజనులను కూడా చేర్చిన దేవుని విశ్వప్రణాళిక (9:27–33)

2. ఇశ్రాయేలీయుల యొక్క రక్షణ (10:1–21)
   - ఎ. దేవునినీతి / మానవుని నీతి (10:1–13)
   - బి. దేవుని కరుణ వర్తమానికుల యొక్క అవసరతను కోరుతుంది, ప్రపంచ పరిచర్యల కొరకు పిలుపు (10:14–18)
   - సి. ఇశ్రాయేలియుల నిరంతర అవిశ్వాసం (10:9–21)

3. ఇశ్రాయేలీయుల ఓటమి (11:1–36)
   - ఎ. యూదుల శేషము (11:1–10)
   - బి. యూదుల అసూయ (11:11–24)
   - సి. ఇశ్రాయేలీయుల తాత్కాలిక అంధకారం (11:25–32)
   - డి. పౌలు నుండి ఉప్పొంగిన స్తుతి (11:33–36
   - ఇ. దైవిక నీతి బహుమానం యొక్క ఫలితం (12:1–15:13)
     1. శుద్దీకరణ కొరకు పిలుపు(12:1–2)
     2. వరముల యొక్క ఉపయోగం (12:3–8)
     3. ఇతర విశ్వాసులతో విశ్వాసుల సంబంధం (12:9–21)
     4. ప్రభుత్వంతో సంబంధం (13:1–7)
     5. పొరుగువారితో సంబంధం (13:8–10)
     6. ప్రభువుతో సంబంధం (13:11–14)
     7. ఇతర సంఘ సభ్యులతో సంబంధం (14:1–12)
     8. ఇతరులపైన మన ప్రభావం (12:13–23)
     9. క్రీస్తును పోలిన సంబంధములు (15:1–13)
   - ఎఫ్. ముగింపు (15:14–33)
     1. పౌలు యొక్క వ్యక్తిగత ప్రణాళిక (15:14–29)
     2. ప్రార్థన కొరకైన విన్నపం (15:30–33)
   - జి. చివరి మాటలు (16:1–27)
     1. శుభాకాంక్షలు (16:1–24)
     2. ఆశీర్వాదం (16:25–27)

# ద్వితీయోపదేశకాండము - 1వ అధ్యాయము

నవీన అనువాదముల యొక్క వాక్య విభజన

| UBS | NKJV | NRSV | TEV | JB |
|---|---|---|---|---|
| శుభములు | శుభాకాంక్షలు | శుభములు | శుభములు | చిరునామా |
| 1:1-7 | 1:1-7 | 1:1-6 | 1:1 | 1:1-2 |
| | | | 1:2-6 | |
| | | | | 1:3-7 |
| | | 1:7ఎ | 1:7బి | |
| | | 1:7బి | 1:7బి | |
| రోమ్‌ను దర్శించాలనే | రోమ్‌ను దర్శించాలనే | కృతజ్ఞతాస్తుతులు | కృతజ్ఞతా ప్రార్ధన | కృతజ్ఞతా |
| పాల్ కోరిక | కోరిక | | | స్తుతి మరియు ప్రార్ధన |
| 1:8-15 | 1:8-15 | 1:8-15 | 1:8-12 | 1:8-15 |
| | | | 1:13-15 | |
| సువార్త యొక్క శక్తి | నీతిమంతుడు | పత్రిక అంశం | సువార్త యొక్క శక్తి | చెప్పబడిన అంశం |
| | మూలంగ బ్రతుకును | | | |
| 1:16-17 | 1:16-17 | 1:16-17 | 1:16-17 | 1:16-17 |
| మానవుని అపరాధ భావం | అవినీతిపై దేవుని ఉగ్రత | పాపం పైన దేవుని తీర్పు | మానవుని అపరాధభావం | అన్యజనుల |
| | | | | ఎడల దేవుని కోపం |
| 1:18-23 | 1:18-32 | 1:18-23 | 1:18-23 | 1:8-25 |
| 1-24-32 | | 1:24-25 | 1:24-25 | |
| | | 1:26-27 | 1:26-27 | |
| | | 1:28-32 | 1:28-32 | 1:28-32 |

వాక్యపు పరిధి యొద్ద అసలైన గ్రంధకర్త ఉద్దేశ్యంను అనుసరించుట....

ఈ వ్యాఖ్యానం చదువుటకు ఉపయోగపడే మార్గదర్శిని......

కావున బైబిల్ యొక్క వ్యాఖ్యానమును నీవు సొంతంగా చేసుకొనుటకు భాద్యుడవు. మనమందమం మనకు ఇవ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, పరిశుద్ధ గ్రంథం మరియు పరిశుద్ధాత్మ వ్యాఖ్యానంలో ప్రాధాన్యత వహించవలెను. దీనిని నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు విడిచిపెట్టకూడదు.

అధ్యాయమంతటినీ ఒకేసారి చదవాలి, అంశాలను గుర్తించాలి. నీ అంశ విభజనము పైన ఇవ్వబడిన నవీన అనువాద విభజనలతో సరి పోల్చుకోవాలి. విభజన అనేది ప్రేరణ కాదు. కాని ఇది అసలు గ్రంధకర్త యొక్క ఉద్దేశ్యమును తెలుసుకొనుటకు ఉపయోగపడును వ్యాఖ్యానమునకు ఇది కేంద్రమై వున్నది. ప్రతి వాక్య విభజనకే ఒక్క విభజనను కలిగి ఉండును.

1. మొదటి వాక్య భాగం
2. రెండవ వాక్య భాగం
3. మూడవ వాక్య భాగం
4. మొదలగునవి.

**సందర్భోచిత తలంపులు.....**

ఎ) 1-7 వచనాలు పత్రికకు పరిచయంను రూపొందిస్తున్నాయి. ఇది పౌల్ యొక్క పత్రికలలో అన్నిటికంటే విస్తరమైన ఉపోద్ఘాతం అపోస్తులుడైన పౌల్ గురించి వ్యతిరేక సమాచారం వినిన తనను వ్యక్తిగతంగా ఎరుగని సంఘను తనను గురించి తన బోధ గురించి పరిచయం చేయటానికి ప్రయత్నించుచున్నాడు.

బి) 8-12 వచనాలు కృతజ్ఞతాస్తుతి ప్రార్ధన యొక్క ప్రారంభం. ఈ పద్ధతి గ్రీకుల పత్రిక నియమావళి ప్రత్యేకంగా పౌల్ యొక్క రచనాపద్ధతి.

సి) 16-17 వచనాలు పత్రిక యొక్క అంశంను తెలియజేస్తున్నాయి.

డి) 1:18-3:20 వచనాలు పౌల్ యొక్క సువార్తలోని సాహిత్య భాగమును రూపొందిస్తున్నాయి, మానవులందరూ తప్పిపోయి వున్నారు, వారందరికీ రక్షణ అవసరం (ఆదికాండం)

1. దుర్నీతి - అన్యజనులు
2. నీతికలిగిన - అన్యజనులు
3. యూదులు.

ఇ) రోమా 1:18 వచనం ఆదికాండం 3వ అధ్యాయంను ప్రతిబింబిస్తుంది. మానవులు దేవునితో సహవాసం కొరకు సృష్టించబడినారు. (ఆదికాండం 16:26-27 వచనాలు) అయిననూ మానవుడు జ్ఞానోదయంను మరియు శత్తి అగ్రగణ్యత యొక్క వాగ్దానమును ఎంపికచేసుకొన్నాడు. దాని ఫలితముగా మానవులు వారి కొరకు దేవుని మరువకొన్నారు. (దేవుడు లేడనే మానవ వాదన.)

దేవుడు దీనిని అనుమతించాడు, ఈ సమస్యకు ఇప్పుడే సూత్రకారుడు అయి వుండవచ్చును. దేవుని పోలికలతో ఉంచుచు అనేది బాధ్యత. కలిగి వుండటం, నీతికి బాధ్యత వహించడం, సేచ్ఛాచిత్తంను పరిణామములతో కలిగివుండటం. దేవుడు మానవుని తన చిత్తంతోను మరియు వారి చిత్తంతోను వేరు పరిచెను (నిబంధన సంబంధం) దయడు పరిణామములతో కూడిన దానిని ఎంచుకొనుటకు అనుమతించెను అప్పుడు దుఃఖించెను. (ఆదికాండం 6:5-07). కాని మానవుడు వారి సర్వహక్కులు మరియు బాధ్యతలు విషయములలో స్వతంత్రులు. మాటి, మాటికి చెప్పబడుతున్న మాట. దేవుడు వారి కప్పగించెను. (1:24, 26, 28). అనేది వారి స్వతంత్ర్యమునకు గుర్తు. కాని దేవుని యొక్క స్వంత తృణీకారంకాదు. ఇది దేవుని ఎంపిక కాదు. దేవుడు ఆశించిన లోకం కాదు. (ఆదికాండం 3:22, 6, 5-7, 11-13)

ఎఫ్) 1:18-3:20 యొక్క కధాంతసారాంశం 3:21-31లో కన్పిస్తుంది. ఇది సువార్త యొక్క మొదటి వాగ్దానం - పాపం చేసి దేవుని యొక్క క్షమాపన అవసరతను కల్గియున్నారు.

జి) రోమా 1:18-320 వచనాలలోని మొదటి సువార్త సాహిత్య విభాగంలో సాతానుకు లేక అపకారికి మానవుల యొక్క పతనం, వారి తిరుగుబాటునకు ఏ మాత్రం సంబంధం లేని విధంగా అపోస్తులుడైన పౌల్ తన సువార్త ప్రకటనలలో చెప్పటం ఆశక్తికరంగా కన్పిస్తుంది. ఈ భాగం ఆదికాండం 3వ అధ్యాయం యొక్క వేదాంతంను నిశ్చయంగా ప్రతిబింబిస్తుంది. రిఏడిపోయిన మానవుడు సాతానుని నిందించుటకు దేవుడు అనుమతించుట లేదు. (ఆది 3:13) లేక దేవునిని నిందించుటకు కూడా అనుమతించుటలేదు. (ఆది 3:12). మానవుడు దేవుని పోలికలో సృజించబడినాడు. (081:26:88) (5:13, 9:6). పంక చేసుకొనుటకు మానవుని శక్తి, అధికంను దేవుడు ఇచ్చెను. మానవులందరు ఆదాముతోను, వారి వ్యక్తిగత పాప విషయంలోను ఎంపిక చేసుకొనుటలో వారు బాధ్యతలు (3:23).

పద మరియు వాక్య ద్యానము

**NASB (నవీన) వాక్యము 1:1-6**

**క్రీస్తు దాసుడును, అపొస్తలుడుగా నుండుటకు పిలువడిన వాడును, దేవుని సువార్త నిమిత్తము ప్రత్యేకింపబడినవాడునైన పౌలు రోమాఓ ఉన్న దేవుని ప్రియులకందరికి అనగా పరిశుద్ధులుగా ఉండుటను పిలువబడినవారికందరికి (శుభమని చెప్పి) వ్రాయునది. మన తండ్రియైన దేవుని నుండియూ, ప్రభువైన యేసుక్రీస్తునుండియు, కృపాసమాధానములు మీకు కలుగుగాక దేవుడు తన కుమారుడును మన ప్రభువునైన యేసుక్రీస్తు విషయమైన ఆ సువార్తను పరిశుద్ధ లేఖనములయందు తన ప్రవక్తలద్వారా ముందు వాగ్దానము చేసెను. యేసుక్రీస్తు, శరీరమునుబట్టి దావీదు సంతానము గాను, మృతులలో నుండి పునరుత్థానుదైనందున పరిశుద్ధమైన ఆత్మనుబట్టి దేవుని కుమారుడుగాను ప్రభావముతో నిరూపించబడెను. ఈయన నామము నిమిత్తము సమస్త జనులు విశ్వాసమునకు విధేయులగునట్లు ఈయన ద్వారా మేము కృపను అపొస్తలత్వమును పొందితిమి. మీరును వారిలో ఉన్న వారై యేసుక్రీస్తు వారుగా ఉండుటకు పిలువబడి యున్నారు.**

**1:1 "పౌలు"** పౌలు కాలములో యూదులనేకులకు 2 మొదటి పేరులు కలిగియుండేవారు. ఒకటి యూదుల పేరు, రెండవది రోమా పేరు (అపొ13:9). పౌలు యొక్క యూదు పేరు సౌలు ఈయన పూర్వపు ఇశ్రాయేలు రాజు అయిన సౌలు వలె బెంజమేన్ గోత్రమునకు చెందినవాడు. (రోమా 11:1; ఫిలి 3:5) పౌలు యొక్క రోమా పేరు గ్రీకు రూపములో పౌలోస్ అనగా చిన్నవాడు అని అర్థము. ఇది 1. ఆయన యొక్క భౌతిక స్థితి కొరకు రెండవ శతాబ్దపు నాన్‌కెనానికల్ పుస్తకము అయిన దా ఎక్ట్స్ ఆఫ్ పౌల్‌లో, థెస్సలోనిక గురించిన అద్యాయంలో "పౌలు మరియు తెకల" అని వ్రాయబడియున్నది; 2. ఇది పౌలు తొలుత సంఘమును హింసించిన కారణముచేత పరిశుద్ధులందరిలో తక్కువ వానిగా చూసుకొనే భావన (1కొరి 15:9; ఎఫెసి 3:8; 1తిమో 1:15); 3. ఇది తన తల్లిదండ్రుల ద్వారా ఇచ్చే పేరుకావచ్చు.

- **"యేసుక్రీస్తు దాసుడు" NKJV, NRSV, TEV, JB** అనువాదములో "సేవకుడు" అనిచదువబడింది. ఈ అంశము 1. యేసుక్రీస్తు ప్రభువు కనుక పౌలు దానికి విరోధముగా సేవకుడు అని పిలుచుకొను చున్నాడు. లేక 2. పాత నిబంధన యొక్క ఘనమైన బిరుదు (మోషే సంఖ్య 12:7 మరియు యెహో 1:1; యెహో; 24:25; దావీదు కీర్తనలలో, యెషయా 42:1, 19; 52:13)

- **"అపొస్తులుడిగా పిలువబడిన"** ఇది దేవుని ఏర్పాటుకాని ఆయన స్వంతదికాదు (లపొ 9:15; గలతీ 1:15; ఎఫెసి 3:7) పౌలు ఆయన యొక్క ఆత్మీయ అధికారమును మరియు అర్హతలను రూఢిపరుచుకొనుకచున్నాఉడ. (1కొరి 1:1; 2కొరి 1:1; గలతీ 1:1 ఎఫెసి 1:1; కొలసి. 1:1; 1.తీమొ. 1:1; తీతు. 1:1) "అపొస్తలుడు" అన్న పదము మొదటి శతాబ్దపు పాలస్తినా యూదుల వర్గములలో "అధికార ప్రతినిధిగా పంపబడిన వాడు" అని అర్థము. (2దిన 17:7-9) క్రొత్త నిబంధనలో ఈ పదము రెండు భావనలలో వాడబడుతుంది. పన్నెండు మంది ప్రత్యేక శిష్యులు మరియు పౌలు; 2. సంఘములో కొనసాగుతున్న ఒక ఆత్మీయ వరము (1కొరి 12:28-29; ఎఫెసి 4:11)

- **"ప్రత్యేకింపబడినవాడు"** పౌలు గతములోనే దేవునిచే ప్రత్యేకింపబడి ఇప్పుడు కూడా కొనసాగుతున్నట్టుగా సూచస్తుంది. (యిర్మియా 1:5 & గలతీ 1:15) ఇది "పరిశయ్యుడు" అన్న అరమిక్ పదము యొక్క ఉపయోగము కావచ్చును. పౌలు థమస్కసు మార్గమున యేసు క్రీస్తును ఎదుర్కొనక ముందు అనుభవమును కూడా సూచిస్తుంది. పౌలు ఇప్పుడు సువార్త కొరకు ప్రత్యేకింపబడినాడు.

  ఇది హీబ్రూ పదమైన పరిశుద్ధత కొరకు వాడబడిన పదములు (నిర్గమ 19:6; 1పేతురు 2:5) "పరిశుద్ధుడు" "పరిశుద్దీకరణ" మరియు ప్రత్యేకింపబడుట అన్న ఈ పదములన్నియు గ్రీకులో ఒకే మూలమును కలిగియున్నవి.

- **"దేవుని సువార్త నిమిత్తము"** ఈ విభక్తి ఈ సందర్భములో పౌలు యొక్క పిలుపు ఉద్దేశ్యమును (5వ వచనం) మరియు ప్రత్యేకింపబడుటను (1బి)ను సూచస్తుంది. సువార్త అన్న మిశ్రమ పదము "మంచి" (యు) మరియు "వర్తమానము" (ఎన్జిలోస్)ల నుండి వచ్చినది. ఇది నూతన నిబంధనలోని సిద్దాంతములను వివరించుట కొరకు వాడబడుతున్నది. (2వ & యిర్మియా 31:31-34, యెహె 36:22-32) ఇది మెస్సయా వాగ్దానము కొరకు చెప్పబడినవి (3,4 వ.)

  ఇది దేవుని సువార్త కాని పౌలుది కాదు (15:16; మార్కు 1:14; 2కొరి 11:7; 1థెస్స 2:2, 8, 9; 1 పేతురు 4:17) పౌలు క్రొత్త విషయములను కనిపెట్టడము లేక సాంప్రదాయమును దత్తత చేసుకోవడము గాని తాను పొందిన సత్యమును ప్రకటించేవాడు. (1కొరి 1:18-25)

**1:2 "పరిశుద్ద లేఖనముయందు తన ప్రవక్తల ద్వారా ముందు వాగ్దానము చేసెను"** ఈ సువార్త దేవుని యొక్క తదుపరి ఆలోచన కాదు.

కాని దేవుని యొక్క నిత్య మరియు ఉద్దేశ్య పూర్వక ప్రణాళిక (ఆది 3:15, యెషయా 53; కీర్తన 118; మార్కు 10:45; లూకా 22:22; అపొ 2:23; 3:18; 4:28; తీతు 1:2) అపొస్తులులు ప్రకటించిన ఆది వర్తమానములు పాత నిబంధన వాగ్దానములు మరియు ప్రవచనముల నేరవేర్పు

**ప్రత్యేక అంశము : ఆది సంఘము యొక్క ప్రకటన**

1. పాత నిబంధనలో దేవుని వాగ్దానములు మెస్సియా యేసు రాకలో నెరవేర్చబడినవి. (అపొ 2:30–3:19:24: 10:43:26:6–7,22: రోమా 1:2–4:1.తిమోతి 3:16: హెబ్రీ 1:1:–2:1 పేతురు 1:10–12:2 పేతురు 1:18–19)
2. భాప్తిస్మము దగ్గర నుండి దేవునిచే యేసుక్రీస్తు మెస్సియాగా అబిషేకించబడినాడు (అపొ 10:38)
3. భాప్తిస్మము తదుపరి యేసు తన పరిచర్యను గలిలయలో ప్రారంభించిలీను (అపొ10:37)
4. యేసు పరిచర్య, దేవుని యొక్క శక్తివలన మేలు చేయుచు అద్భుతములు, మహాత్కార్యములు, సూచక క్రియల వలన తెలియజేయబడింది. (మార్కు 10:45:అపొ 2:22:20:38)
5. దేవుని సంకల్పము చొప్పుననే యెస్సయా సిలువ వేయబడెను. (మార్కు 10:45:యొహాను 3:16, అపొ 2:23:3–13–15, 8:4:11:10:39–26–23: రోమా ర:34:గలిత 1:4:హెబ్రి 1:3:1 పేతురు. 1:2,19:3:18–1 యొహాను 4:10.
6. యేసు మరణము నుండి తిరిగి లేచెను. ఆయన శిష్యులకు అగుపడెను. (అపొ 2:24, 31:32:3:15:26:10:40–41:17:31:26:23:రోమా 8:34:10:9:1:కొరి 15:4–7,12:1 దెస్స 1:10:1 తిమోతి 3:16–1 పేతురు 1:2:3:18,21)
7. యేసు దేవునిచే హెచ్చింపబడి ప్రభువు అని పేరు ఇవ్వబడెను. (అపొ 2:25–29,33–36:3:13:10:36, రోమా 8:34:10:9
8. యేసు దేవుని నూతన సమాజమునను ఏర్పరచుటకు పరిశుద్ధాత్మనిచ్చెను. (అపొ 1:8:2:14–18, 38:39:10:44–47:1పేతురు 1:12).
9. సమస్తమును తిరిగి కట్టుటకును, తీర్పు తీర్చుటకును ఆయన (యేసు) మరల వచ్చును. (అపొ. 3:20–21:10:42:17:31:1 కొరి. 15:20–28:1 దెస్స 1:10)
10. సందేశమును వినిన ప్రతివాడును మారు మనస్సు పొంది బాప్తిస్మము పొందవలెను (అపొ 3:20–21:38:3:19:10:43, 47–48:17:30:26:20:రోమా 1:17: 10:9: (పేతురు 3:21)

ఈ కొత్త నిబంధన వ్రాసి గ్రంధకర్తలు ఒక విషయమును విడిచి వేరే విషయములను వక్కాణించినప్పటికినీ, ఈ షేమా (ప్రకటన) ఆది సంఘము యొక్క ప్రకటన సారాంశం అయి వున్నది. శితురు యొక్క ప్రకటన (సందేశంను) అధికంగా మార్కు సువార్త అంతయు అనుసరించబడినది. మార్కు సంప్రదాయకంగా పేతురు వర్తమానములు అనగా రోమాలోని వర్తమానములును కట్టి ఒక వ్రాత పూర్వకంగా సువార్తను అందించినాడు. మత్తయి మరియు లకకా మార్కు యొక్క ఆధారిత అమరికను అనుసరించినారు. 1:3 తన కుమారుడైన యేసు విషయమైన. సువార్త యొక్క కేంద్రవర్తమానము, నజరేయుడైన యేసు, కన్యక మరియకు జన్మించిన కుమారుడు అనే ఒక వ్యక్తి అయి ఉన్నది. పాత నిబంధనలో రాజ్యము, రాజు మరియు మెస్సియ అనేవి కుమారుడు షని పిలువబడేవి. (2 సమూ 7:14:హోషేయా 11:1 కీర్తనలు 2:7:మత్తయి 2:15).

పాత నిబంధనలో దేవుడు ప్రవక్తల ద్వారా సేవకుల ద్వారా మాట్లాడినాడు. యేసుక్రీస్తు దేవుని సేకుడు కాదు. యేసు దేవుని కుటుంబ సభ్యుడు. (హెబ్రీ 1:1–2:3:6 5:8:7:28). ఆశ్చర్యంగా అపొ పౌలు ఈ సందర్భములోని తన పత్రికలే క్రీస్తు జీవితం పైన ( ) కేంద్రీకరిస్తున్నాడు. రోమా పత్రిక క్రమ వేదాంత పుస్తకం కాదు.

**ప్రత్యేక అంశం : దేవుని కుమారుడు**

దేవుని కుమారుడు (The son of God) క్రొత్త నిబంధనలోని యేసు బిరుదులలో ఓఇది ఒకటి. ఈ బిరుదు దైవిక అంతరర్ధమును కలిగి ఉంది. ఇది యేసుని "కుమారుడు" లేక నా కుమారుడు మరియు దేవుని తండ్రిగా చూపిస్తుంది. ఈ పదము క్రొత్త నిబంధనలో 124 సార్లు ప్రస్తావించమడింది. యేసు తనకు తానుగా పిలుచుకొనిన మనుష్యకుమారుడు కూడా దైవిక అంతరార్ధము కల్గియున్నది. దాని యేలు 7:13–14 పాత నిబంధనలే కుమారుడు అన్నపేరు (పదవి, హోదా) 3 ప్రత్యేకమైన వర్గములను సూచిస్తుంది.

1. దేవ దూతలు (సాధారణంగా బహువచనం, అది 6:2, యోబు 1:6:2:1)

2. ఇశ్రాయేలు రాజు (2 సమూయేలు 7:14:కీర్తన 2:7 89:26-27)

3. ఇశ్రాయేలు రాజ్యం ఒక దేశంగా (నిర్గమ 4:22-23:ద్వతి 14:1: హోషేయా 11:1, మవాకీ 2:10)

4. ఇశ్రాయేలు న్యాయాధిపతులు (కీర్తన 82:6)

యేసునకు సంబంధించిన వాడుక పేరులలో ఇది రెండవది. ఈ రీతిలో దావీదు కుమారుడు మరియు దేవుని కుమారుడు 2 సమూ 7: కీర్తన 2 మరియు 89 నకు సంబంధించినవి. పాతనిబంధనలలో దేవునికుమారుడు భవిష్యత్‌లోని రాజుగా ఇశ్రాయేలు అభిషిక్తుడైన అధిపతిగా ప్రత్యేకంగా మెస్సియాగా ఎన్నడు వాడబడలేదు. అయినప్పటికినీ, మృతసముద్రపు చుట్టలలో ఈ పేరునకు మెస్సియా సంబంధంగా సహజంగా వాడబడింది. (డిక్షనరీ ఆఫ్ జీసస్ గాస్పల్స్‌ను చూడండి. 770 పేజీని చూడండి) అదే విధంగా దేవుని కుమారుడు అనేది పాత క్రొత్త నిబందన కాలంలోని యబదుల భవిష్యత్ సంబంద పుస్తకములలో వాడబడినది. (2స్‌దాస్ 7:28-13:32,37,52: మరియు ఎనోస్ 105:2) దీని యొక్క క్రొత్త నిబంధన ఉపయోగములో యేసుని గురించి చెప్పబడిన సారాంశము వేర్వేరు మార్గములలో చెప్పబడినది.

1. యేసుని పబర్వ ఉనికి (యొహాను 1:1-18)
2. యేసు ప్రత్యేక (సాటిలేని) జననము (మత్తయి 1:23:లకు 1:31-35).
3. యేసుని బాప్తిస్వము (మత్తయి 3:17, మార్కు 1:11:లుకు 3:22 పరలోకము నుండి వచ్చిన ధ్వని స్వరము మహారాజు కీర్తన2.తో యెషమ 53లోని బాధించబడు సేవకునితో ఏకీకృపరిచింది.
4. యేసుని అపవాది సోధన (మత్తయి 4:1:11 మార్కు 1:12:13:లూకా 4:1-13. అతడు తన కుమారత్వము గురించి శోధించమడ్డాడు.
5. యేసుని అంగీకరించని వారి ఒప్పు తప్పులతో, దృవీకరించబడ్డాడు.
   ఎ) దయ్యములు (మార్కు 1:23-25, లూకా 4:31:37, మార్కు 3:11:12)
   బి) అవిశ్వాశులు (మత్తయి 27:43, మార్కు 14:61), యొహాను 19:7)
6. యేసు శిష్యులచే దృవీకరణ
   ఎ) మత్తయి 14:33,16-16
   బి) యొహాను 1:34 49, 6, 69, 11:27
7. యేసుని దృవీరకరణ
   ఎ) మత్తయి 11:25-27
   బి) యొహాను 10:36
8. యేసు తరచుగా ఉపయోగించిన కుటుంబపరమైన మరియు దేవుని తండ్రిగా అభివర్ణన.
   ఎ) యేసు తండ్రి గురించి అబ్బా అనే వాడుక
      1) మార్కు 14:36
      2) రోమా 8:15
      3) గలతీ 4:6

బి) దైవత్వముతో తమ సంబందమును వివరించటానికి తరచుగా వాడే తండ్రి అనే పదము (పధార్) సారాంశంగీ దేవుని కుమారుడు అన్న బిరుదు పాత నిబందన మరియు దాని వాగ్దానములు మరియు వర్గములు తెలిసిన వారికి గొప్ప వాదాంతార్దము కల్గి యున్నవి. కాని క్రొత్త నిబంధన రచయితలు అన్యజనులతో ఈ పదం యొక్క వాడుక గురించి భయపడుతాయిరు. కారణము ఏమిటంటే అన్యజనులు యొక్క దేవుళ్ళు బలశూరులుగా ఉండి లేక రాక్షస సంతానంగా స్త్రీలను తీసుకుని వెళ్ళేవారు.

▣ **"దావీదు సంతానంగా"..**

ఇది 2 సమూయేలు ప్రవచమనమునకు సంబంధించినది. మెస్సియా యూదా గోత్రము నుండి దావీదు రాజవంశములో నుండి వచ్చును. (యెషయా 9:7, 11:1,10: యిర్మియా 23:5, 30:9, 33:15, ఆది 49:4-12, యొషయా 65:9) మత్తయి సువార్తలో ఈ పేరుతో యేసు అనేకసార్లు పిలువబడ్డాడు. (9:27, 12:23, 15-22,20:30), ఈ పేరు యూదుల మెస్సియాను గురించిన నిరీక్షణను సూచిస్తుంది. పౌల్ యేసు యొక్క ఈ దృక్ఫథమును క్యాణించక పోవటం ఆశ్చర్యం కల్గిస్తుంధి. ఈ విషయం ఇక్కడ మరియు 2. తిమోతి 2:8లో ప్రస్తావించినాడు, ఈ రెండు వాక్య భాగములు అది సంఘము యొక్క విశ్వాససిద్ధాంతమునుల నుండి అనుకరించినాడు.

1. **NASB, NKJV, NRSV "శరీరరీతిని బట్టి"**
2. **TEV "తన మానవత్వంను బట్టి"**
3. **JB "మానవ స్వభావమును బట్టి"**

ఇది ప్రవచన నెరవేర్పు మరియు యేసుని మానవత్వమును దృఢపరచేది. అయినప్పటికి మొదటి శతాబ్దపు మత వర్గములచే తుణికరించబడేది. (1 యొహాను 1:1-4-3) పౌల్ శరీరము అన్న మాటను వ్యతిరేక భావముతో ఉపయోగించుట లేదని స్పష్టపరచబడుతుంది. (2:28:9:3) సాధారణంగా శరీరము అన్న మాటను ఆత్మకు విరోధంగా ఉన్నది. అని మాత్రం ఉపయోగించినాడు. (619, 7:5, 18, 25, 8:3-9, 1213 : 1.కొరి 5:5, 11 కొరి 1:17:11:18, గలత 3-3, 5:13, 1617-19,24 : ఎఫెసి 2:3, కొలస్సి 2:11, 13, 1823)

ఈ వ్యఖ్యరణ నిర్మాణము కాటా (ప్రకారము) ద్వితీయావిభక్తి 4వ వచనముతో సరిపోల్చబడింది. యేసు శరీరమను బట్టి మానవుడు అదే విధంగా ఆత్మను బట్టి దేవుడు ఈ అవతార సిద్ధాంతం చాచా క్లిష్టమైనది. (1యొహాను 4:1-3) ఈ మాట యేసు తనంతతాను ఎంచుకొనిన పేరు అయిన మనుష్యకుమారుడును కూడా సూచించవచ్చు. (కీర్తన 8:4) : యొహెజ్కేలు 2:1 (మానవ) మరియు దానియేలు 7:13 (ద్రైవిక)

**"1:4 నిరూపింపబడినవాడు యేసు"**

ఇది ఒక ఆరోస్ట్ పాసిల్ పార్టసిపల్ ( ) దేవుడు నిశ్చయంగా యేసుని దేవునికుమారుడుగా నియమించినాడు. ఇలా అంటే, బెత్లెహేము యేసునకు ఆరంభము కాదు. లేక యేసు తండ్రికంటే తక్కువైమవాడు కాదు. ప్రత్యేక అంశం త్రిత్వం 8:11 చూడండి.

దేవుని కుమారుడుగాను. గ్రీసు పురాణ శాస్త్రం తప్పుడు సూచనను బట్టి క్రొత్త నిబంధన గ్రంధకర్తలు యేసుని దేవుని కుమారుడని తరచుగా పిలువలేదు. కన్యకజన్మ విషయములో కూడా ఇదే కారణము) ఈ ఆలోచన అనేది ఒకే ఒక్కటి లేక సాటి లేనిది., అన్న విషయమునకు సంబంధించినది. (యొహాను 1:18 : 3: 16, 18 యొహాను 4:9) ఇందు మూలమున యేసు. ఒకే ఒక్క నిజమైన దేవుని కుమారుడు. కొత్త నిబంధన తండ్రి కుమారునికి సంబంధించి రెండు స్తంభములను కల్గియుంది. (1) వారు సమానులు (యహాను 1:1, 5:18:10:30:14:9:28:2 కొరి 4:4 ఫిలుఫ్ఫ్ 2:6, కొలస్సి 1:15, హెబ్రీ 1:3) వారిని వేర్వేరు వ్యక్తిత్వాలు (మార్కు 10:18:14:36, 15:34)

▣ **పునరుత్తాథానుడైనందున...**

దేవుడే యేసుని మృతులలో నుండి లేపుట ద్వారా యేసు జీవితమును మరియు వర్తమానమును ధృడపరచినాడు (4:24:6:4, 9:8:11). యేసుని దైవత్వము (యొహాను 1:1-14: కొలస్సి 1:15-19, ఫిలిప్పి 2:6-11) మరియు యేసుని పునరుతాధనము (4:25:1 కొరి, 15) ఈ రెండును క్రైస్తవత్వము యొక్క రెండు స్తంభములు యేసు తన యొక్క మాదిరికరమైన జీవితమును బట్టి దేవునిచేత ఘనత పొందినాడు. అనే చెప్పె ఒక తప్పుడు బాధ అయిన ఆడాప్టనివాసం వారు ఈ వచనమును సూచిస్తారు. ఈ తప్పుడు సిద్ధాంత కర్తలు నమ్మునది ఏమిటంటే యేసు ఎల్లప్పుడు దేవుడు కాదు కాని దేవుడు అయినను మృతులలో నుండి లేపినప్పుడు మాత్రమే దేవుడైనాడు అని చెప్పుదురు. ఇది స్పష్టంగా అసత్యమైనది. ఇది యహాను 1 మరియు 17లో స్పష్టం చేయబడినది. కాని ఒక అద్భుతమైనది. పునరుత్థానంతో యేసు పై ఉంచమడింది. దైవత్వము ఏవిధంగా ఇవ్వబడిందో చెప్పటం క్లిష్టతరమే కాని, అది జరిగింది. యేసు తండ్రితో మహిమ లోపాలే భాగస్తుడైనప్పటికి, తన కొరకు నియమించమడిన రక్షణార్థం కార్యం ముగింపు వలన అది అంకరించబడింది. పునరుత్థానం అనేది యేసిని జీవితం, మాదిరి, బోధలు మరియు త్యాగపూరిత మరణము, నిత్యదైవికం సంపూర్ణమానవత్వం పరిపూర్ణరక్షకుడు తిరిగిలేపబడినను

మరియు మెప్పు పొందిన ఏకైక సాటిలేని కుమారుడని దేవుని ధృవీకరణ అనుబంధం 3- అడాప్షనిసం చూడండి.

**▣ NASB, NKJV "పరిశుద్ధమైన ఆత్మను బట్టి"**

**NKJV "పరిశుద్ధమైన ఆత్మను బట్టి"**

**TEV "తన దైవిక పరిశుద్ధతను బట్టి"**

**JB "ఆత్మక్రమంను బట్టి, పరిశుద్ధమైన ఆత్మను బట్టి"**

కొన్ని అనువాదములు ఆ (5) పెద్ద అక్షరములలో వ్రాసి పరిశుద్ధాత్మను సూచించినారు. చిన్న ( ) (ఆ) యేసుని ఆత్మకు సూచనగా చూపినారు. తండ్రియైన దేవుడు ఆత్మయై యున్న లాగున యేసు కూడా ఆత్మయై ఉన్నాడు. పురాతన హెబ్రు మరియు గ్రీకు అక్షరాలలో చిన్న, పెద్ద అక్షరాలని కాని విరామ చిహ్నాలని కాని అధ్యాయములు కానీ, వచనములు కానీ లేవు, ఇవి అన్ని సాంప్రదాయ లేక అనువాదికుల తర్జుమా కావచ్చు.

3 మరియు 4 వచనములను అర్థం చేసుకోవటానికి 3 మార్గాలు ఉన్నాయి.

1) యేసుని యొక్క రెండు స్వభావాలు, మానవ మరియు దైవిక స్వభావములు సూచించును.

2) యేసుని రెండు దశలు భూలోక జీవితము (మానవ) మరియు పులరుత్థాన జీవితం

3) మన ప్రభువైన యేసుక్రీస్తునకు సమంగాను.

యేసు అరమియ పేరైన యేసు అనేది హెబ్రీ పేరైన యెహోషువాకు సమానమైనది. యెహోషువా అనేది రెండు హెబ్రీపదముల కలయిక "yhwh" యహ్వా మరియు రక్షణ దీని అర్థము "యెహోవా రక్షించును" యహ్వా విడిపించును. లేక యెహోవా యే రక్షణ. అర్థం యొక్క వివరణ మత్తయి 1:21:25లో చూడబడుచున్నది. క్రీస్తు ఇది మెస్సియా అభిషిక్తుడు అనే హెబ్రూపదమును గ్రీకు అనువాదము పాత నిబంధనలో నాయకుల వర్గాలలోని ( ) ప్రవక్తలు, సూజకులు మరియు రాజులు, దేవుని ఏర్పాటుగా దేవునిచే సన్నద్ధం చేయబడేవారు. యేసు ఈ మూడు అభిషిక్త కార్యకలాపములను నెరవేర్చినాడు, (హెబ్రీ 1:2-3) దేవుడు నీతి రాజ్యమును ప్రారంభించటానికి ఒక ప్రత్యేకమైన అభిషిక్తుడుని పంపునని పాత నిబంధన ముంధుగానే చెప్పనదతి. యేసే దేవుని ప్రత్యేకమైన సేవకుడు. కుమారుడు., మరియు మెస్సియా.

**ప్రభువు....**

యూదామతంలో దేవుని నిబంధన నామము యెహోవా ఈ నామము ఎంతో పరిశుద్ధమైనది. కావున రబ్బీలు ఈ పేరునకు బదులుగా ప్రభువు అని ఉపయోగించినారు. రబ్బీలు ప్రత్యేకంగా లేఖనములు చదువునప్పుడు దేవుని నామమును వ్యర్ధంగా ఉచ్చరించి దేవుని ఆజ్ఞలలో ఒక దానిని మీరుదురేమో అన్న భయంతో ప్రభఉవుని ఉచ్చరించేవారు. (నిర్గమ 20:7, ద్వితి 5:11)

క్రొత్త నిబంధన గ్రంధకర్తలు యేసుని ప్రభఉవు అని వేదాంత పరమైన సందర్భములలో పిలిచినపుడు యేసు యొక్క దైవత్వంను దృఢపరచేవారు. (అపో 2:36, రోమా 10:9:13 : ఫిలిప్పి 2:6-11)

**మేము..**

పౌలు తన ఇతర పత్రికలలోగానే ఇక్కడ కూడా తన ఉపోద్ఘాతంలోని వేరే వారని చెప్పుట లేదు. మొదటి పదము పౌలు యొక్క దమస్కు మార్గ మార్పును మరియు ఏర్పాటును గూర్చి చెప్పబడింది. (అపొ9), అది సంపాదక వాడుక అని బలంగా చెప్పబడుతుంది.

**మేము కృపను, అపొస్తలతవమును పొందితిమి..**

క్రీస్తు ద్వారా కేవలము రక్షణ యొక్క బహుమానమే కాదు గాని, దానితో పాటు అన్యజనులకు అపొస్తలలుడుగా పిలుపులో సంబంధించినదిగా పౌలు దృఢపరుచున్నాడు. ఇవి అన్ని దమస్కు మార్గములోనే తక్షణమే జరిగినవి. (అపొ9) ఇది యోగ్యతనుదడి కాదు గాని ఉద్దేశ్యపూరిత దేవుని కృపవలన తీసుకుని వచ్చునట్లు. ఉద్దేశ్య సందర్భములో ఇది రెండవసారి వాడబడినది (1.వ) యేసు క్రీస్తునందు విశ్వాసముంచుట ద్వారా సువార్త మానవునిలో దేవుని స్వరూపమును తీసికుని వచ్చును. దేవుని స్వరూపాన్ని ప్రతిబింబించే మానవులతో దేవుని సంబంధం అన్న అసలైన దేవుని ఉద్ధేశ్యము ప్రత్యక్షపరచుటను అనుమతిస్తుంది. (7.వ).

▣ NASB, JB "విశ్వాసము యొక్క విధేయత"

NKJV "విశ్వాసపు విధేయత కొరకు"

NRSV "విశ్వాసపు విధేయతను తీసుకుని వచ్చుటకు"

TEV "విశ్వసించుటకు మరియు విధేయత కొరకు"

రోమా పత్రికలో కేంద్రపధమైన విశ్వాసము యొక్క మొదటి వాడుక.

ఈ అధ్యాయంలోనూ మరియు పత్రికలోను ఇది 3 వేర్వేరు రీతులుగా వాడబడినది.

1. 5వ వచనంలో యేసుక్రీస్తు మరియు క్రైస్తవ జీవితమునకు సంబంధించిన సత్యములు మరియు సిద్ధాంతముల చేరికగా వాడబడింది. (అపొ 6:7, 13:8, 14:22, 16:5, రోమా 14:1, 16:26, గలత 1:23, 6:10 యూదా 3, 20)
2. 8వ వచనం, యేసునందుంచవలసిన వ్యక్తిగత నమ్మకము గురించి వాడబడింది. ఆంగ్ల పదమైన బిలివ్ ఫెయిత్, మరియు ట్రస్ట్ గ్రీకు పదమైన (పిస్టిస్, పిస్టియో) యొక్క అనువాదం, సువార్త అనేది వేదాంతపరమైనది. అదే విధంగా వ్యక్తిగతమైనది. (16:యోహాను 1:12, 13:1)
3. 17వ వచనం పాత నిబంధన భవమైన నమ్మకత్వం విధేయత్వం, లేక ఆభరపడుట అన్న వాడుకలో వాడబడింది. ఇది హక్కుకు 2ఔ4 యొక్క అర్ధము. పాత నిబంధనలో అభివృద్ధి చెందిన విశ్వాస సిద్ధాంతం లేదు గాని విశ్వాస జీవిత ఉదాహరణలు అనేకం ఉన్నాయి. (అబ్రహం, అది 15:6 పరిపూర్ణ విశ్వాసము కాదు గాని ఇబ్బందులతో కూడిన విశ్వాసము (హెబ్రి 11) చేసే సామర్ధ్యంలో గానీ లేక సరిగా నమ్మటంలో మానవ నిరీక్షణ లేదు గానీ, దేవుని గుణంలోనే ఉన్నది. దేవుడు ఒక్కడే నమ్మదగినవాడు...

రక్షణకార్యము అని పిలువబడేదానికి అనేక కార్యములు శీర్షిక రూపంలో వున్నాయి. (1) మారు మనస్సు (మార్కు 1:15, లూకా 13:3,5 3:16, అపొ 3:16, 19, 20:21) (2) విశ్వాసము (యోహాను 1:12:3:16:అపొ 16:31), (3) విధేయత (11, కొరి 9:13, 10:5, 1 పేతురు 1:2, 22) మరియు (40 సహనము (దెస్స, 11 కొరి 4:1, 16: గతత 6:911 దెస్స 3:13). ఇవి నూతన నిబంధన షరతులు మనము స్వీకరించాలి క్రీస్తులో దేవుని బహువచనమును స్వీకరిస్తూ వుండాలి, (16వ యోహాను 1:12)

▣ NASB "ఈయన నామము నిమిత్తము"

NKJV "ఈయన నామము కొరకు"

NRSV "ఈయన నామము నిమిత్తము కొరకు"

TEV "క్రీస్తు నిమిత్తము"

NJB "ఈయన నామ ఘనత కొరకై"

"ప్రత్యేక అంశం 10:9 చూడండి"

▣ NASB,NRSV "సమస్త అన్యజనుల మధ్య"

NKJV "సమస్త అన్యజనుల మధ్య"

TEA "సమస్త జనులు"

ఇది విశ్వ వ్యాప్త సువార్త ఆదికాండము 3:15లో దేవుని విమోచన నాత్మక వాగ్దానము సమస్త మానవులకొరకైనది. యేసుని పాప పరిహారార్ధ మరణము పతనమైన ఆదాము సమస్త సంతానము కొరకైనది. (యోహాను 3:16:4:42), ఎఫిసి 2:11-3:13:1 తిమోతి 2:4, 4:10, తతుకు 2:11, 11 పేతురు 3:9) అన్యజనులకు దేవుని సువార్తను ప్రకటించుట కొరకు దేవుడు పౌలునకు ప్రత్యేక పిలుపును ఇచ్చెను. పౌలు గుర్తించెను. (అపొ 9:15, 22:21, 26:17, రోమా 11:13, 15:16, గతత 1:16, 2:29, ఎఫిసి 3:28 3:28:1 తిమోతి 2:7, 11 తిమోతి 2:7, 11 తిమోతి 4:17).

**1:6 "మీరును"** దేవుని కృపకు పౌలు గొప్ప ఉదాహరణ.

**NASB (నవీన) వాక్యము 1:8-15**

మీ విశ్వాసము సర్వలోకమున ప్రచురము చేయబడుచుండుటను బట్టి, మొదట మీ యందరి నిమిత్తము యేసు క్రీస్తు ద్వారా నా దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాను. ఇప్పుడేలాగైనను ఆటంకము లేకుండా మీ యొద్దకు వచ్చుటకు దేవని చిత్తము వలన నాకు వీలు కలుగునేమో అని, నా ప్రార్థనల యందు ఎల్లప్పుడూ ఆయనను బ్రతిమాలుకొనుచు, మిమ్మును గూర్చి యెడతెగక జ్ఞాపకము చేసికొనుచున్నాను. ఇందుకు ఆయన కుమారిని సువార్త విషయమై నేనునా ఆత్మయందు సేవించుచున్న దేవుడే నాకు సాక్షి. మీరు స్థిర పడవలెనని, అనగా మీకును నాకును కలిగిచున్న విశ్వాసము చేత, అనగా మనము ఒకరి విశ్వాసముచేత ఒకరము ఆదరణ పొందవలెనని, ఆత్మ సంబంధమైన కృపావరమే దైననూ మీకిచ్చుటకు మిమ్మును చూడవలెనని మిగుల ఆపేక్షించుచున్నాను. సహోదదరులారా నేను ఇతరులైన అన్యజనులలో ఫలము పొందినట్లు మీలోకూడా ఫలమేదైనను పొందవలెనని అనేక పర్యాయములు మీ యొద్దకు రానుద్దేశించితిని, గాని యిదివరకు ఆటంక పరచబడితిని, ఇది మీకు తెలియకుండుట నా కిష్టములేదు. గ్రీసు దేశస్తులకును గ్రీసు దేశస్థులు కాని వారికిని, జ్ఞానులకును మూడులకును నేనుఋణస్తుడను. కాగానా వలననైంత మట్టు రోమాలోని మీకును సువార్త ప్రకటించుటకు సిద్దంగా ఉన్నాను.

**1:8 "మొదట"** ఈ సందర్భంలో "మొదట" అనగా "ఆదినుండి" లేక నేను తప్పక ప్రారంభించాలి. (జె.బి. ఫిలిప్స్)

- **"యేసు క్రీస్తు ద్వారా నాదేవునికి కృతజ్ఞతాస్తులులు చెల్లించుచున్నాను".** పౌలు సాధారణంగా తన ప్రార్థనలను యేసుక్రీస్తు ద్వారా దేవునికి చెల్లించుచున్నాడు. దేవునిని చేరుకొనుటకు యేసు ఒక్కడే మన మార్గము. ప్రత్యేక అంశం : పౌలు యొక్క ప్రార్థనలు మరియు కృతజ్ఞతాస్తుతులు 7:25 చూడండి.

- **"మీ యందరి నిమిత్తం"** 7వ వచనంలోవలెను ఈ "అందరి" అన్న ఉనయోగం, క్లౌదియా చక్రవర్తి కాలములో రోమాను విడిచివెళ్లిన అసూయ మరియు వివాదరములో ఉన్న విశ్వసించిన యూదులు (అపొ 18:2) దాని ఫలితంగా వారి స్థానంలో ఉంచబడిన విశ్వసించిన అన్యజనులు కావచ్చును. రోమా 9-11 ఈ విషయమును గూర్చి మాట్లాడుతుంది.

  రోమా 14:1 - 15:13 రోమాలోని "బలహీనులు" మరియు "బలవంతులు" గురించి మాట్లాడుతుంది. దేవుడు రోమా సంఘమంతటిని ప్రేమిస్తున్నాడు. అందరిని ఒకేలా ప్రేమిస్తున్నాడు.

- **"మీ విశ్వాసము సర్వలోకమున ప్రచురము చేయబడుచుండుట చేత"** రోమా 16:19 ఈ సత్యమును సూచిస్తుంది. ఈ వచనము రోమాను గురించి చెప్పబడిన అతిశయోక్తి కావచున్నఉ (ఐ. డెస్స 1:8) 1:9 "దేవుడే...నాకు సాక్షి" దేవుని పేరుతో పౌలు ఒక ఒట్టు / ప్రమాణము చేయుచున్నాడు. (9:1, 2 కోరి 1:23, 11:10 - 11,31, 12:9, గలతీ 1:20, ఐ-దెస్స, 2:5) ఇది పౌలు తన సత్యమును దృడపరుచుకొనుటకు వాడుచున్న యూదురీతి.

- **"నా ఆత్మయందు"** ఇది మానవ ఆత్మగురించి ఉపయోగించు న్యూమా (యెచల)నకు మంచి ఉదాహరణ (8:5, 10, 16:12:11) మరియు మానవ జీవితమును ఉద్దేశించి చెప్పబడింది. (ఊపిరి, హబ్రూ రూఖ్ ఆది 2:7) 1:10 "నా ప్రార్థనల యందు ఎల్లప్పుడూ ఆయనను బలిమాలుకొనుచూ" అపొ పౌలు ఈ సంఘమును స్థాపించలేదు. కాని తన సంఘములన్నిటివలెను ఈ సంఘము నిమిత్తము ప్రార్థించినవాడు (2 కొరి 11:28). ప్రత్యేక అంశం విజ్ఞాపన ప్రార్థన 8:26 చూడండి. అదేవిధంగా రోమా 16వ అద్యాయం ప్రకారం, రోమాలో పౌలునకు చాలామంది స్నేహితులు మరియు జతపనివారు ఉన్నట్టుగా కనిపిస్తుంది.

- **"వీలుకలుగుదమో"** "ఐఒ" ఇది మొదటి తరగతి షరతులతో కూడిన వాక్యము ఇది గ్రంధకర్త యొక్క దృక్పదము మరియు తన సాహిత్య ఉద్దేశ్యమును ధృడపరుస్తుంది. పౌలు స్పెయిన్‌కు వెళ్ళు మార్గంలో రోమాను కూడా దర్శించాలని ప్రణాళిక చేసాడు (15:22-24) రోమాలో ఎక్కువ కాలము ఉండుటకు ప్రణాళిక చేయటుదు. పౌలు ఎల్లప్పుడు ఎవరూచేరని, రులిచర్య చేయని ప్రాంతాలకు వెళ్ళటానికి ఇష్టపడేవాడు (15:20, 2. కొరి 10:15,16), స్పెయిన్‌కు వెళ్ళటానికి అవసరమగు కొంత ధనమును రోమా సంఘము నుండి పొందకోవాలనే ఉద్దేశ్యముతో ఈ పత్రికను పౌలు వ్రాసెననుటలో సత్యము కలదు. (15:24)

- **"దేవుని చిత్తము వలస నాకు వీలు కలుగనెమో"** ఇది 13వ వచనమునకును మరియు 15:32నకు సమమైనది. పౌలు తన జీవితము మరియు ప్రయాణపు ప్రణాళికలు తనకు చెందినవి అని తలంచలేదు, గాని అవి దేవునికి చెందినవి అని నమ్ముచున్నాడు. (అపొ 18:21, ఐ. కొరి 4:19 - 16:7) ప్రత్యేక అంశం 12:2 చూడండి 1:11 "మిమ్మును చూడను మిగుల అపేక్షించుచున్నాను" ఇది 15:23నకు సమంగా ఉన్నది. రోమాలో ఉన్న విశాసులను చూడవలెనని పౌలు చాలా కాలం నుండి అపేక్షించుచున్నాడు. (అపొ 19:21)

- **"కృపావరమేదైనను మీకిచ్చుటకు"**

  **"కృపావరం"** అన్నపదం ఆత్మీయ పరిజ్ఞానము లేక ఆశీర్వాదము అయిఉండవచ్చు. (11:29, 15:27) అపో. పౌలు తనను తాను అన్యజనుల కొరకు పిలువబడిన వానిగా చూసుకొనేవాడు (15వ వచనం)

- **"మీరు స్థిరపడవలెనని"** ఇది ఆరోయిస్ట్ పాసిల్ ఇన్ఫినిటిల్‌లోని హిస్టెమి (.....) (ప్రత్యేక అంశం 5:2 చూడండి)

  **1:12** ఇది క్రైస్తవ సహవాసము యొక్క ఉద్దేశ్యము. పరిచర్య చేసి సమాజములోనికి విశాసులను ఐక్యపర్చటానాకి వరములు ఉద్దేశించబడినవి. వరములు అందరి శ్రేయస్సు నిమిత్తము ఇవ్వబడినవి. (ఐ. కొరి 12:7) అన్ని వరములు సంబంధము కల్గినవి. రక్షణతో ఆత్మ వలన వరములు ఇవ్వబడినవి. (ఐ. కొరి 12:11) విశ్వాసులందురు పిలువబడినవారు, వరములతో నింపబడినవారు, సంపూర్ణ పరిచారకులు (ఎఫెసి 4:11-12) పౌలునకు తన అపొస్తలత్వపు అధికారము స్పష్టంగా తెలుసు. అదేవిదంగా సామాజిక అన్యోన్యత కూడా తెలుసు. విశ్వాసులు ఒకరికి ఒకరు కావాలి. 1:13 "ఇది మీరు తెలసుకొన గోరుచున్నాను". అపో పౌలు ఒక ప్రాముఖ్యమైన విషయమును పరిచయము చేయడం కొరకు తరచుగా ఉపయోగించు ఒక జాతీయము (11:25, ఐ.కొరి 10:1, 12:1, 2.కొరి 1:8, ఐ.దెస్స 14:3) ఇది యేసునకు సాహిత్య ఉద్దేశ్యమునకు సమమైన "ఆమెన్, ఆమెన్"కు సమంగా ఉన్నది.

- **"యిదివరకు ఆటంకపరచబడితిని"** ఇది చురుకైన క్రియ ఈ పదము ఐ థెస్స 2:18లో సాతాను ఆటంకపరిచే ప్రతినిదిగా చూపబడింది. తన జీవితము దేవుని చేత నడిపించబడుచున్నదని మరియు సాతానుచే భంగ పర్చబడుతున్నది పౌలునకు తెలుసు. ఎలాగైననూ రెండునూ సత్యమే (యోబు 1-2, దని 10) 15:12 ప్రకారము, ఈ పదము ఇంకనూ సంపూర్తికాని తూర్పు దేశాలలోని పరిచర్య వలనైన ఆటంకము కావచ్చును.

- **"మీలో కూడా ఫలమేదైనను పొందవలెనని"** ఈ సందర్భంలో ఫలము అనగా మారు మనస్సు పొందినవారు కాని యెహోను 15:1-8 మరియు గలతీ 5:22లో ఈ ఫలము క్రైస్తవ పరిపక్వతను సూచిస్తుంది. మత్తయి:7 చెప్తుంది. "మీ ఫలము వలన మీరు తెలియబడెదరు",కాని ఇది ఫలమును నిర్వచించదు. ఫిలిప్పి 1:22లో పౌలు ఉపయోగించిన వ్యవసాయ సంబంధపు ఉపమానం సరైన సాదృశ్యంగా ఉంటుంది.

**1:14 "నేను ఋణస్తుడను"** రోమా పత్రికలో అపో పౌలు అనేకసార్లు ఈ పతమును ఉపయోగించినాడు.

1. పౌలు అన్యజనులందరికి సువార్త ప్రకటించుటకు బాధ్యుడు.
2. పౌలు శరీరమునకు ఋణస్తుడు కాదు (8:12)
3. అన్యజన సంఘము యెరుషలేంలోని తల్లిసంఘమునకు సహకరించుటకు ఋణస్తురాలైయున్నది (15:27)

- **"హెల్లెనీయులకు (...)"** వీరు మద్యదర సముద్రమునకు చుట్టూ ఉన్న నాగరికత, సంస్కృతికలవారు చెప్పబడిన ఈ ప్రాంతమును గొప్పవాడైన అలెగ్జాండర్ మరియు అతని అనుసరులు గ్రీకు లోకంగా మార్చినారు. రోమావారు డాడిచేసి గ్రీకు సంస్కృతిని వారుతో కలుకొనినారు.

- **"హెల్లెనీయులు కాని వారికి"** (.....) వీరు ఉత్తరమునకు చెందిన విద్యలేనివారును, నాగరికత లేని వర్గమునకు చెందినవారు. ఈ పదము గ్రీకు బాష మాట్లాడవారి కొరకు ఉపయోగించబడేది. వీరి భాష గ్రీకులకు మరియు రోమియులకు "బార్ బార్ బార్"గా వినిపించేది.

- **"జ్ఞానములకును మూఢులకును"** ఇది "గ్రీకులకును, గ్రీకుయేతరలకు సమమైనది కావచ్చును" కాని అదే అవ్వవలసిన అవసరంలేదు. ఇది అన్ని వర్గముల ప్రజలను వ్యక్తులను సూచించడానికి ఉపయోగించేది కావచ్చును.

**NASB** (నవీన) **వాక్యము 1:16-17**

> **"సువార్తను గూర్తి నేను సిగ్గుపడుఆడునుకాను". ఎలాగైనా నమ్ము ప్రతివానికి మొదట యూదునికి, గ్రీసు దేశస్తునికి కూడా రక్షణ కలుగజేయుటకు అది దేవుని శక్తియై యున్నది. ఎందుకనిన - నీతిమంతుడు విశ్వాసమూలముగా జీవించునని వ్రాయబడిన ప్రకారము విశ్వాసమూలముగా అంతకంతకు విశ్వాసము కలుగునట్లు దేవుని నీతి దానియందు బయలు పరచబడుచున్నది.**

**1:16**

**NASB, NRSV "సువార్తను గూర్తినేను సిగ్గుపడువాడనుకాను"**

**NKJV "క్రీస్తు సువార్తను గూర్చి నేను సిగ్గుపడువాడనుకాను"**

**TEV "సువార్తయందు నాకు సంపూర్ణ నమ్మకం కలదు"**

**JB "శుభవార్త నిమిత్తం నేను సిగ్గుపడువాడనుకాను"**

మార్కు 8:38 మరియు మాకా 9:26లోని యేసు మాటలను పౌలు ఉద్దేశించుచున్నాడు. పౌలు సువార్తలోని విషయములను బట్టిగాని సువార్త ఫలితంగా వచ్చే హింసలను బట్టి సిగ్గుపడువాడు కాదు (ఐ. తిమో1:12, 16, 18) ఐ.కొరింది 1:23లో యూదులు సువార్త ద్వారా ధృవీకరించబడిన హింసించబడిన (శ్రమనొందిన) మెస్సియను బట్టి సిగ్గుపడినారు మరియు గ్రీసు దేశస్థులు క్రీస్తు పునరుత్థానమును బట్టి సువార్త విషయమై సిగ్గుపడినారు. 16-17 వచనములు ఈ పత్రిక యొకరి అంశమైయున్నది. ఈ అంశము 3:21-31లో విస్తరించబడినది మరియు సంగ్రహించబడినది.

- **"రక్షణ"** పాత నిబంధనలలో, హీబ్రూ పదమైన (యషో) ప్రాధమికగంగా భౌతిక విడుదల గురించి సూచిస్తుంది (యాకోబు 5:15), కాని నూతన నిబంధనలో, గ్రీకు పదమైన (సోజో) ప్రధానంగా ఆత్మీయ విడుదలను సూచిస్తుంది (ఐ.కొరి 1:18, 21) రాబర్ట్ బి. గిర్డిల్ స్టోన్ యొక్క సినోనిమ్స్ ఆఫ్థా ఒల్డ్ టెస్టమెంట్ చూడండి.

- **NASB "విశ్వసించు వారికందరికి"**

  **NKJV "విశ్వసించు వారి అందరి కొరకు"**

  **NRSV "విశ్వాసం ఉన్న వారికందరికి"**

  **TEV "నమ్మువారికందరికి"**

  **JB "విశ్వాసం కల్గియున్న వారికందరికి"**

  సువార్త అందరికీ (ఓ "ప్రతిఒక్కరికి", "ఎవరైనప్పటికిని" మరియు "అందరికిని" ఈ మాటలను నేను ఎంతగానో ప్రేమిస్తున్నాను), కాని అంగీకారము మాత్రము నమ్మువారికి మాత్రమే ఇంకొకటి మరమనస్సు (మార్కు 1:15, అ11కా 3:16, 19, 20:21) దేవుడు నిబంధనను బట్టి మానవులతో వ్యవహరిస్తున్నాడు. దేవుడు ముందుగా ప్రారంభించి ప్రణాళికను సిద్ధం చేస్తాడు.(యోహాను 6:44, 65 అయినను చాలా పరస్పరమైన షరతులు ఉన్నవి 1:5ను చూడండి.

  గ్రీకు పదం "బిలివ్" నమ్మకం అనేది ఇంగ్లీష్‌లో ఇంకా "విశ్వాసం" మరియు "సంపూర్ణ విశ్వాసం" తర్జుమా చేయబడింది. ఇంగ్లీషులోని పదము కంటే గ్రీకు పదము వేర్వేరు అంతరార్థములు కలిగిఉన్నది. ఈ పదము శత్రర్ధకము (......) రక్షించే విశ్వాసము అనేది కొనసాగే విశ్వాసమై యుంటుంది. (ఐ.కొరి 1:18, 15:2, ఐ.కొరి 2:15, ఐ.దెస్స 4:14)

  విశ్వాసమును గురించి గ్రీకుపదమునకు సంబంధించిన హీబ్రూ పదములు యొక్క అర్థము స్థిరంగా నిలువబడటం. ఒక మనుష్యుడు తనపాదములను దూరంగా చాపి, సులభంగా కదలలేని స్థితి అని సూచిస్తుంది. దీనికి వ్యతిరేకమైన ఉపమానం కీర్తన 40:2లోని "జిగటగల ఊబిలో నుండి" "నా పాదములు జారుటకు కొంచేమే తప్పెను"లో చూడగలం. (కీర్తన 73:2)

  హీబ్రూ మూల పదములైన ఈమునా, అమాన్ అన్న పదములు నమ్మదగిన విధేయతగల లేక ఆధారపడిన వ్యక్తి కొరకు ఉపయోగించబడిన రూపక అలంకారములు రక్షించే విశ్వాసము పడిపోయిన మానవుని సామర్థ్యముపైన ఆధాపడును. కాని దేవునిపైన ఆధారపడుతుంది. విశ్వాసుల నిరీక్షణ వారి సామర్థ్యములపైన కాదుగాని దేవునిలోనూ మరియు ఆయన వాగ్దానములలోనూ ఆధారపడుతుంది. అది కేవలము దేవని విశ్వాస్యత, నమ్మదగిన తనము, దేవుని వాగ్ధానములు మాత్రమే.

- **"మొదట యూదులకు"** దీనికి కారణము క్లుప్తంగా 2:9-10 మరియు 3వ అధ్యాయంలో 9-11వ అధ్యాయములలో పూర్తిగా వివరించబడినది. ఇది ముత్తయి 10:6, 15:24, మార్కు 7:27లోని యేసు యొక్క మాటలను అనుసరిస్తుంది. ఇది రోమా సంఘంలోని విశ్వసించిన యూదులకును మరియు అన్యజనులకు మద్య ఉన్న అసూయకు సంబంధించినది కావచ్చును.

**1:17 "దేవునినీతి"**

ఈ సందర్భములో ఈమాట (1) దేవని లక్షణము, మరియు (2) ఆ దేవుని గుణమును పాపభరిత మానవునికి ఎలా దేవుడు ఇచ్చును అన సూచిస్తుంది. యోరుషలేం బైబిల్ అనువాదము "ఇది దేవుని నీతిని బయలుపరుచుతుంది". అని కల్గియున్నది. ఇది విశ్వాసి యొక్క నైతిక జీవిత విధానమును, ప్రధానంగా నీతిమంతుడైన న్యాయాధిపతి ఎదుట విశ్వాసి యొక్క నీతి స్థితిని సూచిస్తుంది. పతనమై పోయని మానవునికి దేవుడు తన నీతిని ఇచ్చుట అనేది రూదర్ సంస్కరణము నుండి "విశ్వాసమును బట్టి నీతి" అని పిలువబడుతుంది. (2.కొరింది 5:21, ఫిలిప్పి 3:9) ఈవచనము మార్టిన్‌లూదర్ యొక్క జీవితమును మరియు సిద్ధాంతమును మార్చివేసినది. ఎదైమైనప్పటికి దోష విమోచనము యొక్క గురి శుద్ధీకరణం, క్రీస్తు వంటి స్వభావము లేక దేవుని యొక్క నీతిగుణము అయిఉన్నది. రోమా 8:28-29, ఎఫెసి 1:4, 2:10, గలతీ 4:19) నీతిమంతులుగా, తీర్చబడటం అనేది కేవలం న్యాయ ప్రకటన మాత్రమే కాదు గాని, అది పరిశుద్ధ జీవితము, దేవుని యొక్క స్వరూపము తిరిగి మానవునిలో ప్రారంభించబడటము (2.కొరి 5:21)

**NASB (నవీన) వాక్యము 1:8-15**

**మీ విశ్వాసము సర్వలోకమున ప్రచురము చేయబడుచుండుటను బట్టి, మొదట మీ యందరి నిమిత్తము యేసు క్రీస్తు దార్వా నా దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాను. ఇప్పుడేలాగైనను ఆటంకము లేకుండా మీ యొద్దకు వచ్చుటకు దేవని చిత్తము వలన నాకు వీలు కలుగునేమో అని, నా ప్రార్థనల యందు ఎల్లప్పుడూ ఆయనను బ్రతిమాలుకొనుచు, మిమ్మును గూర్చి యెడతెగక జ్ఞాపకము చేసికొనుచున్నాను. ఇందుకు ఆయన కుమారిని సువార్త విషయమై నేనునా ఆత్మయందు సేవించుచున్న దేవుడే నాకు సాక్షి. మీరు స్థిర పడవలెనని, అనగా మీకును నాకును కలిగిచున్న విశ్వాసము చేత, అనగా మనము ఒకరి విశ్వాసముచేత ఒకరము ఆదరణ పొందవలెనని, ఆత్మ సంబంధమైన కృపావరమే దైననూ మీకిచ్చుటకు మిమ్మును చూడవలెనని మిగుల ఆపేక్షించుచున్నాను. సహోదదరులారా నేను ఇతరులైన అన్యజనులలో ఫలము పొందినట్లు మీలోకూడా ఫలమేదైనను పొందవలెనని అనేక పర్యాయములు మీ యొద్దకు రానుద్దేశించితిని, గాని యిదివరకు ఆటంక పరచబడితిని, ఇది మీకు తెలియకుండుట నా కిష్టములేదు. గ్రీసు దేశస్తులకును గ్రీసు దేశస్థులు కాని వారికిని, జ్ఞానులకును మూడులకును నేనుఋణస్తుడను. కాగానా వలననైంత మట్టు రోమాలోని మీకును సువార్త ప్రకటించుటకు సిద్ధంగా ఉన్నాను.**

**1:8 "మొదట"** ఈ సందర్భంలో "మొదట" అనగా "ఆదినుండి" లేక నేను తప్పక ప్రారంభించాలి. (జె.బి. ఫిలిప్స్)

- **"యేసు క్రీస్తు ద్వారా నాదేవునికి కృతజ్ఞతాస్తులులు చెల్లించుచున్నాను".** పౌలు సాధారణంగా తన ప్రార్థనలను యేసుక్రీస్తు ద్వారా దేవునికి చెల్లించుచున్నాడు. దేవునిని చేరుకొనుటకు యేసు ఒక్కడే మన మార్గము. ప్రత్యేక అంశం : పౌలు యొక్క ప్రార్థనలు మరియు కృతజ్ఞతాస్తుతులు 7:25 చూడండి.

- **"మీ యందరి నిమిత్తం"** 7వ వచనంలోవలెను ఈ "అందరి" అన్న ఉనయోగం, క్లౌదియా చక్రవర్తి కాలములో రోమాను విడిచివెళ్లిన అసూయ మరియు వివాదరములో ఉన్న విశ్వసించిన యూదులు (అపొ 18:2) దాని ఫలితంగా వారి స్థానంలో ఉంచబడిన విశ్వసించిన అన్యజనులు కావచ్చును. రోమా 9-11 ఈ విషయమును గూర్చి మాట్లాడుతుంది.

  రోమా 14:1 - 15:13 రోమాలోని "బలహీనులు" మరియు "బలవంతులు" గురించి మాట్లాడుతుంది. దేవుడు రోమా సంఘమంతటిని ప్రేమిస్తున్నాడు. అందరిని ఒకేలా ప్రేమిస్తున్నాడు.

- **"మీ విశ్వాసము సర్వలోకమున ప్రచురము చేయబడుచుండుట చేత"** రోమా 16:19 ఈ సత్యమును సూచిస్తుంది. ఈ వచనము రోమాను గురించి చెప్పబడిన అతిశయోక్తి కావచ్చుఁ (ఐ. దెస్స 1:8) 1:9 "దేవుడే...నాకు సాక్షి" దేవుని పేరుతో పౌలు ఒక ఒట్టు / ప్రమాణము చేయుచున్నాడు. (9:1, 2 కోరి 1:23, 11:10 - 11,31, 12:9, గలతీ 1:20, ఐ-దెస్స, 2:5) ఇది పౌలు తన సత్యమును దృడపరుచుకొనుటకు వాడుచున్న యూదురీతి.

- **"నా ఆత్మయందు"** ఇది మానవ ఆత్మగురించి ఉపయోగించు న్యూమా (యెచల)నకు మంచి ఉదాహరణ (8:5, 10, 16:12:11) మరియు మానవ జీవితమును ఉద్దేశించి చెప్పబడింది. (ఊపిరి, హబ్రూ రూఖ్ ఆది 2:7) 1:10 "నా ప్రార్థనల యందు ఎల్లప్పుడూ ఆయనను బలిమాలుకొనుచూ" అపొ పౌలు ఈ సంఘమును స్థాపించలేదు. కాని తన సంఘములన్నిటివలెను ఈ సంఘము నిమిత్తము ప్రార్థించినవాడు (2 కొరి 11:28). ప్రత్యేక అంశం విజ్ఞాపన ప్రార్థన 8:26 చూడండి. అదేవిధంగా రోమా 16వ అధ్యాయం ప్రకారం, రోమాలో పౌలునకు చాలామంది స్నేహితులు మరియు జతపనివారు ఉన్నట్టుగా కనిపిస్తుంది.

- **"వీలుకలుగుంమో"** "ఐఒ" ఇది మొదటి తరగతి షరతులతో కూడిన వాక్యము ఇది గ్రంధకర్త యొక్క దృక్పదము మరియు తన సాహిత్య ఉద్దేశ్యమును ధృడపరుస్తుంది. పౌలు స్పెయిన్‌కు వెళ్ళు మార్గంలో రోమాను కూడా దర్శించాలని ప్రణాళిక చేసాడు (15:22–24) రోమాలో ఎక్కువ కాలము ఉండుటకు ప్రణాళిక చేయటుడు. పౌలు ఎల్లప్పుడు ఎవరూచేరని, రులిచర్య చేయని ప్రాంతాలకు వెళ్ళటానికి ఇష్టపడేవాడు (15:20, 2. కొరి 10:15,16), స్పెయిన్‌కు వెళ్ళటానికి అవసరమగు కొంత ధనమును రోమా సంఘము నుండి పొందకోవాలనే ఉద్దేశ్యముతో ఈ పత్రికను పౌలు వ్రాసెననుటలో సత్యము కలదు. (15:24)

- **"దేవుని చిత్తము వలస నాకు వీలు కలుగనెమో"** ఇది 13వ వచనమునకును మరియు 15:32నకు సమమైనది. పౌలు తన జీవితము మరియు ప్రయాణపు ప్రణాళికలు తనకు చెందినవి అని తలంచలేదు, గాని అవి దేవునికి చెందినవి అని నమ్ముచున్నాడు. (అపొ 18:21, ఐ. కొరి 4:19 – 16:7) ప్రత్యేక అంశం 12:2 చూడండి 1:11 "మిమ్మును చూడను మిగుల అపేక్షించుచున్నాను" ఇది 15:23నకు సమంగా ఉన్నది. రోమాలో ఉన్న విశాసులను చూడవలెనని పౌలు చాలా కాలం నుండి అపేక్షించుచున్నాడు. (అపొ 19:21)

- **"కృపావరమేదైనను మీకిచ్చుటకు"**

  **"కృపావరం"** అన్నపదం ఆత్మీయ పరిజ్ఞానము లేక ఆశీర్వాదము అయిఉండవచ్చు. (11:29, 15:27) అపొ. పౌలు తనను తాను అన్యజనుల కొరకు పిలువబడిన వానిగా చూసుకొనేవాడు (15వ వచనం)

- **"మీరు స్థిరపడవలెనని"** ఇది ఆరోయిస్ట్ పాసిల్ ఇన్ఫినిటిల్‌లోని హిస్టెమి (.....) (ప్రత్యేక అంశం 5:2 చూడండి)

  **1:12** ఇది క్రైస్తవ సహవాసము యొక్క ఉద్దేశ్యము. పరిచర్య చేసి సమాజములోనికి విశాసులను ఐక్యపర్చటానాకి వరములు ఉద్దేశించబడినవి. వరములు అందరి శ్రేయస్సు నిమిత్తము ఇవ్వబడినవి. (ఐ. కొరి 12:7) అన్ని వరములు సంబంధము కల్గినవి. రక్షణతో ఆత్మ వలన వరములు ఇవ్వబడినవి. (ఐ. కొరి 12:11) విశ్వాసులందురు పిలువబడినవారు, వరములతో నింపబడినవారు, సంపూర్ణ పరిచారకులు (ఎఫెసి 4:11–12) పౌలునకు తన అపొస్తలత్వపు అధికారము స్పష్టంగా తెలుసు. అదేవిదంగా సామాజిక అన్యోనత కూడా తెలుసు. విశ్వాసులు ఒకరికి ఒకరు కావాలి. 1:13 "ఇది మీరు తెలసుకొన గోరుచున్నాను". అపొ పౌలు ఒక ప్రాముఖ్యమైన విషయమును పరిచయము చేయడం కొరకు తరచుగా ఉపయోగించు ఒక జాతీయము (11:25, ఐ.కొరి 10:1, 12:1, 2.కొరి 1:8, ఐ.దెస్స 14:3) ఇది యేసునకు సాహిత్య ఉద్దేశ్యమునకు సమమైన "ఆమెన్, ఆమెన్"కు సమంగా ఉన్నది.

- **"యిదివరకు ఆటంకపరచబడితిని"** ఇది చురుకైన క్రియ ఈ పదము ఐ థెస్స 2:18లో సాతాను ఆటంకపరిచే ప్రతినిదిగా చూపబడింది. తన జీవితము దేవుని చేత నడిపించబడుచున్నదని మరియు సాతానుచే భంగ పర్చబడుతున్నది పౌలునకు తెలుసు. ఎలాగైననూ రెండునూ సత్యమే (యోబు 1–2, దని 10) 15:12 ప్రకారము, ఈ పదము ఇంకనూ సంపూర్తికాని తూర్పు దేశాలలోని పరిచర్య వలనైన ఆటంకము కావచ్చును.

- **"మీలో కూడా ఫలమేదైనను పొందవలెనని"** ఈ సందర్భంలో ఫలము అనగా మారు మనస్సు పొందినవారు కాని యెహోను 15:1–8 మరియు గలతీ 5:22లో ఈ ఫలము క్రైస్తవ పరిపక్వతను సూచిస్తుంది. మత్తయి:7 చెప్తుంది. "మీ ఫలము వలస మీరు తెలియబడెదరు", కాని ఇది ఫలమును నిర్వచించదు. ఫిలిప్పి 1:22లో పౌలు ఉపయోగించిన వ్యవసాయ సంబంధపు ఉపమానం సరైన సాదృశ్యంగా ఉంటుంది.

**1:14 "నేను ఋణస్తుదను"** రోమా పత్రికలో అపొ పౌలు అనేకసార్లు ఈ పదమును ఉపయోగించినాడు.

1. పౌలు అన్యజనులందరికి సువార్త ప్రకటించుటకు బాధ్యుడు.
2. పౌలు శరీరమునకు ఋణస్తుడు కాదు (8:12)
3. అన్యజన సంఘము యెరుషలేంలోని తల్లిసంఘమునకు సహకరించుటకు ఋణస్తురాలైయున్నది (15:27)

- **"హెల్లెనీయులకు"** వీరు మద్యదర సముద్రమునకు చుట్టూ ఉన్న నాగరికత, సంస్కృతికలవారు చెప్పబడిన ఈ ప్రాంతమును గొప్పవాడైన అలెగ్జాండర్ మరియు అతని అనుసరులు గ్రీకు లోకంగా మార్చినారు. రోమావారు డాడిచేసి గ్రీకు సంస్కృతిని వారుతో కలుకొనినారు.

- **"హెల్లెనీయులు కాని వారికి"** వీరు ఉత్తరమునకు చెందిన విద్యలేనివారును, నాగరికత లేని వర్గమునకు చెందినవారు. ఈ పదము గ్రీకు బాష మాట్లాడవారి కొరకు ఉపయోగించబడేది. వీరి భాష గ్రీకులకు మరియు రోమియులకు "బార్ బార్ బార్"గా వినిపించేది.

- **"జ్ఞానములకును మూఢులకును"** ఇది "గ్రీకులకును, గ్రీకుయేతరలకు సమమైనది కావచ్చును" కాని అదే అవ్వవలసిన అవసరంలేదు. ఇది అన్ని వర్గముల ప్రజలను వ్యక్తులను సూచించడానికి ఉపయోగించేది కావచ్చును.

**NASB** (నవీన) వాక్యము 1:16-17

> **"సువార్తను గూర్తి నేను సిగ్గుపడుఆడునుకాను". ఎలాగైనా నమ్ము ప్రతివానికి మొదట యూదునికి, గ్రీసు దేశస్తునికి కూడా రక్షణ కలుగజేయుటకు అది దేవుని శక్తియై యున్నది. ఎందుకనిన – నీతిమంతుడు విశ్వాసమూలముగా జీవించునని వ్రాయబడిన ప్రకారము విశ్వాసమూలముగా అంతకంతకు విశ్వాసము కలుగునట్లు దేవుని నీతి దానియందు బయలు పరచబడుచున్నది.**

**1:16**

**NASB, NRSV "సువార్తను గూర్తినేను సిగ్గుపడువాడనుకాను"**

**NKJV "క్రీస్తు సువార్తను గూర్చి నేను సిగ్గుపడువాడనుకాను"**

**TEV "సువార్తయందు నాకు సంపూర్ణ నమ్మకం కలదు"**

**JB "శుభవార్త నిమిత్తం నేను సిగ్గుపడువాడనుకాను"**

మార్కు 8:38 మరియు మాకా 9:26లోని యేసు మాటలను పౌలు ఉద్దేశించుచున్నాడు. పౌలు సువార్తలోని విషయములను బట్టిగాని సువార్త ఫలితంగా వచ్చే హింసలను బట్టి సిగ్గుపడువాడు కాదు (ఐ. తిమో1:12, 16, 18) ఐ.కొరింది 1:23లో యూదులు సువార్త ద్వారా ధృవీకరించబడిన హింసించబడిన (శ్రమనొందిన) మెస్సియను బట్టి సిగ్గుపడినారు మరియు గ్రీసు దేశస్థులు క్రీస్తు పునరుత్థానమును బట్టి సువార్త విషయమై సిగ్గుపడినారు. 16-17 వచనములు ఈ పత్రిక యొకరి అంశమైయున్నది. ఈ అంశము 3:21-31లో విస్తరించబడినది మరియు సంగ్రహించబడినది.

- **"రక్షణ"** పాత నిబంధనలలో, హీబ్రూ పదమైన (యషో) ప్రాథమికగంగా భౌతిక విడుదల గురించి సూచిస్తుంది (యాకోబు 5:15), కాని నూతన నిబంధనలో, గ్రీకు పదమైన (సోజో) ప్రధానంగా ఆత్మీయ విడుదలను సూచిస్తుంది (ఐ.కొరి 1:18, 21) రాబర్ట్ బి. గిర్డిల్ స్టోన్ యొక్క సినోనిమ్స్ ఆఫ్థా ఒల్డ్ టెస్ట్‌మెంట్ చూడండి.

- **NASB "విశ్వసించు వారికందరికి"**

  **NKJV "విశ్వసించు వారి అందరి కొరకు"**

  **NRSV "విశ్వాసం ఉన్న వారికందరికి"**

  **TEV "నమ్మువారికందరికి"**

  **JB "విశ్వాసం కల్గియున్న వారికందరికి"**

  సువార్త అందరికీ (ఓ "ప్రతిఒక్కరికి", "ఎవరైనప్పటికిని" మరియు "అందరికిని" ఈ మాటలను నేను ఎంతగానో ప్రేమిస్తున్నాను), కాని అంగీకారము మాత్రము నమ్మువారికి మాత్రమే ఇంకొకటి మరమనస్సు (మార్కు 1:15, అ11కా 3:16, 19, 20:21) దేవుడు నిబంధనను బట్టి మానవులతో వ్యవహరిస్తున్నాడు. దేవుడు ముందుగా ప్రారంభించి ప్రణాళికను సిద్ధం చేస్తాడు.(యోహాను 6:44, 65 అయినను చాలా పరస్పరమైన షరతులు ఉన్నవి 1:5ను చూడండి.

  గ్రీకు పదం "బిలివ్" నమ్మకం అనేది ఇంగ్లీష్‌లో ఇంకా "విశ్వాసం" మరియు "సంపూర్ణ విశ్వాసం" తర్జుమా చేయబడింది. ఇంగ్లీషలోని పదము కంటే గ్రీకు పదము వేర్వేరు అంతరార్థములు కలిగిఉన్నది. ఈ పదము శత్రర్థకము (......) రక్షించే విశ్వాసము అనేది కొనసాగే విశ్వాసమై యుంటుంది. (ఐ.కొరి 1:18, 15:2, ఐ.కొరి 2:15, ఐ.దెస్స 4:14)

  విశ్వాసమును గురించి గ్రీకుపదమునకు సంబంధించిన హీబ్రూ పదములు యొక్క అర్ధము స్థిరంగా నిలువబడటం. ఒక మనుష్యుడు తనపాదములను దూరంగా చాపి, సులభంగా కదలలేని స్థితి అని సూచిస్తుంది. దీనికి వ్యతిరేకమైన ఉపమానం కీర్తన 40:2లోని "జిగటగల ఊబిలో నుండి" "నా పాదములు జారుటకు కొంచేమే తప్పెను"లో చూడగలం. (కీర్తన 73:2)

  హీబ్రూ మూల పదములైన ఈమునా, అమాన్ అన్న పదములు నమ్మదగిన విధేయతగల లేక ఆధారపడిన వ్యక్తి కొరకు ఉపయోగించబడిన రూపక అలంకారములు రక్షించే విశ్వాసము పడిపోయిన మానవుని సామర్థ్యముపైన ఆధాపడును. కాని దేవునిపైన ఆధారపడుతుంది. విశ్వాసుల నిరీక్షణ వారి సామర్థ్యములపైన కాదుగాని దేవునిలోనూ మరియు ఆయన వాగ్దానములలోనూ ఆధారపడుతుంది. అది కేవలము దేవని విశ్వాస్యత, నమ్మదగిన తనము, దేవుని వాగ్ధానములు మాత్రమే.

- **"మొదట యూదులకు"** దీనికి కారణము క్లుప్తంగా 2:9-10 మరియు 3వ అధ్యాయంలో 9-11వ అధ్యాయములలో పూర్తిగా వివరించబడినది.

ఇది మత్తయి 10:6, 15:24, మార్కు 7:27లోని యేసు యొక్క మాటలను అనుసరిస్తుంది. ఇది రోమా సంఘంలోని విశ్వసించిన యూదులకును మరియు అన్యజనులకు మధ్య ఉన్న అసూయకు సంబంధించినది కావచ్చును.

**1:17 "దేవునినీతి"**

ఈ సందర్భములో ఈమాట (1) దేవని లక్షణము, మరియు (2) ఆ దేవుని గుణమును పాపభరిత మానవునికి ఎలా దేవుడు ఇచ్చును అన సూచిస్తుంది. యోరుషలేం బైబిల్ అనువాదము "ఇది దేవుని నీతిని బయలుపరుచుతుంది". అని కల్గియున్నది. ఇది విశ్వాసి యొక్క నైతిక జీవిత విధానమును, ప్రధానంగా నీతిమంతుడైన న్యాయాధిపతి ఎదుట విశ్వాసి యొక్క నీతి స్థితిని సూచిస్తుంది. పతనమై పోయని మానవునికి దేవుడు తన నీతిని ఇచ్చుట అనేది రూదర్ సంస్కరణము నుండి "విశ్వాసమును బట్టి నీతి" అని పిలువబడుతుంది. (2.కొరింది 5:21, ఫిలిప్పి 3:9) ఈవచనము మార్టిన్‌లూదర్ యొక్క జీవితమును మరియు సిద్ధాంతమును మార్చివేసినది. ఎద్దెమైనప్పటికి దోష విమోచనము యొక్క గురి శుద్ధీకరణం, క్రీస్తు వంటి స్వభావము లేక దేవుని యొక్క నీతిగుణము అయిఉన్నది. రోమా 8:28–29, ఎఫెసి 1:4, 2:10, గలతీ 4:19) నీతిమంతులుగా, తీర్చబడటం అనేది కేవలం న్యాయ ప్రకటన మాత్రమే కాదు గాని, అది పరిశుద్ధ జీవితము, దేవుని యొక్క స్వరూపము తిరిగి మానవునిలో ప్రారంభించబడటము (2.కొరి 5:21)

**ప్రత్యేక అంశం : నీతి**

**"నీతి"** అనే చాలా ప్రాముఖ్యమైన అంశము. ఒక బైబిల్ తప్పునిసరిగా ఈ అంశముపైన విస్తృతమైన ధ్యానం చేయవలసిన అవసరం ఉంది. పాత నిబంధనలలో దేవుని గుణము "న్యాయవంతుడు" లే "నీతిమంతుడు" అని వివరించబడింది. ఈ మెసపతోమియా పదము అనేది ఒకనది తీరమున ఉన్న రెల్లుజాతి (రెల్లునకు)కి చెంది గోడల యొక్కయు ఆవరణములు (దడులు) యొక్కయు నిటారు తనమును కొలుచుటకు ఉపయోగించుదురు. దేవుడు ఈ పదమును ఉపమానరీతిగా ఆయన గుణస్వభావమును తెలిజుయుటకు ఎంచుకొన్నాడు. దేవుడు సరియైన అధిపతి. ఆయనలోనే సమస్తము పరిక్షింపబడుతుంది. ఈ దృక్పదం దేవుని యొక్క నీతిని మరియు తీర్పు తీర్చె దేవుని హక్కును గూర్చి మాట్లాడుతుంది.

మానవుడు దువని స్వరూపములో సృష్టించబడినాడు. (ఆది 1:26–27, 5:1,3 – 9:6) మానవులు దేవునితో సహవాసములో ఉండడానికి పిలువబడినారు. సృష్టి అంతయు దేవునికి మానవునికి మధ్య సంబంధమునకు వేదికగా, ఒక వెనుకతెరగా ఉన్నది. దేవుడు తన సృష్టిలో ఉన్నత సృష్టి అయిన మానవుడు ఆయనను తెలుసుకోవాలని, ఆయనను ప్రేమించాలని ఆయనను సేవించాలని ఆయన వలె ఉండాలని ఆశించినాడు. మానవుని యొక్క విధేయత పరీక్షించబడింది. (ఆది.3) ఆది దంపతులు పరీక్షలో ఓటమైనారు. ఈ ఓటమి దేవునికి మానవునికి మధ్య సంబంధం విచ్ఛేధనమునకు కారణమైనది. (ఆది–3, రోమా 5:12–21)

దేవుడు పాడైన సంబంధమును సహవాసమును బాగుచేయటకు వాగ్దానం చేసినాడు (ఆది 3:15. ఈ కార్యమును ఆమన కుమారుని ద్వారా ఆయన చిత్తము వలన చేసెను. మానవులు తెగిన పగిలిన సంబంధమును నిర్మించుటకు అసమర్దులు (రోమా 1:18 – 3:20)

మానవుని పతనం తరువాత, సంబంధం తిరిగి నెలకొల్పుట కొరకు దేవుడు నిబంధన సంబంధమైన ఆహ్వానమునిచ్చి మానవులు మారు మనస్సు, విశ్వాసం, విధేయతతో స్పందిచాలని ఆశించాడు. పతన కారణముచే సరియైన కార్యము చేయుటకు మానవులు అసమర్థులైనారు. (రోమా 3:21–31, గలతీ.3) నిబంధనను మీరిన మానవులను తిరిగి సంబంధంలోనికి తీసుకొని రావడానికి దేవుడే మొదటి అడుగును ఎసేను. ఆయన ఈవిధంగా చేసెను.

1. క్రీస్తు కార్యము ద్వారా పాపభరితమైన మానవ జాతిని నీతిమంతులుగా ప్రకటించినాడు (న్యాయస్థాన సంబంధమైన నీతి)
2. క్రీస్తుకార్యము ద్వారా మానవజాతికి నీతిని ఉచితంగా ఇవ్వటం (ఆరోపింపబడిన నీతి)
3. మానవజాతి నీతిని కల్గించే పరిశుద్ధాత్మవశింపు ఇవ్వటం (నైతిక నీతి)
4. క్రీస్తు విశ్వాసిలో దేవుని పోలికను కల్గించుటవలన ఏలెనువనంలోని సహవాసమును తిరిగి సమకూర్చటం (సంబంధనరమైన నీతి) ఎలాగైననూ దేవుడు నిబంధన సంబంధమైన స్పందనను కోరుచున్నాడు. ఈ విషయంలో దేవుడు శాసిస్తాడు (ఉచితంగా ఇస్తాడు) ఆయనే సమకూర్చుతాడు. కానీ మానవులు తప్పక స్పందించాలి. స్పందిస్తూ ఉండాలి.

    1. మారుమనస్సు
    2. విశ్వాసం
    3. విధేయత జీవిత విధానం

4. సహనము

నీతి అనేది దేవునికిని ఆయన ఉన్నత సృష్టి అయిన మానవునికి మధ్య ఉన్న నిబంధనపరమైన మరియు పరస్పర అన్యోన్యతగలిగిన కార్యము ఇది దేవుని గుణముపైన, క్రీస్తుకార్యముపైన, ఆత్మపురికొల్పుపైన ఆధారపడి వీటికి వ్యక్తిగతంగా ప్రతిఒక్కరూ సరిగా స్పందిస్తూ ఉండాలి. ఈ ఆలోచననే "విశ్వాసము వలన నీతి" అని పిలుచుదురు. ఈ ఆలోచన సువార్తలలో ప్రత్యేకమైన ఈ పదములతో కాదు. ఈ పదము ప్రధానంగా పౌలుచే నిర్వచించబడినది. దీనిని పౌలు గ్రీకుపదంతో 100 సార్లు కంటే ఎక్కువగా ఉపయోగించినాడు.

పౌలు శిక్షణ పొందిన బోధకునిగా డైకైసునొ (..........) అన్న పదమును హీబ్రూ ఆలోచన రీతిలో ఉపయోగించినాడు కానగ్రీకు సాహిత్యమునుంది కాదు. గ్రీకు సాహిత్యంలో ఈ పదము సమాజమునకు మరియు దేవతల తలంపులచే అనుసరించబడిన ఒక వ్యక్తినకు సంబంధించినదిగా ఉన్నది. హీబ్రూ ఆలోచనలలో ఇది ఎల్లప్పుడూ నిబంధన పదములతో నిర్మితమై యున్నది. యెహోవా దేవుడ, న్యాయవంతుడు, నీతిమంతుడు మరియు గుణవంతుడు. దేవుడు ఆయనవలె తన ప్రజలు ఉండాలని ఆశిస్తున్నాడు. రక్షించబడిన మానవులు నూతన సృష్టి ఈ నవీనత్వము దైవత్వం అన్న క్రొత్త జీవిత విధానంలో కనిపిస్తుంది. ఇశ్రాయేలు రాజ్యము, దైవ పరిపాలన క్రింద ఉండుల వలన సామాజిక మరియు దైవికం అన్న విషయాలలో స్పష్టమైన వేర్పాటు కనిపించలేదు. ఈ వ్యత్యాసం హీబ్రూ మరియు గ్రీకు పదములు ఇంగ్లీషులో అనువందిచబడినవై "న్యాయం" (సమాజమునకు సంబంధిచినది) మరియు "నీతి" (మతమునకు సంబంధిచినది).

యేసు క్రీస్తు సువార్త ఏమిటంటే పతనమైన మానవజాతి తిరిగి దేవునితో సహవాసములోనిక తీసుకొనిరావటమే. పౌలు యొక్క విపరీతమైన భావము ఏమిటంటే దేవుడు క్రీస్తు ద్వారా దోషమునుండి విముక్తి చేయడం. ఇది తండ్రిప్రేమ, కరుణ, కృప, కుమారుని జీవితము, మరణ పునరుత్థానము, పరిశుద్దాత్మ ఒప్పుదల మరియు సువార్తవైపు ఆకర్షణ ద్వారా సంపూర్తి చేయబడుతుంది. నీతిమంతులుగా చేయబడలము దేవుని యొక్క ఉచితమైన కృప కాని అది దైవత్వంతో బయటపాడాలి. (అగస్టీన్ యొక్క స్థానము, సంస్కరణ ఉద్యమం యొక్క సువార్త యొక్క విడుదల మరియు రోమన్ కదోలిక్‌ల మార్పు చెందిన జీవితం యొక్క ప్రేమ మరియు విశ్వాస్యతలను రెండింటిని ఇది సూచిస్తుంది.) సంస్కరణ కర్తలకు "దేవునినీతి" అనేది బాహ్యమైనదిగా కనిపిస్తుంది. (పాపియైన మానవుని దేవుని యెదుట అంగీకార యోగ్యంగా చేయటం (స్థాన శుద్ధీకరణం), కథోలిక్‌లకైతే అంతః కరణము, మనస్సునకు సంబంధించినదిగా బాహ్యము కానిదిగా ఉంటుంది. ఇది దేవునివలె మార్చబడటము అన్న విధానంలో జరుగుతుంది. (అనుభ క్రమేణ శుద్ధికరణము), నిజంగా ఈ రెండునూ నీతిమంతులుగా తీర్చటంలో ఉంటాయి.

నా ఉద్దేశ్యంలో బైబిల్ అంతా, ఆదికాండము, 4వ అధ్యాయం నుండి ప్రకటన 20, వరకు ఏదేను యొక్క సహవాసమును తిరిగి కల్పించుట యొక్క గ్రంథం అయిఉన్నది. బైబిల్ గ్రంథము భూమిమీద దేవుడు మానవునితో ఉన్న సహవాసముతో ప్రారంభమై (ఆది 1-2) అదే అమరికతో బైబిల్ ముగుస్తుంది (ప్రకటన 21-22) దేవుని స్వరూపము మరియు దేవుని చ్ఛిము తిరిగి నిర్మించబడుతుంది. పై చర్చించని విషయములను ఋజువు పర్చుటకు ఈ క్రింది గ్రీకు పద వర్గములతో క్రొత్త నిబంధన వాక్య భాగములు ఎంపిక చేయబడినవి.

1. దేవుడు నీతిమంతుడు (ఈరుచుగా దేవుడు ఒక న్యాయాధిపతిగా సూచించినది)
   ఎ) రోమా 3:26
   బి) 2దెస్స 1:5-6
   సి) 2తియోతి 4:8
   డి) ప్రకటన 16:5
2. యేసు నీతిమంతుడు
   ఎ) అపో 3:14, 7:52, 22:14 (మెస్సియ బిరుదు)
   బి) మత్తయి 27:19
   సి) ఐ.యెహోను 2:129, 3:7
3. దేవుని సృష్టి నిమిత్తము దేవుని చిత్తము నీతిగలది
   ఎ) లేవి 19:2
   బి) మత్తయి 5:48 (5:17-20)
4. నీతిని ఇచ్చుటకు, నీతిని కల్గించుటకు దేవుని మార్గములు నీతివంతమైనవి

ఎ) రోమా 3:21-31

బి) రోమా 4

సి) రోమా 5:6-11

డి) గలతీ 3:6-14

ఇ) దేవునివలన ఇవ్వబడినది

1) రోమా 3:24, 6:23

2) ఐ.కొరింది 1:30

3) ఎఫెసి 2:8-9

ఎఫ్) విశ్వాసం వలన స్వీకరించబడినది

1) రోమా 1:17, 3:22, 26 - 4:35,13 - 9:30, 10:4,6,10

2) ఐ.కొరింది 5:21

జి) కుమారుని కార్యము ద్వారా

1) రోమా 5:21-31

2) 2కొరింది 5:21

3) ఫిలిప్పి 2:6-11

5. దేవుని అనుసరులు కూడా నీతిమంతులుగా ఉండాలని దేవుని చిత్తము

ఎ) మత్తయి

బి) రోమా 2:13 - 5:1,5 - 6:1,23

సి) 2కొరింది 6:14

డి) 1తిమోతి 6:11

ఇ) 2తిమోతి 2:22, 3:16

ఎఫ్) 1 యెహోను 3:7

జి) 1పేతురు 2:24

6. దేవుడు నీతిని బట్టి లోకమును తీర్పు తీర్చుతాడు

ఎ) అపొ 17:31

బి) 2తిమోతి 4:8

7. నీతి అనేది దేవుడు గుణలక్షణము, అది పాపభరితమైన మానవునికి ఉచితంగా ఇవ్వబడినది.

1) ఒక దేవుని శాసనము

2) ఒక దేవుని వరము

3) ఒక క్రీస్తు కార్యము

కాని నీతి మంతులగుటకు ఒకడు స్థిరంగా గట్టి ప్రయత్నంతో పనిచేయాలి. ఈ ప్రయత్నం రెండవ రాకడ దినముతో సంపూర్తి అగును. దేవునితో సహవాసము రక్షణతో నెలకొల్పబడింది కాని అది జీవితమంత క్రమేణ చెందుతూ మరణముతో ముగుస్తుంది. డిక్షనరీ ఆఫ్ పౌల్ మరియు హిస్ లెటర్స్ **IVP** లో నుండి తీయబడిన ఒక మంచి వాక్యం.

“కాల్విన్, లూదర్ కంటే ఎక్కువగా, దేవుని నీతి యొక్క సంబంధ దృక్పధము వర్ణించాడు. లూదర్ యొక్క దేవుని నీతి అనేది ఉంచబడినదిగా లేక మోపబడినదిగా కనిపిస్తుంది. కాల్విన్ అద్భుతమైన సమాచరము లేక దేవుని నీతి మనకిచ్చుట గురించి ఎక్కువగా వివరించినాడు” (834 పేజీ)

నాకు సంబంధించి దేవునితో విశ్వాసి సంబంధము మూడు దృక్పదాలు కల్గియున్నది.

1. సువార్త ఒక వ్యక్తి (ఈస్టరన్ సంఘం మరియు కాల్వినిస్ట్)

2. సువార్త సత్యము (ఆగస్టిన్ మరియు లూథర్ వివరణ)

3. సువార్త మార్పు చెందిన జీవితము (కథోలిక్‌ల వివరణ)

ఇవి అన్నియూ సత్యము మరియు ఆరోగ్యకరమైన, సత్యమైన బైబిల్ క్రైస్తవమునకు కలిసియుండాలి. ఎవరైనా ఎక్కువ వర్ణించిన, లేక తగ్గించిన సమస్యలు వచ్చును. మనం యేసుని ఆహ్వానించాలి. మనం సువార్తను నమ్మాలి. మనం క్రీస్తు వలె ఉండుటకు ప్రయత్నించాలి.

**NASB, NKJV "విశ్వాసము నుండి విశ్వాసమునకు"**

**NRSV "విశ్వాసము ద్వారా విశ్వాసమునకు"**

**TEV "ఇది విశ్వాసము ద్వారా, ఆదినుండి అంతం వరకు"**

**JB "విశ్వాసము, విశ్వాసమునకు ఎలా నడిపిస్తుందో ఇది చూపుతుంది"**

ఈ వాక్యము రెండు విభక్తులను కల్గియుంది. ఎక్ మరియు ఎయిస్ ఇది ఒక బదిలీ లేక అభివృద్ధిని సూచిస్తుంది. పౌలు ఇలాంటి అమరికన్ 2.కొరింది 2:16 లోను 2కొరింధి 3:18లో అపొ మరియు ఎయిస్‌ను ఉపయోగించినాడు. క్రైస్తవ్యము ఒక బహుమానము అది ఒక లక్షణము మరియు జీవిత విధానంగా ఉండటానికి ఆశించబడుతుంది. ఈ వాక్యమును వ్యాఖ్యానించడానికి చాలా రీతులు ఉన్నాయి. విలియమ్స్ నూతన నిబంధన దీనిని "విశ్వాస మార్గము గొప్ప విశ్వాసమునకు నడిపించును" అని వ్యాఖ్యానించినాడు. ప్రధానమైన వేదాంత విషయములు ఏవనగా 2(1) విశ్వాసము దేవుని నుండి వచ్చును. "ప్రత్యక్షమైనది" (2) మానవుడు స్పందించాలి మరియు స్పందిస్తూ ఉండాలి; మరియు (3) విశ్వాసము దైవిక జీవిత ఫలమైయుండాలి. ఒక్క విషయము నిశ్చయం, క్రీస్తుయందు "విశ్వాసము" చాలా ప్రాముఖ్యమైనది (5:1 ఫిలిప్పి 3:9) విశ్వాసముతో స్పందించుట అన్న షరుతుపై దేవుని రక్షణ బహుమానం ఆధారపడి ఉన్నది. (మార్కు 1:15, యెహాను 1:12, 3:16, అపొకా 3:16,19; 20:21)

**NASB, "నీతిమంతుడు విశ్వాసమూలమున బ్రతుకును"**

**NKJV "నీతిమంతుడు విశ్వాస మూలంగా జీవించును"**

**NRSV "నీతిమంతుడైన ఒక్కడు విశ్వాసమూలంగా జీవించును"**

**TEV "విశ్వాసం ద్వారా దేవునితో సరైనవాడు జీవించును"**

**JB నీతిమంతుడు విశ్వాసము ద్వారా జీవమును కనుగొనును"**

ఇది హబక్కూకు 2:4 నుండి తీయబడిన వాక్యము, కాని మసోరిటిక్ టెక్స్ట్ లేదా సెప్టుజియంట్ నుండి కాదు, పాతని బంధనలలో "విశ్వాసము" "నమ్మకత్వము"నకు లేక "విధేయత్వమునకు" రూపక అలంకార అర్ధంగా విస్తరించబడినది. "రక్షించే విశ్వాసము దేవుని విశ్వాస్యత పైన ఆధారపడి ఉంది. (3:5, 21, 22, 25, 26) ఎలాగైననూ, మానవుని విశ్వాస్యత ఒకడు దేవుని ఏర్పాటుపై నమ్మకం ఉంచాడు. అన్నదానికి బుజువైయున్నది. పాత నిబంధనలోని ఇదే వాక్య భాగం గలతీ 3:11 మరియు హైబ్రీ 10:38లో కూడా చెప్పబడినది. తదుపరి సాహిత్య భాగము రోమా 1:18–3–20, దేవునికి విశ్వాస్యత చూపుటకు విరోధమైన స్థితిని ప్రత్యక్ష పర్చుతుంది. ఈ వాక్య భాగమును నవీన అనువాదకారులు ఎలా అర్ధము చేసుకొన్నారో పట్టీగా చేయటం సహాయపడుతుంది.

1) వూగాన్ : "విశ్వాసముతో ప్రారంభమై విశ్వాసముతో ముగియును"

2) హోడ్జ్ : "విశ్వాసము వలన మాత్రమే"

3) బారెట్ : "దేని ఆధారం కాదుగాని విశ్వాసము మాత్రమే"

4) నాక్స్ : "విశ్వాసమే మొదట మరియు చివరిది"

5) స్టాగ్ : "నీతిమంతుడు విశ్వాసం నుండి బ్రతుకును"

**NASB** (నవీన) వాక్యము **1:18-23**

> **18 దుర్నీతిచేత సత్యమును అడ్డగించు మనుష్యులు యొక్క సమస్త భక్తిహీనత మీదను దేవుని కోపము పరలోకము నుండి బయలుపరచబడుచున్నది. 19 ఎందుకనగా దేవుని గూర్చి తెలియశక్యమైనదేదో అది వారి మధ్య విశదమైయున్నది. దేవుడు అదివారికి విశదపరచెను. 20 ఆయన అదృశ్య లక్షణములు, అనగా ఆయన నిత్యశక్తియు, దేవత్వమును, జగదుత్పతి మొదలుకొని సృష్టించబడిన వస్తువులను ఆలొచించుటవలన తేటపడుచున్నది. గనుక వారు నిరుత్తరులై యున్నారు. 21 మరియు వారు దేవని నెరిగియు ఆయనను దేవునిగా మహిమపరచలేదు, కృతజ్ఞతాస్తుతులు చెల్లింపను లేదుగాని తమ వాదములయందు వ్యర్థులైరి. 22 వారి అవివేక హృదయము అందకారమయమయెను. తామా జ్ఞానులమని చెప్పుకొనుచు బుద్ధిహీనులైరి. 23 వారు అక్షయుడగు దేవుని మహిమను క్షయమగు మనుష్యులు యొక్కయు, పక్షుల యొక్కయు, చతుష్పాద జంతువుల యొక్కయు, పురుగులు యొక్కయు ప్రతిమా స్వరూపంగా మార్చిరి.**

- 1:18 **"ఎందుచేతననగా"** 16-17 వచనములలో గార్ ఎన్నిసార్లు వాడబడిందో గమనించండి - మూడుసార్లు, ఇద పౌలు యొక్క సువార్తలో మొదటి విషయమును పరిచయం చేస్తుంది (1:18-3:31) ఇది రక్షించుటకు దేవుని శక్తి అన్న దానిని విభేదిస్తుంది (1:16-17)

- **"దేవుని కోపము"** 18-23 వచనములు పౌలు కాలమునాటి అన్యలోకమును సూచిస్తుంది. అన్య లోకమును గురించిన పౌలు వర్ణన యూదుల సాహిత్యం (లిస్‌డమ్ ఆఫ్‌సాలోమోన్ 13:1 మరియు లెటర్‌ఆఫ్ అరిస్టెయస్) అదేవిధంగా గ్రీకులు మరియు రోమీయుల నీతి గ్రంథాలలో కూడా కనిపిస్తుంది. దేవుని ప్రేమను తెలియజేసే అదే బైబిల్, దేవుని కోపమును కూడా ప్రత్యక్ష పరుస్తుంది. (23-32, 2:5,8, 3:5, 4:15, 9:22, 12:19, 13:4-5) కోపము మరియు (పేవ) అనేవి మానవ పదములై దేవునికి వర్తిస్తున్నాము. దేవుడు స్పందించి జీవించాలనే సత్యాన్ని అవి వ్యక్తపరుస్తున్నాయి. ఒకని యొక్క స్వచిత్త తృణీకారము తత్కలమునకు మరియు అంత్యకాలమునకు సంబంధించిన ఫలితములిచ్చును (2:5) ఎలాగైననూ, దేవుడు పగ తీర్చుకొనేవాడని చూడకూడదు. తీర్పు అనేది ఆయన "బలిష్టమైన పని" (యోషయా 28:21) ప్రేమ ఆయన గుణము, ద్వితి 5:9 - 5:10, 7:9 పోల్చండి. ఆయన యందు కరుణా జాలి హెచ్చుగా ఉన్నవి. అయినప్పటికిని మనం అందరం దేవునికి లెక్క అప్పజెప్పవలయును (ప్రసంగి 12:13-14, గలతీ. 6:7), క్రైస్తవులు కూడా (14:10-12, 2.కొరింది 5:10)

- **"బయలుపర్చబడుచున్నది"** సువార్త బయలు పర్చబడిన సత్యమువలె (17వ) దేవుని కోపం కూడా బయలుపర్చబడుచున్నది. ఇది మానవుని అన్వేషణ మరియు యుక్తికాదు.

- **"సత్యమును అడ్డగించు"** ఇది మానవుని స్వంత తృణీకారము కాని అజ్ఞానము కాదు (21,32, యెహాను 3:17-21). ఈ వాక్యము ఈ రీతిలొ చెప్పవచ్చు (1) వారిక సత్యము తెలుసుకాని దానిని తృణీకరించారు, (2) వారు సత్యమును తృణీకరించారు. అని వారి జీవిత విధానం చూపెడుతుంది. లేక (3) వారి జీవితాలు మరియు మాటలు ఇతరులు సత్యమును తెలుసుకొని స్వీకరించకుండా ఉండుటకు కారణమైనవి

**ప్రత్యేక అంశం : "పౌలు రచనలలో సత్యము"**

1. రోమా 1:18,25 - 2:8,20 - 3:7 - 15:8
2. 1.కొరింది 13:6
3. 2.కోరింది 4:2, 6:7, 11:10, 13:8
4. గలతీ 2:5,14 - 5:7
5. ఎఫెసీ 1:13, 6:14
6. కొలస్సీ 1:5,6
7. 2దెస్స 2:10,12,13
8. 1తిమోతి 2:4, 3:15, 4:3, 6:5
9. 2తిమోతి 2:15,18,25 - 3:7,8 - 4:4
10. తితుకు 1:1,14

**పౌలు మాట్లాడుతున్న మాటలు సత్యము అని చెప్పడానికి ఈ పదమును మార్గంగా వ్యక్తపరుస్తున్నాడు.**

1. అపొ. 26:25
2. రోమా 9:1
3. 2కోరింది 7:14, 12:6
4. ఎఫెసి 4:25
5. ఫిలిప్పి 1:18
6. 1తిమోతి 2:7

**పౌలు తనతలంపులను వివరించుటకు (1.కొరింది 5:8)లో మరియు జీవనశైలి (క్రైస్తవులందరికి కూడా) ఎఫెసి 4:24, 5:9, ఫిలిప్పి 4:8లో ఉపయోగించినాడు కొన్నిసార్లు ప్రజలకొరకు వాడినాడు**

1. దేవుడు రోమా 3:4 (యోహాను 3:33, 17:17)
2. యేసు, ఎఫెసి 4:21 (యోహాను 14:6నకు సాదృశ్యంగా)
3. అపొస్తులుల సాక్షుములు, తీతుకు 1:13
4. పౌలు 2.కొరింది 6:8

పౌలు మాత్రమే క్రియారూపమును గలతీ 4:16 మరియు ఎఫెసి 4:15లొ సువార్తను సూచిస్తూ ఉపయోగించినాడు. మరిన్ని విషయముల కొరకు కొలిన్ (బౌన్ఎడి) థాన్యూ ఇంటర్‌నేషనల్ డిక్షనరీ ఆఫ్ న్యూటెస్ట్‌మెంట్ థి యెటజీ, సంపుటి3, 784, 902 పేజీలు చూడండి.

**1:19 "దేవుని గూర్చి తెలియ శక్యమైనదేదో అది వారి మధ్య విశదమైయున్నది; దేవుడు అదివారికి విశదపరచెను".** సృష్టి నుండి మానవులందరూ దేవుని గూర్చి కొంత తెలుసుకోగలరు. (20వ, యోబు 12:7-10 మరియు కీర్తన 19:1-6, 12-15) వేదాంతములో దీనిని "సహజ ప్రత్యక్షత" అని పిలుస్తారు. ఇది సంపూర్తి కాదు, కాని దేవుని ప్రత్యేక ప్రత్యక్షతను లేఖనాలలో ప్రత్యేకంగా యేసుక్రీస్తులో చూడబడని వారి కొరకు దేవుని బాధ్యతకు ఆధారము (కొలస్సి 1:15, 2:9)

**"విశదము"** అన్న పదము క్రొత్త నిబంధనలో రెండు విధాలుగా వాడబడినది. (1) దీని పాల నిబంధన భావంతో సన్నిహిత సంబంధం అని (ఆది 4:1, యిర్మియా 1:5) మరియు దీని గ్రీకు భావంతో ఒక విషయం గురించిన సత్యము అని (21వ) సువార్త అనేది ఆహ్వానించదగిన ఒక వ్యక్తి మరియు ఆ వ్యక్తిని గురించిన సందేశము విని విశ్వసించడం అనే విషయము. ఈ వచనంలో ఇది రెండవ రీతిలో వాడబడినది. 1:20 ఈ వచనము దేవుని యొక్క మూడు విషయములను తెలియజేస్తుంది.

1. దేవుని అదృశ్య లక్షణములు (దేవుని గుణము. కొలస్సి 1:15, 1 తిమోతి 1:17, హెబ్రీ 11:27)
2. దేవుని నిత్యశక్తి (భౌతిక విశ్వంలో కనిపించేది)
3. దేవుని దైవిక స్వభావం (ఆయన కార్యములలో మరియు సృష్టితలంపులలో కనిపిస్తుంది)

- **"జగదుత్పత్తి మొదలుకొని"** అపొ అనే విభక్తి ఆశాశ్వతమైన భావనలో వాడబడినది. ఇలాంటి పదము మార్కు 10:6, 13:19, 2.పేతురు 3శ4లో కూడా కనిపిస్తుంది. అదృశ్య దేవుడు (1) భౌతిక సృష్టి, (2) లేఖనాలు, మరియు (3) చివరిగా యేసు క్రీస్తులో చూడవలెను.
- **"దేవత్వము"** గ్రీకు సాహిత్యము నుండి దియొటస్ (.....) "దైవివక ప్రభావం"గా అనువదించబడినది. ఇది యేసులో ఉన్నతంగా కనిపిస్తుంది. ఆయన ప్రత్యేకంగా దేవుని స్వరూపంను భరించాడు. (2.కోరింధి 4:4; హెబ్రీ 1:3) యేసు క్రీస్తు మానవ ఆకారంలో దేవుని సంపూర్ణ ప్రత్యక్షతను చూపినాడు (కొలస్సీ 1:19, 2:9) అద్భుతమైన సత్యమేదనగా, పతనమైన మానవజాతి, క్రీస్తునందు విశ్వాసము ద్వారా క్రీస్తు వంటి స్వభావంలో పాలి భాగస్తులగుదురు. (హెబ్రీ 12:10, ఐ. యోహాను 3:2) మానవునిలో దేవుని స్వభావము తిరిగి పునరుద్ధికరించబడినది. (ఆది 1:26-27, 2పేతురు 1:3-4)

- **NASB "సృష్టింపబడిన వస్తువులను ఆలోచించుట వలన తేట పడుచున్నది"**
  **NKJV "సృష్టింపబడిన వాటి వలన తెలియపర్చబడుచున్నవి"**
  **NRSV "ఆయన చేసిన వస్తువులను చూచుటను బట్టి అర్థమగుచున్నది"**
  **NJB "దేవుడు చేసిన వస్తువులలో అది తెలియచేయబడి అర్థమగుచున్నది"**

**"సృష్టింపబడిన వస్తువులను మనస్సు అర్థం చేసుకొనుటను బట్టి స్పష్టంగా కనబడుచున్నది"**

నోవాహు ..... (మత్తయి15:17) మరియు కథోరావో .... ల కలయిక ఒక సత్య జ్ఞానమును సూచిస్తుంది. దేవుడు రెండు గ్రంథములను వ్రాసెను. (1) ప్రకృతి మరియు (2) లేఖనం (3) అది రెండునూ మానవ జ్ఞానమునకు అంది మానవుని నుండి స్పందనను అడుగుచున్నవి. "కావున వారు నిరుత్తరులైనారు" ఇది అక్షరార్థంగా "న్యాయపరమైన వాదన లేనివారు" అని తెలియపరుస్తుంది. గ్రీకు పదమైన (ఎ మరియు అపోపలో జియామై) కొత్త నిబంధనలో ఇక్కడ వేదాంత ఉద్దేశ్యం, మానవులందరి ఆత్మీయ ఓటమిని చూపిస్తుందని జ్ఞాపకం ఉంచుకో, మానవులు వారుకున్న జ్ఞానమును బట్టి వారు బాధ్యులు దేవుడు మానవులకు తెలిసిన, తెలుసుకోదగిన విషయాలను బట్టియే వారి బాధ్యతను అడుగుచున్నాడు.

1:21 "వారు దేవునిని ఎరిగియు" మానవులు మతపరంగా అభివృద్ధి చెందుట లేదు కాని దుష్టరీతిలో అభివృద్ధి చెందినారు. ఆదికాండము 3 నుండి మానవులు క్రిందికి వెళ్ళుచున్నారు. అందకారము అధికమైనది.

- **"ఆయనను దేవునిగా మహిమపరచలేదు"** ఇది అన్య జనపు విగ్రహారాధన యొక్క దుస్థితి 23, 24 వచనాలు (యిర్మియా 2:9-13)
- **"తమ వాదముల యందు వ్యర్థులైరి".** వారి అవివేక హృదయము అందకారమయ మాయెను.

కొత్త నిబంధన : ఇలాప్ ఎమ్. మోర్లీ అనువాదంలో ఈవిధంగా ఉంది. "ఆయనను గురించి అనవసర వాదములతో వారు నిమగ్నులైనారు, వారు తెలివి తక్కువ హృదయములు చీకటిలో తడుము లాడెను". మానవ మత వ్యవస్థలు ఆత్మీయ తిరుగుబాటునకు మరియు అహంభావమునకు చిహ్నములు (22వ, కొలస్సీ 2:16-23)

రెండు క్రియలు ఆరోయిస్ట్ పాసిల్ ఇండికేటివిల్ ఉన్నవి. జ్ఞానము యొక్క కొరత మరియు సరిగా స్పందించక పోవటానికి దేవుడే వారి హృదయములను మరుగ జేసెనా లేక వెలుగును తృణీకరించి వారి హృదయములు కఠిన మాయెనా ? (10:12-16, 2 రాజులు 17:15, యిర్మియా 2:5, ఎఫెసి 4:17,19) ఈ సందర్భము అంతా మానవులందరి అపరాదమును సూచిస్తుంది.

- "హృదయము" పాత నిబంధనలో ఇది సంపూర్ణ వ్యక్తి గురించి తెలియజేస్తుంది. ఎలాగైననూ, ఆలోచన మరియు భావనలను తెలియజేయటానికి ఒక మార్గంగా దీనిని ఉపయోగిస్తారు. 1:24 ప్రత్యేక అంశం చూడుము. 1:22

**NASB, NRSV "తాము జ్ఞానులమని చెప్పుకొనుచూ బుద్ధిహీనులైరి"**
**NKJV "జ్ఞానులమనుకొని, బుద్ధి హీనులైరి"**
**TEV "వారు జ్ఞానులమని చెప్పారు, కాని బుద్ధిహీనులైనారు"**
**JB "వారు తత్వజ్ఞానులమని ఎక్కువగా చెప్పుకొనుచూ, తెలివితక్కువ వారైరి"**

గ్రీకు పదమైన "మోరాన్" నుండి ఇంగ్లీష్ పదమైన ఫూల్ (బుద్ధిహీనుడు) అన్నపదము వచ్చినది. సమస్య ఏమిటంటే మానవుల గర్వము మరియు వారి స్వంత జ్ఞానముపైన నమ్మకంలో ఉండి (1కోరింది 1:18-31, కొలస్సి 2:8-23). ఇది ఆదికాండము 3న వెళ్ళుచున్నది. తెలివి వేర్పాటును, తీర్పును తీసుకొని వచ్చింది. మానవుని తెలివి ఎల్లప్పుడూ తప్పు అని కాదు గాని అదే చివరిది కాదు. 1:23 స్వంతం గానే అజ్ఞానులైనారు. దేవుని స్వరూపమందు చేయబడిన మానవులు (ఆది 1:26-27, 5:1,3, 9:6) దేవునిని భూ సంబంధమైన ఆకారములైన (1) జంతువులు గాను (ఈజిప్టు) (2) ప్రకృతి శక్తులుగాను (పర్షియా, (లే) (3) మానవరూపములుగాను (గ్రీసు / రోము)

**విగ్రహములుగా మార్చినారు.**

దేవుని స్వంత ప్రజలు కూడా ఈ విధంగా చేసినారు. (ద్వితి 4:15-24, ఆమోసు 5:25-26). పాత పాపము యొక్క కొన్ని క్రొత్త రూపములు (పర్యావరణవాదం (భూమితల్లి), (2) న్యూఏజ్ ఈస్టరన్ థాట్ (మిస్టిసిసమ్, స్పిరిట్‌లిసమ్ మరిము అక్కల్ట్), (3) ఎతిస్టిక్ మానవవాదం (మార్కిసమ్, యుథోప్యనిసం, ప్రోగ్రెసిమ్ ఐడిమలిసమ్ మరియు విద్య, రాజకీయములపై చిట్టచివరి విశ్వాసం, (4) సంపూర్ణ వైద్యం (ఆరోగ్యము మరియు దీర్ఘాయుస్సు) మరియు (5) విద్య.

**"మహిమ" 3:23లో ప్రత్యేక అంశం చూడండి**

**NASB (నవీన) వాక్యము : 1:24-25**

> **24.** ఈ హేతువు చేత వారు తమ హృదయముల దురాశలను అనుసరించి, తమ శరీరములను సరస్పరము అవమాన పరుచుకొనునట్లు దేవుడు వారిని అపవిత్రతకు అప్పగించెను. **25.** అట్టి వారు దేవుని సత్యమును అసత్యమునకు మార్చి, సృష్టికర్తకు ప్రతిగా సృష్టిని పూజించి సేవించిరి. యుగము పర్యంతము ఆయన స్తోత్రార్హుడైయున్నాడు, ఆమెన్. **1:24, 26, 28** "దేవుడు వారిన అప్పగించెను" ఇది చాలా నీచమైన తీర్పు కావచ్చును. ఇది దేవుడు చెప్పుచున్నాడు

**"పడిపోయిన మానవులు వారు స్వతం మార్గములు కల్గియుండని"** (కీర్తన 81:12, హోషేయా 4:17, అపో 7:42) 23-32 వచనములు

అన్యలోకముపైన మరిము దాని మతతత్వంపైన దేవుని తృణీకారం (అశాశ్వతమైన ఉగత)ను వివరిస్తున్నాము. అన్య జనంగము లైంగిక అవినీతి మరియు లైంగిక అక్రమంలు గుణములు కల్గియున్నది.

**1:24 "హృదయములు" ప్రత్యేక అంశమును చూడండి.**

**ప్రత్యేక అంశం : హృదయం**

గ్రీకు పదమైన కార్డియా గ్రీకు బైబిల్ ... లో వాడబడినది. క్రొత్త నిబంధనలో హీబ్రూ పదమైన లెబ్ ఉపయోగించబడినది. ఇది చాలా రీతులలో వాడబడినది. (బ్రయర్, అర్నిడిట్, గింగ్రిచ్ మరియు డాంకర్, ఎ గ్రీక్-ఇంగ్లీష్ లెక్సికాన్, 403-404).

1. భౌతిక జీవితంలో కేంద్రం, వ్యక్తికి ఒక రూపక అలంకారం (అపో 14:17, 2కోరింది 3:2-3, యకోబు 5:5)
2. ఆత్మీయ జీవితమునకు కేంద్రం

   ఎ) దేవునికి హృదయం తెలుసు (లూకా 16:15, రోమా 8-27, 1కోరింది 14:25, 1థెస్స 2:4 ప్రకటన 2:23)

   బి) మానవుని ఆత్మీయ జీవితం కొరకు వాడబడినది. (మత్తయి 15:18-19, 18:35, రోమా 6:17, 1తిమో 1:5 2. తిమో 2:22, 1పేతురు 1:22)
3. ఆలోచన జీవితానికి కేంద్రము (జ్ఞానము మత్తయి 13:15, 24:48, అపో 7:23, 16:14, 28:27, రోమా 1:21, 10:6, 16:18, 2కోరింది 4:6, ఎఫెసి 1:18, 4:18, యాకోబు 1:26, 2 పేతురు 1:19, (ప్రకటన 18:7, 2కోరింది 3:14-15 మరియు ఫిలిప్పి 4:7లో హృదయము మనస్సుతో సాదృశ్యపదంగా వాడబడినది.
4. ఇచ్ఛాశక్తి / స్వచిత్తమునకు కేంద్రం (చిత్తము అపో 5:4, 11:23, 1కోరింది 4:5, 7:37, 2కోరింది 9:7)
5. భావనలకు కేంద్రం (మత్తయి 5:28, అపో 2:26, 37, 7:54, 21:13, రోమా 1:24, 2కోరింది 2:4, 7:3, ఎఫెసి 6:22, ఫిలిప్పి 1:7)
6. ఆత్మ కార్యములకు ప్రత్యేక స్థలం (రోమా 5:5, 2కోరింది 1:22, గలతీ 4:6 (మన హృదయములలో క్రీస్తు ఎఫెసి 3:17)
7. ఒక సంపూర్ణ వ్యక్తిని సూచించడానికి హృదయమును రూపక అలంకారంతో చూపడం ఒక మార్గం (మత్తయి 22:37 ద్వితి 6:5) తలంపులు, ఆలోచనలు మరియు కార్యాలు హృదయమునకు సంబంధించినవి ఒక వ్యక్తిగా చూపించేవి.

**పాత నిబంధనలో కొన్ని వాడుక పదములు చూద్దాము.**

ఎ) ఆది 6:6, 8-21, "దేవుడు తన హృదయమందు దుఃఖించెను" (హోషెయా 11:8-9)

బి) ద్వితి 4:29, 6:5 "హృదయమంతటితో"

సి) ద్వితి 10:16 (సున్నతి పొందని హృదయము"

డి) యెహేజ్కెలు 18:31-32 "నూతన హృదయం"

ఇ) యెహేజ్కెలు 36:26 "నూతనహృదయం" / "రాతి హృదయం"

**1:25 "దేవుని సత్యమును అసత్యమునకు మార్చిరి".**

ఇది చాలా రీతులుగా అర్థమవుతుంది (1) మానవుల యొక్క విగ్రహారాధన (2థెస్స 2:4,11, (2) దేవుడు చేసిన వాటిని మానవుడు ఆరాదించటం విగ్రహాలు (యెషయా 44:20, యిర్మియా 13:25, 16:19) యెహోవాను ఆరాధించడానికి బదులు దేవతలను ఆరాదించటం (18-23) లేక (3) సువార్త సత్యమును మానవుని తృణీకారం (యెహోను 14:17, 1యెహోను 2:21, 27) "పూజించి సేవించిరి" మానవులు ఎల్లప్పుడు దేవుళ్లను కలిగియున్నారు. వారిని మించి ఎవరో ఒకరున్నారని, ఎదో ఒక సత్యము ఉందని, ఎదో ఒకటి ఉందని

మానవులందరు గ్రహింపు కల్గియున్నారు. "యుగముల పర్యంతము ఆయన స్తోత్రార్హుడైయున్నాడు" అపో. పౌలునకు అలవాటైన యూదుల ఆశీర్వములోనికి ఒక్కసారి బయటపడినాడు. (రోమా 9:5, 2కోరింది 11:31) అపో పౌలు వ్రాస్తూ అనేక సందర్భములలో ప్రార్ధనలను వినిపించువాడు (9:5, 11:36, 15:33, 16:27) "యుగముల పర్వంతము" ఇది గ్రీకు అక్షరార్ధపు జాతీయము, "యుగముల పర్యంతము" (లూకా 1:33, రోమా 1:25, 11:36, 16:27, గలతీ : 1:5 1 తిమోతి 1:17), ఇది హీబ్రూ 'ఓలామ్'ను సూచిస్తుంది. రాబర్ట్ బి. గిర్డిల్ స్టోన్, సినోనిమ్ ఆఫ్ దా ఒల్డ్ టెస్టమెంట్, 321-319ను చూడండి. ఇతర సంబంధపదములు "యుగాంతము" (మత్తయి 21:19 (మార్కు 11:14), 1దెస్స 1:55, యోహాను 6:5, 58, 8:35, 12:34, 13:8, 14:16, 2 కోరింది 9:9) మరియు "తర తరముల యొక్క" (ఎఫెసి 3:21) ఈ "యుగముల పర్యంతం" అన్న జాతీయముల మద్య వత్యాసం లేదు. "యుగములు" అన్న పదము బహువచనంలో రబ్బీయుల వ్యాకరణంలోని ఉపమాన అలంకారంగా చెప్పబడింది.

ఈ ఆలోచన అనేది చాలా "యుగములు" అన్న యూదుల అభిప్రాయం అయిన "అజ్ఞాన యుగం", "దుర్నీతియోగం" "రానున్నయుగం" లేక "నీతియుగం"

**"ఆమెన్" క్రింది అంశంను చూడండి.**

**ప్రత్యేక అంశం : ఆమెన్**

1. పాత నిబంధన
   - ఎ. "ఆమెన్ అన్నపదం (ఈమెత్) అన్న హీబ్రూ పదం నుండి వచ్చినది. దీని అర్ధము సత్యము లేక విశ్వాసము / విశ్వాస్యత.
   - బి. దీని పదజాలం భౌతికంగా తిన్నగా నిలువడిన వ్యక్తినుండి వచ్చినది. దీని వ్యతిరేకపదం నిలుకడలేని, జారుతున్న లేక కదిలిపోతుతన్న వ్యక్తిఆ ఉంది. (ద్వితి 28:64-67, 38:16, కీర్తన : 40:2, 73:18, యిర్మియా 23:12, కీర్తన 73:2) ఈ ఉపయోగం నుండి విశ్వాస్యత, నమ్మకం, విధేయత మరియు ఆధారపడదగిన అన్న ఆలోచనలు వచ్చినవి.
   - సి. ప్రత్యేక ఉపయోగములు
     1. ఒక స్థంభము 2రాజులు 18:16 (1తిమోతి 3:15)
     2. నమ్మిక, నిర్తమ17:12
     3. నిలుకడ, నిర్గమ 17:12
     4. స్థిరం, యెషయా 33:6, 34:5-7
     5. నిజం, 1రాజులు 10:6, 17:27, 22:16 - సామెతలు : 12:22
     6. దృఢం, 2దిన 20:20 యెషయా 7:9
     7. ఆధారపడదగిన, (థోరా) కీర్తన 119:43, 142, 151, 168
   - డి. పాత నిబంధనలో విశ్వాసమునకు వేరే రెండు హాబ్రూ పదములు వాడబడినవి.
     1. బతాఖ్, నమ్మకం
     2. యరా, భయం, మర్యాద, ఆరాధన (ఆది 22:12)
   - ఇ) నమ్మకం లేక నమ్మకత్వం నుండి అభివృద్ధి చెందిన ప్రార్ధన ప్రకరణ పదము (ద్వితి 27:15-26, నెహెమ్యా 8:6, కీర్తన 41:13, 70:19, 89:52, 106:48
   - ఎఫ్) ఈ పదమునకు వేదాంత సూత్రం మానవుల యొక్క విశ్వాస్యత కాదుగాని, యెహోవాది (నిర్గమ 34:6, ద్వితి 32:4, కీర్తన 108:4, 115:1, 117:2, 138:2) పతనమైన మానవుల యొక్క ఒకే ఒక్క ఆశ, కరణ విశ్వాస్యతలతో కూడిన యెహోవా నిబంధనలో ఉన్న నమ్మదగినతనం మాత్రమే యెహోవాను ఎరిగినవారు ఆయనవలె ఉంటారు (హబ 2:4) బైబిల్ గ్రంథం మానవునిలో పోయిన దేవని స్వరూపము తిరిగి పునరుద్దరించబడే చరిత్ర నమోదు (ఆది 1:26-27 రక్షణ దేవునితో సన్నిహిత సంబంధం కల్లియుండటానికి సామర్ధ్యతను ఇస్తుంది. ఇందుకే మనం సృజించబడ్డాము.
2. క్రొత్త నిబంధన
   - ఎ. క్రొత్త నిబంధనలో ఒక పదము యొక్క విశ్వాస్యతను నమ్మకంను ధృవీకరించటానికి ప్రార్ధన ప్రకరణముగా చివరలో వాడబడే పదం "ఆమెన్" (1కోరింది 14:16, 2కోరి 1:20, ప్రకటన 1:7, 5:14, 7:12)
   - బి. ప్రార్ధన చివరలో ఆమెన్ అన్న పదం వాడుక క్రొత్త నిబంధనలో వాడుక (రోమా 1:25, 9:5, 11:36, 16:27, గలతీ 1:5, 6:18, ఎఫెసి 3:21, ఫిలిప్పి 4:20, 2దెస్స 3:18, 1 తిమోతి 1:17, 6:16, 2 తిమోతి 4:18)

సి. ప్రాముఖ్యమైన వాక్యములను పరిచయం చేయుటకొరకు చేసు తరచుగా ఈ పదమును ఉపయోగించినారు (లూకా 4:24, 12:37, 18:17,29, 21:32, 23:43)

డి. యేసునకు బిరుదుగా ప్రకటన 3:14లో ఈ పదం వాడబడినది. (యెషయా 65:16లో యెహోవా బిరుదు కావచ్చు)

ఇ. నమ్మకత్వం, విశ్వాసం అన్న పదముల గ్రీకు మూలపదం పిస్టోస్ లేక పిస్టిస్ పదముల ఆంగ్ల అనువాదం, నమ్మకం, విశ్వాసం, స్థిరత్వం అన్న అర్ధమిచ్చునది.

**NASB (నవీన) వాక్యము 1:26-27**

**26. అందువలన దేవుడు తుచ్ఛమైన అభిలాషలకు వారికి అప్పగించెను. వారి స్త్రీలు స్వాభావికమైన విరుద్ధమైన ధర్మమును అనుసరించిరి. 27. అటువలె పురుషులు కూడా స్త్రీ యొక్క స్వాభావికమైన ధర్మమును విడిచి పురుషులతో పురుషులు అవాచ్యమైనది చేయుచూ, తమ తప్పితమునకు తగిన ప్రతిఫలమును పొందుచు ఒకరి యెడల ఒకరు కామాతప్తులైరి.**

1:26,27 స్వలింగ సంపక్రము అనేది సృష్టిలో దేవుని చిత్తమునకు విరోధమైన జీవితంనకు ఒక ఉదాహరణము. ఇది ఒక పాపము మరియు సాంస్కృతిక సమస్య. (1) పాత నిబంధనలో (లేవి. 18:22, 20:13, ద్వితి 23:18, (2) గ్రీకు-రోమా ప్రపంచంలో (1కోరింది 6:9, 1తిమోతి 1:10), మరియు (3) మన దినములలో కూడా ఆది 1-3, సందర్భంలోని పతనమైపోయిన జీవితంలో ఉన్న కార్యములలో స్వలింగ సంపర్కం అనేది ఒక ఉదాహరణ మానవుడు దేవుని స్వరూపంలో సృష్టించబడినాడు (ఆది 1:26-27, 5:1, 3, 9:6 మానవుడు స్త్రీనిగానూ, పురుషునిగానూ చేయబడినాడు. (ఆది 1:27) ఫలించి అభివృద్ధి చెందమని దేవుడు ఆజ్ఞాపించినాడు. (ఆది 1:28, 9:1, 7) మానవ పతనం దేవుని ప్రణాళిక చిత్తమును పాడుచేసింది. స్వలింగ సంపర్కం విపరీతమైన నేరం. ఎలాగైననూ, ఈ సందర్భంలో ఈ ఒక్క పాపము మాత్రమే ప్రస్తావించబడలేదు (29-31) పాపములన్నియూ, దేవుని నుండి మానవుని వేరు పరిచి వారు శిక్షకు యోగ్యులైరి. పాపములన్నియూ, ప్రత్యేకంగా జీవిత విధానంలోని పాపము, దేవునికి ఎంతో అసహ్యము ప్రత్యేక అంశంను క్రింద చూడండి.

**ప్రత్యేక అంశం : స్వలింగ సంపర్కం**

స్వలింగ సంపర్కం స్వలింగ సంపర్కమును సరైన వేరే జీవిత విధానమునకు అంగీకరించవచ్చునని నవీన సంస్కృతి ఒత్తిడి అధికమవుతుంది. దేవుని సృష్టి గురించిన చిత్తమునకు ఏఒది వేరైనదిగా జీవితంలను పాడు చేసేదిగా బైబిల్ దీనిని ఖండిస్తుంది.

1. ఆది 1లో నున్న ఫలించి అభివృద్ధి చెందుడి అన్న ఆజ్ఞను మీరేటట్లు చేస్తుంది.

2. అన్య ఆరాధనను మరియు సంస్కృతిని వారి అలవాట్లును సూచిస్తుంది (లేవి 18:22, 20:13, రోమా 1:26-27, యుదా 7) దేవుని నుండి స్వతంత్రమైన స్వకేంద్రిత జీవితమును ప్రత్యక్ష పరుస్తుంది. (1కోరింది 6:9-10) ఎదేమైననూ, ఈ అంశంను విడిచిపెట్టెముందు తిరుగుబాటు చేసే మానవులందరిని ప్రేమించి, క్షమించే దేవుని గురించి గుర్తు చేస్తున్నాను. ఈ ప్రత్యేకమైన పాపము యెడల అసహ్యకరంగా, అహంకారంగా ప్రవర్తించటానికి హక్కులేదు. అహంకారముతో ద్వేషించుటకంటే ప్రార్ధన పట్టింపు, సాక్ష్యము మరియు కనికరం చూపించుట మంచిది. తీర్పును దేవుని వాక్యమునకునూ దేవుని ఆత్మకునూ విడిచిపెట్టినట్లయితే అవి వాటి పనిని చేస్తాయి. ఈ పాపము మాత్రమే కాదు గాని, లైంగిక పాపములన్నియూ దేవునికి అసహ్యంగా ఉండి తీర్పును తీసుకొనివచ్చును. స్త్రీ, పురుషుల కలయిక అనేది మానవుల ప్రశేయస్సు, ఆనందం, మరియు సామాజిక శ్రేయస్సు కొరకు దేవుడిచ్చిన వరము కాని ఈ శక్తివంతమైన దేవుడిచ్చిన ప్రేరణ తిరుగుబాటు చేయడానికి స్వకేంద్రిత జీవితం గల ఆనందమును వెదికే జీవితమునకు "ఏది ఎమైనా నాకు అధికం" అన్న ధోరణికి దారితీసింది. (రోమా 8:1-8, గలతీ 6:7-8) 28. మరియు నాకు తమ మనస్సులో దేవునికి చోటియ్య నొల్లకపోయిరి గనుక చేయరాని కార్యములు చేయుటకు దేవుడు (భష్టమనస్సుకు వారినప్పగించెను.) 29. అట్టివారు సమస్తమైన దుర్నీతి చేతను, దుష్టత్వము చేతను, లోభము చేతను, ఈర్ష్యచేతను నిండుకొని, మత్సరము నరహత్య కలహము కదుటము వైరమును వాటితో నిండినవారై కొండెగాల్లను 30. అపవాకులను దేవ ద్వేషులకు హింసకులును అహంకారులను బింకము లాడువారును చెడ్డ వాటిని కల్పించువారును తల్లిదండ్రుట కవిధేయులను 31. అవివేకులను మాట తప్పువారును అనురాగ రహితులను నిర్ధయులునైరి. 32. ఇట్టి కార్యములను అభ్యసించువారు మరణిమునకు తగిన వాడరు అను దేవుని న్యావిధిని వారు బాగుగా ఎరిగియుండియు, వాటిని చేయుచున్నారు. ఇది మాత్రమే గాక వాటిని అధ్యసించు వారితో సంతోషంగా సమ్మతించుచున్నారు.

1:28-31 ఇది గ్రీకులో ఒకే ఒక వాక్యము. ఇది తిరుగుబాటు తనం గల, పడిపోయిన, స్వతంత మానవులను తెలియజేస్తుంది. (రోమా. 13:13, 1కోరింది 5:11, 6:9, గలతీ 5:19-21, ఎఫెసి 5:5, 1తిమోతి 1:10, ప్రకటన 21:8) మానవుల పాపము ఏమిటంటె, దేవుని నుండి వేరు జీవితంను వారు ఎంచుకొన్నారు. నరకం ఆ వేరు జీవితమును శాశ్వతం చేస్తుంది. స్వతంత్రం ఎంతో భయంకరం! మానవులకు దేవుడు కావాలి. దేవుడు లేకుండా వారు నశించినవారు, తక్కువైనవారు, దేనిని నెరవేర్చలేనివారు నిత్యనరకంలోని నీచస్థితి ఏమిటంటే దేవునితో సంబంధం లేకపోవడమే.

**ప్రత్యేక అంశం :**

క్రొత్త నిబంధనలోని దుర్గుణములు మరాయు సద్గుణములు క్రొత్త నిబంధనలోని దుర్గుణములు మరియు సద్గుణముల రెండింటి పట్ట సహజం తరచుగా అవి సాంఘిక మరియు సంస్కృతిక లక్షణములను ప్రతిబింబిస్తాయి. క్రొత్త నిబంధనలో ఈ విరుద్ధ బావముల లక్షణములు ఈ క్రింది విధంగా చూడవచ్చు.

1. పౌలు దుర్గుణములు సద్గుణములు రోమా 1:28-32 -------- రోమా 13:13 రోమా 2:9-21 1కోరింది 5:9-11 -------- 6:10 1కోరింది 6:6-9 2కోరింది 12:20 2కోరింది 6:4-10 గలతీ 5:19-21 గలతీ 5:22-23 ఎఫెసి 4:25-32 -------- 5:3-5 ----------- ------ ఫిలిప్పి 4:8-9 కొలస్సి 3:5,8 కొలస్సి 3:12-14 1తిమోతి 1:9-10 -------- 6:4-5 --------- 2తిమోతి 2:22ఎ, 23 2.తిమెతి 2:22బి,24 తీతుకు 1:7, 3:3 తీతుకు 1:8-9, 3:1-2
2. యోకోబు యాకోబు 3:15-16 యాకోబు 3:17-18
3. పేతురు 1పేతురు 4:3 1 పేతురు 4:7-11 2 పేతురు 1:9 2 పేతురు 1:5-8
4. యోహాను ప్రకటన 21:8, 22:15 -----

**1:29 "భ్రష్టమనస్సుకు"** పడిపోయిన మానవుడు స్వతంత్రం అనుకుంటున్నది ఏమిటంటే స్వఆరాధన (తనను తాను ఆరాదించు కోవడం), "ఏదైనా మరియు సమస్తము నాకొరకు" 1:24, 26, 28 లోని కర్మార్థకపు కర్త దేవుడుగా చూడవచ్చు. అయితే ఆది 1-3లోని సంబంధ సంధర్భములో చూసినట్లయితే మానవుల యొక్క తెలివి మరియు స్వంతం గురించి తెలుసు కోవాలనే ఆశ సమస్యకు కారణమయినది మానవుల ఎంపికల యొక్క ప్రభావములను బట్టి శ్రమను దేవుడు అనుమతించినాడు.

**"నిండురకొని"** ఇది భూతార్ధ కర్మార్ధక క్రియాజన్యవిశేషణము ..... మానవులు దేని మీద / దేనితో బ్రతకుతున్నారో వాటితో నింపబడివుంటున్నారు. ప్రతి మానవుని హృదయంలో ఒక నల్లకుక్క మరియు ఒక తెల్లకుక్క ఉంటాయి అని రబ్బీలు చెప్పుదురు. దేనికైతే ఆహారం దొరికితే అది పెద్దదగును. 1:29-31 దేవుడు లేని కారణం వలన జీవితంలో వచ్చిన ఫలితములు లేక లక్షణములు బైబిల్ దేవుని తృణీకరించు వ్యక్తులు మరియు సమాజముల గుణ లక్షణములను 12:20, అవి సూచిస్తున్నాయి. అపో పౌలు ఇచ్చిన పాపముల పట్టీలలో ఇది ఒకటి (1కోరింది 5:11, 6:9, 2కోరింది గలతీ 5:19-21, ఎఫెసి 4:31, 5:3-4, కొలస్సీ 3:5-9 1:30 "అహంకారులు" పౌలు యొక్క "హుపర్" మిళిత పద వాక్యములలో ఇది ఒకటి.

**ప్రత్యేక అంశం : "హుపర్" యొక్క పౌలు వాడుక**

పౌలు గ్రీక విభక్తి అయిన "హుపర్"ను ఉపయోగించి ప్రత్యేక పదములను సృష్టించుటలో ఎంతో ఆశ కల్గినవారుడ. ఈ హుపర్ యొక్క అర్ధం "పై" / "మీద" షష్టీ విభక్తితో వాడబడినప్పుడు "తరుపున" అని అర్ధం వచ్చును. అదేవిధంగా ఇది "గురించి" లేక "సంబంధించి" అన్న అర్ధములు పెరివలెవచ్చును. (2.కోరింది 8:23, 2దెస్స 2:1) ద్వితియా విభక్తితో వాడబడినపుడు "మీద" లేక "పైన" లేక "అందని" అన్న అర్ధమిచ్చును (ఎ.టి. రాబర్ట్‌సన్, ఎ గ్రామర్ ఆఫ్ థా గ్రీకు న్యూటెస్ట్‌మెంట్ ఇన్ థా లైట్ ఆఫ్ హిస్టోరికల్ రిసెర్చ్ 625-633) అపో పౌలు ఏదైనా ఒక విషయమును నొక్కివక్కానించుట కొరకు ఈ విభక్తి మిళింతో ఉపయోగించేవాడు. ఈ విభక్తి మిళితంతో ఉపయోగించేవాడు.

ఎ. హపాక్స్ లెగోమెనాన్ దీని అర్ధం "క్రొత్త నిబంధనలో ఒకే ఒక్కసారి వాడబడినది"

1. హుపర్ అక్మోక్, మరి శ్రేష్ఠమైనది. 1కోరింది 7:36
2. హుపర్ అక్షానో మరి ఎక్కువగా విస్తరించబడాలని
3. హుపర్‌బైనో హద్దుమీరుట లేక అతిక్రమించుట 2దెస్స 4:6
4. హుపర్‌కైనా మించి, 2కొరింది 10:16
5. హుపర్ క్టైనా, బాగా విస్తరించటం 2కొరింది 10:14
6. హుపర్ ఎంటుగ్చానో, విజ్ఞాపనకు రోమా 8:26
7. హుపర్ నికావో, అత్యధికంగా విజయం కొరకై రోమా 8:37
8. హుపర్ ప్లెనాజో అత్యధికంగా విస్తరించుట కొరకు 2తిమోతి 1:14
9. హుపర్ ఉప్సో, అత్యధికంగా హెచ్చింపబడుట

10. హుపర్ ఫ్రోనియా ఉన్నతమైన తలంపులు కలిగియుండుట కొరకు రామో 12:3

బి. పౌలు రచనలలో మాత్రమే వాడబడిన సందర్భాలు

1. హాపర్ అయిరోమై, ఒకనిని హెచ్చించుట, 2కొరింది 12:7, 2 థెస్స 2:4
2. హుపర్ బల్లోనిటస్, కొలతనుమించి, విస్తారంగా 2కొరింది 11:23 (ఇక్కడ మాత్రమే విశేషణము, 2 కొరింది 3:10, 9:14, ఎఫెసి 1:19, 2:7, 3:19 లలో క్రియారూపం వాడబడినది)
3. హుపర్‌బోలె, గురిని మించి కొట్టడం, విపరీతమైన మొత్తం రోమా 7:13, 1కొరింది 12:31, 2కొరింది 1:8, 4:7,12:7, గలతీ 1:13
4. హుపర్ ఎక్‌పెరిసోయో, కొలతలన్నింటిని మించి, ఎఫెసి 3:20, 1దెస్స, 3:10, 5:13
5. హుపర్‌లియాన్, మిక్కిలి శ్రేష్ఠమైన 2కోరింది 11:5, 12:11
6. హుపర్‌ఒక్, ఉన్నతమైన, శ్రేష్టమైన 2కొరింది 2:1, 1తిమోతి 2:2
7. హుపర్ పెరిస్సియో అత్యంత సమృద్ధి రోమా 5:20 2కొరి 7:4

సి. పౌలు చేతను మరికొంతమంది నూతన నిబంధన గ్రంధకర్తలచే వాడబడిన పదములు

1. హుపర్‌లనో, మిక్కిలిపైన, ఎఫెసి 1:21, 4:10 మరియు హెబ్రీ 9:5 (దేవదూత అధికారుల కోరకు వాడబడినది)
2. హుపర్‌ఎకో, శ్రేష్టం అన్నింటికికి ముందు రోమా 13:1, ఫిలిప్పి 2:3, 3:8, 4:7 1పేతురు 2:13
3. హుపర్ ఎఫానోస్ గర్వించు అహంకారం, రోమా 1:30 2తిమోతి 3:2 మరియు లూకా 1:51, యాకోబు 4:6,1 పేతురు 5:5

పౌలు గొప్ప ఆశ కల్గినవ్యక్తి ప్రజలుగాని వస్తువులుగాని మంచి వైనప్పుడు అవి ఆయనకు చాలా మంచివి, అవి చెడ్డవైనప్పుడు అవి చాలా చెడ్డవి. ఈ విభక్తి పౌలు యొక్క శ్రేష్టమైన భావనలును, పాపము గురించి తనను గురించి మరియు క్రీస్తు గురించి, సువార్త గురించి ఉపయోగపడినది. 1:32 “ఇట్టి కార్యములను అభ్యసించువారు మరణమునకు తగినవారు” ఈ వాక్యము మోషే దర్మశాస్త్రమును సూచిస్తుంది. ఇది రోమా 6:16, 21, 23; 6, 13 లో సంగ్రహించబడినది. మరణము అనేది దేవుని చిత్తమునకు దేవుని జీవమునకు విరోధమైనది. (యెహెజ్కెలు 18:32, 1తిమోతి 2:4, 2పేతురు 3:9) “ఇది మాత్రమేగాక వాటిన అభ్యసించు వారితో సంతోషంగా సమ్మతించుచున్నారు”. వ్యసనము సహవాసమును కోరుతుంది. పడిపోయిన మానవజాతి ఇతరుల పాపమును సాకుగా వాడుకొంటుంది. “అందరూ చేస్తున్నారు కదా 1 అని సర్తిచెప్పుకొంటుంది. వారి వారి పాపములను బట్టి సంస్కృతులు గుర్తించబడతాయి.

**చర్చాప్రశ్నలు :**

ఇది ధ్యాన మార్గదర్శక వ్యాఖ్యానం కావునా బైబిల్ యొక్క మీ స్వంత వ్యాఖ్యానమునకు మీరు భాద్యులు. మనమందరం మన కివ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, బైబిల్ మరియు పరిశుద్ధాత్మ భావ వ్యక్తీకరణలో ప్రముఖులు నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు దానిని విడిచి పెట్టకూడదు. ఈ పుస్తకంలోని బహుళ విషయములను ఆలోచించుటకు ఈ చర్చా ప్రశ్నలు సహాయపడతాయి. అవి ఆలోచింపజేసేవే కాని, నిశ్చితమైనవి కావు.

1. రోమా సంఘమునకు ఏపౌలు ఎందుకు వ్రాసినాడు ?
2. క్రైస్తవ వేదాంతమునకు రోమా పత్రిక ఎందుకు అంతటి ప్రాముఖ్యత నిచ్చినది ?
3. 1:18 – 3:20ను నీ స్వంతమాటలలో వివరించండి ?
4. సువార్తను విననివారు, క్రీస్తును అంగీకరించని కారణము చేత తృణీకరించబడతారా ?
5. “సహజ ప్రత్యక్ష్యత”నకు “ప్రత్యేక ప్రత్యక్ష్యత”కు తేడాను వివరించండి ?
6. దేవుడు లేని మానవ జీవితాన్ని వివరించండి ?
7. 24–27వ వచనములలోని స్వలింగ సంపర్కం అన్న విషయమును వివరించండి?

# ద్వితీయోపదేశకాండము - 2వ అధ్యాయము

నవీన అనువాదముల యొక్క వాక్య విభజన

| UBS | NKJV | NRSV | TEV | JB |
|---|---|---|---|---|
| దేవుని యొక్క నీతి తీర్పు | దేవుని నీతి తీర్పు | తీర్పుక్రింద యూదులు | దేవుని తీర్పు | కోపము నుండి యూదుల మినహాయింపు |
| 2:1-16 | 2:1:16 | 2:1:16 | 2:1-16 | 2:1-11 |
| యూదులు మరియు ధర్మశాస్త్రం | అన్యజనులవలె యూదులు కూడా అపరాదులే | తీర్పునకు ఆధారం | యూదులు మరియు ధర్మశాస్త్రం | ధర్మశాస్త్రం వారిని రక్షించదు |
| | | 2:12-16 | (2:17-3:6) | 2:12-16 |
| 2 : 17 - 3:8 | 2:17-24 | 2:17-29 | | 2:17-24 |
| | ఉపయోగంలేని సున్నతి | | | |
| | 2:25-29 | 2:25-29 | 2:25-29 | 2:25-29 |

వాక్యపు పరిధి యొద్ద అసలైన గ్రంథకర్త ఉద్దేశ్యంను అనుసరించుట....

ఈ వ్యాఖ్యానం చదువుటకు ఉపయోగపడే మార్గదర్శిని......

కావున బైబిల్ యొక్క వ్యాఖ్యానమును నీవు సొంతంగా చేసుకొనుటకు భాద్యుడవు. మనమందమం మనకు ఇవ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, పరిశుద్ధ గ్రంథం మరియు పరిశుద్ధాత్మ వ్యాఖ్యానంలో ప్రాధాన్యత వహించవలెను. దీనిని నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు విడిచిపెట్టకూడదు.

అధ్యాయమంతటినీ ఒకేసారి చదవాలి, అంశాలను గుర్తించాలి. నీ అంశ విభజనము పైన ఇవ్వబడిన నవీన అనువాద విభజనలతో సరి పోల్చుకోవాలి. విభజన అనేది ప్రేరణ కాదు. కాని ఇది అసలు గ్రంథకర్త యొక్క ఉద్దేశ్యమును తెలుసుకొనుటకు ఉపయోగపడును వ్యాఖ్యానమునకు ఇది కేంద్రమై వున్నది. ప్రతి వాక్య విభజనకే ఒక్క విభజనను కలిగి ఉండును.

1. మొదటి వాక్య భాగం
2. రెండవ వాక్య భాగం
3. మూడవ వాక్య భాగం
4. మొదలగునవి.

**రోమా 2:1-3:20నకు సందర్భోచిత తలంపులు**

ఎ. రోమా 1:18లో ప్రారంభమైన భాగమును 2, 3 అధ్యాయాలు ముగిస్తున్నాయి. ఈ భాగము క్రింది విషయములతో వ్యవహారిస్తుంది.

1. సర్వమానవ నాశనం
2. పాపముపై దేవుని తీర్పు
3. వ్యక్తిగత విశ్వాసము మరియు పశ్చాత్తాపముతో క్రీస్తు నందు విశ్వాసముంచుట వలన దేవుని నీతిని సంపాదించవలసిన మానవునిఅవసరం.

బి. 2వ అధ్యాయంలో దేవుని తీర్పునకు సంబంధించి ఏడు సూత్రములు ఉన్నవి.

1. 2వ వచనం, సత్యం క్రారం
2. 5వ వచనం, సమకూర్చుకొన్న అపరాదం

3. 627వ వచనం, క్రియల చొప్పున
4. 11వ వచనం, ఏ పక్షపాతం లేకుండా
5. 13వ వచనం, జీవిత వాధానమును బట్టి
6. 16వ వచనం, మనుష్య హృదయ రహస్యములను బట్టి
7. 17-29 వచనలు, జాతి బేధములు లేకుండా

సి. 2:1-17 వవచనములు ఎవరిని గురించి చెప్పబడినవి అని వ్యాఖ్యానకర్తలులో చాలా చర్చలు ఉన్నాయి. 2:12-29 వరకు యూదులకు అని స్పష్టం అవుతుంది. 1-17 వచనాలు ఇటు నీతి కలిగిన అన్యజనులతో (సామాజిక న్యాయరీతి) అటు యూదులతో (మోషే ధర్మశాస్త్రం) చెప్పబడినట్టుగా కనిపిస్తుంది.

డి. 1:18-21, సృష్టి ద్వారా మానవులు దేవునిని తెలుసుకోగలరని పౌలు ధృవీకరించినాడు 2:14-15,లో మానవులందరు దేవునిని తెలుసకోగల్గుటకు మనస్సాక్షి ఇవ్వబడినవారని తెలియజేస్తున్నాడు. పాతనిబంధనకు లేక సువార్త తెలియబడని వారికి కూడా, సృష్టి మరియు మనస్సాక్షి, అన్న ఈ రెండు సాక్ష్యములు దేవుడు మానవులకు తీర్పు తీర్చుటకు ఆధారమై యున్నవి. మానవులు వారికి కల్గిన శ్రేష్టమైన వెలుగులో జీవించని కారణము చేత వారు దేవుని తీర్చునకు భాద్యులు

**పద మరియు వాక్య ధ్యానం :**

**NASB (నవీన) వాక్యము 2:1-11**

**1.** కాబట్టి తీర్పు తీర్చు మనుష్యుడా, నీవెవవడవైననూ సరే నిరుత్తరుడవై యున్నావు. దేని విషయములో ఎదుటి వానికి తీర్పు తీర్చుచున్నావో దాని విషయములో నీవే నేరస్థుడవని తీర్పు తీర్చుకొనుచున్నావు; ఏలయనగా తీర్పు తీర్చు నీవు అట్టి కార్యములనే చేయుచున్నావు కావా?

**2.** అట్టి కార్యములను చేయువారి మీద దేవుని తీర్పు సత్యమును అనుసరించినదే అని యెరుగుదము.

**3.** అట్టి కార్యములు చేయువారికి తీర్పు తీర్చుచు వాటినే చేయుచున్న మనుష్యుడా, నీవు దేవుని తీర్పు తిప్పించుకొందువని అనుకొందువా?

**4.** లేదా, దేవుని అనుగ్రహము మారు మనస్సు పొందుటకు నిన్ను ప్రేరేపించుచున్నదని యెరుగక, ఆయన అనుగ్రహైశ్వర్యమును సహనమును దీర్ఘశాంతమును తృణీకరించుదువా?

**5.** నీ కాఠిన్యమును, మార్పు పొందని నీ హృదయమును అనుసరించి, ఉగ్రత దినమందు, అనగా దేవుని న్యాయమైన తీర్పు బయలుపర్చబడు నీకు నీవే ఉగ్రతను సమకూర్చుకొనుచున్నావు.

**6.** ఆయన ప్రతివానికి వాని వాని క్రియల చొప్పున ప్రతిఫలిమిచ్చును.

**7.** సత్‌క్రియను ఓపికగా చేయుచు, మహిమను, ఘనతను, అక్షయతను వెదకువారికి నిత్య జీవము నిచ్చును.

**8.** అయితే భేదములు పుట్టించి, సత్యమునకు లోబడక దుర్ణీతికి లోబడు వారి మీదికి ఆయన ఉగ్రతను రౌద్రమును కలుగును. దుష్కార్యము చేయు ప్రతి మనుష్యుని ఆత్మకు, మొదట యూదునికి, హెల్లెనీయునికి కూడాను, శ్రమయు లేదనియు కలుగును.

**3.** **10. సత్‌క్రియ చేయు ప్రతివానికి, మొదట యూదునికి హెల్లెనీయునికి కూడా, మహిమయు ఘనతయు సమాధానమును కలుగును.**

**2:1 ఇది శబ్దార్థ ప్రకారము "న్యాయపరమైన ప్రతివాదము" లేదని అర్థము.**

**NASB "తీర్పు తీర్చు ప్రతి ఒక్కరూ, నిరుత్తరులై యున్నారు"**

**NKJV "తీర్పు తీర్చు ఓ మనష్యుడా, నీవు క్షమింపబడలేవు"**

**NRSV "నీవు ఎవడవైననూ, ఇతరులను తీర్పు తీర్చితే నీవు తప్పించుకోలేవు"**

**TEV "నీవు ఇతరులకు తీర్చిన తరువాత, ఏ మాత్రమును తప్పించుకోలేవు"**

**JB "నీవు ఎవరు అయిననూ, తీర్పును చేస్తే నీవు తప్పించుకోలేవు"**

(1:20) దీని యొక్క ప్రాముఖ్యతను పొగుడుటకు గ్రీకు పదంలో ఉంచబడినది. 1-16 వచనములు స్వనీతిపరులైన యూదుల ధర్మశాస్త్ర వాదులకునూ మరియు గ్రీకు నీతిమంతులైన వారికి సంబంధించినట్టు కనిపించుచున్నవి. ఇతరులకు తీర్పు తీర్చుట ద్వారా వారు తీర్పునకు క్రింధి వచ్చుచున్నారు.

**2:2 "యెరుగుదుము"**

ఈ సర్వనామము తోటి యూదులకు అవ్వవచ్చు అదే విధంగా క్రైస్తవులందరికి వర్తించవచ్చు. 2–4 వచనాలలో, పౌలు తన సహజ పద్ధతి అయిన ప్రశ్నా జవాబు పద్ధతైన డైట్రెబ్, అనగా ఉన్న ఒక కారకమును చూపించి ఒక సత్యమును ప్రదర్శించటం దీనిని హబకూరకు, మాలకీ, మరియు రబ్బీలు, గ్రీకు తత్వవేత్తలు (సోక్రటీస్ మరియు స్టోయిక్స్‌లు) కూడా ఉపయోగించినారు.

**"యెరుగుదుము"** అన్న వాక్యము రోమా పత్రికలో చాలా సార్లు ఉపయోగించబడినది. (2:2, 3:19;7:14;8:22,28). 1వ అధ్యాంలోని అన్యజనుల వలె కాక, ఈ పత్రికను విను వారికి కొంత జ్ఞానము, తెలివి ఉందని నమ్ముచున్నాడు.

▣ **"దేవుని తీర్పు"** ఈ సత్యముపై బైబిల్ స్పష్టంగా బోధిస్తుంది. మానవులందరూ దేవుని జీవ బహుమానం నిమిత్తం లెక్క అప్పగించవలసిన వారై యున్నారు. (5–9వచ; మత్తయి 25:31–46; ప్రకటన 20:11–15) క్రైస్తవులు కూడా క్రీస్తు ఎదుట నిలువబడుదురు (14:10–12; **II** కొరింథి5:10) 2:3 ఇది పౌలు యొక్క వ్యాఖ్యాన సంబంధమైన వాక్చాతుర్యత వాక్యముతో "లేదు" అన్న జవాబుకోసం ఆశిస్తూ వాడబడినది.

▣ **"అనుకొందువా"**

ఇది లోగిజామై అనే గ్రీకు క్రియ. పౌలు దీనిని తరుచుగా ఉపయోగించేవాడు (రోమా 2:3, 26; 3:28; 4:3, 4, 5, 6, 8, 9, 10, 11, 12, 22, 23, 24,; 6:11; 8:18,36;9:8;14:14; గలతీ 3:6,

4. **I** మరియు **II** కొరింథి పత్రికలలో 10 సార్లు మరియు ఫిలిప్పిలో రెండుసార్లు వాడబడినది. 4:3 మరియు 8:18లో నోట్ చూడండి.

* **"ఓ మనుష్యుడా"** 1వ వచనంలో జాతీయమునకు ఇది సరిపోతుంది. 9:20లో యూదులను సూచిస్తుంది

**2:4** గ్రీకులో ఇది కూడా ఒక ప్రశ్న

* **"ఆయన అనుగ్రహైశ్చర్యమును, సహనమును, దీర్ఘశాంతము"** మానవులు ఎల్లప్పుడు దేవుని కృపను, దయను, మరియు సహనమును అపార్థము చేసుకొని మారుమనస్సునకు బదులుగా వాటిని పాపము చేయుటకు అవకాశములుగా వాడుకొనుచున్నారు. (**II** పేతురు 3:9).

దేవుని గుణలక్షణములను పౌలు ఎప్పుదు "ఐశ్వర్యమువలె" వివరించేవాడు (9:23;11:33; కొలస్సి 1:27; ఎఫెసి. 1:7, 18;2:4,7: 3:8,16; ఫిలిప్పి. 4:19)

* "మారు మనస్సు పొందుటకు నిన్ను ప్రేరేపించుచున్నది" దేవునితో విశ్వాస నిబంధన సంబంధంనకు మారు మనస్సు చాలా ప్రాముఖ్యమైనది. (మత్తయి 3:2; 4:17; మార్కు 1:15; 6:12; లూకా 13:3,5; అపో. 2:38; 3:19; 20:21) హీబ్రూలో ఈ పదమునకు చర్యల యొక్క మార్పుగానూ, గ్రీకులోనైతే మనస్సు యొక్క మార్పు అని అర్ధము మారుమనస్సు అనగా ఒకడు స్వకేంద్రిత జీవితము నుండి దేవునిచే తెలియజేయబడే మరియు నడిపింపబడే జీవితమునకు మార్పు చెందటమే. స్వప్రాధాన్యతకు మరియు బానిసత్వము నుండి తిరుగుటకు ఇది పిలుచును. ముఖ్యంగా ఇది ఒక నూతన స్వభావం, ఒక నూతన దృక్పథం, నూతన యాజమాన్యం దేవుని స్వరూపంలో సృష్టించబడి పడిపోయిన ఆదాము సంతానము అంతా మారుమనస్సు పొందాలని దేవుని చిత్తము (యెహెజ్కేలు 18:21, 23, 32; **II** పేతురు 3:9). **II** కొరింథి 7:8–12 లోని వేర్వేరు గ్రీకు పదములు మారుమనస్సు గురించి ప్రతిబింబిస్తున్నాయి. (1) లూపే "దుఃఖం" లే "విచారం" 8వ (రెండుసార్లు), 9 (మూడుసార్లు), 10 (రెండుసార్లు), 11; (2) మెటామెలోమై, "బాదపడు" లేక "తరువాత చింత" (8వ) (2సార్లు) 9; మరియు (3) మెటానోయా, "పశ్చాత్తాము", లేక "తరువాత ఆలోచన" (9,10వ) దీనికి విభేధం, తప్పుడు పశ్చాత్తాపం (మెటామెలోమై) (యూదా, మత్తయి 27:3 మరియు ఏశావు, హెబ్రీ 12:16–17 దానికి ఎదురుగా నిజమైన మారుమనస్సు (మెటానోయా) నిజమైన మారుమనస్సు వేదాంతపరంగా (1) నూతర నిబంధన యొక్క షరతుల మీద యేసుని బోధ (మత్తయి 4:17; మార్కు 1:15; లూకా 13:3,5); (2) అపొస్తులుల బోధ (అపొ 3:16,19,20:21); (3) దేవుని సార్వభౌమ బహుమానం (అపొ 5:31; 11:18 మరియు **II** తిమోతి. 2:25); మరియు (4) నాశనం (**II** పేతురు 3:9) లతో సంబంధం కలిగి యుంది. మారుమనస్సు ఎంచుకొనేదికాదు 2:5–9 ఈ వచనములు (1) పతనమైన మానవుల కాఠిన్యమును మరియు (2) దేవుని ఉగ్రత మరియు తీర్పును గురించి వివరిస్తున్నాయి.

**2:5 "కాఠిన్యము"** నిర్గమ 32:9; 33:3,5; 34:9; దివతి 9:6, 13,27లో కూడా ఈ విధంగానే ఇశ్రాయేలు ప్రజలు చెప్పబడినారు.

- **"హృదయము"** 1:24లోని ప్రత్యేక అంశమును చూడండి

- **"ఉగ్రతదిమందు"** ఇది పాతనిబంధనలో (యోలలు, ఆమోసు) "యెహోవా దినము" అని పిలువబడింధి. ఇది తీర్పు దినపు భావన, లేక విశ్వాసులకు పునరుత్థానపురోజు జీవం అనే బహుమానంనకు సంబంధించి మానవులందరూ దేవునికి లెక్క అప్పగింపవలసిన వారైయున్నారు. (మత్తయి 25:31–46; ప్రకటన 20:11–15)

గమనించండి పాపులు ("నీవు" మరియు "నీకు") దేవుని ఉగ్రతను కూర్చుకొనుచున్నారు. దేవుడు కొంత సమయం ఈ కూర్చుకొన్న ఉగ్రత పూర్తి కోసం అనుమతిస్తున్నాడు. ఉగ్రత, దేవునిని వర్ణించటానికి ఉపయోగిస్తున్న మానవ పదం. దేవుడు నిత్యుడు, పరిశుద్ధుడు, ఆత్మయై యున్నాడు మానవులు మితమైనవారు, పాపులు, మరియు శరీర సంబంధులు అధిక కోపంలోని ఆవేశం కాదు దేవుని ఉగ్రత దేవుడు పాపులను ప్రేమించేవాడుగా, మానవులు పశ్చాత్తాపపడాలని ఆశించేవాడిగా అదేవిధంగా మానవ తిరుగుబాటునకు వ్యతిరేఖించే వానిగా బైబిల్ చూపుతుంది. దేవుడు వ్యక్తిగతమైనవాడు; పాపమును వ్యక్తిగతముగా ఆయన తీసుకొంటాడు. మన పాపముల నిమిత్తము మనం వ్యక్తిగతంగా భాద్యులం.

దేవుని ఉగ్రతకు సంబంధించి ఇంకొక తలంపు. బైబిల్లో ఇది యుక్తకాలం (వేళకు మించుకుండా (అనిత్యమైన 1:24,26,28) మరియు చివరి కాలము వరకు కూడా (అంతిమకాలం 2:5–8). యెహోవా దినము (తీర్పుదినము) పాతనిబంధన ప్రవక్తలచే బోదించమడి ఆ సమయంలో ఇశ్రయేలు మారు మనస్సు పొందితే, వారి భవిష్యత్, తీర్పు తీర్చబడకుండా దీవించబడాలని చేసారు. (ద్వితి 27–28) పాతనిబంధన ప్రవక్తలు వారి దినములలోని క్లిష్టపరిస్థితిని తీసుకొని చివరికాల భవిష్యత్ను చూపించేవారు.

**2:6 కీర్తన 62:12 నుండి ఇది ఒక ఉదాహరణ.**

ఇది మానవులందరూ వారి క్రియలను బట్టి దేవునికి లెక్క ఇవ్వవలసిన బాధ్యులైన వారు అనే ఒక విశ్వ సూత్రం (యోబు 34:11; సామెతలు 24:12; ప్రసంగి 12:14; యిర్మీయా 17:10; 32:19; మత్తయి 16:27; 25:31–46; రోమా 2:6; 14:12; **I** కొరింథి 3:8; గలతీ 6:7; **II** తిమోతి 4:14; **I** పేతురు 1:17; ప్రకటన 2:23; 20:12;22:12) విశ్వాసులు కూడా వారి జీవితాలను బట్టి, క్రీస్తు సేవను బట్టి లెక్క అప్పగిస్తారు (**II** కొరింథి 5:10) విశ్వాసులు క్రియల వలన రక్షించబడురు కాని సత్క్రియల కొరకు రక్షింపబడ్డారు. (ఎఫెసి 2:8–10 (2:14–26 ప్రత్యేకంగా); యాకోబు మరియు **I** యెహోను). 2:7 "వారికి" 7వ వచనంలోని వ్యక్తులకు మరియు 8వ వచనం (అయితే..... వారికి)లోనికి వారికి వ్యత్యాసం ఉంది.

**NASB "సర్క్రియను ఓపికగా చేయుచూ, మహిమను ఘనతను అక్షయతను వెదకు వారికి; నిత్యజీవము".**
**NKJV "సహనంతో సత్క్రియను చేయుచూ, మహిమను ఘనతను, అక్షయతను వెదుకు వారికి నిత్యజీవము".**
**NRSV "సత్క్రియను ఓపికగా చేయుచూ, మహిమను, ఘనతను, అక్షయతను వెదకు వారికి ఆయన నిత్యజీవమిచ్చును".**
**TEA "కొంతమంది మంచిని చేయుచూ, మహిమను, ఘనతను, అక్షయతను వెదుకుచున్నారు. అట్టివారికి దేవుడు ఆత్మజీవమిచ్చును".**
**JB "నిత్యము మంచి చేయుచూ, కీర్తిని, ఘనతను, మరియు అక్షయతను వెదుకు వారిదే నిత్యజీవము".**

ఈ వచనము కొర్నేలి లాంటి వ్యక్తులను సూచిస్తుంది (అపో 10:34–35) ఈ వాక్యభాగము నీతిక్రియలుగా (మానవ ప్రయత్నంతో నీతిని సంపాదించటం) కనిపించవచ్చు. అది ఈ పత్రిక ముఖ్య అంశమునకు వ్యతిరేకంగా వెళ్తుంది. 1–16 వచనాలు లేక 1–11 వచనాలు ఒక వాక్య భాగం (A Paragraph) ఈ వాక్య భాగమంతటి వేదాంతాంశం ఏమిటంటే, దేవుడు పక్షపాతికదు (11వ) మరియు అందరూ పాపులే (12వ) దేవుడు ప్రజలకిచ్చిన వెలుగులో వారు నడిచినట్లయితే వారు దేవునితో సరి అవుతారు. అయినప్పటికి 3:9–18, 23లో వారెవ్వరూ అలా చేయలేదు చేయలేరు! అని సారాంశం చెప్పుచున్నది.

ఒక విశ్వాసి మారి, దైవిక జీవితమును కల్గి యుండటం అనేది తన విశ్వాస స్పందనను దృవీకరిస్తున్నట్టు, బలపర్చుతున్నట్టు కనిపిస్తుంది. మార్పు చెందిన జీవితము దేవుని ఆత్మతో నింపబడటానికి ఋజువు (10,13; మత్తయి 7; ఎఫెసి. 2:8–10; యాకోబు 2:1426 మరియు **I** యెహోను). ఓపికతో కనిపెట్టవలసిన అవసరం: ప్రత్యేక అంశం చూడండి.

- **"నిత్యజీవము"** ఇది యెహోను రచనలలోని స్వాభావిక పదము మరియు సదృశ్య సువార్తలలో తరుచుగా వాడబడినది. పౌలు బహుశా దీనిని దాని 12:2 నుండి తీసుకొనినట్టుగా కనిపిస్తుంది. అక్కడ ఇది నూతన యుగం యొక్క జీవితం, దేవుని సహవాసంలోని జీవితము, పునరుత్థాన జీవితమును సూచిస్తుంది. (తీతుకు 1:2;3:7) దీనిని మొదట గలతీ 6:8లో ఉపయోగించినాడు. ఇది రోమా సిద్దంత భాగములలో సాధారణ అంశం (2:7; 5:21; 6:22, 23). అదే విధంగా కాపరి పత్రికలలో కూడా చాలాసార్లు వాడబడింధి (**I** తిమోతి. 1:16; తీతుకు 1:2;3:7) 2:8

**NASB** "స్వార్ధపూరిత ఆశలు గల వారికి".

**NKJV, NRSV** "స్వార్ధమును వెదుకు వారికి".

**TEA** "ఇతరులు స్వార్ధపరులు".

**NJB** "అసూయతతో ఉన్న వారికి".

పదము "కూలి కొరకు పనిచేయుట" అన్న అర్ధమునిచ్చును. లౌ నిడా, గ్రీకు – ఇంగ్లీష్ లెక్సికన్, 2 పుట, 104వ పేజీలో ఈ పదము యొక్క రెండు ఉపయోగములు ఇవ్వబడినది.

1. "స్వార్ధపూరిత ఆశలు" రోమా 2:8ని ఉపయోగించి "ఇంకొకరి కంటే శ్రేష్టులుగా ఉండాలని కోరిక" అని చెప్పవచ్చు.
2. "ద్వేషము" ఫిలిప్పి. 1:17ను ఉపయోగించి "వివాదము" అనువాద ఎంపికతో చెప్పబడింధి. (**I** కొరింథి 12:20; గలతీ 5:20; ఫిలిప్పి 2:3; యాకోబు 3:14, 16).

* **"సత్యమునకు లోబడక" "సత్యము"** అన్న పదము హీబ్రూ భావనలో నమ్మదగిన తనము, నిజము అని అర్ధం వస్తుంది. ఈ సందర్భంలో ఇది నైతిక సంబంధమైనది కాని వివేక సంబంధమైనది కాదు. ప్రత్యేక అంశం : పౌలు రచనలలో సత్యమును చూడండి 1:18. 2:9 "ప్రతి మనుష్యుని ఆత్మకు" పౌలు గ్రీకు పదమైన పాస్ తర్జుమా అయిన "అందరూ" లేక "ప్రతి ఒక్కరూ" అన్న పదములను రోమా ప్రారంభ అధ్యాయములలో "దుర్వార్త" (మానవుల పతనము, దేవుని నిష్పక్షపాతతీర్పు) మరియు "శుభవార్త" (మారు మనస్సు పొంది విశ్వసించు వారికి క్రీస్తునందు సంపూర్ణ క్షమాపణ అనే దేవుని ఉచిత బహుమానం) అన్న సర్వసామాన్యమైన ప్రబావములను తెలియజేస్తున్నాడు. ఈ సందర్భము లోకపు తీర్పు మరియు దాని ఫలితములను గూర్చి బలంగా సూచిస్తుంది ఈ సత్యము నీతిమంతుల మరియు దుష్టుల యొక్క పునరుత్ధానమును కోరుతుంది (దాని 12:2; యోహను 5:28–29; అపొ 24:15). 6–11 వచనాలైతే చియాసిసమ్. తరువాతి 8–9 వచనాలు దుర్నతి చేయు వారి మీద దేవుని తీర్పును సూచిస్తుంది.

**2:9–10 "మొదట యూదునికి"**

వక్కాణము కొరకు తిరిగి చెప్పబడిన పధము యూదులు దేవుని ప్రత్యేక ప్రత్యక్షతను కలిగినవారు కుక యూదులు అవకాశంలో మొదటి వారు. (1:16; మత్తయి 10:6‘ 15:24; యోహాను 4:22; అపొ 3: 26; 13:46), అదే విధంగా తీర్పులో కూడా మొదటివారే (9–11) ఎందుచేతనంటే వారు దేవుని ప్రత్యేక పిలుపును ఆశీర్వాదమును పొందినవారు (9:4–5)

**2:11**

**NASB,NKJV "దేవునికి పక్షపాతము లేదు".**

**NRSV "దేవుడు పక్షపాతము చూపడు".**

**TEA "ఒకే ప్రమాణంతో దేవుడు అందర్ని తీర్పు తీర్చును".**

**NJB "దేవునికి ఎటువంటి పక్షపాతం లేదు".**

దీని అర్ధము "ముఖమును పైకెత్తుట" పాతనిబంధన న్యాయవ్యవస్ధ నుండి వచ్చిన రూపక అలంకారము త్రేవి 19:15; ద్వితి 10:17; **II** దిన19:7; అపొ 10:34; గలతీ 2:6; ఎఫెసి 6:9; కొలస్సి 3:25; **I** పేతురు 1:17 తీర్పు తీర్చుతున్న వ్యక్తి వైపు న్యాయాధిపతి చూసినట్లయితే పక్షపాతం చూపించటానికి అవకాశం ఉండవచ్చు. కాబట్టి నాయాధిపతి ఆయన యొదుటి నిల్చున్న వ్యక్తి వైపు ముఖం ఎత్తకూడదు.

**ప్రత్యేక అంశం : జాతితత్వం**

**1. ఉపోద్ఘాతము :**

ఎ. ప్రతి సమాజంలోనూ పతనమైన మానవుల యొక్క సామాన్యమైన భావన ఇది మానవుని యొక్క అహం అయి వుండి ఇతరుల వీపు మీద ఆనుకొనేది. ఈ జాతి తత్వము అనేది నవీన అభిప్రాయం దేశీయవాదము అనేది పురాతనమైన భావన.

బి. దేశీయ వాదము బాచెలు వద్ద ప్రారంభమైనది. (అది. 11) ఇది నోవహు యొక్క ముగ్గురు కుమారుల నుండి ఈ తెగలు అభివృద్ధి చెందినవి. (ఆది.10) ఎదేమైనప్పటికి, మానవులు అందరికి ఒకే ఒక్క మూలం నుండి వచ్చారని లేఖనములు తెలియజేస్తున్నాయి (ఆదాము అవ్వల ప్రత్యేక సృష్టి ఆది 1–3; అపొ 17:24–26)

సి. జాతితత్వము అనేది, ప్రతికూలాభిప్రాయంలో ఇది ఒకటి మరికొన్ని

1. విద్యాపరమైన అహంకారం.
2. సాంఘిక – ఆర్ధిక అహంకారం.
3. స్వనీతి మతన్యాయవాదం.
4. అహేతుక రాజకీయ చేర్పుదల

**2. బైబిల్ అంశము**

ఎ. పాతనిబంధన

1. ఆది 1:27 – మానవుడు – పురుషుడు మరియు స్త్రీ దేవుని స్వరూపమందు చేయబడటం వారికి సాటిలేని తనమును ఆస్వారించింది ఇది వారికి వ్యక్తిగత ఘనత మరియు విలువను సమకూర్చింది. (యోహాను 3:16)
2. ఆది 1:11–25 – "వాటి వాటి జాతి ప్రకారము" అని పలుసార్లు నమోదైనది. ఇది జాతుల వేర్పాటుకు ఆధారముగా ఉండేది ఎలాగైననూ, ఈ సందర్భము జంతువులకు మరియు మొక్కలకు సంబంధించినది కాని మానవులకు కాదు.
3. ఆది 9:18–27 – ఇది తెగల ఆదిపత్యమునకు ఆధారముగా ఉన్నది. దేవుడు కనాను శపించలేదని మనం జ్ఞాపకం ముంచుకోవాలి నోవాహ, మైకము నుండి మెల్కొన్న తరువాత కనాను శపించినాడు. ఈ శాపమును దేవుడు ఆమోదించినట్టుగా బైబిల్ చెప్పుట లేదు. దీనిని నోవాహు చేసిననూ అది నల్ల జాతిని ప్రభావితం చేయలేదు. పాలస్థీనా మరియు నివాసంగా చేసుకొన్న వారి తండ్రియే కనాను ఐగుప్తీయుల గోడ పటచిత్రం వారు నల్లవారు కాదని చూపిస్తుంది.
4. యెహోషువా 9:23 – ఒక తెగ వెరొక తెగకు సేవ చేయును. అన్న దానిని ఋజువు చేయటానికి వాడబడుతుంధి. ఎలాగైననూ, ఈ సందర్భంలో యూదుల వలె గీచి యోనీయులు కూడా ఒకే తెగకు చెందినవారు.
5. ఎజ్రా 9–10 మరియు నెహెమ్యా 13 ఇవి కూడా తెగల సంబంధమైన భావనలో చెప్పబడ్డాయి. కాని సందర్భము చూపిస్తున్నది ఏమిటంటే ఆ వివాహాలు తెగను బట్టి నిషేధించబడలేదు కాని మతపరమైన కారణములను బట్టియే (నోవహా యొక్క కుమారుడు నుండి వచ్చినవారే ఆది. 10).

బి. క్రొత్త నిబంధన

1. సువార్తలు

ఎ. యూదులకు మరియు సమరయులకు మద్య ఉన్న వివాదము యేసు ఉపయోగించుట, అది సరియైనది కాదు అని చూపిస్తుంది.

1. మంచి సమరయుని ఉపమానం (లూకా 10:25–37).
2. బావి యొద్ద స్త్రీ (యోహాను 4:4).
3. కృతుజ్ఞుడైన కుష్ఠరోగి (లూకా 17:7–19)

బి. సువార్త మానవులందరికి

1. యోహాదీ 3:16
2. లూకా 24:46–47
3. హెబ్రీ 2:9
4. ప్రకటన 14:6

సి. దేవుని రాజ్యము అందర్ని కలిపి ఉంచును.

1. లూకా 13:29
2. ప్రకటన 5
3. అపొస్థులుల కార్యము

ఎ. అపొ 10వ అధ్యాయము దేవుని సార్వత్రిక ప్రేమకు మరియు సువార్త యొక్క సార్వత్రిక సందేశమునకు ఖచ్చితమైన వాక్యభాగం.

బి. అపొ. 11వ అధ్యాయంలో పేతురు తన కార్యమును బట్టి ఎదుర్కొనబడ్డాడు. అది 15వ అధ్యాయంలో యెరుషలేము మహాసభ వరకు పరిష్కరించమడలేదు. మొదటి శతాబ్దపు యూదులకు మరియు అన్యజనులకు సమస్య చాలా సున్నితమైనది.

3. పౌలు

ఎ. క్రీస్తులో ఏ అడ్డుగోడలు లేవు

1. గలతీ 3:26-28
2. ఎఫెసి 2:11-22
3. కొలస్సి 3:11

బి. దేవుడు పక్షపాతి కాదు

1. రోమా 2:11
2. ఎఫెసి 6:9

4. పేతురు మరియు యాకోబు

ఎ. దేవుడు పక్షపాతికాదు **I** పేతురు 1:17

బి. దేవుడు పక్షపాతం చూపించడు, కాబట్టి దేవుని ప్రజలు కూడా చూపించకూడదు యాకోబు 2:1

5. యెహాను

ఎ. **I** యెహాను 4:20లో విశ్వాసుల యొక్క బాధ్యతల గురించి బలమైన వాక్యభాగం దీనిలో కనబడుతుంది.

**3. ముగింపు**

ఎ. జాతితత్వం, వేరే ఇతర దురాభిప్రాయములు దేవుని పిల్లలకు సరి అయినవి కాదు. 1964లో గ్లోరైటి ఫోరమ్ వద్ద క్రిష్టియన్ లైఫ్ కమీషన్, న్యూమెక్సికో కొరకు హెన్లీ బార్నెట్ మాటలు ఇవి. "జాతితత్వం అనేది తప్పుడు సిద్ధాంతం, ఎందుచేతనంటే ఇది బైబిల్ సంబంధం కానిది, మరియు క్రైస్తవ సంబంధం కానిది, ఆ శాస్త్రీయమైనదని చెప్పుటకు కానిది."

బి. ఈ సమస్య నశించిన లోకమునకు క్రీస్తువంటి ప్రేమ, క్షమాపణ మరియు అర్ధం చేసుకొనే అవకాశమును చూపిస్తుంది ఈ విషయంలో క్రైస్తవుల తృణీకారము వారి అపరిపక్వతను మరియు విశ్వాసుల విశ్వాసమును, నమ్మికను, ఎరుగుదలను క్షీణింపజేయటానికి అపవాదికి అవకాశము ఇచ్చినట్లవుతుంది. ఇది అదే విధంగా నశించిన వారు క్రీస్తు యొద్ద రాకుండా ఆటంకపరుస్తుంది.

సి. నేనేమి చేయగలను? (ఈ భాగము ఎక్రిష్టియన్ లైఫ్ కమిషన్ పత్రిక "జాతి సంబంధాలు" లనుండి తీసుకొనబడింది) "వ్యక్తిగత అంతస్తు మీద"

* జాతితో సంబంధము కలిగిన సమస్యల పరిష్కారము కొరకు నీ స్వంత భాద్యతను అంగీకరించు.
* ప్రార్ధన, బైబిల్ ధ్యానమ, ఇతర జాతులతో సహవాసము ద్వారా జాతి దురాభిప్రాయములను నీ జీవితము నుండి తొలగించుకో.
* జాతి గురించి నీ ఒప్పదలలను వ్యక్తపరుచు, ప్రత్యేకంగా ఎక్కడైతే జాతి దురాభిప్రాయములు సవాలు చేయబడటం లేదో అక్కడ. "కుటుంభ జీవతంలో"
* ఇతర జాతుల యెడల సరైన స్వభావమును కలిగించుటలోనున్న ప్రాముఖ్యతను గుర్తించు.
* ఇంటికి ఆవల పిల్లలు మరియు తల్లిదండ్రులు జాతుల గురించి వినిన దానినిబట్టి క్రైస్తవ స్వభావమును అభివృద్ధి చేయుటను వెదుకు.
* ఇతర జాతుల ప్రజలతో సంబంధం కలిగి యుండుటలో ఒక మాదిరిని కల్గించుటకు తల్లిదండులు జాగ్రత్త పడాలి.
* జాతి హద్దులను దాటి కుటుంబ స్నేహాల కొరకు అవకాశములను వెదకాలి. "నీ సంఘంలో"
* జాతులకు సంబంధించి ప్రకటించుట ద్వారా, బోధించుట ద్వారా సమాజమంతటికొరకు ఒక మాదిరిని ఏర్పరుచుటకు సంఘమును ప్రేరేపించవచ్చు.
* క్రొత్త నిబంధనలోని సంఘము ఏ విధమైన జాతి అవరోధములను పాటించలేదో, అదే విధంగా ఆరాధన, సహవాసము మరియు పరిచర్య ద్వారా సంఘము అందరి కొరకు తెరవబడాలి (ఎఫెసి 2:11-22; గలతీ 3:26-29). "దైనందిక జీవితంలో."
* పనిలోకంలో అన్ని జాతి వ్యత్యాసాలను పారద్రోలటానిరీ సహాయం చేయాలి.
* అన్ని రకాల సామాజిక సంస్థల ద్వారా పనిచేసి సమానహక్కులు మరియు అవకాశములు పొందుటకు ప్రయత్నించాలి. ఇది జాతిసమస్య. సమస్యతో పోరాడాలి కాని ప్రజలతో కాదు. అవగాహన కల్పించాలే కాని ద్వేషాన్ని సృష్టించకూడదు.
* తెలివిగా కనిపిస్తే, ఒక ప్రత్యేక కమిటీకి సంబంధించిన ప్రజలతో ఏర్పరచి సాధారణ మరియు ప్రజా విధ్యను ప్రత్యేకంగా జాతి సంబంధములను అభివృద్ధి చేయుట కొరకు ప్రయత్నించు.

* జాతిపరమైన న్యాయమును అభివృద్ధి పరుచుటకు చట్టములను మరియు చట్టకర్తలను సహకరించి చట్టములను అమలు చేయుట కొరకు సహాయ పడాలి, మరియు రాజకీయ లబ్ధి కొరకు జాతి దురాభిప్రాయములను కల్గించు వారిని వ్యతిరేఖించాలి.
* ఎటువంటి వ్యత్యాసములు లేకుండా చట్టములను అమలు పర్చు అధికారులను అభినందించు.
* హింసను వదిలి, చట్టము కొరకు గౌరవమును పెంపొందించు, వ్యత్యాసములు కలిగించు వారి చేతులకు న్యాయపు కట్టడలు చేరకుండా క్రైస్తవ పౌరులుగా చేయవలసినదంతా చేయాలి.
* మానవ సంబంధము లన్నింటిలో క్రీస్తు మనస్సు మరియు ఆత్మను మాదిరిగా తీసుకోవాలి.

**NASB (నవీన) వాక్యము 2:12-16**

12. ధర్మశాస్త్రము లేక పాపము చేసిన వారందరు ధర్మశాస్త్రలము లేకచే నశించెదరు. ధర్మశాస్త్రము కలిగిన వారై పాపము చేసిన వారందరు ధర్మశాస్త్రాను సారముగా తీర్పునొందుదురు. 13. ధర్మశాస్త్రము వినువారు దేవుని దృష్టికి నీతిమంతులు కారు గాని ధర్మశాస్త్రమును అనుసరించి ప్రవర్తించువారే నీతిమంతులుగా ఎంచబడుదురు. 14. ధర్మశాస్త్ర సంబంధమైన క్రియలను చేసిన పక్షమున, వారు ధర్మశాస్త్రము లేని వారైనను, తమకు తామే ధర్మశాస్త్రమైనట్టున్నారు. 15. అట్టివారి మనస్సాక్షి కూడా సాక్ష్యమిచ్చుచుండగను, వారి తలంపులు ఒకదాని మీద ఒకటి తప్పు మోపుచు లేక తప్పులేదని చెప్పుచుండగను, ధర్మశాస్త్ర సారము తమ హృదయముల యందు వ్రాయబడినట్టు చూపుచున్నారు. 16. దేవుడు నా సువార్త ప్రకారము యేసుక్రీస్తు ద్వారా మనుష్యుల రహస్యములను విమర్శించు దినమందు ఈలాగు జరుగును.

**2:12 "ధర్మశాస్త్రము లేక పాపము చేసిన వారందరు"**

ధర్మశాస్త్రలమునకు లేక సువార్తను వినని వారిని కూడా దేవునికి లెక్క అప్పచెప్పమని దేవుడు అడుగుచున్నాడు. సృష్టినుండి మానవులందరూ దేవుని గురించిన కొంత జ్ఞానమును కల్గియున్నారు (1:19-20; కీర్తన.19:1-6), మరియు వారి అందరిలోనూ పట్టుకతో వచ్చే నైతిక జ్ఞానము కూడా తెలియజేస్తుంది (2:14-15). దుఃఖకరమైన విషయమేమిటంటే వారందరూ వారికి కలిగిన వెలుగను ఇష్టపూర్వకంగా తృణీకరించారు(1:21-23; 3:9; 19,23; 11:32; గలతీ 3:22)

**"ధర్మశాస్త్రము"**

ధర్మశాస్త్రము అన్న పదముతో ఖచ్చితమైన విషయమునిచ్చే బాషా భాగము లేదు. ఈ వ్యాకరణ అమరిక నామవాచక లక్షణమును ప్రస్తావించుట కొరకు ఉపయోగిస్తారు. ఎదేమైననూ, పౌలు "ధర్మశాస్త్రము" అన్న పదమును వేర్వేరు విషయములను గురించి ఉపయోగించినాడు. (1) రోమా ధర్మశాస్త్రము (2) మోషే ధర్మశాస్త్రము, (3) సాధారణ మానవ సామాజికి నీతి నాయమాలు కావచ్చు. సందర్భము, ఆర్టికల్ కాదు గాని ఎదో దానిని తెలియజేయాలి. ఈ సందర్భము మానవులందరూ వారి హృదయములలో దేవుని సహజ ప్రత్యక్షతను కొంత కల్గియున్నారు.

**2:13 "ధర్మశాస్త్రము వినువారు దేవుని దృష్టికి నీతిమంతులు కారు" "వినువారు"**

అన్న పదము రబ్బీల పరంగా థోరాను చదువు రబ్బీ విద్యార్థులు అన్న భావం కలదు. "నీతి" లేక "నీతిమంతులవటం" (డైకే అన్న అన్ని రూపములు) పౌలు వేదాంతములో ముఖ్య పదములు (3:4, 20, 24, 26, 28, 30; 4:25; 5:1,9; 6:7; 8:30,33). "నీతి" "నీతిమంతులవడం" "నీతిమంతులగుట అన్న విధానం" "న్యాయం" మరియు "సత్యం" అన్నపదములన్నీ డైకెస్ నుండి వచ్చినవి. 1:17లో ప్రత్యేక అంశం నీతిని చూడండి. హీబ్రూలో (సడాగ్) 15 నుండి 20 అడుగుగల నిటారైన రెల్లును, గోడలను ఆవరణములను కొలుచుటకు ఉపయోగించు కొలబద్దను సూచిస్తుంది. ఇది అలంకార రూపముగా దేవుడే నీతిక ప్రమాణము అని ఉపయోగించబడింది.

పౌలు రచనలలో ఈ పదము రెండు కోణములను కల్గియుంది. మొదటగా, క్రీస్తునందు విశ్వాసము ద్వారా పరిశుద్ధుడైన దేవుని నీతి పాపభరితమైన మానవులకు ఇవ్వబడటం ఇది నింపబడిన లేక న్యాపరమైన నీతి. నీతిమంతుడైన దేవుని యెదుట నిలువబడుట కొరకు ఇవ్వబడినది. పౌలు ప్రాముఖ్యమైన అంశమైన "విశ్వాసమూలమైన నీతి" నుండి ఉత్పన్నమైనది. రెండవదిగా, పతనమైన మానవులకు తన స్వరూపమును తిరిగి కల్పించాలనే దేవుని ఆశ. ఇంకొక రీతిలో చెప్పాలంటే క్రీస్తు స్వారూప్యమును కల్గించుట ఈవచనము 13:17; యాకోబు 1:22-23, 25 వచనాలు విశ్వాసులు వినువారు మాత్రమే కాంకుండా దాని ప్రకారము చేయువారై ఉండాలని అడుగుచున్నవి. నింపబడిన నీతి, నైతిక జీవితంలో కనిపించాలి. దేవుని క్షమాపణ పాపిని మార్చును పౌలు వాడుక న్యాయ మరియు నైతిక సంబంధమైనది అదేవిధంగా, దైవిక జీవితమును కోరుతుంది. ఇది ఉచితమే కాని వెలఅయినది.

**"కాని ధర్మశాస్త్రమును అనుసరించువారు"**

దేవుని తెలుసుకోవటం ఒక నూతన విధేయతా జీవితమును అడుగుతుంది. (లేవి. 18:5; మత్తయి : 7:24-27; లూకా.8:21; 11:28; యోహాను 13:17; యాకోబు 1:22-25; 2:14-28). ఈ విషయము చాలా రీతులుగా హీబ్రూ షెమాను ప్రతిబింబిస్తుంది. అనగా చేయుట కొరకు వినుట (ద్వితి 5:1; 6:4; 9:1; 20:3; 27:9-10) 2:14

NASB "ధర్మశాస్త్రము లేని అన్యజనులు స్వాభావికముగా ధర్మశాస్త్ర సంబంధమై క్రియలను చేసిన నక్షమున, వారు ధర్మశాస్త్రము లేని వారైనను, తమకు తామే ధర్మశాస్త్రమైనట్టున్నారు".

NKJV "ధర్మశాస్త్రము లేని అన్యజనులు, సహజముగా ధర్మశాస్త్ర సంబంధమైన క్రియలను చేసిన పక్షమున, వారు ధర్మశాస్త్రము లేని వారైననూ, తమకు తామే ధర్మశాస్త్రమైనట్టున్నారు".

NRSV "ధర్మశాస్త్రలములేని అన్యజనులు, ధర్మశాస్త్రనియమములను పాటించినట్లయితే, వారు ధర్మశాస్త్రము లేని వారైననూ, తమకు తామే ధర్మశాస్త్రమైనట్టున్నారు"..

TEV "ధర్మశాస్త్రములేని అన్యజనులు, స్వచిత్తముగా ధర్మశాస్త్రము ఆజ్ఞలను పాటించనట్లయితే వారికి ధర్మశాస్త్రము లేకపోయిననూ తమకు తామే ధర్మశాస్త్రమైనట్టున్నారు".

JB "ధర్మశాస్త్రమును ఎన్నడూ వినని అన్యజనులు ఎదైనా కారణముచేత ధర్మశాస్త్ర ఆజ్ఞలను పాటించినట్లయితే, నిజముగా వారికి ధర్మశాస్త్రము లేకపోయిననూ వారికి వారే ధర్మశాస్త్రమైనట్టున్నారు.

అన్ని సంస్కృతులలో అంతరంగిక నైతక నియమాలు మరియు సామాజిక ప్రమాణాలు ఉంటాయి. వారు కలిగియున్న వెలుగును బట్టి వారు బాధ్యులు (1కొరింధి 9:21) వారి సంస్కృతి వెలుగును బట్టి జీవించినంత మాత్రానా వారు దేవునితో సరి అయిన వారు అని చెప్పటం కాదుగాని వారి అంతరంగంలో నుండిన దేవుని జ్ఞానమును బట్టి వారు బాధ్యులు.

2:15 "అట్టివారి మనస్సాక్షి కూడా సాక్ష్యమిచ్చుచుండగను, వారి తలంపులు ఒకదానిమీద ఒకటి తప్పుమోపుచు లేక తప్పులేదని చెప్పుచుండగను, ధర్మశాస్రసాము తమ హృదయముల యందు వ్రాయబడినట్టు చూపుచున్నారు".

అంతరంగిక నైతిక స్వరము కలదు. కాని ఆత్మవలన వెలిగించబడిన రేఖనములను మాత్రమే నమ్మగలం. మానవుని పతనము వాని మనస్సాక్షిని ప్రభావితం చేసినది. ఎలాగైననూ సృష్టి (1:18-20) మరియు ఈ అంతరంగము, నీతి నియమావళి (2:14-15) ఇవి అనియూ కొంత మంది కల్గియున్న దేవుని జ్ఞానము. "మనస్సాక్షి" కి సంబంధించిన గ్రీకు పదము (సినైదేసిస్)నకు సమమైన హీబ్రూ పదము లేదు. అంతరంగిక నైతిక భావన అన్న విషయమును స్టోయిక్ తత్వవూత్లఉ చర్చించినారు. తర్సీసులో విద్య నుండి పౌలునకు గ్రీకు తత్వవేత్తలతో పరిచయం ఉన్నది. (అపో 17:28లో క్లిందెస్‌ను; 1కోరి. 15:33లో మెనందర్‌ను తీతుకు 1:12లో ఎపిమెనిడెస్‌ను ఉపయోగించినాడు) పౌలు స్వంత పట్టణము గ్రీకు తత్వశాస్త్రానికి మరియు సాహిత్య శాస్త్రానికి ప్రసిద్ధి.

**2:16 "ఆ దినమందు" 2:5లోని నోట్ చూడండి**

- **"నా సువార్త ప్రకారము"** ఈ సందర్భములో ఇది యేసుక్రీస్తు యొక్క ప్రత్యక్షత యొక్క ప్రకటనను సూచిస్తుంది. "నా" అనే సర్వనామము పౌలునకు అప్పగించబడిన సువార్త బాధ్యత అవగాహనను సూచిస్తుంది. (16:25; 1కోరి 15:1; గలతీ 1:11; 1తిమోతి 1:11; 2తిమోతి 2:8) ఇది ప్రత్యేకంగా ఆయనదికాదుగాని అన్యజనులకు సువార్తికుడిగా గ్రీకు-రోమా ప్రపంచంలో యేసును గురించిన సత్యమును వ్యాప్తి చేయాలనే బహోత్తరమైన బాధ్యతగా ఉండి.

- **"మనుష్యుల రహస్యములను దేవుడు విమర్శించును"**

  మనుష్యుల హృదయములను దేవుడు ఎరుగును (1సమూ2:7; 10:7; 1రాజులు 8:39; 1.దిన 28:9; 2దిన 6:30; కీర్తన 7:9; 44:21; 139:1-6; సామెతలు 15:11; 21:2; యిర్మీయా 11:20; 17:10; 20:12; లూకా 15:16; అపో 1:24; 15:8; రోమా 8:27; ప్రకటన 2:230 తండ్రి, కుమారుని ద్వారా మనుష్యుని తలంపులను, చర్యలను తీర్పు క్రిందికి తీసుకొనివచ్చును. (మత్తయి 25:31-46; ప్రకటన 20:11-15)

- **"యేసుక్రీస్తుద్వారా"** యేసుక్రీస్తు న్యాయాధిపతిగా (తీర్పరి) గా రాలేదు. (యోహాను 3:17-21). దేవునిని ప్రత్యక్ష్య పర్చటానికి, ప్రాయశ్చిత మరణమును పొందటానికి, విశ్వాసులు అనుసరించడానికి ఒక మాదిరిని ఇచ్చుటకు వచ్చెను. ప్రజలు యేసుని తృణీకరించినపుడు వారికి వారే తీర్పు తీర్చుకుందురు. ఎలాగైననూ తండ్రి ప్రతినిధిగా తీర్పులో చేసుక్రీస్తు వ్యవహరిస్తారు. అన్ని క్రొత్తనిబంధన బోధిస్తుంది. (యోహాను 5:22, 27; అపొ 10:42; 17-31; 2తిమోతి 4:1) యేసుక్రీస్తు న్యాయాధిపతియా లేకా రక్షకుడా అన్న తన్యత యోహాను సువార్తలో కనినిస్తుంది. (3:17-21, 9:39).

NASB (నవీన) వాక్యము **2:17-24**

> **17. నీవు యూదుడవని పేరుపెట్టుకొని ధర్మశాస్త్రములను ఆశ్రయించి దేవుని యందు అతిశయించు చున్నావు కావా? 18. ఆయన చిత్తమెరిగి ధర్మశాస్త్రమందు ఉపదేశము పొందినవాడవై శ్రేష్టమైన వాటిని మెచ్చుకొనుచున్నావు కావా? 19. జ్ఞాన సత్య స్వరూపమైన ధర్మశాస్త్రము గలవాడవై యుండి - నేను గ్రుడ్డివారికి త్రోవ చూపువాడను. 20. చీకటిలో ఉండువారికి వెలుగును, బుద్ధిహీనులకు శిక్షకుడను, బాలురకు, ఉపాధ్యాయుడనై యున్నానని నీయంతటనీవే ధైర్యము వహించుకొనుచున్నావు కవా? 21. ఎదుట వానికి బోధించు నీవు నీవే బోధించుకొనవా? దొంగల వద్దని ప్రకటించు నీవు దొంగిలిదెవా? 22 వ్యభిచరింపవద్దని చెప్పునీవు వ్యభిచరించెదవా? 23. ధర్మశాస్త్రమందు అతిశయించు నీవు ధర్మశాస్త్రము మీరుటవలన దేవుని అవమాన పరచెదవా? 24 వ్రాయబడిన ప్రకాము మిమ్మును బట్టియే గదా దేవుని నామము అన్యజనుల మద్యను దూషింపబడుచున్నది ?**

**2:17 "అయితే"** ఇది మొదటి తరగతి షరతులతో కూడిన వాక్యము రచయిత యొక్క విషయ అంశం నుండి సత్యమని చెప్పబడినది. ఈ షరతు అనే 20వ వచనం వరకు చెప్పబోవు వాటిని గూర్చి తెలియజేస్తుంది. యూదులు వారి వంశము, ఆచారములు, వారు చేసే కార్యములు రక్షణను తీసుకొనువచ్చుననవి వాటి యందు నమ్మిక యుంచుచున్నారు. (మత్తయి 3:9; యోహాను 8:33, 37, 39)

**"దేవుని యందు అతిశయించుచున్నావు"**

చాలామంది యూదులు (1) వారి జాతి వంశములు (2) దేవునిచే అంతీకరింపబడుటకు ధర్మశాస్త్రమును వ్యక్తిగతంగా నెరవేర్చుట అన్న వాటిపై ఆధారపడుచున్నారు. ఏదేమైననూ వారి స్వనీతి ధర్మశాస్త్రము దేవుని నుండి వేరు పర్చింది. (మత్తయి 5:20; గలతీ 3) ఎంత దురదృష్టమైననీతి 1కొరిందిలో పౌలు అతిశయించుట అన్ని ఆటోచనను వృద్ధిపర్చినాడు. పౌలు అహంకారులైన ఇశ్రాయేలు వారిని మరియు అహంకారులైన గ్రీకు జ్ఞానులను ఎదుర్కొంటున్నాడు. చివరివలస ఏమిటంటే ఏ శరీరము దేవుని ముందు మహిమ పర్చబడలేదు.

**ప్రత్యేక అంశం : అతిశయించటం**

కౌచోమై, కౌచెమ మరియు కౌచెసిస్ అన్న గ్రీకు పదములు పౌలుచే 35సార్లు వాడబడినవి మరియు మిగిలిన క్రొత్తనిబంధనలో రెండే రెండుసార్లు (రెండును యాకోబులెనే) వాడబడినవి. 1 & 2 కొరింది పత్రికలలో వీటి ఉపయోగం. అతిశయమునకు సంబంధించి రెండు సత్యములు ఉన్నవి.

* ఏ శరీరము దేవుని యెదుట అతిశయించలేదు (1కోరి 1:29; ఎఫెసి 2:9)
* విశ్వాసులు దేవుని యందు అతిశయించాలి (1కొరి 1:31; 2కొరింది 10:17, ఇది యిర్మీయాకు ఒక సూచన యిర్మీయా 9:23-24) కాబట్టి సరిఅయిన మరియు సరికాని అతిశయము కలదు.

1. సరిఅయిన అతిశయము
   - ఎ. మహిమా అతిశయంలో (రోమా 4:2)
   - బి. యేసు క్రీస్తు ద్వారా దేవునిలో (రోమా 5:11)
   - సి. ప్రభువైన యేసు క్రీస్తు సిలువలో (పౌలు ప్రధాన అంశం 1కొరింది 1:17-18; గలతీ 6:14)
   - డి. పౌలు అతిశయం
     1. ప్రతిఫలము ఆశించని తన పరిచర్యయందు (1కొరి 9:15, 16; 2కోరి 10:12)
     2. క్రీస్తు నుండి తన అధికారము యందు (2కొరి 10:8,12)
     3. ఇతరుల ప్రయాశయందు అతిశయించుట లేదు (కొంతమంది కోరింధీయులవలె, 2కొరి 10:15)
     4. ఆయన వంశ వారసత్వము బట్టి (కొరింధులో కొంతమంది చేస్తున్నట్టుగా 2కొరింది 11:17; 12:1,5, 6)
     5. ఆయన సంఘముల యందు
        - ఎ. కొరింధు (2కొరింధి 7:4, 12; 8:24; 9:2; 11:10)
        - బి. థెస్సలొనిక (2థెస్స 1:4)
     6. దేవుని ఆదరణ మరియు విడుదల యందు నమ్మకమందు (2కొరింధి 1:12)

సరికానిది

ఎ. యూదుల వారసత్వమునకు సంబందించినది (రోమా 2:17, 23; 3:27; గలతీ 6:13)

బి. కొరిందిలోని కొంతమంది ఈ క్రింది విషయములలో అతిశయించుచున్నారు.

1. మనుష్యుల యందు (1కొరింది 3:21)
2. జ్ఞానమందు (1కొరింది 4:7)
3. స్వాతంత్ర్యమందు (1కొరింది 5:6)

సి. తప్పుడు బోధనకులు కొరింది సంఘంలో అతిశయించుటకు ప్రయత్నించిరి (2కొరింది 11:12)

**2:18 "మెచ్చుకొనుచున్నావు" ప్రత్యేక అంశమైన పరీక్షించబడటంను చూడండి.**

**ప్రత్యేక అంశం : "పరీక్షింపబడుట" మరియు దాని సంబంధిత పదముల కొరకు గ్రీకు పదములు.**

ఒక ఉద్దేశ్యంతో పరీక్షించుట అన్న విషయమునకు రెండు గ్రీకు పదములు ఉన్నవి.

1. డోకిమజో, డోకిమియోన్, డోకిమసియా

ఇది లోహపరముగా దాని శ్రేష్టతను అగ్నితో పరీక్షింపబడుటకు వాడబడినది. అగ్ని మలినమును కాల్చుట ద్వారా నిజమైన లోహమును చూపిస్తుంది. ఈ భౌతిక విధానము దేవున్ని మరిము మానవుని పరిక్షించే బలమైన జాతీయంగా మారింది. ఈ పదము అంగీకారము కొరకు అనుకూల రీతితో వాడబడినది. ఇది క్రొత్త నిబంధనలో పరీక్ష కొరకు వాడబడినది

ఎ. ఎద్దులు, లూకా 14:19

బి. మనలను, 1కొరింది 11:28

సి. మన విశ్వాసము, యాకోబు 1:3

డి. దేవుని కూడా, హెబ్రీ 3:9

ఈ పరీక్షల ఫలితం అనుకూలత అయిన జవాబునిచ్చినది. (రోమా 1:28; 14:22; 16:10; 2కొరింది 10:18; 13:3; ఫలి 2:27; 1పేతురు 1:7) కాబట్టి, ఒకరు పరీక్షింపబడి ఆమోదించబడుటకే అన్న ఆలోచనిస్తుంది.

ఎ. యెగ్యులగుటకు

బి. మంచికొరకు

సి. శ్రేష్టత కొరకు

డి. విలువ కొరకు

ఇ. ఘనత కొరకు

2. పైరాజో, పైరాశ్మోస్

ఈ పదము తప్పులను పట్టుకొనుట కొరకు మరియు తృణీకరించాలనే ఉద్దేశ్యంతో చేసే పరీక్షకు అర్ధనిచ్చును. ఇది అరణ్యములా యేసు శోదించబడులతో సంబంధం కల్గినది.

ఎ. యేసుని పట్టుకోవాలనే ప్రయత్నం (మత్తయి 4:1; 16:1; 19:3; 22:18, 35; మార్కు 1:13; లూకా 4:2;10:25; హెబ్రీ 2:18)

బి. ఈ పదము (పైరాజో) అపవాదికి బిరుదుగా వాడబడినది. మత్తయి 4:3, 1థెస్స 3:5

సి. ఇది (మిశ్రమ పదమైన, ఎక్పైరాజో) దేవుని దేవుని శోదించవలసినదని యేసు వలన వాడబడినది (మత్తయి 4:7; లూకా 4:12; 1కొరింది 10:9 కూడా చూడండి)

డి. ఇది విశ్వాసుల శోదన మరియు శ్రమలకు సంబంధించి వాడబడినది (1కొరింది 7:5; 10:9, 13; గలతీ 6:1; 1థెస్స 3:5; హెబ్రీ 2:18; యాకోబు 1:2, 13,14; 1పేతురు 4:12; 2 పేతురు 2:9)

▣ **"ధర్మశాస్త్రము"** 17 వ వచనము నుండి యూదులతో వ్యవహరిస్తుంది. కాబట్టి ఈ సందర్భము మోషే ధర్మశాస్త్రమును సూచించాలి. 25వ వచనముతో సున్నతితో ఇది వ్యవహరిస్తుంది.

**2:18-20** యూదానాయకులు వారి మార్గమే సరియైనదని, దేవుని యొద్దకు అదే ఏకైక మార్గమని విశ్వసించిరి. మత సంబంధ విషయములలో వారే నిజమైన బోధకులని నమ్మేవారు. ధన్యత బాధ్యతను తీసుకొనివచ్చును (లూకా 12:28) వారి నమ్మకమునకు

సాదృశ్యమైన వచనములను గమనించండి.

1. గ్రుడ్డివారికి త్రోవ చూపువాడు, 19వ
2. చీకటిలో ఉండువారికి వెలుగును, 19వ
3. బుద్ధిహీనులకు శిక్షకుడును, 20వ
4. బాలురకు ఉపాధ్యాయుడను, 20వ
5. జ్ఞాన సత్య స్వరూపమైన ధర్మశాస్త్రము కలవాడు, 20వ

**2:21-24** ఒకడు వ్యక్తిగత విధేయతను నమ్మిక ఉంచినట్లయితే ఆ విధేయత సంపూర్తి అయి ఉండాలి. (మత్తయి 5:20, 48; గలతీ 3:10 ఇది ద్వితి 27:26 నుండి ఉదాహరించబడింది). పతనమైన మానవునికి ఇది అసాధ్యమైనది. 21-23 వచనములలో 5 సాహిత్యపరమైన ప్రశ్నలు ఉన్నవి.

**2:22 22-23**లో దేని గురించి సూచిస్తున్నాడో తెలుసుకోవడం కష్టము. వివరణ పౌలు కాలమునాటి యూదులకు సరిపడదు కాబట్టి మత్తయి 5:20-28లో యేసు క్రీస్తు ధర్మశాస్త్రమును ఏవిధంగా అనువదించాడో ఇవి కూడా ఆత్మీయ భావనలో ఉపయోగించి ఉండవచ్చును. ఎథియాలజీ ఆఫ్ దా న్యూటెస్ట్‌మెంట్‌లో జార్జిలాడ్ ఈవిధంగా చెప్పెను. "దేవునికి చెందిన మహిమను దొంగిలించటంను సూచించెను అని; ఇది ఆత్మీయ వ్యభిచారము మరియు దేవునికి మాత్రమే చెందవలసిన ధ్యానమును వారతో సహ సృష్టించబడిన వారిపైన ప్రభువులుగా తీర్పరులుగా చూసుకోవడం" 505 పేజి 2:22 "విగ్రహములను అసహ్యంచు కొను" దుర్గంధము వలన ఒక దానికి దూరముగా వెళ్లటం అనే మూల అర్ధమునిచ్చేది.

▣ **"గుళ్ళను దొంగిలించెదవా"** చారిత్రాత్మకంగా ఇది అనిశ్చయమైనదైన విగ్రహారాధనకు సంబంధించనదే.

2:24 గ్రీకు బైబిల్‌లో యెషయా 52:5లో నుండి చెప్పబడిన మాట ఇది. నిబంధనను అనుసరించుట ద్వారా ఇశ్రాయేలుపైన దేవుని ఆశీర్వాదము లోకమునకు సాక్షముగా ఉండును. ఎలాగైననూ, ఇశ్రాయేలు దేవుని నిబంధనను ఎన్నడూ కాపాడు కోలేదు కాబట్టి లెకము దేవుని తీర్పునే చూసింది (యెహెజ్కేలు 36:22-32). ఇశ్రాయేలు రాజులైన యాజకసముహింగా ఉండాలి (నిర్గమ 19:5-6), లోకమంతటిని దేవుని యొద్దకు తీసుకునిరావాలి. (ఆది 12:3; ఎఫెసి 2:11-3:13)

NASB (నవీన) వాక్యము : **2:25-29**

**నీవు ధర్మశాస్త్రమును అనుసరించి ప్రవర్తించు వాడవైతివా, సున్నతి ప్రయోజనకరమగును గాని ధర్మఝశాస్త్రమును అతిక్రమించు వాడవైతివా, నీ సున్నతి సున్నతి కాకపోవును. 26 కాబట్టి సున్నతిలేనివాడు ధర్మశాస్త్రపు నీతివిధులను గైకొనిన పక్షమున అతడు సున్నతిలేని వాడైయుండియు సున్నతిగల వాడుగా ఎంచబడును గదా? 27 మరియు స్వభావమును బట్టి సున్నతి లేనివాడు ధర్మశాస్త్రమును నెరవేర్చిన యెడల లేఖనమును, సున్నతి గల వాడవై ధర్మశాస్త్రమును అతిక్రమించు నీకు తీర్పుతీర్చడా? 28. బాహ్యమునకు యూదుడైనవాడు యూదుడుకాడు; శరీరమందు బాహ్యమైన సున్నతి సున్నతికాదు. 29. అయితే అంతరంగమందు యూదుడైనవాడే యూదుడు మరియు సున్నతి హృదయ సంబంధమైన దై ఆత్మయందు జరుగునదే గాని లేఖనమున కలుగునది కాదు. అట్టి వానికి మెప్పు, మనుష్యుల వలన కలుగదు దేవుని వలననే కలుగును.**

**2:25 "సున్నతి"** కొంతమంది ఈ మాటను చెప్పుదురు, కనీసము మేము సున్నతి చేయబడ్డాం అని (ఆది 17:10-11) మేము అబ్రాహాము వంశము. పౌలు స్పష్టముగా మరియు ధైర్యముగా ఈ యూదుల ఆశను త్రుంచివేస్తున్నాడు (మత్తయి 3:7-10; యోహాను 8:31-59) ఫిలీప్తీయులు తప్ప ఇశ్రాయేలు పొరుగువారందరూ సున్నతి చేయబడినవారే. చర్య అనేది ప్రాముఖ్యంకాదు. విశ్వాసంలో కొనసాగటం ప్రాముఖ్యం (26-27వ). అన్ని మత కర్మకాండలకు ఇది సత్యము. మతపరమైన ప్రజలందరికి దేవుని నిబంధన ఆశీర్వాములు కావాలి కాని బాద్యతలు అవసరం లేదు.

**2:25-26 "యెడల.... యెడల.... యెడల...."** ఈ మూడు మూడవ తరగతి షరతులతో కూడిన వాక్యము ఇది సమీప భవిష్యత్‌లో జరిగే కార్యము. విధేయత (ద్వితి 27-30) అనేది 2వ అధ్యాయంలో పౌలు వాదనలో ముఖ్యమైనది, కాని 3:21-31(గలతీ3)లో కాదు.

**2:26-27** కొంతమంది అన్యులు వారికి కలిగిన వెలుగునకు స్పందించినట్టుగా ఈ వచనాలు చూపిస్తున్నాయి. ఇది అపొ10లోని కొర్నెలి యస్ కావచ్చు అయినా అతడు అంతగా అమరడు ఎందుచేతనంటే ఆయన దేవుని యందు భయభక్తులు గలిగి సమాజ మందిరములో ఆరాదించేవాడు.

యూదులు రక్షింపబడటానాకి అవసరమైన వాదనకు ఇది విరుద్ధమైనది. రోమా 3:23లో మానవులందరూ ఆత్మీయంగా క్రీస్తు లేక నశించినవారని సారాంశం. అన్యజనులు సృష్టిని బట్టి మరియు అంతరంగిక నీతి భావన వలన వారికి కల్గిన వెలుగులోవారు జీవించనట్టయితే, క్రీస్తునకు స్పందించుటకు ఎలాగైననూ, ఎదో మార్గమున, ఎదో సమయమున అవకాశమును కల్గిస్తాడు.

2:28-29 "యూదుడు కాదు.... యూదుడు" నవీన వేదాంతపరమైన అభివృద్ధితో యుగముల వాదము మరియు దాని ప్రయత్నమైన పాత, క్రొత్త నిబంధన ప్రజలను వేరుచేయుట అన్న సందర్భములో ఇది చాలా ప్రాముఖ్యమైన చర్చ. ఒకే ఒక్క నిబంధన మరియు ఒకే ప్రజలు (రోమా 9:6; గలతీ 3:7-9, 29; 6:16; 1పేతురు 3:6) నూతన నిబంధన, పాతనిబంధన యొక్క అభివృద్ధి మరియు దాని నెరవేర్పు. విశ్వాసమును బట్టి గాని వంశావళిని బట్టి దేవుని ప్రజలు కాలేరు. వారి "హృదయప్రజలు"కాని పూజలు లేదా జాతికి చెందిన వారుకారు. విశ్వాసము, తల్లిదండ్రులు కాదు మూలం. నిబంధన మనస్సు గుర్తుకాని నిబంధన చిహ్నం కాదు.

2:29 ఒకడు దేవునికి తన మనస్సును తెరువజేయడానికి అలంకార రూపంగా పాతనిబంధనలో సున్నతిగా కనిపిస్తుంది. (ఆది 17:14) ఇది అలంకార రూపముగా చాలా రీతులుగా అభివృద్ధి చెందినది (1) హృదయ సున్నతి (ద్వితి 10:16; యిర్మియా 4:4); (2) చెవిసున్నతి (యిర్మియా 6:10); మరియు (3) పెదవి సున్నతి (నిర్గయ 6:12, 30) ధర్మశాస్త్రము పరిచే నియమము. ప్రత్యేక అంశం : ధర్మశాస్త్రము మీద పౌలు అభిప్రాయం 7:12ను చూడండి.

▣ **NASB "హృదయ సంబంధమైనదై ఆత్మయందు జరుగునదే కాని, లేఖనము వలన కలుగునది కాదు"**
**NKJV "హృదయ సంబంధమైనదై ఆత్మయందు జరుగునది కాని లేఖనములో కాదు"**
**NRSV "హృదయమునకు సంబంధించినదై ఆత్మీయమైనది కాని అక్షరార్థమైనది కాదు"**
**TEV "దేవుని ఆత్మకార్యము గాని, వ్రాయబడిన ధర్మశాస్త్రము కాదు"**
**JB "హృదయములో - అక్షర సంబంధమైనది కాదు గాని ఆత్మసంబంధమైనది.**

గ్రీకులో ఈ వాక్యము చాలా సందిగ్ధమైనది. కొన్ని అనువాదములు దీనిని అక్షరార్థమునకు విరుద్ధంగా ఆత్మీయత కొరకు సూచనగా ఉపయోగించినారు. (NRSV, 20వ శతాబ్దపు క్రొత్త నిబంధన, నాక్స్ అనువాదం, పెషిత్తా యొక్క అమ్సా అనువాదం, విలియమ్స్ మరియు న్యూబర్గ్క్ అనువాదం). ఇతర అనువాదములు పరిశుద్ధాత్మకు మధ్య ఉన్న భేదాన్ని చూసినారు (7:6; 2కొరి 3:6, అక్క ఇటువంటి నిర్మాణమే కనిపిస్తుంది) మరియు వ్రాయబడిన వాక్యము (NASB, NKJV, NEB, NIV, NTV)

కొంతమంది అన్యజనులు ధర్మశాస్త్రము లేకనే దేవునికి ఇష్టులుగా ఉంటున్నారని పౌలు వాదిస్తున్నాడు. దీనిని బట్టి భౌతికంగా సున్నతి చేయబడిన వారు మాత్రమే కాకుండా, దేవుని పిల్లలుగా అనేక మంది చేర్చబడతారు. యూదుల జాతి కంటే దేవుని కుటుంబము చాలా విశాలమైనది (ఆది 3:15; 12:3; నిర్గమ 19:5) యోబు మెల్కిసెదకు, యిత్రో, కాలేబు, రాహాబు మరియు రూతు అనువారు యూదుల జాతి వారు కారు. ఎఫ్రాయిము, మనష్షే గోత్రముల వారు సగపు ఐగిప్తీయులు ఆది (41:50-52)

**చర్చాప్రశ్నలు :**

ఇది ధ్యాన మార్గదర్శక వ్యాఖ్యానం కావునా బైబిల్ యొక్క మీ స్వంత వ్యాఖ్యానమునకు మీరు బాధ్యులు. మనమందరం మన కివ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, బైబిల్ మరియు పరిశుద్ధాత్మ భావ వ్యక్తీకరణలో ప్రముఖులు నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు దానిని విడిచి పెట్టకూడదు. ఈ పుస్తకంలోని బహుళ విషయములను ఆలోచించుటకు ఈ చర్చా ప్రశ్నలు సహాయపడతాయి. అవి ఆలోచింపజేసేవే కాని, నిశ్చితమైనవి కావు.

1. యూదులు అవిశ్వాస్యత దేవుని వాగ్దానములను ఎలా ప్రభావితం చేసినది ?
2. యూదుడుగా ఉండుట వలన దేవుని ఎదుట ఎదైనా లాభం ఉన్నదా ?
3. డైయాట్రైబ్ అనగానేమి ?
4. 5-8లోని డైయాట్రైబ్‌లోని అంశం ఏమిటి ?
5. క్రియలు కాకుండా విశ్వాస మూలంగా కృప ద్వారా నీతిమంతులుగా ఎలా తీర్చబడగలరు?
6. సంపూర్ణ పతనం యొక్క వేదాంత అభిప్రాయం ఏమిటి (3:10-18)?
7. మోషే ధర్మశాస్త్రము యొక్క సాధారణ ఉద్దేశ్యం ఏమి ? (3:20; గలతీ 3:24-25)?
8. 1-3వ అధ్యాయాలలో పతనముతో సంబంధం కలిగియున్న సాతాను ప్రస్తాపన ఎందుక రాలేదు?
9. పాత నిబంధన వాగ్దానాలు షరతులతో కూడినవా? కావా?
10. (1) యూదులేతర మరియు (2) యూదుల జీవితములలో ధర్మశాస్త్రము యొక్క ఉద్దేశ్యము ఏమిటి ?
11. 1:18-3:20 లో పౌలు వాదనను మీ స్వంత మాటలలో వివరించండి ?

# ద్వితీయోపదేశకాండము - 3వ అధ్యాయము

నవీన అనువాదముల యొక్క వాక్య విభజన

| UBS | NKJV | NRSV | TEV | JB |
|---|---|---|---|---|
| యూదులు మరియు ధర్మశాస్త్రం (2:17-13:8) | దేవునితీర్పు ప్రతివాదం | యూదుల లాభము | యూదులు మరియు ధర్మశాస్త్రము (2:17-3:8) | దేవుని వాగ్దానము వారిని రక్షించదు |
| 3:1-8 | 3:1-8 | 3:1-8 | 3:1-4 | 3:1-8 |
| | | | 3:5-6 | |
| | | | 3:7-8 | |
| నీతిమంతుడు ఒక్కడునూ లేడు | అందరునూ పాపము చేసిరి | అందరూ ఆపరాదులే | ఏ మనుష్యుడనూ నీతిమంతుడు కాడు | అందరూ అపరాదులే |
| 3:9-20 | 3:9-20 | 3:9-18 | 3:9-18 | 3:9-18 |
| | | 3:9-20 | 3:9-20 | 3:9-20 |
| విశ్వాసము ద్వారా నీతి | విశ్వాసము ద్వారా దేవుని నీతి | నిజమైన నీతి | ఎలా దేవుడు మనిషిని సరి చేస్తాడు | దేవుని న్యాయం యొక్క ప్రత్యక్షత |
| 3:21-26 | 3:21-26 | 3:21-26 | 3:21-26 | 3:21-26 |
| | అతిశయం బహిష్కరించబడింది | అతిశయం బహిష్కరించబడింది | | విశ్వాసము ఏమి చేయును |
| 3:27-31 | 3:27-31 | 3:27-31 | 3:27-31 | 3:27-31 |

వాక్యపు పరిధి యొద్ద అసలైన గ్రంధకర్త ఉద్దేశ్యంను అనుసరించుట....

ఈ వ్యాఖ్యానం చదువుటకు ఉపయోగపడే మార్గదర్శిని......

కావున బైబిల్ యొక్క వ్యాఖ్యానమును నీవు సొంతంగా చేసుకొనుటకు భాద్యుడవు. మనమందమం మనకు ఇవ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, పరిశుద్ధ గ్రంధం మరియు పరిశుద్ధాత్మ వ్యాఖ్యానంలో ప్రాధాన్యత వహించవలెను. దీనిని నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు విడిచిపెట్టకూడదు.

అధ్యాయమంతటినీ ఒకేసారి చదవాలి, అంశాలను గుర్తించాలి. నీ అంశ విభజనము పైన ఇవ్వబడిన నవీన అనువాద విభజనలతో సరి పోల్చుకోవాలి. విభజన అనేది ప్రేరణ కాదు. కాని ఇది అసలు గ్రంధకర్త యొక్క ఉద్దేశ్యమును తెలుసుకొనుటకు ఉపయోగపడును వ్యాఖ్యానమునకు ఇది కేంద్రమై వున్నది. ప్రతి వాక్య విభజనకే ఒక్క విభజనను కలిగి ఉండును.

1. మొదటి వాక్య భాగం
2. రెండవ వాక్య భాగం
3. మూడవ వాక్య భాగం
4. మొదలగునవి.

**సందర్భోచిత తలంపులు**

ఎ. చాలా రీతులలో 1-8 వచనములు సంబంధము కల్గినవి. కానీ పౌలు యుక్తి అర్థము కాదు.

బి. 2:17-29 వచనములకు కొంతమంది యూదులు ఎలా స్పందిస్తారోనని పౌలు ఎదురుచూస్తు, వారి ఆక్షేపణలకు ఆయన జవాబిస్తున్నాడు. (కొర్లీ, వాగన్ రోమన్స్ 37-39)

1. మొండి ప్రశ్న నిజముగా యూదులకు ఎటువంటి ప్రయోజనం లేదా ? (1-2వ॥లు)
2. రెండవ ప్రశ్న కొంతమంది యూదుల అవిశ్వాసము వలన దేవుని మాట తప్పిపోయెనా ? (3-4వ॥లు)
3. మూడవ ప్రశ్న. దేవుని గుణమును ప్రత్యక్ష పర్చుటకు యూదలును దేవుడు వాడుకొనినట్లయిననూ యూదులు న్యాయపరంగా భాద్యులా? (5-8వ॥లు)

సి. ముగింపు 2:11నకు వెళ్తుంది. దేవుడు పక్షపాతికాడు. మానవులందరూ వారు పొందుకున్న వెలుగోని జీవితమును బట్టి బాధ్యులు.

డి. 9-18 వచనములు యూదుల పాపమును వివరంచిఏ ఉదహరణలు.

ఇ. 19-20 వచనములు ఇశ్రాయేలీయుల ఆత్మీ స్థితి మరియు పాతనిబంధన ఉద్దేశ్యము యొక్క మొత్తము.

ఎఫ్. 21-31 వచనములు 1:18-3:20 యొక్క సంగ్రహము అలి సువార్త యొక్క మొదటి వేదాంతంశము (మానవుని అవసరత)

**పద మరియు వాక్య ధ్యానము**

**NASB (నవీన) వాక్యము) : 3:1-8**

**అట్లయితే యూదునికి కలిగిన ఆదిక్యమేమి? సున్నతి వలన ప్రయోజనమేమి? 2. ప్రతి విషయమందు అధికమే. మొదటిది, దేవోక్తులు యూదుల పరము చేయబడెను. 3. కొందరు అవిశ్వాసులైన నేమి? వారు అవిశ్వాసులైనందున దేవుడు నమ్మతగినవాడు కాకపోవునా? అట్లనరాదు. 4. నీ మాటలలో నీవు నీతి మంతుడవుగా తీర్చబడునట్లును నీవు వ్యాజ్యమాడునప్పుడు గెలుచునట్టను అని వ్రాయబడిన ప్రకారము ప్రతి మనుష్యుడు అబద్ధికుడగును కాని దేవుడు సత్యవంతుడు కార తీరదు. 5. మన దుర్నీతి దేవుని నీతిక ప్రసిద్ధి కలుగజేసిన యెడల ఏమందుము? ఉగ్రతను చూపించు దేవుడు అన్యాయస్తుడగునా ? నేను మనుష్య రీతిగా మాటలాడుచున్నాను. 6. అట్లనరాదు. అట్లయిన పక్షమున దేవుడు లోకమునకు ఎట్లు తీర్పు తీర్చును? 7. దేవునికి మహిమ కలుగునట్లునా అసత్యము వలన దేవుని సత్యము ప్రభలించిన యెడల నేనికను పాపినైనట్లు తీర్పు పొందనేల? 8. మేలుకలుగుటకు కీడుచేయుదమని మేము చెప్పుచున్నామని, కొందరు మమ్మును దూషించి చెప్పు ప్రకారము మేమెందుకు చెప్పరాదు? అట్టి వారికి కలుగు శిక్షావిధి న్యాయమే.**

**3:1 "అట్లయితే యూదునికి కలిగిన ఆదిక్యమేమి"** సాహిత్య సాంకేతికమైన డయాట్రైబ్, అనగా ఇక వస్తువును / విషయమును చూపించి తన వర్తమానమును తెలియజేస్తున్నాడు. యూదుల ఆధిక్యతల పట్టీ 3:2 మరియు 9:4-5లో చూడండి.

**3:2 "మొదటది"** 1:8లో పౌలు "మొదట" ఉపయోగించినాడు, కాని రెండవ విషయము ప్రస్తావించలేదు. ఇక్కడ కూడా అదే చేస్తున్నాడు. పౌలు రచన చాలా తీవ్రమైనది. మరియు అధికారముతో కూడినది. కావునా తరచుగా ఆయన వ్యాకరణ నిర్మాణము అసంపూర్తిగా ఉండేది.

▣ **"దేవోక్తులు యూదలు పరము చేయబడెను"**

దేవుని ప్రత్యక్షత కలిగియుండటము, గొప్ప బాద్యత మరియు గొప్ప ధన్యత కలిగిన విషయము (లూకా 12:48) వారు దేవుని బహుమానం యొక్క అధికారులు (1దెస్స 2:4) లోగియెన్ (దేవోక్తులు ) అన్న పదము గ్రీకు బైబిల్ (సెప్టుజియంట్)లో దేవుని నుండి వచ్చు మాటగా చెప్పబడింది. (సంఖ్యా 24:4, 16, ద్వితి 33:9, కీర్తన 119:67, యెషయా 5:24, 28:13) నూతన నిబంధనలో కూడా తరచుగా వాడబడింది (అపొ 7:38; హెబ్రీ 5:12; 1పేతురు 4:11)

**3:3 "అయితే"** ఇది మొదటి తరగతి షరతులతో కూడిన వాక్యము అయివుండి గ్రంధకర్త దృక్పధము నుండి సత్యమని మరియు తన సాహిత్య ఉద్దేశ్యం కొరకు వాడబడినదని చెప్పవచ్చు. 5 మరియు 7 వచనాలు కూడా మొదటి తరగతి షరతుల వాక్యములే. 3:3

**NASB "కొంతమంది అవిశ్వాసులైనేమి"**

**NKJV "కొంతమంది అవిశ్వాసులు"**

**NRSV "కొంతమంది అవిశ్వాసులైనేమి"**

ఇది ఇశ్రాయేలీముల వ్యక్తిగత (1) అవిశ్వాస్యత లేక (2) యోహోవా యందు వ్యక్తిగత విశ్వాసం యొక్క కొదువ కావచ్చును. దీనిని షరతులు లేని దేవుని వాగ్దానమునకు మరియు మానవస్పందన యొక్క షరతులలో కూడినవాగ్దానముతో జ్ఞాన యుక్తముగా కలపలము కష్టము అయినప్పటికి ఇది బైబిల్ విరుద్దము (3:4-5) ప్రజలు అవిశ్వాసులైనా దేవుడు నమ్మతగినవాడు (హోషేయా 1,3)

▣ **"వ్యర్థము చేయునా"** - క్రింది ప్రత్యేక అంశంను చూడండి

**ప్రత్యేక అంశం :** వ్యర్తము మరియు శూన్యము (కాటార్జియో) ఈ (కాటార్జియో) పౌలు యొక్క అభిమాన పదం. కనీసం 25 సార్లు ఆయన వాడినాడు. దీనికి విస్తారమైన అర్ధం వ్యాపించి ఉండి.

ఎ. దీనిమూలపదం అర్గోస్ దీని అర్ధము

1. చురుతనం కాని
2. కదలని
3. ఉపయోగించని
4. ఉపయోగించలేని
5. వినియోగంలో లేని

బి. కాట్‌తో మిళితపదం ఈవిధంగాం వ్యక్తమవుతుంది

1. అచేతనం
2. నిరుపయోగం
3. రద్దు చేయబడిన
4. జరిగిపోయిన
5. సంపూర్తిగా వినియోగంలో లేని

సి. లూకాలో ఒకసారి ఫలములేనిదిగా చెప్పబడి, ఉపయోగంలేని చెట్టుగా పరిగణించబడినది (లూకా 13:7) పౌలు దీనిని,

డి. రెండు ప్రాథమిక రీతులలో ఉపమానభావనలో చెప్పినాడు.

1. మానవులకు విరోధముగా నున్న వాటిని దేవుడు అచేతనం చేస్తున్నాడు.
   ఎ. మానవుని పాప స్వభావం - రోమా 6:6
   బి. "సంతానము" నకు దేవుని వాగ్దానముతో మోషే ధర్మశాస్త్రములనకున్న సంబంధం - రోమా 4:14; గలతీ 3:17; 5:4, 11;
   ఎఫెసి 2:15
   సి. ఆత్మీయ శక్తులు - 1 కోరింది 15:24
   డి. "ధర్మవిరోధి" - 2థెస్స 2:8
   ఇ. భౌతిక మరణము - 1కోరింది 15:26; 2 తిమోతి 1:16
2. దేవుడు పాతదానికి బదులుగా క్రొత్త దానిని ఉంచుచున్నాడు.
   ఎ. మోషే ధర్మశాస్త్రానికి సంబంధించిన వాటిని రోమా 3:3, 31; 4:14; 2కోరింది 3:7, 11, 13, 14
   బి. ధర్మశాస్రమును గురించి వివాహ ఉపమానం - రోమా 7:2, 6
   సి. ఈ యుగసంబంధ విషయములు - 1కొరింది 13:8, 10, 11
   డి. ఈ శరీరము - 1 కొరింది 6:13
   ఇ. ఈ యుగపు అధికారులు - 1కొరింది - 1:28; 2:6

ఈ పధము వేర్వేరు తీరులలో అనువాదము చేయబడినప్పటికి, ముఖ్యమైన అర్ధము, ఒక విషయమును నిరుపయోగం చేయటం, వ్యర్థం మరియు శూన్యం చేయుట, వినియోగ లేకుండా చేయటం, నిస్సత్తువ చేయటం, కాని పూర్తిగా లేకుండా, నాశనం లేక నిర్మూలము అవ్వవలసిన అవసరము లేదు.

**3:4**

**NASB "అట్లు కాకూడదు"**

**NKJV, TEV "అది నిశ్చయంగా కాదు"**

**NRSV "ఏవిధంగానూ కాదు"**

**JB "అది అయుక్తము"**

ఇది అరుదుగా ఉపయోగించే ఆశీర్వాదపు భావన. ఇది ఒక ఆశనులేక ఒక ప్రార్ధనగా అను వాదించబడుతుంది. పైలు యొక్క సాహిత్య సాంకేతిక డయోట్రైబ్ పద్ధతిలో ఉపయోగించే పధము (3:4, 6, 31; 6:2, 15; 7:7, 13; 9:14; 11:1; 1కొరింది 6:15; గలతీ 2:17; 3:21; 6:14) ఇది నిశ్చయమని తలంచిన దానిని సున్నితంగా తిరస్కరించడం.

1. "అట్లనరాదు", 4,6 వ॥లు
2. "ప్రతిమనుష్యుడు అబద్ధికుడగును గాని దేవుడు సత్యవంతు కాక తీరడు" 4వ
3. "(నేను మనుష్యరీతిగా మాట్లాడుచున్నాను)". 5వ
4. "(కొందరు మమ్మును దూషించి చెప్పు ప్రకారము మేమెందుకు చెప్పరాదు)"

- **"ప్రతి మనుష్యుడు అబద్ధికుడగును గాని దేవుడు సత్యవంతుడు కాక తీరడు".** ఇది వర్తమాన తటస్థ ఆజ్ఞార్ధకమైన వాక్యము. ఇది చెప్పబడిన విషయము యొక్క కొనసాగింపు పైన దృష్టి నిలుపుతున్న వాక్య నిర్మాణము. దేవుడు నమ్మతగినవాడు, సత్యవంతుడు, మానవులు అవిశ్వాసులు మరియు అబద్ధికులు. ఇది కీర్తన 116:11 నకు సాదృశ్యమైనట్టు మరియు యోబు 32:2, 40:8లో యోబు నేర్చుకున్నదైనట్టు కనిపిస్తుంది. ఈ అధ్యాయంలో పాపభరితమైన విషయము పాస్ (అందరూ, ప్రతి) అన్న పదముతో పౌలు ఉపయోగించినాడు 4,9,12,19,20,23,24 కాని దేవునికి స్తోత్రము, అందరి రక్షణకొరకైన దేవుని సార్వత్రిక బహుమానం (3:22) "వ్రాయబడిన ప్రకారము"

- **"ఇది వ్రాయబడిన మరియు వ్రాయబడుతున్న "** అని అక్షరార్ధాముగా చెప్పబడుతుంది. ఇది దేవుని లేఖనాల ప్రేరణను ధృవీకరించు వాడబడుతున్న సాంకేతిక జాతయము. (మత్తయి 5:17-19) ఇది గ్రీకు బైబిల్లోని కీర్తన 51:4 నుండి చెప్పబడింది. 3:5-6 ఈ వచనములలో లోకమును చేరుకొనుటకు, దేవుడు ఇశ్రాయేలు ప్రజలను ప్రత్యేకంగా ఎన్నుకొనినాడని పౌలు వాదన చూడవచ్చు ఆది 12:3; నిర్గమ 19:5-6) పాతనిబంధనలో "ఎన్నిక" సేవను సూచిస్తుంది. కాని ప్రత్యేక ధన్యతను కాదు. దేవుడు వారితో నిబంధన చేసికొనినాడు. దేవుడు నమ్మతగినవాడు; వారు అవిశ్వాసపాత్రులు. దేవుడు నీతిని బట్టి అవిశ్వాస ఇశ్రాయేలీయులను తీర్పు తీర్చినాడనేది సత్యము. అన్య జనులను చేరుకొనుటకు ఇశ్రాయేలును సాధనంగా దేవుడు ఎంచుకున్నాడు. వారు విఫలమైనారు (3:24)! ఇశ్రాయేలీయుల ఓటమి దేవుని సార్వత్రిక రక్షణ ఉద్దేశ్యమును ప్రభావితం చేయలేదు. (ఆది 3:15) నిజముగా, దేవుని అసలైన నిబంధనకు దేవుని విశ్వాస్యత రోమా 9-11లో రూడి చేయబడినది. అవిశ్వాసులైన ఇశ్రాయేలు వారు తృణీకరింపబడ్డారు. కాని విశ్వాస ఇశ్రాయేలీయులు దేవుని విమోచన ప్రఖాళికలో ఉన్నత స్థితిని పొందుదురు. పౌలు దయాట్రైబ్ 5-6 వచనాలు 7-8 వచనాలకు సాదృశ్యంగా ఉన్నవి.

- **3:5 "అయితే"** ఇది మొదటి తరగతి షరతులతో కైడిన వాక్యమై, గ్రంధకర్త దృక్పదము నుండినిజమని దృవీకరిస్తుంది. లేక గ్రంథకర్త యొక్క సాహిత్య ఉద్దేశ్యము కొరకు వ్రాయబడినది 3 మరియు 7వ వచనాలు కూడా మొదటి తరగతి షరతులతో కూడిన వాక్యము. "మన దుర్ణీతి దేవుని నీతికి ప్రసిద్ధి కలుగజేసిన యెడల ఏమందుము" ఈ సర్వనామము,, "మన" పౌలునకు మరియు యూదులందరికి ఏకభావనగా చెప్పబడింది. 1:7లో ప్రత్యేక అంశం చూడండి. "మనము ఏమందము" పౌలు దయాట్రైబ్ను ఉపయోగించుచున్నాడు. (3:5; 7:7; 8:31; 9:14, 39) ఉదహరించబడిన విషయము ఉపయోగించుట వలన తన బోధను తేటపరుచుచున్నాడు (మలాకీ 1:2, 6, 7, 12, 13; 2:14, 17 (రెండుసార్లు) 3ః7, 13, 14)

**NASB "(నేను మనుష్యరీతిగా మాటలాడుచున్నాను)"**

**NKJV "(మనుష్యునివలె మాట్లాడుచున్నాను)"**

**NRSV "(మానవరీతిలో మాటలాడుచున్నాను)"**

**TEV "మనుష్యులు మాటలాడునట్టుగా మాటలాడుచున్నాను)"**

**JB "(మానవ ఉదాహరణను ఉపయోగించుటకు)"**

పౌలు తన వేదాంత వాదనలలో తరుచుగా మానవ తర్క శాస్త్రమును ఉపయోగించువాడు (6:19; 1కొరింది 9:8; గలతీ 3:15) ఉదహరించబడిన విషయము యొక్క ధృవీకరణను తృణీకరించుట కొరకు పనిచేస్తుంది. 3:7-8 5&7 వచనముల మధ్య సాదృశ్యమున్నది. పౌలు (1) సాహిత్య సాంకేతికమైన డయాట్రైబ్‌ను వాదుచున్నాడు (3:5,7; 7:7; 8:31; 9:14, 30) లేక (2) విశ్వాసము మూలంగా దేవుని నీతి అన్న వర్తమానమునకు వచ్చిన విమర్శకు స్పందిస్తున్నట్టు కనిపిస్తుంది. నిందారోపణమును వివరించటము లేక జవాబివ్వటం కాదుగాని బలవంతముగా నిషేదిస్తున్నాడు. ఉచితముగా, ఆయోగ్యమైన వారికి, విశ్వాసము వలన నీతిమంతులుగా చేయబడటమునకు ఆక్షేపించటము అనేది అన్యాయమునకు లేక అవిశ్వాస అవిధేయతకు దారతీస్తుంది. ఉచిత కృప, నూతన కృప మరియు కృతజ్ఞత జీవితం ద్వారా క్రీస్తు సారూప్యమునకు నడిపిస్తుందని పైలు నమ్ముచున్నాడు. యూదులు, గ్రీకు నైతిక వాదులు, మరియు పౌలు అందరూ మార్పు చెందిన వారు నైతిక జీవితం కల్గియుండాలని ఆశిస్తున్నారు. కాని ఇది ఒక నైతిక జీవితం కల్గియుండాలని ఆశిస్తున్నారు. కాని ఇది ఒక బాహ్య ధర్మశాస్త్ర విధికి లోబడుట ద్వారవ కాదు గాని నూతన హృదయము ద్వారా మాత్రమే (యిర్మియా 31:31-34; యెహెజ్కెలు 26:22-32

3:7 "అయితే" ఇది మొదటి తరగతి షరతులలో కూడిన వాక్యమై, గ్రంధకర్త దృక్పధమునుండి సత్యమని రూడి పరుచుటకు లేదా తన సాహిత్య ఉద్దేశ్యము కొరకు వాడబడినది.

**"దేవుని మహిమ"**

NASB (నవీన) వాక్యము : **3:19-18**

**అలాగైన ఏమందుము? మేము వారికంటే శ్రేష్టులమా? ఎంతమాత్రమును కాము. యూదులేమి హెల్లెనీయులేమి అందరును పాపమునకులోనైయున్నారని యింతకు ముందు దోషారోపణచేసియున్నాము. 10 ఇందుకు వ్రాయబడినదేమనగా 11 నీతిమంతుడు లేడు ఒక్కడును లేడు గ్రహించువాడెవడును లేడు. దేవుని వెదకు వాడెవడును లేడు 12 అందరును త్రోవతప్పి యేకముగా పనికి మాలిని వారైరి. మేలు చేయువాడులేడు, ఒక్కడైనను లేడు. 13 వారి గొంతుక తెరచిన సమాధి; తమ నాలకతో మోసము చేయుదురు; వారి పెదవుల క్రింది సర్ప విషమున్నది. 14 వారి నోటినిండ శపించుటయు పగయు ఉన్నది. 15 రక్తము చిందించుటకు వారి పాదములు పరుగెత్తుచున్నవి. 16 నాశనమును కష్టమును వారి మార్గములలో ఉన్నవి 17 శాంతి మార్గము వారెరుగరు 18 వారి దృష్టి యెదుట దేవుని భయము లేదు 19 ప్రతినోరు మూయబడునట్లును, సర్వలోకము దేవుని యెదుట శిక్షకు పాత్రమగునట్లును, ధర్మశాస్త్రము చెప్పుచున్న వాటి నన్నిటిని ధర్మశాస్త్రమునకు లోనైన వారితో చప్పుచున్నదని యెరుగుదుము.**

**3:9 "మేము వారికంటే శ్రేష్టులమా"** ఈ సందరభములోని వ్యాకరణము సందిగ్దంగా ఉంది. ఈ వాక్య భాగము యొక్క ముఖ్య సత్యమేమిటంటే, మానవులందరూ దేవుని కృప అవసరతలో ఉన్నారు. అని స్పష్టము చేస్తుంది (3:9, 19, 23; 11:32; గలతీ. 3:22). ఎలాగైననూ ఈప్రత్యేక వచనములు యూదులకనిగాని (పౌలు మరియు తన జనాంగము .....) లేక క్రైస్తవులకనిగాని (పౌలు మరియు దేవుని కృప నుండి వేరుగా ఉన్న తోటి విశ్వాసులు) చెప్పలేము. యూదులకు కొంత ప్రయోజనం కలదు(1-2; 9:4; 4-5), కాని ఈ ప్రయెజనములు మరింత భాద్యులునుగా చేస్తుంది. మానవులందరూ ఆత్మీయంగా నశించిరి. వారు అందరూ దేవుని కృప అవసరతలో ఉన్నారు. "శ్రేష్టులము" అన్నపదము కొద్దిపాటి పండితులచే మద్యమపదంనకు బదులుగా కర్మార్ధకరముగా (పాసిల్ వాయిస్) చెప్పబడింది. దీనిఫలితంగా ఇది "మించినది"గా అనువదించబడినది. రోమా పత్రిక పౌలు పత్రికల్లో స్థానికంగా తటస్థపత్రికగా చెప్పబడింది. అధికంగా పైలు పత్రికలు ఒక స్థానిక అవసరం లేక క్లిష్టపరిస్థితిని ఎదుర్కొనుటకు వ్రాయబడినది (సందర్భోచిత పత్రములు) ఎలాగైననూ, విశ్వసించిన యూదుల నాయకులు మరియు విశ్వసించిన అన్యజననాయకులకు మద్య ఉన్న అనూయ ఈ వచనములకు మరియు 9-11 అద్యాయములకు సందర్భముగా కనిపిస్తుంది. "పాపమునకు లోనై" పౌలు పాపమును, పతనమైన మానవులపైన కఠిన యాజమానిగా పొల్చుచున్నాడు.

**3:10-18 "ఇందుకు వ్రాయబడిన దేమనగా"** ఈ వాక్యము 4వ వచనంలో కూడా కనిపిస్తుంది. చెప్పబడిన వాక్యములు మానవుల పతనమును ఒక్కాణించుటకు మానవ శరీరము యొక్క ఉపమానములతో కూడిన పాత నిబంధన వచనములు (1) 10-12, ప్రంగి 7:20 లేక కీర్తన 14:1-3 (2)13వ, 5:9 లేక 140:3; (3) 14వ కీర్తన 10:7; (4) 15-17వ యెషమా 59:7-8 మరియు సామెతలు 1:16 మరియు (5) 18వ, కీర్తన 36:1, పౌలు యెషయా 53:6 అను ఉపయోగించక పోవటం ఆశ్చర్యము.

**NASB (నవీన) వాక్యము 3:19-20**

**19 ప్రతినోరు మూయబడునట్లును, సర్వలోకము దేవుని యెదుట శిక్షకు పాత్రమగునట్టును, ధర్మశాస్త్రమునకు లోనైన వారితో చెప్పుచున్నదని యెరుగుదము 20 ఏలయనగా ధర్మశాస్త్ర సంబంధమైన క్రియల మూలంగా ఏ మనుష్యుడును ఆయన దృష్టికి నీతిమంతుడని తీర్చబడడు.**

**3:19 "యెరుగుదుము"** 2:2లోని నోట్ చూడండి

- **"ధర్మశాస్త్రము"** 10-18 వచనములలో ఉదహరించిబడిన కారణముచేత 9వ వచనంలో "పాపము"నకు చెప్పిన రీతిగా "ధర్మశాస్త్రము"నకు చెప్పుచున్నాడు. (6:16-23)

- **"ధర్మశాస్త్రమునకు లోనైన వారితో"** చాలా పాతనిబంధన వచనము అధికంగా అన్యజనుల కొరకు చెప్పబడినప్పటికి, ఇది యూదులకు మరియు అన్య జనమునుండి మారుమనస్సుపొందిన వారికి ప్రత్యేకంగా చెప్పబడినట్టు సూచిస్తుంది.

**NASB "ప్రతినోరు మూయబడునట్టు, సర్వలోకము దేవుని యెదుట లెక్క అప్పగింపబడునట్టు"**

**NKJV "ప్రతినోరు ఆపబడి, సర్వలోకము దేవుని యెదుట అపరాదులగునట్టు"**

**NRSV "కావున ప్రతినోరు నిశ్శబ్దమై, సర్వలోకము దేవునికి లెక్క ఇచ్చునట్లు.**

**TEV "మానవ సాకులన్నిటిని ఆపుటకు మరియు సర్వలోకమును దేవుని తీర్పు క్రిందకు తెచ్చునట్లు"**

**JB "అందరిని నిశ్వబద్ధపరుచుటకు, సర్వలోకమును దేవుని తీర్పునకు తెరచుటకు".**

ఇది 1:18-3:20లో పెద్ద అంశమై యుంది 3:23లో సంగ్రహించబడినది "ప్రతినోరు" మానవులందరిని సూచించే పదములు 19-20 వచనాలలో అనేకం ఉన్నవి.

1. "ప్రతినోరు" 19వ
2. "సర్వలోకము" 19వ
3. "ఏ మనుష్యుడును" 20వ

3:20 "ధర్మశాస్త్ర సంబంధమైన క్రియల మూలముగా ఏ మనుష్యుడును ఆయన దృష్టికి నీతిమంతుడని తీర్చబడడు" ఇది కీర్తన 143:2నకు ఒక పదము చేర్చబడిన ఉపమానం. పౌలు సువార్తలో ఇది ఒక ఉన్నత దృక్పధం (గలతీ 2:10; 3:11) సమర్పణ కలిగిన పరిశయ్యుడిగా, అంతరంగిక శాంతిని కలిగించలేని మతపరమై సంతోషం మరియు నిర్ధేషించబడిన క్రియల అచేతనము పౌలునకు తెలుసు.

**NASB "ధర్మశాస్త్రము వలన పాపమనగా ఎట్టిదో తెలియబడుచున్నది"**

**NKJV "ధర్మశాస్త్రము ద్వారా పాపము తెలియబడుచున్నది"**

**NRSV "ధర్మశాస్త్రము మానవుడు పాపము చేసేనని తెలియజేస్తుంది.**

**TEV "ధర్మశాస్త్రము చేస్తున్నదంతా, పాపము ఏమిటో తెలియజేయటమే.**

ఇది పాత నిబంధన యొక్క ఒక ఉద్దేశ్యము పతనమైన మానవులకు రక్షణను తీసుకురావటానికి ఇది ఉద్దేశించబడలేదు. దీని ఉద్దేశ్యం ఏమనగా, పాపమును ప్రత్యక్ష పర్చి మానవులందరిని దేవుని కృప యొద్దకు నడిపించటమే (4:15; 5:13, 20; 7:7; గలతీ 3:19-22, 23-29)

**చర్చాప్రశ్నలు :**

ఇది ధ్యాన మార్గదర్శక వ్యాఖ్యానం కావునా బైబిల్ యొక్క మీ స్వంత వ్యాఖ్యానమునకు మీరు భాద్యులు. మనమందరం మన కివ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, బైబిల్ మరియు పరిశుద్ధాత్మ భావ వ్యక్తీకరణలో ప్రముఖులు నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు దానిని విడిచి పెట్టకూడదు. ఈ పుస్తకంలోని బహుళ విషయములను ఆలోచించుటకు ఈ చర్చా ప్రశ్నలు సహాయపడతాయి. అవి ఆలోచింపజేసేవే కాని, నిశ్చితమైనవి కావు.

1. యూదులు అవిశ్వాస్యత దేవుని వాగ్దానములను ఎలా ప్రభావితం చేసినది ?

2. యూదుడుగా ఉండుట వలన దేవుని ఎదుట ఎదైనా లాభం ఉన్నదా ?
3. డైయాట్రైబ్ అనగానేమి ?
4. 5–8లోని డైయాట్రైబ్‌లోని అంశం ఏమిటి ?
5. క్రియలు కాకుండా విశ్వాస మూలంగా కృప ద్వారా నీతిమంతులుగా ఎలా తీర్చబడగలరు?
6. సంపూర్ణ పతనం యొక్క వేదాంత అభిప్రాయం ఏమిటి (3:10–18)?
7. మోషే ధర్మశాస్త్రము యొక్క సాధారణ ఉద్దేశ్యం ఏమి ? (3:20; గలతీ 3:24–25)?

**రోమా 3:21–31నకు సందర్భోచిత తలంపులు**

ఎ. రోమా 3:21–31, 1:18–3:20 యొక్క ముగింపు సారాంశం మరియు 1:16–17 యొక్క వర్ధనము.

బి. విశ్వాసము వలన నీతిమంతులుగా తీర్చబడుట అన్న సారాంశమ్మత సంస్కరణ కర్తలచే ఈవిధంగా వర్ణింపబడింది.

1. మార్టిన్‌లూథర్ : ఇది పత్రికకు మరియు బైబిల్ అంతటికి కేంద్ర స్థానము మరియు ముఖ్య అంశముగా
2. జాన్ కాల్విన్ : క్రీస్తులో దేవుని నీతి అనే చెప్పేమాట, ఇక్కడ తప్ప, బహుశా బైబిల్ అంతటిలో ఎక్కడ కనిపించకపోవచ్చు.

సి. సౌవార్తిక క్రైస్తవ్యమునకు ఇది వేదాంతసారము. ఈసందర్భమును అర్థము చేసుకొనుట క్రైస్తవ్యమును అర్థము చేసుకొనుటే. యోహాను 3:16 ఒక వచనములోని సువార్తవలె ఇది రెండు వాక్యభాగముల సువార్త సారాంశం. పౌలు సువార్త ప్రదర్శనకు ఇది ప్రాణం మరియు ఆత్మయై యున్నది. మూడు ముఖ్య అనువాదపు ప్రశ్నలు :

1. "ధర్మశాస్త్రము" అన్న పద అర్ధమేమి?
2. "దేవుని నీతి" అన్న వాక్య అర్ధమేమి?
3. "విశ్వాసం" మరియు "నమ్మిక" పదముల అర్థమేమి?

డి. "అందరూ" 22వలోని మాటను బట్టి నేను దేవుని స్తుతించుచున్నాను. అదేవిధంగా "బహుమానం" 23వలోని మాటను బట్టికూడా (5:15, 17; 6:23)

**పద మరియు వాక్య ద్యానం**

NASB (నవీన) వాక్యం **3:21–26**

**21 ఇట్లుంగడా ధర్మశాస్త్రమునకు వేరుగా దేవుని నీతి ప్రత్యక్షమగుచున్నది; దానికి ధర్మశాస్త్రమును ప్రవక్తలును సాక్షమిచుచున్నారు. 22 అది యేసు క్రీస్తునందలి విశ్వాసమూలమైనదై, నమ్మువారందరికి కలుగదేవుని నీతియైయున్నాది. 23 ఏ భేదమును లేదు; అందరును పాపముచేసి దేవుడు అనుగ్రహించు మహిమను పొందలేక పోవుచున్నారు. 24 కాబట్టి నమ్మువారు ఆయన కృపచేతనే క్రీస్తు యేసునందలి విమోచనము ద్వారా, నిర్హేతుకముగా నీతిమంతులని తీర్చబడుచున్నారు 25 పూర్వము చేయబడిన పాపములను దేవుడు తన ఓరిమివలన ఉపేక్షించినందున, ఆయన తన నీతిన కనుపరచవలెనని 26 క్రీస్తు యేసు రక్తము నందలి విశ్వాసము ద్వారా ఆయనను కరుణాధారముగా బయలుపరచెను. దేవుడిప్పటికాలమందు తన నీతిని కనుపరుచు నిమిత్తము, తాను నీతిమంతుడును యేసునందు విశ్వాసముగల వానిని నీతిమంతులుగా తీర్చువాడునై యుండుటకు ఆయన అలాగు చేసెను.**

**3:21 "ఇట్లుండగా"** పౌలు పాత నిబంధనను క్రొత్త నిబంధనతో విభేదిస్తున్నాడు. తిరుగుబాటు పాత యుగముతో నీతి యొక్క నూతన యుగముతో విభేదిస్తున్నాడు. కావున ఇది "ప్రస్తుత కాలమునకు" 26వ నకు సాదృశ్యమైనది (కాని ఇప్పుడు 6:22; 7:6)

▣ **"ధర్మశాస్త్రమునకు వేరుగా"** ఈ ప్రారంభ అధ్యాయములలో పౌలు మోషే ధర్మశాస్త్రమున లేక సాధారణ ధర్మశాస్త్రమును సూచిస్తున్నాడని ఖచ్చితంగా చెప్పుట కష్టతరం. ఈ సందర్భంలో యూదుల ధర్మశాస్త్రము పౌలు వారనకు అమరుతుంది. మానవులందరూ ప్రతీ నైతిక, సాంఘిక నియమాలను అంతరంగికంగా లేక బాహ్యంగానైన మీరి యున్నారు. పతనమైన మానవులుగా మన సమస్య ఏమిటంటే, మన స్వార్ధము మరియు మన స్వార్ధ పూరిత ఆశలు తప్ప వేరే నియమావళిని కోరము (ఆది.3)

NASB "దేవుని నీతి"

NKJV "దేవుని నీతి"

NRSV "ప్రజలను తనతో సరిచేసుకొనే దేవుని రీతి"

TEV "రక్షించే దేవుని న్యాయము"

**"నీతితో ఖచ్చితమైన ఆర్టికల్ లేదు.** ఇది దేవుని గుణమును సూచించుటకాదు గాని పాపులకు క్షమాపణను మరియు అంతీకారమును కల్గించే దేవుని పద్ధతి రోమా 1:16-17లో వేదాంత అంశముగా ఈ వాక్యం వాడబడినది. సిలువ వేయబడిన యేసునందు విశ్వాసమును ప్రత్యక్ష పరిచే యంత్రము (22, 24-26)

సత్యమేమనగా (డైకైసొనే) అన్న పదము మరియు దాని ఇతర పదములు దీని గుర్తింపును తెలియజేయటానికి వాడబడినవి. (1:17; 3:5,21,22,25,26; 4:3,5,6,10,17) ఈ గ్రీకు పదము పాతనిబంధన రూపక అలంకారమైన (సడాక్) "ఒక ప్రమాణం" లేక "కొలబద్ద" నుండి వచ్చినది. ప్రమాణము దేవుడే. క్రీస్తు ద్వారా పతనమైన మానవులకు ఉచితంగా ఇచ్చే దేవుని గుణమును ఈ పదము ప్రతిబింబిస్తుంది. (2కొరింది 5:21) వారి పాపములను ఒప్పుకొని, దేవుని బహుమానమును స్వీకరించటం, గర్వాందులు, స్వార్ధపూరిత మనుష్యులకు ప్రత్యేకంగా ధర్మశాస్త్రవాదులకు, మతపురుషులకు అవమానకరమని తలంచుచున్నారు. 1:17 ప్రత్యేక అంశం చూడండి.

- **"ప్రత్యక్షమగుచున్నది"** ఈ వాక్యము 1:17నకు చాలా సాదృశ్యంగా ఉన్నది. ఎలాగైననూ క్రియ వేరుగా ఉన్నది. ఒక్కడ క్రియ ఈవిధంగా అనువదించబడవచ్చు. "ప్రత్యక్షమై మరి స్పష్టంగా ప్రత్యక్షమగుచున్నది". పాత నిబంధనలోను సువార్తలలోనూ దేవుడు స్పష్టంగా సువార్త బయలుపరచెను.

- **"దానికి ధర్మశాస్త్రమును ప్రవక్తలను సాక్ష్యమిచ్చు చున్నారు"** హీబ్రూ కానాన్‌లోని మూడు విభాగాలలో రెండింటిని ఇది సూచిస్తుంది. (దర్మశాస్త్రము, ప్రక్తలు మరియు రచనలు) ఈ రెండునూ మొత్తమంతటిని సూచిస్తున్నాయి. (3:19లోని నోట్ చూడండి) పాతనిబంధనలోనే ప్రాథమిక ఆకారం సువార్తలకు కలదని స్పష్టంగా చూపిస్తుంది (లూకా 24:27, 44; అపో 10:43). ఇది తరువాతి ఆలోచన కాదు. "ప్లాన్ బి" లేక చివరి నిమిషపు కార్యక్రమం కాదు (1:2)

**3:22 "యేసు క్రీస్తునందలి విశ్వాసమూలంగా"** అక్షరార్దంగా ఇది "యేసు క్రీస్తు యొక్క విశ్వాసం ద్వారా" గలతీ 2:16 ఫిలిప్పి 3:9 తిరిగి చెప్పబడింది. అదేవిధ:గా రోమా 3:26; గలతీ 2:16, 20; 3:22లో కూడా ఇదే రూపంలో ఉంది. ఇది (1) యేసు యొక్క విశ్వాసము లేక విశ్వాస్యత లేక (2) మన విశ్వాసమునకు యేసు కారకంగా అని అర్ధమివ్వవచ్చును. గలతీ 2:16లోని వ్యాకరణ నిర్మాణము 2వ అర్ధమును ఎంచుకొనుచున్నది.

ఇది దేవుని యొక్క నీతికరణను చూపిస్తుంది. ఇది క్రీస్తు యొక్క నీతి దేవుని ఉచిత బహుమానం. క్రీస్తు ద్వారా ఒకని జీవితంలో పనిచేస్తుంది (4:5; 6:23), ఇది విశ్వాసం / నమ్మికతో అంగీకరించబడాలి. (ఎఫెసి 2:8-9) దైనందిక జీవితంలో కనిపించాలి. ఎఫెసి 2:10)

- **"అందరికి"** సువార్త అందరికి(24వ; యెషయా 53:6; యెహెజ్కెలు 18:23, 32; యోహాను 3:16-17; 4:42; 1తిమోతి 2:4, 4:10; తీతుకు 2:11; పేతురు 3:9; 1యోహాను 4:14), ఎంత గొప్ప సత్యము! బైబిల్ సత్యం అయిన ఎన్నికను సరితూచబడాలి. దేవుని ఎంపిక ఇస్లామీయ నియతివాదముతోగాని లేక కాల్వినిసం యొక్క భావన అయిన కొందరు & ఇతరులుతో కాకుండా నిబంధన భావనలో అర్ధం కాబాలి. పాత నిబంధన మానవుని రక్షణకు దేవుడు వాగ్దానం చేసినాడు. (ఆది 3:15) ఇశ్రాయేలీయుల ద్వారా మానవులందరిని దేవుడు పిలిచి ఎంపిక చేసుకొనుచున్నాడు. (ఆది 12:3; నిర్గమ 19:5-6). క్రీస్తు నందు విశ్వాసం ద్వారా దేవుడు ఎన్నుకుంటున్నాడు. రక్షణలో దేవుడే ఎన్నడూ ముందు అడుగువేస్తాడు. (యోహాను 6:44, 65 ఎఫెసియులకు 1, మరియు రోమా 9 అనేవి అగస్టిన్ మరియు కాల్విన్ వేదాంతపరంగా వక్కానించిన విది పూర్వ నిర్ధారణ / దైవ సంకల్పసిద్దాంతమునకు బలమైన బైబిల్ వాక్య భాగములు.

దేవుడు విశ్వాసులను రక్షణ (నీతికరణ) కొరకు మాత్రమే కాకుండా శుద్దీకరణకొరకు కూడా ఎన్నిక చేసుకొంటాడు. (ఎఫెసి 1:4; కొలస్సీ 1:12) ఇది (1) క్రీస్తులో మనస్థానము (2కోరింది 5:21) లేక (2) దేవుని పిల్లలలో దేవుని గుణమును కలిగించాలనే దేవుని కోరిక (రోమా 8:28-29; గలతీ 4:19; ఎఫెసి 2:10) సంబందించినదవ్వచ్చును. దేవుడు తన పిల్లలకు ఒక రోజు పరలోకము మరియు క్రీస్తు స్వారూప్యం ఇక్కడ అని దేవని చిత్తము. దైవ సంకల్పం యొక& గురి పరిశుద్దత, ధన్యత కాదు. కొంతమంది ఆదాము సంతానమును

పిలువాలని దేవుని కోరిక కాదు గాని అందరికి. ఇది దేవుని గుణము కొరకైన పిలుపు (1 థెస్స 5:23; 2 థెస్స 2:13)

పరిశుద్ధత లేకుండా విధి పూర్వ నిర్ధారణ సిద్దాంతము కేవలం వేదాతం పరమైనదే అయితే మానవ వేదాత సిద్దాంతములు దురదృష్టకరం తరచుగా మన వేదాంత సిద్ధాంతములు బైబిల్ వాక్యమును వక్రీకరిస్తుంటాయి.

8:33లోని ఎన్నిక / విధి పూర్వ నిర్ధారణ సిద్దాంతము మరియు వేదాత సరితూకం యొక్క అవసరంను చూడండి.

- **"నమ్మువారికందరికి"** యేసు అందరికొరకు మరణించాడు అందరూ రక్షింపబడగలరు. యేసుని నీతిని వారి జీవితాలకు అన్వయించుకోవటం మానవుల వ్యక్తిగత స్వీకరణపై ఆధారపడిఉండి (1:16; యోహాను 1:12; 3:16; 20:31; రోమా 10:9-3; 2 యోహాను 5:13) నీతి నింపబడటానాకి బైబిల్ రెండు పద్దతులను నియమించింది. విశ్వాసము మరియు మారు మనస్సు (మార్కు 1:15; అపొ 3:16, 19; 20:31 మరియు 1:5లోని నోట్ చూడండి) ఈ వాక్యము విశ్వమానవాళి రక్షణ అవకాశంను ప్రత్యక్షపర్చుతుంది. కాని అందరూ రక్షింపబడరు.

- "ఏ భేదమును లేద" ఒకే ఒక్క మార్గము మరియు ఒకే ఒక్క వ్యక్తి ద్వారా మానవులు (యూదులు మరియు అన్యజనులు) రక్షింపబడగలరు. (యోహాను 10:1-2, 7; 11:25; 14:6) క్రీస్తునందు విశ్వాసము ద్వారా ఎవరూననూ రక్షింపబడగలరు. (1:16; 4:11, 16; 10:4, 12; గలతీ 3:28; కొలస్సీ 3:11)

3:23-26 ఇది గ్రీకులో ఒక వాక్యం 3:23

**NASB, NKJV, NRSV "అందరునూ పాపముచేసి దేవుడు అనుగ్రహించు మహిమను పొందలేక పోవుచున్నారు"**

**TEV "అందరునూ పాపముచేసి దేవుని నుండి దూరమైనారు.**

**JB "పాపముచేసిరి మరియు ఎగొట్టుకొనిరి"**

ఇది 1:18-3:20 యొక్క సారాంశం. ప్రతివారును క్రీస్తుచే రక్షింపబడవలసిన వారైయున్నారు (3:9, 19; 11:32; గలతీ 3:22; యెషయా 53:6) "పాపముచేసి" అనేది ఆరిస్ట్ ఎక్టివ్, అగాగే "పొందలేక పోవుచున్నారు." అనేది ప్రేసెంట్ మిడిల్ ఇండికేటివ్. ఇది ఆదాములో పతనమైపోయిన మానవులందరిని సూచిస్తుంది (5:12-21) మరియు కొనసాగుతున్న వ్యక్తిగత తిరుగుబాటును సూచిస్తుంది. ఏ నవీన అనువాదము వ్యత్యాసంను చూపించుటలేదు. 21వచనంనకు వేదాంతపరంగా సబందించినది, 24వ వచనంనకు పరోక్ష సంబంధం కలదు.

- **"దేవుని మహిమ"** క్రింది ప్రత్యేక అంశంను చూడండి.

**ప్రత్యేక అంశం : మహిమ**

బైబిల్ అంశమైన **"మహిమ"** నిర్వచించటం కష్టం సువార్తను అర్దం చేసుకొని మరియు దేవునిలోని మహిమను చూడటమే విశ్వాసుల మహిమకాని వారిలోఏమిలేదు. (1:29-31; యిర్మియా 9:23-24) పాతనిబంధనలో "మహిమ" సాధారణ హీబ్రూపదమైన (బడీ) ఒక వాణిజ్య పదరమునకు సంబంధిచంని కొలబద్ద జత ("బరువుగా ఉండుటకు) బరువైనది మరియు విలువైన లేక నికరమైన విలువ కదది. దేవుని ప్రభావమును వ్యక్తపరచడానికి తరుచుగా ప్రకాశమానం సిద్ధాంతం చేర్చబడుతుంది (నిర్గమ 19:16-18; 24:17; యెషయా 60:1-2) దేవుడు మాత్రమే యోగ్యుడు మరియు ఘనతనొదినవాడు. పడిపోయిన మానవులను లేపటానికి ఆయన జ్ఞానవంతుడు (నిర్గమ 33:17-23; యెషయా 6:5) క్రీస్తు ద్వారా మాత్రమే యెహోవా తెలియబడగలదు(యిర్మియా 1:14; మత్తయి 17:2; హెబ్రీ 1:3; యాకోబు 2:1)

**"మహిమ"** అన్న పదం చాలా సంధిగ్దపదం (1) ఇది "దేవునినీతి"కి సమంగా ఉండవచ్చు; (2) "పరిశుద్ధత"లేక "పరిపూర్ణత" లేక (3) మానవులు సృజించబడిన దేవుని స్వరూపమే కావచ్చు (ఆది 1:26-27; 5:1; 9:6), కాని అది తరువాత తిరుగుబాటు వలన పొగొట్టబడినది. (ఆది 3:1-22) కావచ్చును. ఇది మొట్టమొదటిసారిగా దేవుని ప్రజలు అరణ్యంలో తిరుగుతున్నప్రడు యెహోవా సన్నిధిగా ఇది వాడబడినది (నిర్గమ 16:7, 10, లేవి 9:23 మరియు సంఖ్యా 14:10)

**3:24 "ఆయన కృపచేతనే, నిర్హేతుకంగా నీతిమంతులని తీర్చబడుచున్నారు"** ఇది ప్రెసెంట్ పాసివ్ పార్టిసిపల్ ఇక్కడ నుండే సువార్త ప్రారంభమవుతుంది – నీతిని ఇచ్చే దేవుని కృప (5:15, 17; 6:23) గ్రీకు పదమైన "నీతిమంతులుగా చేయటం", "నీతి డైకైసునె) ఒకే మూలపదం నుండి వచ్చినవి. ఎప్పుడూ దేవుడు ముందు ప్రారంబిస్తాడు. (యెహాను 6:44, 65)

24-25 వచనాలలో రక్షణను వివరించటానాకి మూడు రూపక అలంకారములు ఉన్నవి (1) "నీతిమంతులుగా తీర్చబడటం" అనేది "శిక్ష విధింపబడలేదు" లేక "అపరాది కాదు అని ఒకనిని ప్రకటించటం" అనే న్యాయపరమైన పదం; (2) "విమోచనము" "తిరిగి కొనటం" లేక "విడిపించటం" అనే దాసత్వపు సంత పదముల అర్ధం; (3) "పాప పరిహారార్ధం" బలుల వ్యవస్థనుండి వచ్చినదై కప్పే స్థలం లేక ప్రాయశ్చిత్తం అని అర్ధమిస్తుంది. ఇది ప్రాయశ్చిత్తార్ధపు దినమందు నిబంధన మందసపు మూతపైన ఉంచబడిన రక్తమునకు సచనగా కనిపిస్తుంది. (లేవి16; హెబ్రీ 9:5)

**ప్రత్యేక అంశం : ఒకని రక్షణకు క్రొత్తనిబంధన ఋజువు ఇది ఆధారడినది ;**

1. తండ్రి యొక్క గుణం (యోహాను 3:16)కు కుమారుని కార్యము (2కొరింది 5:21), మరియు పరిశుద్దాత్మ పరిచర్య (రోమా 8:14-16) కాని మానవ పనినిబట్టి గాని, విధేయతా ఫలముబట్టిగాని, ఒక శాసనము బట్టి కాదు.
2. ఇది ఒక బహుమానం (రోమా 3:24; 6:23; ఎఫెసి 2:5, 8-9)
3. ఇది ఒక నూతన జీవితం, ఒక నూతన జీవిత విధానం (యాకోబు మరియు 1. యోహాను)
4. ఇది జ్ఞానం (సువార్త) సహవాసం క్రీస్తు నందు మరియు క్రీస్తుతో), మరియు ఒక నూతన జీవిత విధానం (ఆత్మనడిపించే క్రీస్తువంటి), ఈ మూడు అన్నీ, కాని మూడింటిలో ఎదో ఒక్కటికాదు.

▣ **"బహుమానం"** పౌలు చాలాసారుల ఈ అంశంను వేర్వేరు పదములతో వాడినాడు.

1. దోరియన్, విశేషణము, "ఉచితముగా"
2. డోరియ, నామవాచకం, "ఉచిత బహుమానం" (5:15, 17; ఎఫెసి 3:7)
3. డోరోన్, నామవాచకం "బహుమానం" (ఎఫెసి 2:8)
4. కరిస్మా, నామబాచకం, "ఉచిత బహుమానం" లేక "ఉచిత అభిమానం" (5:15చ, 16; 6:23)
5. కరిసోమై, క్రియా, "ఉచితవరంగా ఇవ్వటం" (8:33)
6. కారిస్, నామవాచకం, "ఉచిత అభిమానం" లేక "ఉచిత బహుమానం" (4:14, 16; 11:5,6; ఎఫెసి 2:5,8)

▣ **"క్రీస్తు యేసునందలి విమోచనము ద్వారా"** మన రక్షణకు యంత్రం, క్రీస్తుయొక్క ప్రాయశ్చితార్ధపు మరణము మరియు పురుత్ధానము ఎంత చెల్లించవడింది, ఎవరికి చెల్లించబడినది అని బైబిల్ దృష్టిని సారించటం లేదు (ఆగస్టీన్), కానీ సత్యమేమిటంటే, పాప అపరాదపు శిక్ష నుండి పాపమెరుగని ప్రాయశ్చిత్తం ద్వారా మానవులు విడిపించబడినారు. (యోహాను 1:29, 36 2కోరింది 5:21; 1 పేతురు 1:19) ఈ వచనం ఆది 3:15 యొక్క వెలను కూడా చూపిస్తుంది. యేసు శాపమును (గలతీ 3:13) భరించి పతనమైన మానవుల పక్షమున (2కొరింది 5:21) మరణించెను (1తిమోతి 2:6) రక్షణ ఉచితమే, కాని నిశ్చయంగా అది చవుకైనదికాదు.

**ప్రత్యేక అంశం : విమోచనం / విడుదల**

1. పాతనబంధన

ఎ. ఈ అంశంను వివరించే రెండు హీబ్రూ న్యాయపదములు కలవు.

1. గాల్, ప్రాథమికంగా ఇది "విడిపంచుటకు" వెల చెల్లించటం అని అర్ధం. గోయెల్ యొక్క రూపం వ్యక్తిగత మధ్యవర్తి సాధారణంగా ఒక కుటుంబ సభ్యుడు (బంధు రక్షకుడు) ఈ సంస్కృత అంశం, వస్తువులను, జంతువులను, భూమిని తిరిగి కొనుటకు (లేవి 25, 27), లేక బంధువులను (రూతు 4:15; యెషయా 29:22) ఈ అంశం, వేదాంతపరంగా ఐగుస్తునుండి ఇశ్రాయేలీయులను విడిపించుటకు బదిలీ చేయబడింది. (నిర్గమ 6:6; 15:13; కీర్తన 74:2; 77:15; యిర్మియా 31:11; యెహోవా దేవుడు "విమోచకుడు" అయినాడు (యెబు 19:25; కీర్తన 19:14; 78:35; సామెతలు 23:1; యెషయా 41:14; 43:14; 44:6,24; 47:4; 48:17; 49:7,26; 54:5, 8; 59:20; 60:16; 63:16; యిర్మియా 50:34)

2. పడా, ఇది "రక్షించుటకు" లేక "విడిపించుటకు"

ఎ. మొదటి సంతానం యొక్క విమోచన, నిర్గమ 13:13, 14 మరియు సంఖ్యా 18:15-17

బి. ఆత్మీయ విడుదలతో భౌతిక విడుదలతో భేదిస్తుంది. కీర్తన 49:7,8,15

సి. ఇశ్రాయేలు పాపమునుండి తిరుగుబాటు నుండి విమోచించును. కీర్తన 130:7-8

డి. వేదాంతాంశం 3 సంబంధిత పదములను కల్గియుంది.

1. బానిసత్వం, అపరాదం, చెర యొక్కఅవసరం

ఎ. భౌతికం

బి. సాంఘికం

సి. ఆత్మీయం (కీర్తన 130:8)

2. స్వేచ్ఛ, విడుదల మరియు తిరిగి కట్టబడుటకు వెల చెల్లించబడాలి.

ఎ. ఒకదేశం యొక్క, ఇశ్రాయేలు (ద్వితి7:8)

బి. ఒక వ్యక్తి యొక్క (యోబు 19:25-27; 33:28)

3. ఒకరకు తప్పనిసరిగా మధ్యవర్తిగా మరియు ఉపకారిగా ఉండాలి. గాల్‌లో ఈ ఒకరు సాధారణంగా కుంటుంబ సభ్యులో

లేక సమీప బంధులో అయిఉండాలి. (గో.ఎల్)

4. యెహోవా తరచుగా కుటుంబ పదములలో చెప్పబడేవాడు.

ఎ. తండ్రి

బి. భర్త

సి. సమీపబంధువుడు విమోచనము యెహోవా వ్యక్తిగత కార్యము; వెల చెల్లించబడింది. రక్షణ సాధించబడింది.

2. క్రొత్తనిబంధన

ఎ. వేదాంత అంశంను వివరించుటకు చాలా పదములు వాడబడినవి.

1. అగోరాజో (1కోరింది 6:20; 7-23; 2పేతురు 2:1) ప్రకటన 5:9; 14:340 ఒక దాని నిమిత్తం వెల చెల్లించబడే వాణిజ్య పదము మన స్వంత జీవితములను మన అదీనంలో ఉంచుకోలేము. ంఎదుచేతనంటే మనం రక్తంతో కొనబడినవారం. మనం క్రీస్తునకు చెందిన వారం.

2. ఎక్సాగురాజో (1కొరి 6:20; 7:23; 2 పేతురు 2:1; ప్రక 5:9; 14:34) ఇవికూడా వాణిజ్య పదమై ఒకదాని నిమిత్తము చెల్లించబడిన వెలను సూచిస్తుంది. ఇది మన తరుపున యేసు యొక్క ప్రాయశ్చిత్త మరణమును సూచిస్తుంది. యేసు క్రీస్తు ధర్మశాస్త్రము యొక్క శిక్షను భరించినాను. (మోషే ధర్మశాస్త్రము) దీనిని మానవులు నెరవేర్చలేకపోయినారు. యేసు మనందరికి నిమిత్తము శాపమును (ద్వితి 21:23) భరించెను. యేసులో దేవుని న్యాయము మరియు ప్రేమ సంపూర్ణ క్షమాపణ మరియు అంగీకారము మరియు సంబంధమును తీసుకొని వచ్చినవి.

3. లువో "విడిపించుట"

ఎ. లుట్రోన్ "చెల్లించబడిన వెల" మత్తయి 20:28, మార్కు 10:45; ఈ మాటలు యేసు ప్రభువు నోటినుండి ఆయన రాకడ ఉద్దేశ్యమును పాపమునకు బదులుగా చెల్లించవలసిన క్రయధనముగా చెప్పినాడు. యోహాను (1:29),

బి. లూట్రూ "విడుదల కొరకు"

1. ఇశ్రాయులను విమోచించుటకు (లూకా 21:24)

2. ప్రజలను విడిపించుటకు మరియు పవిత్రపరుచుటకు యేసు తనను తానే అర్పించుకొనెను. (తీతు 2:14)

3. పాప రహిత పరిహారముగా 1పేతురు 1:18-19

సి. లుట్రోసిస్ "విమోచనము", "విడుదల", "స్వేచ్ఛ"

1. యేసును గురించిన జర్యయా ప్రవచనము (లూకా 1:68)

2. యేసును బట్టి అన్నా స్తుతించుట (లూకా 2:38)

3. యేసు యొక్క ఒకేఒక్క శ్రేష్టమైన బలి (హెబ్రీ 9:12)

4. అపో లుట్రోసిస్

ఎ. రెండవ రాకడతో విమోచనము (అపొ 3:19-21)

1. లూకా 21:28

2. రోమా 8:23

3. ఎఫెసి 1:14, 4:30

4. హీబ్రూ 9:15

బి. క్రీస్తు మరణములో విమోచనము

1. రోమా 3:24

2. 1కొరి 1:30

3. ఎఫెసి 1:7

4. కొలసి 1:14

5. యాంటిలిట్రోన్ (1తిమోతి 2:6) ఇది (తీతు 2:14) వలె ప్రాముఖ్యమైన వాక్యబాగము ఇది సిలువపైన యేసుని యొక్క మరణమును రూఢిపరుస్తుంది. (యెషయా 53) యేసు అందరి కొరకు మరణించే ఒకే ఒక్క మరియు అంగీకార బలి (యోహాను 1:29; 3:16-17; 4:42; 1తిమో 2:4; 4:10; తీతు 2:11; 2పేతురు 2:9; 1జాను 2:2; 4:14)

బి. క్రొత్త నిబంధన సూచించే వేదాంత అంశములు

1. మానవ జాతి పాపమునకు బానిసలుగా ఉన్నారు. యోహాను 8:34; రోమా 3:10-18; 6:23;

2. మానవుల యొక్క పాప బానిసత్వము పాతనిబంధన మోషే ధర్మశాస్త్రము వలన (గలతీ 3, యేసు కొండమీద ప్రసంగం వలన ప్రత్యక్ష పరచబడినది. మత్తయి 5-7. మానవుల ప్రయత్నము మరణ శిక్షకు దారి తీసినది. (కొలసి 2:14)

3. పాప రహిత గొర్రె పిల్ల అయిన యేసు మన స్థానములో మరణించెను. (యెహను 1:29; 2కొరి 5:21) మనము దేవుని సేవించలాగును పాపమునుండి కొనబడినాము. (రోమా 6)

4. యెహోవా మరియు యేసు మన స్వంత బంధువుల వలె మన పక్షమున కార్యము చేసినారు. ఇది కుటుంబపరమైన రూపక అలంకారముతో పోల్చబడింది. (తండ్రి, భర్త, కుమారుడు, సహోదరుడు, బంధువు)

5. విమోచన ధనము అపవాదికి చెల్లించబడలేదు (మిడివల్ థియోలజీ) కాని దేవుని న్యాయము మరియ దేవుని వాక్యము క్రీస్తులో దేవుని ప్రేమగా సంపూర్ణ ఏర్పాటుగా మార్చబడినది. సిలువ యొద్ద సమధానము నెలకొల్పబడింది. మానవ తిరుగుబాటు క్షమించబడింది. దేవుని స్వరూపము మానవునిలో మరియొక సారి కల్పించబడి దేవునితో సవాసముని కల్పించబడింది.

6. ఇంకనూ ఈ రక్షణ దృకృదము భవిష్యత్‌లోగా వివరించబడింది (రోమా 8:23, ఎఫెసి 1:14, 4:30) ఇది త్రియేక దేవునితో మన భౌతిక సాన్నిహిత్యము మరియు పునరుత్థానములో ముందుగా చెప్పబడినది.

**3:25**

**NASB "దేవుడు తన ఓరిమి వలన ఉపేక్షించినందున"**

**NKJV "దేవుడు ఏర్పరచిన"**

**NRSV "దేవుడు ముందు వంచిన"**

**TEV "దేవుడు అర్పిచెను"**

**JB "దేవునిచే ఏర్పాటుచేయబడిన**

ఇది అరిస్ట్ మిడిల్ ఇంటికేట్ ఇది క్రీస్తు మరణము లన దేవుడు తన స్వంత హృదయము, ఉద్దేశ్యమున ప్రత్యే పరుచునని అర్ధమిచ్చును (ఎఫెసి 1:9) దేవుని నిత్య విమోచన ప్రణాళికలో క్రీస్తు యొక్క యాగము నిమగ్నమై యున్నది (యెషయా 53:10, ప్రక 13:8)

యెండైక్ సుమాయ్ (యెండా ఎన్సిస్ 3:25, 26 అనే గ్రీకు పదయు రోమా పత్రికలో అనేకసార్లు వాడబడినది. (2:15 9:17, 23,

**LXX** నిర్గమ

దీని మూల అర్థము ప్రత్యక్షపర్చుట లేక బయలు పర్చు మానవులు దేవుని విమోచనాత్మక ఉద్దేశ్యమును, ప్రణ్యాలికను మరియు నీతిని అర్థము చేసుకొనవలెనని కోరుచున్నాడు. ఈ సందర్భము బైబిల్ దృక్పధమును తెలియజేస్తుంది.

1. దేవుని లక్షణము గురించి
2. క్రీస్తు కార్యమును గురించి
3. మానవుని అవసరత గురించి
4. విమోచనాత్మక ఉద్దేశ్యము కొరకు

మనము అర్థము చేసుకోవాలని దేవుడు కోరుచున్నాడు. క్రైస్తత్వమును అర్థము చేసుకోవడానికి ఈ సందర్భము చాలా ప్రాముఖ్యమైనది. కొన్ని వాక్యములు సందిగ్ధమై యుండి లేక రకరకాలుగా అర్థము చేయబడినప్పటికిని, సారాంశము స్పష్టము మరియు తేటతెల్లము. ఈ సందర్భము క్రొత్త నిబంధన కొరకు ఉత్తరపు నక్షత్రము.

▣ NASB "క్రీస్తు యేసు నందలి రక్తము ద్వారా కరుణాధారముగా"

NKJV "ఆయన రక్తమునందల కరుణాదారమువలె"

NRSV "ఆయన రక్తము నందలి ప్రాయశ్చిత్త బలిగా"

TEV "ఆయన రక్తము వలనైన మార్గము ద్వారా ప్రజల పాపములు క్షమింపబడులాగున"

JB "ఆయన జీవమును యుగముచేసి సమాధానమును సాధించెను"

గ్రీకు రోమా లోకములో ఈ పదము. ఒక వెల చెల్లించి ఆగ్రహించిన దేవతలతో మరళా సహవాసము చేయుటకొరకు అన్న అంశము కొనసాగునిస్తుంది. ఇది గ్రీకు బైబిల్లోనూ మరియు హెబ్రీ 9:5లో "కరుణా పీఠము"గా అనువదించబడింది. ఇది అతి పరిశుద్ధ స్థలములో నిబంధన మందసము పై ఉండి, ప్రాయశ్చిత్త దినమందు ఇశ్రాయేలు దేశము తరుపున జరిపేది (లేవి) ఈ పదము పాపము యడల దేవుని ప్రతికారముగా చూడకూడదు. గాని పాపుల యెడల దేవుని విమోచనాత్మక ఉద్దేశ్యమును చూడాలి.

జేమ్స్ స్టూవర్డ్ ఏమేన్ ఇన్ క్రైస్ట్, 214-224 లో ఈ విషయము పై మంచి చర్చ ఉండి. ఇది క్రీస్తులో దేవుని కార్యమును సూచిస్తుంది. "పాపపరిహారార్ధబలి" లేక "పాపపరిహారార్ధశక్తితో"

▣ **"ఆయన రక్తము నందలి"** ఇది పాపరహిత దేవుని గొఱ్ఱె పిల్ల యొక్క పాప పరిహారార్ధ మరణమును హీబ్రూ భ్యావనతో చెప్పటము (యోహాను 1:29) ఈ అంశము సంపూర్గిఆ అర్ధమగుటకు లేవి 1-7 అదేవిధ:గా 16వ ఆ.లోని ప్రాయశ్చితార్ధపు దినము అనేవి ప్రాముఖ్యమైనది. రక్తము అపరాది పక్షమున చిందించబడిన దానిని సూచిస్తుంది. (యెషయా 52:13; 53:12)

▣ **"విశ్వాసముద్వారా"** ప్రతిఒక్కరూ, ఎవరైననూ యేసుక్రీస్తు మరణము వలన లాభము కొరకు ఉన్న యంత్రము (1:17; 3:22, 25, 20, 27, 28, 30)

ఇది పురాతన యున్సియల్ ప్రతులలో తొలగించబడినది (క్రిసోస్టమ్‌చే వాడబడిన గ్రీకు బైబిల్లో) ఇది మిగతా ఇతర పురాతన ప్రతులలో చేర్చబడింది.

**"తన నీతి కనుపరుచునిమిత్తము"** దేవుడు తన మాటకు మరియు గుణమునకు సత్యముగా ఉండాలి (మలాకీ 3:6) పాత నిబంధనలో పాపము చేయువాడు మరణించును (యెహె 18:4, 20) దేవుడు అపరాదిని నిర్ధోషిగా ఎంచడు (నిర్గమ 23:7). పతనమైన మానవుని పట్ట దేవుని ప్రేమ ఎంతో గొప్పది. దేవుడు మానవుడిగా మారి, ధర్మశ్శాస్త్రమును నెరవేర్చి పతన మానవుని స్థానంలో మరణించెను యేసులో ప్రేమ మరియు న్యాయము కలుసుకొనెను (26వ)

"పూర్వము చేసిన పాపములను ఓరిమి వలన ఉపేక్షించి"

"గతములో దేవుడు సహనము కలిగి, పాపమునలు చూసి చూడనట్టుగా ఉండెను"

"గతములో పాపమును శిక్షింపబడకుండా ఉండెను"

"ఉపేక్షించెను" అన్న పదము పరెసిస్, క్రొత్త నిబంధనలో ఇక్కడ మాత్రమే వాడబడినది. గ్రీకు పితరులు మరియు జెరోమ్ వీటిని గ్రీకు అక్షరార్ధముగా "ఒక ఋణమును క్షమించుట" (మౌల్టన్ & మిల్లిగాన్ పే. 493) పెరైమి క్రియారూపము

- **"ప్రక్కకు వెళ్లెటట్లుచేయు"** లేక "విశ్రాంతికి" (లూకా 11:42) క్రీస్తు భవిష్యత్ కార్యమును చూసి గతంలో దేవుడు పాపములను క్షమించెనా లేక పాపములను చూసి చూడనట్టు ఉండెనా? ఫలితం ఒక్కటే. మానవ పాపము, గతము, ప్రస్తుతము మరియు భవిష్యత్‌లోని క్రీస్తు యొక్క యాగము వ్యవహరిస్తుంది.

  క్రీస్తు కార్యము వైపు చూసిన దేవుని గత కార్యము (అపొ 17:30; రోమా 4:15; 5:13) అదేవిధ:గా ప్రస్తుతము మరియు భవిష్యత్ దేవుడు పాపమును తేలికగా తీసుకొనలేదు, తీసుకోడు కాని మానవ తిరుగుబాటు దేవునితో సహవాసము చేయుటకు అడ్డుగా ఉన్న దానికి క్రీస్తు యాగమును ఔషదముగా అంగీకరించెను.

  **3:26 "నీతి"** అన్నపదము 25వ లోనిది "న్యాయము" మరియు "న్యాయాధిపతి" అన్న 26వలోని పదమునకు ఉత్పత్తి మూలంగా సంబంధం కల్గియున్నది. క్రీస్తునందు విశ్వాసముంచుట ద్వారా విశ్వాసులు దేవుని నీతిని ప్రతిబింబించాలని ఆశిస్తున్నాడు. (2కొరి 5:21) అదేవిధంగా విశ్వాసులు యేసునివలె మార్చబడాలని దేవుడు ఆవిస్తున్నాడు (రోమా 8:29)

**ప్రత్యేక అంశం 1:17లో చూడండి**

- **(నవీన) వాక్యము : 3:27-30**

  కాబట్టి అతిశయాస్పదమెక్కడ? అది కొట్టి వేయబడెను. ఎట్టి న్యాయమును బట్టి అది కొట్టి వేయబడెను? క్రియా న్యాయమును బట్టాయా? కాదు, విశ్వాస న్యాయమును బట్టియే 29. కాగా ధర్మశాస్త్రసంబంధమైన క్రియలు లేకుండా విశ్వాసము వలననే మనుష్యులు నీతిమంతులుగా తీర్చబడుచున్నారని యెంచుచున్నాము. 29. దేవుడు యూదులకు మాత్రమే దేవుడా, అన్యజనుల కొరక దేవుడు కాడా? అవును అన్యజనులకు దేవుడే. 30. దేవుడు ఒకడే గనుక ఆయన సున్నతి గలవారిని విశ్వాస మూలముగాను, సున్నతి లేని వారిని విశ్వాసము ద్వారాను నీతిమంతులుగా తీర్చును.

  **3:27 "కాబట్టి అతిశయమెక్కడ?"** ఇది యూదుల గర్వమును సూచించవచ్చు (2:17, 23) సువార్త సాత్వికమైనది. పతన మానవులు (యూదులు & అన్యులు ః) వారికి వారు సహాయము చేసుకోలేరు. (ఎఫెసి 2:8-9) ప్రత్యేక అంశం 2:17లో అతిశయంను చూడండి.

  **"అదికొట్టివేయబడెను"** ఈ పతము ఎక్ (బయట) మరియు క్లెయా (మూయుట) ఇది ఇక్కడ మరియు గలతీ 4:17లో ఉపయోగించబడినది. అక్షరార్ధముగా "మూయబడుట" అని అర్ధం.

- **శ్వాస నియమము వలననే"** దేవుని నూతన నిబంధన పనుల వలన కాదుగాని దేవుని కృపగల వాగ్దానములను నమ్ము వలననే పాత మరియు క్రొత్త నిబంధనలు పతన మానవులను దేవుని గుణములోనికి మార్చుటకొరకు వాడబడినవి. పాతది, బాహ్య ధర్మశాస్తమువలన, క్రొత్తది నూతన హృదయము వలన (యెహె 36:26-27) గురి ఒక్కటే.

  **3:28 "దర్మశాస్త్ర సంబంధ క్రియలు లేకుండా విశ్వాసము వలననే మనుష్యులు నీతిమంతులుగా తీర్చబడుచున్నారని యెంచుచున్నాము.** ఇది 3:21-26 యొక్క సంగ్రహము మరియు 4-8 అ.ల ముందు చిత్రము (2తిమో 1:9; తీతు 3:5) క్రీస్తు సంపూర్తి కార్యము నందు విశ్వాసముంచుట ద్వారా రక్షణ ఉచిత బహుమానము (3:24; 5:15, 17; 6:23; ఎఫెసి 2:8-9) కాని పరిపక్వత, విధేయత జీవితమును, పరిచర్యను మరియు ఆరాధనను కోరుతుంది (గలతీ 5:6; ఎఫెసి 2:10; ఫిలి 2:12; మరియు 185 నోట్ చూడండి.

  **3:29** దేవుని స్వరూప మందు చేయబడిన మానవులను విమోచించటమే దేవుని "ఉద్దేశ్యము (ఆది 1:26; 5:1; 9:6) ఆది 3:15 యొక్క విమోచన వాగ్దానము అందరికి. లోకమును ఏర్పాటు చేసుకొనుటకు ఆయన అబ్రాహామును ఎన్నుకొనెను (ఆది 12:31; నిర్గమ 19:4-6; యోహాను 3:16)

  ఈ వచనము 3:9లో వలె రోమా సంఘములోని తన్యతను వివరిస్తుంది 9-11 అధ్యాయములు కూడా ఇదే సమస్యను ప్రస్తావిస్తున్నవి.

**3:30**

NASB **"దేవుడు ఒక్కడే"**

NKJV **"దేవుడు ఒక్కడే కాబట్టి"**

NRSV **"దేవుడు ఒక్కడైయున్నాడు"**

TEV **"దేవుడు ఒక్కడు"**

JB **"ఒకే ఒక్క దేవుడైయున్నాడు కాబట్టి"**

ఇది మొదటి తరగతి షరతులతో కూడిన వాక్యమై గ్రంథకర్త దృక్పదము నుండి సత్యమై తన సాహిత్య ఉద్దేశ్యం కొరకు వాడబడినది. ఒకేఒక్క దేవుడు ఉండినట్టయితే, ఆదేవుడు అందరికి దేవుడైయుండాలి. (నిర్గమ 8:10; 9:14; ద్వితి 4:35, 39; 6:4; 1సమూ 2:2; 2సమూ 7:22; 22:32; 1రాజులు 8:23; కీర్తన 86:8, 10; యెషయా 43:11; 44:6, 8; 45:6-7, 14, 18, 21-22; 46:5,9; యిర్మియా 2:11; 5:7; 10:6; 16:20)

**"ఆయన సున్నతిగల వారిని విశ్వాసము ద్వారా"** "నీతిమంతులుగా చేయు" అన్న పదము గ్రీకులో "నీతి" నుండి వచ్చినదే ప్రత్యేక అంశం 1:17లో చూడండి. దేవునితో సరిఅగుటకు ఒకేఒక్క మార్గాము (రోమా 9:30-32) రక్షణ కొరకు రెండే రెండు పద్దతులు విశ్వాసము మరయు మారు మనస్సు (మార్కు 1:15; అపో 3:16, 10; 20:21; 1:5లో నోట్ చూడండి) ఇది యూదులకు మరియు అన్యులకు ఒక్కటే.

**"విశ్వాసము వలన.... విశ్వాసము ద్వారా"** ఈ రెండు పదముల మద్య స్పష్టమైన సమరూపం కలదు. ఎక్ మరియు డైయా అన్న విభక్తులు సాదృశ్యంగా వాడబడినవి వ్యత్యాసము కోరబడలేదు.

| |
|---|
| **NASB (నవీన) వాక్యము 3:31** |
| **31. విశ్వాసము ద్వారా ధర్మశాస్త్రము నిరర్ధకము చేయుచున్నామా? అట్లనరాదు; ధర్మశాస్త్తమును స్థిరపరచుచున్నాము.** |

**3:31**

**NASB "విశ్వాసము ద్వారా ధర్మశాస్తములు నిరర్ధకము చేయుచున్నామా?**

**NKJV "విశ్వాసము ద్వారా ధర్మశాస్తములు నిరర్ధకము చేయుచున్నామా?**

**NRSV "విశ్వాసము ద్వారా ధర్మశాస్తములు నిరర్ధకము చేయుచున్నామా?**

**TEV "విశ్వాసము ద్వారా ధర్మశాస్తములు నిరర్ధకము చేయుచున్నామా?**

**JB "విశ్వాసము ద్వారా ధర్మశాస్తములు నిరర్ధకము చేయుచున్నామా?**

క్రొత్తనిబంధన, పాత నిబంధనను రెండు రీతులుగా చూసిస్తుంది. (1) ఇద దైవ ప్రేరితము దేవుడిచ్చిన ప్రత్యక్షత ఎన్నిటికిని గతించదు (మత్తయి 5:17-19; రోమా 712, 14, 16) మరియు (2) పాతగిలి గతించిపోయెను (హెబ్రీ 8:13)

పౌలు సుమారు 25 సార్లు నిరర్ధకము అన్న మాటను ఉపయోగించినదు ఇది "శున్యముగా, పనిక మాలినదిగా చేయటం" "శక్తిహీనపర్చటము లేక "ఏ ప్రభావం చేయనిదిగా చేయుటము" అని అనువాదం చేయబడింది. పౌలునకు ధర్మశాస్త్రము చాలా శిక్షకుడు (గలతీ 3:23) మరియు చెర (గలతీ 3:24) కాని నిత్యజీవము ఇవ్వలేక పోయినది. (గలతీ 2:16, 19, 3:19 ఇది మానవుని శిక్షకు ఆదారము (గలతీ 3:13; కొలస్సి 2:140 మోషే ధర్మశాస్తము "మంచిచెడుల వృక్షము) వలె ఆది ప్రత్యక్షత మరియు నైతిక పరీక్ష.

పౌలు ధర్మశాస్త్ర బోధగురించి అనిశ్చయత కలదు. (1) ఇది యూదుల ఆచార్యముల వ్యవస్థ (2) అన్యజనులు క్రీస్తునందు విశ్వాసముంచుట ద్వారా రక్షణ మార్గము; లేక (3) మానవులందరూ పడిపోయే ఒక ప్రయాణము (రోమా 1:18-3:20; 7:7-25; గలతీ 3:1-20)

▣ **"మనము ధర్మశాస్త్రమును స్థిరపరుచుచున్నాము"** ముందు వాక్యపు వెలుగులో ఇది ఏమని అర్ధమిస్తుంది. ఇది(1) ధర్మశాస్త్రము రక్షణకు మార్గము కాదుగాని ఒక నైతిక మార్గదర్శిని; (2) ఇది "విశ్వాసమును బట్టి నీతిమంతులుగా తీర్చబడుట (2) ఇది "విశ్వాపమును బట్టి నీతిమంతులుగా తీర్చబడుట; 3:21; 4:3 (ఆది 15:6; కీర్తన 32:1-2; 10-11)

ధర్మశాస్త్ర బలహీనత (మానవ తిరుగుబాటు, రోమా 7; గలతీ 3) క్రీస్తు మరణమతో సంపూర్తిగా ధర్మశాస్త సంతృప్తి తిరుగుబాటు:, రోమా 7; గలతీ 3) క్రీస్తుసంతాఃఖై×48:3-4 3:1-2, 10-11

ధర్మశాస్త్రము దేవుని నితిని ఇది మానవ ప్రయత్నాలు కత్తనషయలు -కౌసత్వలు నీతివంతమైన దూవిక జీవితమును జీవించుదురు. ధర్మ శా-పసు అరి నెరవ్చేబడినది . ఇది మాన ప్రతయత్నం అ కాదుగాని క్రీస్తులో దేవుని ఉచిత కృపాదానము వలననే

**ప్రత్యేక అంశం : 5:2లోని చూడండి**

**చర్చాప్రశ్నలు :**

ఇది ధ్యాన మార్గదర్శక వ్యాఖ్యానం కావునా బైబిల్ యొక్క మీ స్వంత వ్యాఖ్యానమునకు మీరు భాద్యులు. మనమందరం మన కివ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, బైబిల్ మరియు పరిశుద్ధాత్మ భావ వ్యక్తీకరణలో ప్రముఖులు నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు దానిని విడిచి పెట్టకూడదు. ఈ పుస్తకంలోని బహుళ విషయములను ఆలోచించుటకు ఈ చర్చా ప్రశ్నలు సహాయపడతాయి. అవి ఆలోచింపజేసేవే కాని, నిశ్చితమైనవి కావు.

1. రోమా 3:21-31 నీ స్వంత మాటలలో వివరించడి ?
2. గతంలో దేవుడు ఎందుకు పాపములను ఉపేక్షింయెను ఎలా రక్షింపబడ్డారు (25వ.)
3. పాత నిబంధన విశ్వాసులు పాపమునుండి ఎలా రక్షింపబడ్డారు (3:25)
4. యేసు నందు విశ్వాసము ధర్మశాస్త్రమును ఎలా నెరవేర్చినది (3:31) ?

# ద్వితీయోపదేశకాండము - 4వ అధ్యాయము

నవీన అనువాదముల యొక్క వాక్య విభజన

| UBS | NKJV | NRSV | TEV | JB |
|---|---|---|---|---|
| అబ్రహాము యొక్క<br>ఉదాహరణ | అబ్రహాము విశ్వాసమును<br>బట్టినీతిమంతుడుగా<br>తీర్చబడెను | అబ్రహాము విశ్వాసమును<br>బట్టి నీతిమంతుడుగా<br>తీర్చబడెను | అబ్రహాము యొక్క<br>ఉదాహరణ | అబ్రహాము<br>విశ్వాసమునుబట్టి<br>నీతిమంతుడుగా<br>తీర్చబడెను |
| 4:1-12 | 4:1-4 | 4:1-8 | 4:1-8 | 4:1-8 |
| | దావీదు ఈ సత్యమును<br>బట్టి సంతోషిస్తున్నాడు | | | సున్నతికి ముందే<br>అ(2) హాము నీతి<br>మంతుడుగా<br>తీర్చబడెను |
| | | 4:5-8 | | |
| | | సున్నతికి ముందే<br>అబ్రహాము నీతిమంతుడు<br>గా తీర్చబడెను | | |
| | 4:9-12 | 4:9-12 | | 4:9-12 |
| విశ్వాసంవలన<br>వాగ్దానము గుర్తించబడినది | విశ్వాసం ద్వారా<br>వాగ్దానం ఇవ్వబడినది | అబ్రహాము<br>యొక్క నిజ సంతానం | దేవుని వాగ్దానం<br>స్వీకరించబడింది | ధర్మశాస్త్రంనకు<br>విధేయత ద్వారా<br>నీతిమంతుడుగా<br>తీర్చబడలేదు |
| 4:13-25 | 4:13-25 | 4:13-15 | 4:13-15 | 4:13-17 |
| | | 4:16-25 | 4:16-25 | అబ్రహాము<br>యొక్క విశ్వాసం<br>క్రైస్తవ విశ్వాసంనకు<br>మాదిరి |
| | | | | 4:18-25 |

వాక్యపు పరిధి యొద్ద అసలైన గ్రంథకర్త ఉద్దేశ్యంను అనుసరించుట....

ఈ వ్యాఖ్యానం చదువుటకు ఉపయోగపడే మార్గదర్శిని......

కావున బైబిల్ యొక్క వ్యాఖ్యానమును నీవు సొంతంగా చేసుకొనుటకు భాద్యుడవు. మనమందమం మనకు ఇవ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, పరిశుద్ధ గ్రంథం మరియు పరిశుద్ధాత్మ వ్యాఖ్యానంలో ప్రాధాన్యత వహించవలెను. దీనిని నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు విడిచిపెట్టకూడదు.

అధ్యాయమంతటినీ ఒకేసారి చదవాలి, అంశాలను గుర్తించాలి. నీ అంశ విభజనము పైన ఇవ్వబడిన నవీన అనువాద విభజనలతో సరి పోల్చుకోవాలి. విభజన అనేది ప్రేరణ కాదు. కాని ఇది అసలు గ్రంధకర్త యొక్క ఉద్దేశ్యమును తెలుసుకొనుటకు ఉపయోగపడును వ్యాఖ్యానమునకు ఇది కేంద్రమై వున్నది. ప్రతి వాక్య విభజనకే ఒక్క విభజనను కలిగి ఉండును.

1. మొదటి వాక్య భాగం
2. రెండవ వాక్య భాగం
3. మూడవ వాక్య భాగం
4. మొదలగునవి.

**సందర్భోచిత తలంపులు**

ఎ. 3:21-31లోన పౌలు వేదాంతము. పతనమైన మానవుడు ధర్మశాస్త్రము నుండి కాక దేవునితో సరి అవ్వుట ఒక ఉచిత బహుమానం అని ధృవీకరించింది. పౌలు ఇప్పుడు ఇది ఎదో క్రొత్తగా కనిసెట్టినదికాదు అని నిరూపించుటకు అబ్రహము దావీదు ఉదాహరణల ద్వారా నిరూపించుటకు ప్రయత్నం చేస్తున్నాడు (3:216) 6-8వ)

బి. రోమా 4, విశ్వాసం ద్వారా నీతిమంతులుగా తీర్చబడుల అన్న సిద్ధాంతమునకు మోషే ధర్మశాస్త్రము, ఆది-ద్వితి నుండి ఋజువలను తీసుకొనుచున్నాడు. ఇది 3:21-31లో సంగ్రహించబడినది. యూదులకు, మోషే రచనల నుండి ఉదహరించబడిన మాటకు ఎంతో విలు, ప్రత్యేకంగా యూదుల దేశమునకు తండ్రిగా చూడబడుచున్న అబ్రహామునకు సంబంధించిన వాటికి దావీదురానున్న మోస్సీ యోగా చూడబడుతున్నాడు (2సమూ7)

రోమాలోని విశ్వసించిన యూదులకు మరియు విశ్వసించిన అన్యజనులకు మధ్య ఉన్న తన్యత ఈ సందర్భమునకు సూచన. యూదుల నాయకులు రోమాను విడిచడిపెట్టుటకు క్లాడియస్ చేత బలవంతం చేయబడి ఉండవచ్చు. వారికి బదులుగా అన్యజన క్రైసత్వవులు ఉంచబడినారు. మొదటిగుంపు తిరిగి రావటంతో ఎవరూ నాయకత్వపు స్థానంలో ఉండాలన్నది వివాదమునకు కారణమైనది.

సి. రోమా 4, పతనమైన మానవులు వారికి కలిగిన ఆత్మీయ వెలుగునకు సంబందించి విశ్వాసము మరియు మారు మనస్సు ద్వారా రక్షింపబడుదురు. అని చూసిస్తుంది. (ఆది 15:6; రోమా 4:3) చాలా రీతులుగా క్రొత్త నిబంధన (సువార్త) పాత నిబంధన నుండి తీవ్రమైన వ్యత్సాసం కలది కాదు. యిర్మియా 31:31-34; యెహె 36:22-38

డి. ఈ నీతి మార్గము కేవలము పితరులకు, లేక ఇశ్రాయేతు జనాంగమునకు కాదగాని అందరికి ప్రవేశం కలదు. పౌలు తన వేదాంత వాదనను అబ్రహమును ఉపయోగించుకొని వృద్ధి మరియు వ్యాప్తి పరుచుకొనుచున్నాడు. దీనిని తన మొదట పుస్తకం గలతీతో ప్రారంభించినాడు (గలతీ-3)

**పద మరియు వాక్యద్యానం**

NASB (నవీన) వాక్యము : **4:1-8**

**కాబట్టి శరీరము విషయమై మన మూలపురుషుడగు అబ్రహముకేమి దొరికెనని అందుము? 2. అబ్రహము క్రియల మూలముగా నీతిమంతుడని తీర్చబడిన యెడల అతనికి అతిశయా స్పదము కలుగును గాని అది దేవుని యెదుట కలుగదు. 3 లేఖనమేమి చెప్పుచున్నది? అబ్రహము దేవుని నమ్మెను, అది అతనిని నీతిగా ఎంచబడెను. 4పని చేయువానికి జీతము ఋణమేగాని దానమని యెంచబడదు. 5 పనిచేయక భక్తిహీనుని నీతిమంతునిగా తీర్చువాని యందు విశ్వాసముంచు వానికి వాని విశ్వాసము నీతిగా ఎంచబడుచున్నది. 6. ఆ ప్రకారమే క్రియలు లేకుండా దేవుడెవనిని నీతిమంతుడిగా ఎంచునో ఆ మనుష్యుడు ధన్యుడని దావీదు కూడా చెప్పుచున్నాడు. 7. ఏలాగనాగా - ఎవరి అక్రమములు క్షమించబడెనో ఎవరి పాపములు కప్పివేయబడెనో వారు ధన్యులు 8. ప్రభువు ఏమనుష్యుని గూర్చి పాపమును ఎంచాడో వాడు ధన్యుడు**

**4:1 "మన మూలపురుషుడగు అబ్రహముకు ఏమందము"** అబ్రహము అన్న పేరునకు "జనములకు తండ్రి" అని అర్థం. (16-18) అతని అసలు పేరు, అబ్రాము అనగా "హెచ్చింపబడిన తండ్రి".

ఇక్కడ వాడబడిన సాహిత్య సాంకేతమును డైట్రాబ్ అందురు (4:1; 6:1; 7:7; 8:31; 9:14, 30) అబ్రహమును (ఆది 11:27-25:11) ఉదాహరణగా ఉపయోగించుటకు గల కారణములు (1) యూదులు, జాతిమూలమునకు అధిక ప్రధాన్యతనిచెదరు (మత్తయి 3:9;

యోహాను 8:33, 37, 39); (2) ఆయన వ్యక్తిగత విశ్వాసము నిబంధన మాదిరిని ఉదహరిస్తుంది (ఆది 15:6); మరియు (3) ఆయన విశ్వసము మోషేకు ధర్మశ్శాస్త్రము ఇచ్చుటకు నడిపించింది. (నిర్గమ 19-20)

**4:2 "యెడల"** ఇది మొదటి తరగతి షరతులు వాక్యమై (ఎ.టి. రోబర్డ్‌సన్, వర్డ్ పిక్చర్స్, పుట.4, 350 పే), గ్రంధకర్త దృక్పదము నుండి నిమ తన సాహిత్య ఉద్దేశ్యం కొరకు వాడబడినది. ఇది మంచి ఉదహరణై నిజంగా అది ఒక అసత్యమై, ఒక వేదాంత అంశంను చేయుటకు సహాయపడును. (14వ)

జోషఫ్ ఎ. ఫిట్‌జమర్, దా ఎంకర్ బైబిల్, 33వ సంపుటి 372పే, ఇది ఒక మిశ్రమ షరతుల వాక్యంగా, మొదటి భాగం రెండవ తరగతి (సత్యమునకు విరోదంగా), రెండవ భాగం మొదటి తరగతిగా చెప్పబడుతుంది.

- **"క్రియల మూలంగా నీతిమంతుడని తీర్చబడితే"** క్రీస్తునందు విశ్వాసం వలన నీతిమంతుడుగా తీర్చబడుటకు ఇది విరోదము. మానవ సామర్ధ్యములతో రక్షణ మార్గము ఇది (4:4), సాధ్యమైతే క్రీస్తు పరిచర్యను అనవసరంగా చేసేది. ఎలాధైననూ పతనమైన మానవులు దేవుని నిబంధన కార్యమును నెరవేర్చులేని అసమర్ధతను పాత నిబంధన స్పష్టంగా చూపిస్తుంది. కాబట్టి పాత నిబంధన ఒక శాపముగా, మరణశిక్షగా మారింది (గలతీ 3:13, కొలస్సీ 2:14) యూదుల పండితులు ధర్మశాస్త్రమునకు ముందే అబ్రహాము ఉండెనని ఎరుగుదురు. కాని ఆయన ధర్మశ్శాస్త్రమునకు కొరకు ఎదురు చూసి దానిని నెవవేర్యెనని నమ్మెదరు (ప్రసంగి 44:20 మరియు జూబీలీస్ 6:119, 15:1-2).

**"అతనికి అతిశయ స్పదము కలుగును"** ఈ అంశం పైలు రచనలలో తరుచుగా కనిపిస్తుంది. అతని పరిసయ్య వెను చిరత్ర ఈ సమస్యకు అతనిని శీఘ్రగ్రాహకం చేసింది. (3:27, 1కొరింది 1:29; ఎఫెసి 2:8-9). 2:17లోని అతిశయం అన్న అంశంను చూడండి

**4:3 NASB, NKJV, NRSV, TEV "అబ్రహాము దేవుని నమ్మెను"**

**JB "అబ్రహాము దేవుని యందు విశ్వాసము ఉంచెను"**

ఇది ఆది 15:6లో నుండి వాక్యం. ఈ అద్యాయంలో మూడుసార్లు పౌలు దీనిని ఉపయోగించినదు. (4:3, 9, 22) ఇది పౌలు యొక్క రక్షణకు సంబంధించిన వేదాంతమునకు ప్రాముఖ్యతను చూపిస్తుంది. "విశ్వాసము"నకు పాతనిబంధనలో విధేయత, స్థిరత్వం, నమ్మకత్వంగా ఇవి దేవుని స్వభావమే తప్ప మనవి కాదు అని అర్ధమిస్తుంది. ఇది హీబ్రూ పదము (ఈమున్, ఈమునా) అనగా "నిశ్చయముగా లేక స్థిరంగా" అని అర్ధము. రక్షించే విశ్వాసము, మానసిన ఒప్పుదల (సత్యముల వరుస), చిత్తము యొక్క తీర్మానము (ఒక నిర్ణయం), నైతిక జీవితం (ఒక జీవిత విధానం), ప్రాధమికమైన సంబంధాలు (ఒక వ్యక్తిని ఆహ్వానించుటం) అని చెప్పబడుతుంది. అబ్రహాము యొక్క విశ్వాసము భవిష్యత్ మెస్సియాపైన కాదని వక్కానించబడాలి. అబ్రహాము విశ్వాసముఆయన ఒక బిడ్డను మరియు సంతానమును కల్గిఉంటాడు. అన్న దేవని వాగ్దానం పైన ఉంది (ఆది 12శ2; 15:2-5; 17:4-8; 18-14) అబ్రహాము దేవుని యందు విశ్వాసముంచుట ద్వారా ఈ వాగ్దానమునకు స్పందించినాడు. ఆయనకు ఈ వాగ్దానము నిమిత్తం అనుమానాలు మరియు సమస్యలుండేవి. ఎలాగైననూపట్టింది. అతని అసంపూర్ణ విశ్వాసం దేవునికి అంగీకారమైనది. దేవునికి, దేవుని వాగ్దానమునకు విశ్వాసంతో స్పందించే పొరబాటు కల మానవులతో పనిచేయుటకు దేవుడు ఇష్టపడుతున్నాడు. ఆ విశ్వాసం ఆవగింజ అంత చిన్నదైన సరే (మత్తయి 17:20) 4:3,4,5,6,8,9,10,22,23,24

**NASB, NRSV "అది అతనికి ఎంచబడెను"**

**NKJV "అది అతనికి జమచేయబడింది"**

**TEV "దేవుడు అంగీకరించెను"**

**JB "ఈ విశ్వాసము పరిగణించబడింది"**

- **"ఇ అది"** దేవుని వాగ్దానంలలోని అబ్రహాము విశ్వాసమును సూచిస్తుంది.

- **"ఎంచబడెను"** (లోగిజోమై) అనేది లెక్కల పదము. దీని అర్ధం "మోపబడినది" ఒకనికి జమ చేయబడింది (ఎల్‌ఎక్స్ఎక్స్ ఆది 15:6; లేవి 7:18; 17:4) ఇదే సత్యము 2కొరింది 5:21 మరియు గలతీ 3:6లో సుందరంగా వ్యక్తపర్చబడింది. పౌలు ఆది 15:6 మరియ కీర్తన 32:2ను కలిసియుండవచ్చు. ఎందుకంటే ఈ రెండునూ "ఎంచబడెను" అనే లెక్కల పదమును వాడినవి. ఇటువంటి వాక్యముల మిళితము అనేఇ రబ్బీలు ఉపయోగించే వ్యాఖ్యాన శాస్త్ర సూత్రంగా ఉంది. గ్రీకు బైబిల్‌లో ఈ పాత నిబంధన పదము పుస్తకమును ఉంచుట అన్న బ్యాంకింగ్ పదముగా కాకుండా, "గ్రంథములు"నకు సంబంధించి ఉంపడవచ్చు. దాని 7:10; 2:1; ఈ రెండు రూపక అలంకార పుస్తకములు (దేవుని జ్ఞాపకార్ధ గ్రంధములు) అవి.

1. క్రియల గ్రంథ: లేక జ్ఞాపకార్థపు గ్రంథ: (కీర్తన 56:8; 139:6; యెషయా 65:6; మలాకీ 3:16; ప్రక 20:12-13)
2. జీవ గ్రంథం (నిర్గమ 32:32; కీర్తన 69:28; యెషయా 4:3; దాని 12:1; లూకా 10:20; ఫిలిప్పి 4:3; హెబ్రీ 12:23 ప్రక 3:5; 13:8; 17:8; 20:15; 21:27)

"జీవగ్రంథం"లోనికి అబ్రహాము విశ్వాసము దేవుని నీతిగా ఎంచబడింది. 4:3, 5, 6, 9, 10, 11, 13, 22, 25 "నీతిగా" ఇది పాత నిబంధనపరమైన "కొలిచేరెల్లు" (సదక్)ను సూచిస్తుంది. ఇది దేవుని గుణము కొరకు నిర్మించబడిన రూక అలంకారం. దేవుడు తిన్ననివాడు, మానవులందరు వంకరివారు. క్రొత్తనిబంధనలో ఇది హోదా సంబంధమైనదిగా, న్యాయ పరమైనదిగా దైవిక జీవిత విధానంలోనికి వెళ్ళెటటువంటి ఆశావారమైనది. ప్రతి క్రైస్తవుని కొరకు దేవుని ఆశ ఏమిటంటే, తన స్వంత గుణమును కల్గిముండాలని, ఇంకొక మాటతో చెప్పాలంటే క్రీస్తు సారూప్యంలోనిక మార్చబడటం (8:28-29) గలతీ 4:19) 1:17లోని ప్రత్యేక అంశంను చూడండి.

4:5 వ్యక్తిగత సామర్థ్యము లేక యోగ్యతపై కాకుండా తనను ప్రత్యక్ష పర్చుకొనే దేవునికి స్పందించటమే విశ్వాసము యొక్క మూలం ఒకసారి రక్షింపబడి, ఆత్మనింపుదల కల్గియుండిన తరువాత మన జీవి విధానం అంత ప్రాముఖ్యం కాదు అని సూచించకూడదు. క్రైస్తవ్యం యొక్క గురి, చనిపోయినప్పుడు పరలోకం కాదు, గాని ఇక్కడ క్రీస్తు వంటి సారూప్యం కల్గిముండటం మనం రక్షింపబడలేదు. నీతిమంతులుగా వీర్చబడ్డాం. లేక మన పనుల వలన సరిగా నిలువబడుట కొరకు, సత్క్రియ కొరకు విమోచింపబడ్డాం. (ఎఫెసి. 2:8-9, 10; యాకోబు మరియు 1 యాకోబు మరియు 1 యెహాను) ఒకడు రక్షింపబడెను. అనుటకు మార్పు చెందిన మరియు మార్పు చెందుతున్న జీవితమే ఋజువు.

▣ **NASB, NKJV "అతని విశ్వాసము"**

**NRSV "అటువంటి విశ్వాసము"**

**TEV, NJB "అది ఈవిశ్వాసము"**

అబ్రహాము విశ్వాసము అతనికి నీతిగా ఎంచబడింది. ఇది అబ్రహాము పనులను బట్టి కాదు గాని స్వభావమును బట్టియే. "ఎంచబడెను" అన్నమాట గ్రీక బైబిల్‌లోని ఫినెహాస్ యొక్క కీర్తన. 106:31, (ఇది సంఖ్యా 25:11-13ను సూచిస్తుంది)లో కూడా ఉపయోగించబడింది. ఈ సందర్భంలో ఈ మాట ఫినెహాస్ పనివలన అని చెప్పబడింది. కాని అబ్రహాము విషయంలో ఇలాకాదు ఆది 15:6

▣ **"భక్తిహీనుని నీతిమంతునిగా తీర్చువానియందు విశ్వాసముంచు వానికి వాని విశ్వాసము నీతిగా ఎంచబడుచున్నది."** ఇది 3వలోని అబ్రహామునకు సాదృశ్యం (ఆది 15:6) నీతి అనేది దేవుని బహుమానం కాని మానవ కార్యము కాదు.

▣ **"దావీదు"** అబ్రహాము ఏవిధంగా సంపూర్ణ వ్యక్తిగా లేక పోయిన విశ్వాసంను బట్టి దేవునితో సరిగా ఉండెనో, దావీదు కూడా అంతే (కీర్తన 32:51) దేవుని యందు (పాత నిబంధన) దేవుని కుమారుని (క్రొ॥ని॥) యందు విశ్వాసముంచు పతనమైన మానవులను దేవుడు ప్రేమించును, వారితో పనిచేయును

**4:6 "క్రియలు లేకుండా"** పాతనిబంధన (కీర్తన 32:1-2) మాటను దీనిముందు ఉంచి పౌలు నొక్కి వక్కానిస్తున్నాడు. దేవుఇని కృప వలన క్రీస్తు ద్వారా, వ్యక్తిగత విశ్వాసమును బట్టియే మానవుడు దేవునితో సరిఅగును కాని వాని మతపరమైన కార్యములను బట్టికాదు.

**4:7-8** ఇది కీర్తన 32:1-2లోని యొక్క వాక్యము 7వలోని క్రియలు రెండునూ, "క్షమించబడెనో" మరియు "కప్పివేయబడెనో" అనేవి ఆరిస్ట్‌పాసివ్ దేవుడు చేసే వ్యక్తిగా కనిపిస్తుంది. 8వ వచన& రెండింతు వ్యతిరేకం "ఏ పరిస్థితిలోనైన జరుగని" తీర్చబడిన, ఎంబబడిన, లెక్కలోనికి తీసుకొనిన అనిఅర్థం. ఈ మాటలోని మూడు క్రియలను గమనించండి, అన్నియూ పాపపు నిర్దోషమైనవిగా చూపిస్తున్నవి.

**4:7 "ఎవనిపాపములు కప్పి వేయబడెనో"** ఇది కీర్తన 32:1 నుండి చెప్పబడినది "కప్పివేయుట" అన్న అభిప్రాయం ఇశ్రాయేలు యొక్క పూజా బలివ్యవస్థకు కేంద్రం. దేవుడు పాపమును కప్పి వేయుట ద్వారా, అది అదృశ్యమైనట్టు దేవుడు చేస్తాడు. (బ్రౌన్, డ్రైవర్, బ్రిగ్స్ 491పే) ఇదే అంశం, వేరే హీబ్రూ పదమైన (కఫార్), ప్రాయశ్చితార్ధ దినమందు, కరుణాపీఠము మీద ఉంచబడిన రక్తము ఇశ్రాయేటు పాపములను కప్పివేసే పద్ధతిగా చూపబడింది. బైబిల్ సంబంధ రూపక అలంకారము ఒకని పాపమును చెరిపి వేయటం లేక తుడిచి పెట్టడం.

**4:8 "ప్రభువు ఏ మనుష్యుని గూర్చి పాపమును ఎంచాడో వాడు ధన్యుడు"** ఇది కీర్తన 32:2 నుండి చెప్పబడింది. ఈ పదము "ఎంచబడుట" "మోపబడుట" లేక "జమ చేయబడుట" అనే వ్యతిరేఖ శ్రావనతో వాడబడుతుంది. విశ్వాసుల ఆత్మీయ బ్యాంక్ లోనికి

పాపములను చేర్చదు; దేవుడు నీతిని చేర్చుతాడు. ఇది దేవుని గుణము, బహుమానం, మరియు నిశ్చయంపైన గాని మనావ యోగ్యత, సాధన లేక విలువపై ఆధారపడదు.

NASB (నవీన) వాక్యం : **4:9-12**

**9. ఈ శుభవచనం సున్నతిగలవారిని గూర్చి చెప్పినదా సున్నతి లేని వారిని గూర్చి కూడా చెప్పినదా? అబ్రహాము యొక్క విశ్వాసము అతనికి నీతి అని యెంచబడెనను చున్నాము గదా? 10. మంచిది; అది పస్థితియందు ఎంచబడెను? సున్నతి కలిగియుండినప్పుడా సున్నతి లేనప్పుడా? సున్నతి కలిగియుండిన్పుడు కాదు సున్నతి లేనప్పుడే 11 మరియు సున్నతి లేని వారైననూ, నమ్మిన వారికందరికి అతడు తండ్రి యగుట వలన వారికి నీతి ఆరోపించుటకై, అతడు సున్నతి పొందక మునుపు, తనకు కలిగిన విశ్వాసమువలనైన నీతికి ముద్రగా, సున్నతి అను గురుతు పొందెను. 12 మరియు సున్నతి గల వారికిని తండ్రి యగుటకు, అనగా సున్నతి మాత్రము సొందిన వారుగాక, మన తండ్రియైన అబ్రహాము సున్నతి పొందక ముపు అతనికి కలిగిన విశ్వాసము యొక్క అడుగు జాడలను బట్టి నడుచుకొనిన వారికి తండ్రి అగుటకు అతడు ఆ గుర్తుతును పొందెను.**

**4:9-12** ఈ సున్నతి చర్చను రక్షింపబడుటకు సున్నతి అవసరం అని బోదించే జూడైజల్స్ వక్కాణము బట్టి చెప్పెను (లగీ పత్రిక మరియు అపొ. 15లోని యెరుషలేం మహాసబ)

పైలు రబ్బీల వ్యఖ్యానంలో శిక్షణ పొందినవాడై, ఆది 15:6 మరియు కీర్తన 32:2 (భీబ్రూ మరియు గ్రీకులలో కూడా ఒకే క్రియ ఉంటుందని ఎరిగినవాడై తన వేదాంత ఉద్దేశ్యం కొరకు ఈ వాక్య భాగములను కలిని ఉండువచ్చు.

**4:9** 9వ వచనం **"కాదు"** అన్న జవాబును ఆశిస్తుంది. విశ్వాసమును బట్టి దేవుడు అందరిని, అన్యజనులను కూడా అంగీకరించును. ఆది 15:6 మరళా చెప్పబడింది. ఇశ్రాయేలు పితరుడు, అబ్రహాము విశ్వాసము వలన నీతిమంతుడుగా తీర్చబడెను.

**4:10-11 "విశ్వాసము వలననైన నీతికి ముద్రగా, సున్నతి అనుగురుతు పొందెను"** అబ్రహాము పిలువబడిన తరువాత, నీతిమంతునిగా తీర్చబడిన తరువాత దేవుడు నిబంధన గురుతుగా సున్నతిని ఇచ్చెను (ఆది 17:9-14) ఎజియన్ ద్వీపముల గ్రీకు మూలం కల్గిన ఫిలీస్తీయులు తప్ప పురాతన నియర్ ఈస్ట్ ప్రజలందరూ సున్నతి పొందెవేవరు వారి సున్నతి, బాలుడు నుండి పురుషుడయ్యేటప్పుడు సున్నతి ఒక పూజా కార్యక్రమం. యూదుల జీవితంలో పుట్టిన 8 రోజుల తరువాత పురుషులకు చేసే నిబంధన సభ్యత్యంనకు సంబంమైన మత కార్యక్రమం ఈ సున్నతి ఈ వచనంలో "గురుతు మరియు "ముద్ర" సాదృశ్యంగా ఉండినవై అబ్రహాము విశ్వాసమునకు సంబంధించినవి. దేవుని యందు విశ్వాసముంచు వాని గురుతు, సున్నతి. "విశ్వాసపు నీతి" అనేది 13వ వచనంలో కూడా చెప్పబడింది. పరిశుద్ధ దేవునితో సరిఅయిన సంబంధం కల్గియుండటానికి మూలం, సున్నతి కాదు గాని విశ్వాసం.

**4:11 "సున్నతి లేని వారైననూ, నమ్మిన వారికందరికి తండ్రి అగుటకు".** గలతీ పత్రిక తరువాత రోమా పత్రిక వ్రాయబడినది. పౌలు యూదుల (1) జాతి వంశావళి పైన (మత్తయి 3:9; యెహో 8:33, 37, 39) మరియు (2) మోషే నిబంధన యొక్క ప్రస్తుతపు వ్యాఖ్యాన కలదని గుర్తెరిగినాడు. కావునా, విశ్వసించిన వారి అందరికి అబ్రహాము మాదిరిగా పౌలు చూఇనాడు (సున్నతి పొందని విశ్వాసులకు తండ్రి, గలతీ 3:7-9)

**4:12 "అడుగుజాడలను బట్టి నడుచువారికి"** ఇది సైన్యంలోని సైనికులు ఒకే వరుసలో నడుచుట కొరకై దము (అపొ 21:24; గలతీ 5:25; 6:16; ఫిలిప్పి 3:16) ఈ వచనంలో పౌలు విశ్వసించిన యూదులు (సున్నతి పొందిన)తో మాటాలాడుచున్నాడు. దేవునియందు, ఆయన వాగ్ధానమునందు విశ్వాసముంచిన వారికందిరికి అబ్రహాము తండ్రి.

రెండు ఆర్టికల్స్ కారణమున ఇది రెండవ దృశ్యం కావచ్చు. అదేవిధంగా విశ్వాసపు జీవిత విధానం కావచ్చు. రక్షణ, కొనసాగే సంబంధం కాని ఎదో ఒక నిర్ణయమే లేక మానసిక కదలికొకాదు.

NASB (నవీన) వాక్యం : **4:13-15**

**13. అతడు లోకమునకు వారసుడగునను వాగ్దానము అబ్రహాముకైననూ అతని సంతానముకైననూ ధర్మశాస్త్ర మూలముగా కలుగలేదు గని విశ్వాసము వలననైన నీతి మూలముగానే కలిగెను 14. ధర్మశాస్త్ర సంబంధము వారసులైన పక్షమున విశ్వాసము వ్యర్ధమగును, వాగ్దానము నిరర్ధక మగును. 15. ఎలయనగా ధర్మశాస్త్రము ఉగ్రతను పుట్టించును; ధర్మశాస్త్రము లేని పక్షమున అతిక్రమమును లేకపోవును.**

**4:13 "వాగ్దానము అబ్రహాముకైననూ అతని సంతానమేకైననూ"** దేవుడు అబ్రహామునకు "భూమి మరియు సంతానం" వాగ్దానం చేసెను. (ఆది 12:1-3; 15:1-6; 17:1-8; 22:17-18) పాత నిబంధన భూమిపైన (పాలస్తీనా) దృష్టినిల్పింది. క్రొత్తనిబంధన "సంతానం" (మెస్సియా యేసు, గలతీ 3:16, 19), కాని ఇక్కడ "సంతానం" విశ్వాస ప్రజలను సూచిస్తుంది (23-25వ॥లు; గలతీ 3:290 విశ్వాసులందరి విశ్వాసమునకు దేవుని వాగ్దానములు ఆధారము. (గలతీ 3:14, 17, 18, 19, 21, 22, 29; 4:28; హెబ్రీ 5:13-18)

- **"అతడు లోకమునకు వారసుడగునను"** ఈ సార్వత్రిక వాక్యము ఆది 12:3; 18:18; 22:18 మరియు నిర్గయ 19:5-6 వాక్యపు వెలుగులో చాలా ప్రాముఖ్యమూనది. మానవులందరిని పిలుచుట కొరకు దేవుడు అబ్రహామును పిలుచుకొనెను. (ఆది 1:26-27; 3:15) ఈ లోకము అంతటికి అబ్రహాము మరియు అతని సంతానము దేవుని ప్రత్యక్షత కొరకు మార్గములు ఇది భూమి మీద దేవుని రాజ్యమునకు వేరే రీతిగా సూచించటం (మత్తయి 6:10)

- **"ధర్మశాస్త్రము మూలమునగాక"** మోషే ధర్మశాస్త్రం అప్పటికింకా ప్రత్యక్షం కాలేదు. గ్రీకు బైబిల్‌లో దీని ప్రాధాన్యతను వ్యక్తర్చుటకు ఈ వాక్యమును ముందు ఉంచినారు. మానవ ప్రయత్నంనకు మరియు దేవుని కృపకు మధ్య ఉన్న వ్యత్యాసంను నొకిగి చెప్పే విషయాలలో ఇది చాలా ప్రాముఖ్యమైనది (3:21-31) కృప, ధర్మశాస్త్రమును చెల్లనిదిగా చేసి, రక్షణకు మార్గముగా దానిని చేసెను. (హెబ్రీ 8:7,130

**ప్రత్యేక అంశం : పౌలు యొక్క ధర్మశాస్త్ర అభిప్రాయాలను 13:9లో చూడండి**

**4:14 "పక్షమున"** ఇది మొదటితరగతి షరతులు వాక్యమై గ్రంధకర్త దృక్పదం నుండి సత్యమైనదిగా లేక తన సాహిత్య ఉద్దేశ్యం కొరకు వాడబడినదై యుండవచ్చు. పౌలు తన తర్కవాదన కొరక ఈ వాక్యంను వాడుచున్నాడు. ఇది సాహిత్య వక్కానింపుకొరక వాడుచున్న పదం. ఈ వాక్యం సత్యమని ఆయన సమ్ములేదు. కాని అది నిజంగా అసత్యమని చెప్పుటకు వాడినాడు. సున్నతికల యూదుల జాతీయులు లోకమునక వారసులు కారు గాని, దేవుని చిత్తము, వాక్యముపైన విశ్వాసం ఉంచిన వారు వారసులు. భౌతిక సున్నతి నిజమైన గురుతుకాదు గాని క్రీస్తునందు విశ్వాసం. (2:28-29)

- NASB, NKJV **"విశ్వాసము వ్యర్ధమగును"**
  NRSV **"విశ్వాసం శూన్యమగును"**
  TEV **"మానవుని విశ్వాసం ఏమికాదు"**
  JB **"విశ్వాసం విషయం లేనిదవుతుంది"**

ఇది బలీయమైన గ్రీక క్రియయొక్క స్థిరపరిస్థితిని నొక్కి చెప్పి "ఖాళీగా" "పునాదిలేనిదిగా" "అసత్యమయంగా" అని కూడా అరధ్మఇచ్చును (1కొరి 1:17) ఈ పదము ఇంకా పౌలుచే (1కొరి 1:17; 9:15; 2కొరి 9:3 మరియు ఫిలిప్పి 2:7)లో కూడా వాడబడినది.

- NASB **"వాగ్దానము నిరర్ధకమగును"**
  NKJV **"వాగ్దానము ప్రయోజనంలేనిదగును"**
  NRSV **"వాగ్దానం శూన్యం"**
  TEV **"దేవుని వాగ్దానము ఉపయోగం లేనిదగును"**
  JB **"వాగ్దానమునకు ఏ విలువలేదు"**

ఇదికూడా బలీయమైన గ్రీకు క్రియ యొక్క స్థిరపరిస్తితిని నొక్కి చెప్పి "ఖాళీ చేసేటట్టు" "రద్దు పరిచేటట్టు" "అంతమొందిచేటట్టు" "నాశనం" లేక లేకుండా నిషేదించు" అని అర్ధం నిచ్చును. ఈ దపము పౌలుచే (రోమా 3:3, 31; 6:6; 7:2, 6; 1కొరింది 2:6; 13:8; 15:24; 2కొరి 3:7; గలతీ 5:4; 2 థెస్స 2:8)లో కూడా వాడబడినది. రక్షణకు రెండు మార్గములు లేవు. క్రొత్త నిబంధన కృప పాత నిబంధన కార్యములను వ్యర్ధపర్చింది.

**ప్రత్యేక అంశం : శూన్యం మరియు ఖాళీ 3:3లో చూడండి.**

**4:15 ధర్మశాస్త్రము..... ధర్మశాస్త్రము**

మొటి పదమునకు ఆర్టికల్ ఉన్నది. రెండవ పదమునకు లేదు. గ్రీకు ఆర్టికల్ ఉండా, లేదా అని నొక్కి చెప్పటం ప్రమాదకరం కాని ఈ సందర్భంలో ఇది సహాయకారిగా కనిపిస్తుంది. ఈ పదమును పౌలు రెండు భావననలతో ఉపయోగించుచున్నాడు. (1) మోషే ధర్మశాస్త్రము మరియు దాని సాంప్రదాయాల వలన రక్షింపబడవచ్చునని కొంతమంది దానినినమ్ముచున్నారు (2) సాధారణ న్యాయవిధి. ఈ భావన స్వనీతి పరుతైన అన్యజనులు వారి సాంఘిక నైతిక న్యాయ, మత పద్ధతులను పాటింఇ వారి దేవతలచే అంతీకరించబడవచ్చు అనువార్ని సూచిస్తుంది.

- **"ధర్మశాస్త్రము ఉగ్రతను పుట్టించు"** ఇది భయం గొలిపే వాక్యం. (3:20; గలతీ 3:10–13; కొలస్సీ 2:14)మోషే ధర్మశాస్త్రం ఎన్నడును రక్షణ సాధనంగా పరిగణించబడలేదు. (గలతీ 3:23–29) ఇది అర్దం చేసుకొనుటకు లేక అంగీకరించుటకు ఏ యూదుడకైనూ చాలా కష్టతరం కాని ఇదే పౌలు వాదన.

- **"ధర్మశాస్త్రము లేని నక్షమున, అతిక్రమము లేక పోవును"** మానవులకు కల్గిన వెలుగును బట్టి దేవుడు వారిని లెక్కకు అప్పగించుచున్నాడు. అన్యజనుల వారు ఎన్నడూ అప్పగించుచున్నాడు. అన్యజనులు వారు ఎన్నడూ వినవని మోషే ధర్మశాస్త్రమును బట్గి తీర్పు తీర్చబడరు. వారు సహజ / ప్రకృతి ప్రత్యక్షత వలన జవాజీదారులగుదురు. (1:9–20; 2:14–15). ఇక్కడి ఈ మాట పౌలు వాదనను మరికొంత ముందుకు తీసుకొని వెళ్ళింది. మోషే ధర్మశాస్త్రమునకు ముందు దేవుడు స్పష్టంగా ప్రత్యక్షమైనాడు. ఆయన మానవుని అతిక్రమమును నమోదు చేయలేదు. (3:20, 25; 4:15; 5:13,20; 7:5, 7–8; అపొ 17:30 1కొరి 15:56

NASB (నవీన) వాక్యము : **4:16–25**

**16. హేతువు చేతను ఆ వాగ్దానము యావత్సంతికి, అనగా ధర్మశాస్త్రము గల వారికి మాత్రము కాక అబ్రహముకున్నటి విశ్వాసము గలవారికి కూడా దృఢము కావలెనని, కృపననుసరించనదై యుండునట్టు, అది విశ్వాసమూలమైన దాయెను. 17. తాను విశ్వసించిన దేవుని యెదుల, అనగా మృతులను సజీవులనుగా చేయువాడును లేని వాటిని ఉన్నట్టుగానే పిలచువాడునైన దేవుని యెదుల, అతడు మనకందరికి తండ్రియైయున్నాడు. నిన్ను అనేక జనములకు తండ్రినిగా నియమించితిని అని అందుక (ప్రమాణంగా) వ్రాయబడినది. 18 నీ సంతానము ఈలాగు ఉండునని చెప్పిన దానిని బట్టి తానేక జనములకు తండ్రియగునట్టు నింఈగీక్షణకు ఆధారము లేనప్పుడు అతడు నిరీక్షణ కలిగినమ్మెను. 19 మరియు అతడు విశ్వాసము నందు బలహీనుడు కాక, రమారమి నూరేండ్ల వయస్సు గలవాడై యుంది అప్పటికి తన శరీరము మృత తుల్యమైనట్టును, శారాగర్భమును మృతతుల్యమైనట్టును ఆలోచించెను గాని, 20 అవిశ్వాసము వలన దేవుని వాగ్దానమును గూర్చి సందేహింపక 21 దేవుని మహిమ పరిచి, ఆయన వాగ్దానము చేసిన దానికి నెరవేర్చుటక సమర్థుడని రూడిగా విశ్వసించి విశ్వాసము వలన బలమునొందెను. 23 అందుచేత అది అతనికి నీతిగా ఎంచబడెను. 23 అది అతనికి ఎంచబడెనని అనతి నిమిత్తము మాత్రమే కాదు, 24 మన ప్రభువైన యేసును మృతులలో నుండి లేపిన వాని యందు విశ్వాసముంచిన మనక ఎంచబడునని మన నిమిత్తము కూడా వ్రాయబడెను. 25 ఆయన మన అపరాధముల నిమిత్తము అప్పగింపబడి, మనము నీతిమంతులుగా తీర్చబడుటకు లేపబడెను.**

**4:16** 14వ నుండి ఇది సుందరమైన సారాంశం (1) మానవులు విశ్వాసంతో స్పందించాలి (2) దేవుఇ కృప వాగ్దానములక (3) విశ్వసించు వారికందరికి అబ్రహాము సంతతికి (యూదులు మరియు అన్యజనులు) వాగ్దానము నిశ్చయం; మరియు (4) విశ్వాసం గల వారందరికి అబ్రహాము మాదిరి.

- **"ధృడము కావలెనని"** ఇది గ్రీకు పరమైన బెబైయెస్ దీనికి 3 వివరణలు కలవు.

1. నిశ్చయమైనది; ఖచ్చితమైనది లేక ఆధారపడతగినది (రోమా 4:16; 2కొరింది 1:7; హెబ్రీ 2:20; 3:6, 14; 6:19; 2పేతురు 1:10, 19)
2. ఒకదాని యొక్క నమ్మతగిన తనమును చూపించే లేక స్థాపించే ఒక విధానం.
3. పాపిరిలో ఒక న్యాయపూచీదారునికి ఒక సాంకేతిక పదము (మౌల్టన్ & మిల్లిగాన్, థా వకబులరీ ఆఫ్ దా గ్రీకు న్యూటెస్టమెంట్, 107–8 పే

ఇది 14వ వచనమునకు విరుద్దము. దేవుని వాగ్దానములు నిశ్చయం.

4:17–23 పౌలు మురళీ అబ్రహామునకు ప్రాధాన్యతను ఇచ్చుచున్నాడు (1) దేవుడే ప్రారంభించిన కృప వాగ్దానములు (నిబంధన)

మరియు (2) విశ్వాసము విశ్వాసంలో కొనసాగే స్పందన మానవునికి అవపరం (1:5నోట్ చూడండి) నిబంధనలో ఎల్లప్పుడూ రెండు పార్టీలుంటాయి.

**4:17 "నిన్ను అనేక జనములకు తండ్రినిగా నియమించితిని, అని వ్రాయబడిన ప్రకారము"** ఆది 17:5 నుండి చెప్పబడిన వాక్యము గ్రీకు బైబిల్ (ఎల్ఎక్స్ఎక్స్)లో "అన్యజనులు"అని ఉన్నది కేవలము అబ్రహము సంతానము కాకుండా ఆదాము సంతానము అందరు రక్షణను దేవుడు ఆశిస్తున్నాడు. (ఆది 3:15) అబ్రాము యొక్క క్రొత్తపేరు అబ్రహము, అనగా "జనములకు తండ్రి" అని అర్థము ఇప్పుడు అది కేవలం భౌతిక సంతానమే కాకుండా, విశ్వాస సంతానం అని మనకు తెలుసు.

- **"మృతులను సజీవులుగా చేయు దేవునికి"** ఇది అబ్రహము, శారాల లైంగిక సత్తువను తిరిగి కల్పించుట సందర్భమును సూచిస్తుంది (19వ)

- **"లేని వాటిని ఉన్నట్టుగానే పిలుచువాడునైన"** ఇస్సాకుతో శారా గర్భమునకు సూచనగా ఉంది అదే విధంగా ఇది విశ్వాసం యొక్క ప్రాముఖ్యతను సూచిస్తుంఇ (హెబ్రీ 11:1)

**4:18**

**NASB "నీరీక్షణకు ఆధారము లేనప్పుడు అతడు నిరీక్షణ కలిగినమ్మెను"**

**NKJV "నిరీక్షణకు విరోదముగా, నిరీక్షణలో అతడు నమ్మెను"**

**NRSV "నిరీక్షణకు వ్యతిరేకంగా అతడు నమ్మెను"**

**TEV "నిరీక్షణకు కారణము లేకపోయిననూ అతడు నిరీక్షించెను మరియు నమ్మెను"**

**NJB "ఆశలేనట్టుగా కనిపించిన, అతడు నమ్మెను మరియు నమ్మెను"**

**"నిరీక్షణ"పై ప్రత్యేక అంశవీ 12:12లో చూడండి**

ఈ పదమునకు విస్తార అర్థములు కలవు. హేరాల్డ్ కె. మౌల్టన్, దా అనాలిటికల్ గ్రీకు లెక్సికాన్ రివైస్డ్ 133.పే చాలా ఉపయోగములను ఇచ్చింది.

1. మూల అర్థం, నిరీక్షణ (రోమా 5:4; అపొ 24:15)
2. నిరీక్షణకు ఆధారం (రోమా 8:24; గలతీ 5:5)
3. నిరీక్షణకు మూలం (కొలస్సి 1:27; 1తిమో 1:1)
4. నమ్మిక, ధైర్యం (1.పేతురు 1:21)
5. పూచికత్తుతో భద్ర (అపొ 2:26; రోమా 8:20)

ఈ సందర్భంలో నిరీక్షణ రెండు వేర్వేరు రీతులుగా వాడబడినది. మానవ శక్తి, సామర్థ్యములపైన నిరీక్షణ (19-21) దానికి విరుద్దంగా దేవుని వాగ్దానముపై నిరీక్షణ (17వ)

- **NASB, NKJV "నీ సంతానము ఈలాడు ఉండునని"**

  **NRSV "నీ సంతానము విస్తారముగా ఉండునని"**

  **TEV "నీ సంతానము చాలా అని"**

  **JB "నీ సంతానము నక్షత్రమువలె ఉండునని"**

ఇది ఆది 15:5 నుండి చెప్పబడినదై అబ్రహాంనకు కుమారుని గూర్చిన దేవుని వాగ్దానము యొక్క నిశ్చయతను నొక్కి చెప్పుటకు చెప్పబడినది (19-22) (1) వాగ్దానం తరువాత 13 సంవత్సరాలకు; (2) శారాను విడిచిపెట్టుటకు రెండు సార్లు ప్రయత్నవ తరువాత (ఆది 12:10-19; 20:1-7), (3) శారా ఐగుప్తీ దాసి అయిన హాగరుతో కుమారుని కల్గిన తరువాత (ఆది 16:1-6), మరియు (4) శారా (ఆది 18:12) మరియు అబ్రహము (ఆది 17:17) దేవుని వాగ్దానము నిమిత్తం నవ్విన తరువాత, ఇస్సాకు జన్మించెనని జ్ఞాపకం చేసుకో. వారు సంపూర్ణ విశ్వాసం కల్గియుండలేదు! రక్షణకు సంపూర్ణ విశ్వాసం అవసరత లేని దాని బట్టి దేవునికి స్తోత్రము కాని సరి అయిన దానిపైన విశ్వాసం (పాత నిబంధనలో దేవుడు మరియు క్రొత్త నిబంధనలో కుమారుని యందు)

**4:20** మొదట దేవుని వాగ్దానము అబ్రహామునకు సంపూర్తిగా అర్థము కాలేరు. అబ్రహాము విశ్వాసంకూడా పరిపూర్ణమైనది కాదు. దేవుడు అసంపూర్ణమైన ప్రజలను ప్రేమించుచున్నాడు. అసంపూర్తి విశ్వాసంను ఆయన అంగీకరించును.

- **"విశ్వాసమునందు బలహీనుడుకాక"**

ఈ క్రియా దయాక్రినో మత్తయి 21:21; మార్కు 11:23లో యేసు చేత కూడా వాడబడినది. దేవుని ప్రశ్నించుటకు భౌతిక కారణములన్నింటిని కలిగిన, అబ్రహాం విశ్వాసము నందు ఎదిగెను. 20వ వచనంలోని క్రియలు రెండునూ అరిస్ట్ పాసివ్ ఇండికేటివ్. ఈ కర్మార్థకము, దేవుని కాకత్వమును సూచించినప్పటికి, దేవుని శక్తి అతనిని బలపర్చునట్టు అబ్రహాము దేవునిని అనుమతించాలి.

- **"దేవుని మహిమ నరచి"** 3:23లో ప్రత్యేక అంశంను చూడండి

**4:21**

**NASB "రూడిగా విశ్వసించి"**

**NKJV, NRSV "రూడియైన ఒప్పింపబడి"**

**TEV "సంపూర్తిగా నిశ్చయించుకొని"**

**NJB "పూర్తిగా ఒప్పుదలతో"**

ఇది ఒక ఆరిస్ట్ పాసివ్ పార్టిసిపల్, ఇది ఒక దాని నిమిత్తము సంపూర్ణ నిశ్చయం కలిగి ఉండుటను సూచిస్తుంది. (లూకా 1:1; కొలస్సీ 4:12) లేక ఒక వ్యక్తి (4:21; 14:5) పైన సంపూర్తి నమ్మకం కల్గియుండటం. ఈ నామవాచకం కొలస్సీ 2:2 మరియు 1థెస్స 1:5లో సంపూర్ణ నిశ్చయతగా వాడబడినది. దేవుని చిత్తముపైన, వాక్యముపై మరియు శక్తిపైన ఉన్న నమ్మకం మానవులను విశ్వాసంతో పనిచేయుటకు ప్రోత్సహపర్చును.

- **"వాగ్దానము చేసిన దానికి నెరవేర్చుటకు సమర్థుదని"** ఇది పెర్ఫెక్ట్ మిడిల్ ఇండికేటిల్, గతంలోని ఒక పని ముగింపునకు వచ్చి, ప్రస్తుత స్తితిలో ఉండుటను సూచిస్తుంది. దేవుని గుణముపైన మరియు దేవుని వాగ్దానముపైన నమ్మిక ఉంచటమే, విశ్వాసమూలం. (16:25; ఎఫెసి 3:20 యూదా 24) కాని మానవకార్యం పైన కాదు (యెషయ 55:11) విశ్వాసము, వాగ్దానం చేసి (యెషయా 55:11) దానిని నెరవేర్చే దేవునిపై నమ్మిక ఉంచుతుంది. (ఆది 12:1-3; 15:6, 12:21) యెహె 36:22-36

4:22 ఇది ఆది 15:6 లోని ఒక ఉపమానం పాపభారితిమైన మానవులకు దేవుడు ఎలా నీతిని కలిగించును అన్న పౌలు వేదాంతపరమైన వాదనకు మూలం. 4:23-25 ఈ వచనములు గ్రీకు ఒకే వాక్యం.

1. అబ్రహాము నిమిత్తము, 23వ
2. విశ్వాసులందరి నిమిత్తము, 24వ
3. దేవుడు యేసుని లేపినబట్టి, 24వ
4. యేసు మన పాపములను బట్టి ఇవ్వబడెను, మన పాపములు క్షమింపబడులాగున యేసు తిరిగిలేచెను 25వ

4:24 అబ్రహాము విశ్వాసము నిజమైన సంతతతి అనుసరించుటకు ఒక మాదిరి అయినది వాగ్దాన పుత్రుని కొరకు మరియు జనాంగముకొరకు అబ్రహాము దేవుని నమ్మెను. పతనమైన మానవులకొరకైన దేవుని వాగ్దానములన్నింటిని క్రీస్తు నెరవేర్చునని క్రొత్త నిబంధన విశ్వాసులు నమ్మవలెను "సంతతి" అన్న పదం ఏకవచనము మరియు బహువచనం (ఒక కుమారుడు, ఒక జనాంగము).

- **"లేపెను"** 8:11ను చూడండి.

4:25 "మన అపరాదముల నిమిత్తము అప్పగింపబడి ఇది న్యాయసంబంధ పదము, దీని అర్థము, శిక్షనిమిత్తము ఒకనిని అప్పగించటం. 25వ వచనం గ్రీకు బైబిల్ (ఎల్ఎక్స్ఎక్స్) నుండి యెషయా 53:11-12 యొక్క అద్భుతమైన క్రీస్తు శాస్త్ర వాక్యం.

- **"మనము నీతిమంతులుగా తీర్చబడుటకై లేపబడెను"** 25వ వచనంలో రెండు వాక్యాలు సాదృశ్యమైనవి. ఫ్రాంక్‌స్టాగ్ యొక్క అనువాదం (న్యూటెస్టమెంట్ థియాలజీ 97పే)లో "మన అపరాదముల నిమిత్తము అప్పగింపబడి, మనం నీతిమంతులమవ్వాలనే ఉద్దేశ్యంతో తిరిగి లేచెను." ఇది ఎంతగానో అభినందనీయము. ఈ అనువాదం రెండు దృక్పదములుతో పౌలు వాడుతున్నాడు. నీతిమంతులుగా తీర్చబడుట (1) న్యాయపరమైన నీతి (2) దైవికమైన, క్రీస్తు వంటి జీవితం!

**చర్చాప్రశ్నలు :**

ఇది ధ్యాన మార్గదర్శక వ్యాఖ్యానం కావునా బైబిల్ యొక్క మీ స్వంత వ్యాఖ్యానమునకు మీరు భాద్యులు. మనమందరం మన కివ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, బైబిల్ మరియు పరిశుద్ధాత్మ భావ వ్యక్తీకరణలో ప్రముఖులు నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు దానిని విడిచి పెట్టకూడదు. ఈ పుస్తకంలోని బహుళ విషయములను ఆలోచించుటకు ఈ చర్చా ప్రశ్నలు సహాయపడతాయి. అవి ఆలోచింపజేసేవే కాని, నిశ్చితమైనవి కావు.

1. రోమాలోని ఈ భాగముఎందుకు ప్రాముఖ్యమైనది?
2. పౌలు అబ్రహాము, దావీదు ఉదహరణలను ఎందుకు ఉపయోగించుచున్నాడు?
3. పౌలు వాడుకను బట్టి ఈ క్రింది మూలపదములను నిర్వచించండి?
   ఎ. "నీతి"
   బి. "ఎంచబడెను"
   సి. "విశ్వాసం"
   డి. "వాగ్దానం"
4. యూదులక సున్నతి ఎందుకు ప్రాముఖ్యము.
5. 13:16 వచనంలలోని "సంతతి" ఎవరిని సూచిస్తుంది?

# ద్వితీయోపదేశకాండము - 5వ అధ్యాయము

నవీన అనువాదముల యొక్క వాక్య విభజన

| UBS | NKJV | NRSV | TEV | JB |
|---|---|---|---|---|
| నీతిమంతులుగా తీర్చబడులవలన ఫలితములు | సమస్యలో విశ్వాసం గెలుచును | నీతిమంతులుగా తీర్చబడుటవలన ప్రభావములు | దేవునితో సరిగా యుండుట | విశ్వాసం రక్షణకు పూచికత్తు |
| 5:1-11 | 5:1-5 | 5:1-5 | 5:1-5 | 5:1-11 |
| | క్రీస్తు మన స్థానంలో | | | |
| | 5:6-11 | 5:6-11 | 5:6-11 | |
| ఆదాము మరియు క్రీస్తు | ఆదాములో మరణము, క్రీస్తులో జీవము | ఆదాము మరియు క్రీస్తు పోలిక మరియు వ్యత్యాసం | ఆదాము మరియు క్రీస్తు | ఆదాము మరియు యేసు క్రీస్తు |
| 5:12-14 | 5:12-21 | 5:12-14 | 5:12-14బి | 5:12-14 |
| | | | 5:14సి-17 | |
| 5:15-21 | 5:15-17 | | | |
| | | | | 5:15-21 |
| | | 5:18-21 | 5:18-19 | |
| | | | 5:20-21 | |

వాక్యపు పరిధి యొద్ద అసలైన గ్రంథకర్త ఉద్దేశ్యంను అనుసరించుట....

ఈ వ్యాఖ్యానం చదువుటకు ఉపయోగపడే మార్గదర్శిని......

కావున బైబిల్ యొక్క వ్యాఖ్యానమును నీవు సొంతంగా చేసుకొనుటకు భాద్యుడవు. మనమందమం మనకు ఇవ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, పరిశుద్ధ గ్రంథం మరియు పరిశుద్ధాత్మ వ్యాఖ్యానంలో ప్రాధాన్యత వహించవలెను. దీనిని నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు విడిచిపెట్టకూడదు.

అధ్యాయమంతటినీ ఒకేసారి చదవాలి, అంశాలను గుర్తించాలి. నీ అంశ విభజనము పైన ఇవ్వబడిన నవీన అనువాద విభజనలతో సరి పోల్చుకోవాలి. విభజన అనేది ప్రేరణ కాదు. కాని ఇది అసలు గ్రంథకర్త యొక్క ఉద్దేశ్యమును తెలుసుకొనుటకు ఉపయోగపడును వ్యాఖ్యానమునకు ఇది కేంద్రమై వున్నది. ప్రతి వాక్య విభజనకే ఒక్క విభజనను కలిగి ఉండును.

1. మొదటి వాక్య భాగం
2. రెండవ వాక్య భాగం
3. మూడవ వాక్య భాగం
4. మొదలగునవి.

**సందర్భోచిత తలంపులు**

ఎ. 3:21-31లోన పౌలు వేదాంతము. పతనమైన మానవుడు ధర్మశాస్త్రము నుండి కాక దేవునితో సరి అవ్వుట ఒక ఉచిత బహుమానం అని ధృవీకరించింది. పౌలు ఇప్పుడు ఇది ఎదో క్రొత్తగా కనిసెట్టినదికాదు అని నిరూపించుటకు అబ్రహము దావీదు ఉదాహరణల ద్వారా నిరూపించుటకు ప్రయత్నం చేస్తున్నాడు (3:216) 6-8వ)

బి. రోమా 4, విశ్వాసం ద్వారా నీతిమంతులుగా తీర్చబడుల అన్న సిద్ధాంతమునకు మోషే ధర్మశాస్త్రము, ఆది-ద్వితి నుండి ఋజువలను తీసుకొనుచున్నాడు. ఇది 3:21-31లో సంగ్రహించబడినది. యూదులకు, మోషే రచనల నుండి ఉదహరించబడిన మాటకు ఎంతో విలు, ప్రత్యేకంగా యూదుల దేశమునకు తండ్రిగా చూడబడుచున్న అబ్రహామునకు సంబంధించిన వాటికి దావీదురానున్న మోస్సీ యోగా చూడబడుతున్నాడు (2సమూ7)

రోమాలోని విశ్వసించిన యూదులకు మరియు విశ్వసించిన అన్యజనులకు మద్య ఉన్న తన్యత ఈ సందర్భమునకు సూచన. యూదుల నాయకులు రోమాను విడిచడిపెట్టుటకు క్లాడియస్ చేత బలవంతం చేయబడి ఉండవచ్చు. వారికి బదులుగా అన్యజన

**సందోర్భిచిత తలంపులు**

ఎ. 1-11వ వచనాలు గ్రీకులో ఒక వాక్యము. ఇవి "విశ్వాసము వలన నీతిమంతులుగా తీర్చబడుట" అన్న ముఖ్యాంశమును వృద్ధి చేస్తున్నాయి.

బి. 1-11 వచనాలు క్రమ పట్టీ

| **1-5వచనాలు** | **6-8వచనాలు** | **9-11వచనాలు** |
|---|---|---|
| రక్షణ యొక్క ప్రయోజనము | రక్షణకు ఆధారం | రక్షణ యొక్క |
| నీతిమంతులుగా తీర్చబడటం | నీతిమంతులుగా | భవిష్యత్ నిశ్చయత |
| యొక్క అంతఃకరణ అనుభవం | తీర్చబడటం యొక్క | నీతిమంతులుగా |
| భవం | బాహ్య అనుభవం | యొక్క భవిష్యత్ |
| నీతిమంతులుగా తీర్చబడటం | వృద్ధిపొందెడి | నిశ్చయము |
| | శుద్దీకరణము | మహిమపర్చబడటం |
| మనుష్యశాస్త్రం | వేదాంతశాస్త్రం | రాకడశాస్త్రం |

సి. 12-21 వచనాలు క్రీస్తు రెండవ ఆదాము అనే చర్చ (1 కొరింది. 15:21-22, 45-49; ఫిలిప్పి 2:6-8). ఇది వ్యక్తిగత పాపము మరియు సమైఖ్య అపరాదంల వంటి వేదాంత అంశమును నొక్కి చెప్పుచున్నవి. ఆదాములో మానవుని (సృష్టి) పతనము యొక్క పౌలు బోధ రబ్బీల బోధ నుండి ఎంతో వ్యత్యాసము మరియు ఎంతో సాటిలేనిదిగా ఉంది. గమలీయేలు పాదముల యొద్ద యెరుషలేంలోని అతడు నేర్చుకొనిన సత్యములను పరిశుద్ధాత్మ ప్రేరణతో పౌలు ఉపయోగిస్తున్నట్లు ఇది చూపిస్తుంది. (అపో. 22:3).

అగస్టిన్ మరియుకాల్విన్‌లచే ఆది. 3వ అధ్యాయం నుండి అసలు పాపము యొక్క సంస్కరణ సొవర్తిక సిద్ధాంతం. వృద్ధిలోనికి వచ్చింది. మానవులందరూ పాపభరితంగా జన్మిస్తారని బోధిస్తుంది. (సంపూర్ణదుర్నీతి). దీనికి తరుచుగా కీర్తనలు 51:5; 58:3; మరియు యోబు 15:14;25:4 వాక్య భాగములు ఋజువులుగా చూపబడతాయి. పెలాగియస్ మరియు అర్మినియస్‌లు యొక్క మానవులు వారి స్వంత నిర్ణయములు మరియు గమ్యము వలన క్రమంగా నైతిక మరియు ఆత్మీయుతకు జవాబుదారులగుదురు అనేది దానికి బదులైన వేదాంతము. ద్వితి 1:39; యెషయా 7:15; యోనా 4:11; యోహను 9:41; 15:22, 24; అపొ 17:30; రోమా 4:15లు వారి అమిప్రాయములకు ఋజువులు ఈ వేదాంతాంశము యొక్క విషయం ఏమిటంటే, నైతిక భాద్యత వయస్సు వచ్చునంతవరకు పిల్లలు నిరపరాదులు (రబ్బీల ప్రకారం ఈ వయస్సు బాలురకు 13 సం.లు మరియు బాలికలు 12సం.లు).

పుట్టుకతో వచ్చు దుష్టత్వము మరియు నైతిక భాధ్యత తెలియు వయస్సు రెండునూ సత్యమే అని చెప్పు మద్యవర్తిత్వస్థానం కలదు. దుష్టత్వం సామాజిక సంబంధమైనది, కాని వృద్ధి చెందుతున్న దుష్టత్వము ఒక వ్యక్తిని పాపము చేయుటకు ప్రేరేపిస్తుంది. (దేవుని నుండి క్రమక్రమంగా దూరమయ్యే జీవితం). మనుష్యుని దుష్టత్వం విషయం కాదు. (ఆది 6:5,11-12,13; రోమా 3:9-18,23) కాని ఎప్పుడూ, పుట్టుకతోనా లేక జీవితంలో తరువాత?

డి. 12వ వచనంకు సంబంధించి చాలా సిద్ధాంతములు కలవు.

1. పాపము చేయుటను ఎన్నుకొనిన కారణముచేత ప్రజలందరు చనిపోవుదురు (పిలగియస్)

2. ఆదాము పాపము సృష్టి అంతటిని ప్రభావితం చేసినది. కాబట్టి అందరూ మృతి పొందుదురు. (అగస్టీన్)

3. నిజముగా ఇది అసలు పాపము మరియు స్వేచ్ఛ చిత్త పాపము.

ఇ. 12వ వచనంలో ప్రారంభమైన "ఏలాగు" అన్న పోలిక 18వ వచనం వరకు ముగియబడలేదు. 13–17 వచనాలు ఏర్పరిచిన కుండలీకరణము పౌలు రచనాల గుణాలకరణము.

ఎఫ్. 1:18–8:39 పౌలు సువార్త ప్రదర్శన కొరకైన ఒక ఆదారిత వాదన అని జ్ఞాపకముంచుకో. క్రమంగా వ్యాఖ్యానించుటకు, భాగములను సరిగా చేయుటకు మొత్తం చూడబడాలి.

జి. మార్టిన్ లూథర్ 5వ అధ్యాయం గురించి ఈ విధంగా చెప్పెను, "బైబిల్ అంతటిలో ఈ విజయవంతమైన వాక్యమునకు సమమైన వేరే అధ్యాం కనిపించటం కష్టతరము".

**పద మరియు వాక్యధ్యానము.**

**NASB (నవీన) వాక్యము : 5:1–5**

**1. కాబట్టి విశ్వాసమూలమున మనము నీతిమంతులుగా తీర్చబడి, మన ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా దేవునితో సమాదానము కల్గియుందము. (2) మరియు ఆయన ద్వారా మనము విశ్వాసము వలన ఈ కృషయందు ప్రవేశము గలవారమై, అందులో నిలిచి యుండి, దేవుని మహిమను గూర్చిన నిరీక్షణను బట్టి అతిశయపడుచున్నాము. (3) అంతే కాదు; శ్రమ ఓర్పును, ఓర్పు పరీక్షను, పరీక్ష నిరీక్షణను కలుగజేయునని యెరిగి శ్రమల యందును అతిశయపడుదము. (4) మనకు అనుగ్రహింపబడిన పరిశుద్ధాత్మ ద్వారా దేవుని ప్రేమ మన హృదయములలో కుమ్మరింపబడి యున్నది గనుక ఈ నిరీక్షణ మనలను సిగ్గుపరచదు.**

**5:1 "కాబట్టి"** ఈ వచనము (1) ఇంతవరకు వచ్చిన వేదాంత వాదన యొక్క సారాంశం: (2) ఈ వేదాంత ప్రదర్శన యొక్క ముగింపులు; మరియు (3) నూతన సత్యము యొక్క ప్రదర్శన 5:1; 8:1;12;1) లను చూపిస్తుంది.

▣ **"నీతిమంతులుగా తీర్చబడి"** ఇది ఆరిస్ట్‌పాసివ్ పార్టిసిపల్ దేవుడు విశ్వాసులను నీతిమంతులుగా తీర్చెను. గ్రీకులో ఇది నొక్కి చెప్పుటకు ముందుగా ఉంచబడింది. (1–2వ) 1–11 వచనాలలో కాల వ్యవధి కనిపిస్తుంది.

1. 1–5 వచనాలు, కృప యొక్క ప్రస్తుతపు అనుభవం;

2. 6–8 వచనాలు, మన పక్షముగా క్రీస్తు ముగించిన కార్యము; మరియు (3) 9–11 వచనాలు మన భవిష్యత్ నిరీక్షణ మరియు రక్షణ నిశ్చయత.

▣ **"నీతిమంతులుగా తీర్చబడుట"** అన్న పదమునకు పాతనిబంధన వెనుకటి చరిత్ర "నిటారు అంచు" లేక "కొలిచే రెల్లు" అనీ అర్థమిచ్చును. దేవునికి రూపకఅలంకారముగా ఇది వాడబడేది. దేవుని గుణము మరియు పరిశుద్ధత తీర్పునకు ప్రమాణములు (LXX లేవి 24:22; వేదాంతపరంగా మత్తయి 5:48) క్రీస్తు యొక్క త్యాగ పూరిత, పాప పరిహారార్ధ మరణము చేత విశ్వాసులు దేవుని యెదుట న్యాయపరమైన స్థానమును కల్గియున్నారు.

ఇది విశ్వాసులలో అపరాదుం లేదని సూచించబడకూడదు కాని శిక్షను ఎవరో ఒకరు చెల్లించారు. (కొరింథి 5:21). విశ్వాసులు క్షమింపబడినట్లు ప్రకటించబడ్డారు.

▣ **"విశ్వాసమువలన"** విశ్వాసము, దేవుని బహుమానంను స్వీకరించే వాస్తము. (2వ రోమా 4:1) విశ్వాసము, విశ్వాసుల తీర్మానము, సమర్పణల యొక్క తీవ్రతను పరిగణించదు కాని (మత్తయి 17:20), దేవుని గుణము మరియు వాగ్దానములపైన దృష్టి నిలుపుతుంది. (ఎఫెసి. 2:8–9). పాత నిబంధనలో "విశ్వాసము" అన్న పదము నిటారుగా నిలుచున్న వ్యక్తి యొక్క తీరుని సూచిస్తుంది. ఇది రూపక అలంకారముగా విధేయత చూపే, ఆదారపడతగిన మరియు నమ్మదగిన వాని కొరకు వాడబడింది. విశ్వాసము మన విశ్వాస్యతపైన లేక నమ్మదగిన తనంపైన కాకుండా దేవునిపై దృష్టి ఉంచుతుంది.

- **"సమాదానము కలిగియుందము"** గ్రీకు ప్రతులలో కొద్దిపాటి వ్యత్యాసం కలదు. ఈ క్రియ ప్రెసెంట్ ఎక్టివ్ సబ్‌జంక్టివ్ (ఎఖోమెన్) లేక ప్రెసెంట్ ఎక్టివ్ ఇండికేటిల్ (ఎఖోమెన్) ఈ వ్యాఖారణ సందిగ్ధత 1,2,3 వచనాలలో కనిపిస్తుంది. ప్రాచీన ప్రతులు వికల్పాత్మకమును (Subjunctive) బలపరుస్తున్నాయి. (MSS X*A,B,*C.D) ఇది వకల్పాత్మకము అయినదైతే "మనము సమాదానం కలిగి యుందము" లేక "సమాదానమును ఆనందించుదము" అని అనువదించబడుతుంది". ఇది ఇండికేటివ్ అయినట్లయితే "మనకు సమాదానం కలదు" అని అనువదించబడవచ్చు 1-11 వవచనాల సందర్భం హెచ్చరిక కాదు గాని ఒక ప్రకటన దృవీకరణ. అప్పటికే విశ్వాసులకు కలిగినది. క్రీస్తుద్వారా పొందిన దాని యొక్క దృవీకరణ. కావున, ఆ క్రియా ప్రెసెంట్ ఎక్టివ్ ఇండికేటివ్ అవ్వవచ్చు. USB "A" "ఎ" ను ముందు ఉంచి నిశ్చయతను ఎంఫిక చేసింది. మన పురాతన గ్రీకు ప్రతులన్నియూ, ఒక వ్యక్తి వాక్యమును చదువుతూ ఉండగా అనేకమంది దానిని వ్రాస్తుండేవారు. ఒకేలా ఉచ్చరించే పదముల దగ్గర అయోమయం కల్గియుండేది. ఇలాంటి సందర్భాలలో సందర్భం మరియు రచనాశైలి మరియు సాధారణ పదసముదాయము, అనువాద నిర్ణయమును సులభము చేయుటకు గ్రంథకర్తకు తోడ్పడుతాయి.

- **"సమాదానం"** దీనికి సంబంధించిన గ్రీకు పదము అసలైన అర్థము "పగిలిన దానిని కలిపి ఉంచటం". (యెహను 14:27; 16:33; రులిప్పి 4:7) సమాదానంను గురించి 3 రీతులుగా క్రొత్తనిబంధన మాట్లాడుతుంది. (1) క్రీస్తు ద్వారా దేవునితో మన బాహ్యాశాంతి. (కొలస్సి 1:20); (2) దేవునిత అంతరంగికం సరి అగుట (యెహాను 14:27; 16:33; పిలిప్పి 4:7); మరియు (3) క్రీస్తు ద్వారా, యూదులను, అన్యును దేవుడు ఒక నూతన శరీరంలోనికి చేర్చుట, (ఎఫెసి. 2:14-17; కొలస్సి 3:15).

  న్యూమేన్ & నిడా, ఎట్రాన్స్ లేటర్‌స్ హేండ్ బుక్ టు దారోమన్స్, 92 పే, "సమాదానం" గురించి మంచి వ్యాఖ్య కల్గియుంది.

  "పాతనిబంధనలోనూ క్రొత్త నిబంధనలలోనూ కూడా సమాదానం అన్న పదం విస్తార అర్థములు కల్గియుంది. ముఖ్యంగా ఇది ఒక వ్యక్తి యొక్క సంపూర్ణ క్షేమమును వివరిస్తుంది.; ఇది యూదులలో శుభవచనముగా దత్తు తీసుకొనబడింది. మెస్సియా ద్వారా వచ్చే రక్షణను వివరించుటకు కూడా ఈ పదము యూదులచే వాడబడి అతి ప్రాముఖ్యమైన అర్థమును కల్గియుంది. ఈ సత్యము చేతనే "దేవునితో సరి అయిన సంబంధం కల్గియుండుట" అను దానికి నానార్థముగా చాలాసార్లు వాడబడింది. ఇక్కడ ఈ పదము, దేవుడు మానవుని తనతో సరి. అయిన సంబంధంలో ఉంచుకొనుటను బట్టి మానవునికి దేవునికి మధ్య అన్యోన్య సంబంధము స్థాపించబడింది. అని వివరించుటకు వాడబడింది". 92. పే.

- **"మన ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా దేవునితో"** దేవునితో సమాదానం తెచ్చే కారకము క్రీస్తు. దేవునితో సమాదానమునకు యేసు ఒకే ఒక్క మార్గము. (యెహను 10:7-8;14:6; అపొ 4:12; 1 తిమో 2:5) "యేసుక్రీస్తు" బిరుదు 1:4లో చూడండి.

  **5:2 "మనము ప్రవేశము గలవారమై"** ఇది పెర్‌ఫెక్ ఎక్టివ్ ఇండికేటివ్; ఇది గతమందు సంపూర్తి అయ్యి ఇప్పుడు ఉన్న స్థితిని కల్గించేది. "పరిచయం" అన్న పదం అక్షరార్థముగా "ప్రవేశం" లేక "అనుమతి" అని అర్థములనిచ్చును. (ఎఫెసి. 2:18;3:12) ఇది అలంకార ప్రాయంగా (1) రాజులకు వ్యక్తిగతంగా పరిచయం చేయుటకు (2) ఓడరేవులోనికి క్షేమంగా తీసుకొని వచ్చుటకు వాడబడేది.

  గ్రీకు ప్రతులలో ఈ వాక్యమునకు వ్యత్యాసం కలదు. కొన్ని ప్రాచీనప్రతులకు "విశ్వాసం ద్వారా" అని చేర్చబడింది. ఇతర ప్రతులు "ఎన్"కి "విశ్వాసం వలన"కు చేర్చినారు. ఎలాగైన, ఉన్షియల్ ప్రతులు B,D,F మరియు G వాక్యమును విడిచిపెట్టినారు. శాస్త్రులు 5:1 యొక్క మరియు 4:16 (రెండు సార్లు), 19 మరియు 20ల సాదృశ్యంను మామూలుగా నింపినారు. "విశ్వాసము వలన" అనెపొలు యొక్క పునరావృత్తి అంశం.

- **"ఈ కృపయందు"** ఈ పదము (ఖారిస్) దేవుని యొక్క యోగ్యత లేని వారి ప్రేమించే దేవుని ప్రేమ. (ఎఫ్సి. 2:4-9). పాపభరిత మానవుల పక్షమున క్రీస్తు మరణించుటలో ఇది స్పష్టంగా కనిపిస్తుంది. (8వ)

- **"అందులో నిలిచి యుండి"** ఇది వేరే పెర్‌ఫెకోలు ఎక్టివ్ ఇండికేటివ్; అక్షరార్థముగా "మనం నిల్చున్నాము మరియు నిలిచి యుందుము" అని అర్థమునిచ్చును. ఇది క్రీస్తులో విశ్వాసుల స్థానము మరియు వారి విశ్వాసంలో నిలువాలనే వారి తీర్మానముల కలయికను సూచిస్తుంది. ఇది దేవుని సార్వభౌమత్వం (1.కొరి 15:1) మరియు మానవుని స్వేచ్ఛా చిత్తమును (ఎఫెసి. 6:11,13,14) వేదాంత విపరీత భావంను కలుపుతుంది.

**ప్రత్యేక అంశం : నిలిచి యుందము**

ఈ సాదారణ పదము క్రొత్త నిబంధనలో వేర్వేరు రీతులుగా వాడబడింది.

1. స్థాపించుటకు

ఎ. పాతనిబంధన ధర్మశాస్త్రము, రోమా 3:31

బి. ఒకని స్వంత నీతి, రోమా 10:3

సి. నూతన నిబంధన, హెబ్రీ 10:9

డి. ఒక పని, కొరింధి 13:1

ఇ. దేవుని సత్యము, తిమోతి 2:19

2. ఆత్మీయంగా ఎదిరించుటకు

ఎ. అపవాదిని, ఎఫెసి 6:11

బి. తీర్పుదినం, ప్రకటన 6:17

3. ఒకని స్థానంలో నిలువబడి ఎదిరించటం

ఎ. సైనిక ఉపమానం, ఎఫెసి. 6:14

బి. పౌర ఉపమానం, రోమా 14:4

4. సత్యంలోని స్థానం, యోహాను 8:44

5. కృపయందు స్థానం,

ఎ. రోమా 5:2

బి. 1 కొరి 15:1

సి. 1 పేతురు 5:12

6. విశ్వాసంలో స్థానం

ఎ. రోమా 11:20

బి. 1 కొరి 7:37

సి. 1 కొరి 15:1

డి. కొరి 1:24

7. అహంకార స్థానం, కొరి 10:12

ఈ పదము నిబంధన కృపను మరియు సార్వబౌమాదికారి అయిన దేవుని కరుణను వ్యక్తపరుస్తుంది. కాని విశ్వాసులు విశ్వాసంతో స్పందించి దానికి అంటుకొని ఉండాలి. ఇవి రెండు కలిసి యుండాలి.

**"మనము అతిశయ పడుదము"**

▣ **"అతిశయపడుదము"** అన్న దానికి మూలపదం "గొప్ప అగుదము (NRSV, JB) 2:17లో ప్రత్యేక అంశం చూడండి. విశ్వాసులు తమంతట తాము అతిశయపడకూడదు (3:27), కాని వారి కొరకు దేవుడు చేసిన దానిని బట్టి అతిశయపడాలి. (యిర్మి 9:23-24) ఇదే గ్రీకు పదం 3&11 వచనాలలో మరళ చెప్పబడింది.

▣ **"నిరీక్షణను బట్టి"**

ఈ పదము వేర్వేరుగా వాడబడినప్పటికి ఒకదానితో ఒకటి సంబంధంతో పౌలు ఉపయోగించినాడు. తరుచుగా ఇది విశ్వాసుల విశ్వాసం యొక్క సంపూర్ణతతో కలిపి ఉంటుంది. ఇది మహిమగా, నిత్యజీవంగా, కడవరి రక్షణగా, రెండవ రాకడగా వ్యక్తమవుతుంది.

అంతము నిశ్చయం, కాని సమయం తెలియనిది మరియు భవిషత సంబంధము. ఇది తరుచుగా "విశ్వాసం" మరియు "ప్రేమ" అన్న వాటితో కలిసి ఉంటుంది. (కొరి 13:13; గలతీ 5:5-6; ఎఫెసి. 4:2-5; థెస్స 1:3; 5:8) పౌలు వాడిన కొన్నింటిని పట్టీ.

1. రెండవ రాకడ, గలతీ 5:5; ఎఫెసి 1:18; తీతు 2:13
2. యేసే మననిరీక్షణ, తిమో 1:1
3. దేవుని ఎదుట నిలువబడాలనే విశ్వాసి, కొలస్సి 1:22-23; థెస్స. 2:19.
4. పరలోకంలోని నిరీక్షణ. కొలస్సి 1:5
5. అంతిమ రక్షణ, థెస్స 4:13
6. దేవుని మహిమ, రోమా 5:2; కొరింది 3:7-12;కొలస్సి 1:29
7. క్రీస్తుద్వారా అన్యజనుల రక్షణ, కొలస్సి 1:27
8. రక్షణ యొక్క నమ్మిక, థెస్స 5:8-9
9. నిత్య జీవము, తీతు 1:2;3:7
10. క్రైస్తవ పరిపక్వత యొక్క ఫలితములు, రోమా 5:2-5
11. సృష్ఠి అంతటి రక్షణ, రోమా 8:20-22
12. దేవుని బిరుదు, రోమా 15:13
13. అంతిమ దత్తత, రోమా 8:23-25
14. నూతన నిబంధన విశ్వాసులకు పాతనిబంధన మార్గదర్శినిగా రోమా 15:4
15. విశ్వాసులందరి కొరకైన పౌలు కొరిక, కొరి 1:7

"దేవుని మహిమ" పునరుత్థాన దినమందు యేసు క్రీస్తు వలన విశ్వాస నీతి మూలమున దేవుని యెదుట విశ్వాసులు నిలకడను ఇది సూచిస్తుంది. (కొరి 5:21). ఇది తరుచుగా వేదాంతపదమైన "మహిమపర్చబడుట"గా పిలువబడుతుంది. (9-10;8:30). విశ్వాసులు యేసు సారూప్యతను పంచుకొనెదరు (1యోహాను 3:2; పేతురు 1:4) ప్రత్యేక అంశం : మహిమను 3:23లో చూడండి.

**5:3 NASB "అంతేకాదు"**

**NKJV "అదేకాదు"**

**NRSV "అదేకాదు"**

**TEV "వదిలివేసింది"**

**JB "అదేకాదు**

పౌలు ఈ మిశ్రమ పదములను చాలాసార్లు ఉపయోగించినాడు (5:3,11; 8:23; 9:10, మరియు కొరి 8:19).

▣ NASB **"శ్రమలయందును అతిశయపడుదము"**

NKJV **"శ్రమల యందును మహిమపొందుదము"**

NRSV **"మన శ్రమల యందును అతిశయపడుదము"**

TEV **"మన శ్రమల యందును అతిశయపడుదము"**

NJB **"మన కష్టముల యందును అతిశయపడుదము"**

లోకము యేసుని ద్వేషిస్తే, అయన శిష్యులను అది ద్వేషించును. (మత్తయి 10:22; 24:9; యెహాను 15:18-21). యేసు పొందిన శ్రమలను బట్టి పరిపక్వత సాధించెను. అని మానవ రీతిలో చెప్పవచ్చు (హెబ్రీ 5:8).

శ్రమ నీతిని కల్గిస్తుంది. ప్రతి విశ్వాసి గురించి దేవుని ప్రణాళిక ఇదే. (8:17-19; అపో 14:22;యాకోబు 1:2-4; పేతురు 4:12-19).

- **"యెరిగి"** ఇది "ఒయిడా" యొక్క పెర్‌ఫెక్‌ల పార్టిసిపల్ అయినా భూతకాలంగా పనిచేస్తుంది. విశ్వాసులు సువార్త సత్యమును అర్థం చేసుకొని శ్రమలలో ఆనందముతో మరియు ధైర్యంగా జీవించి, పరిస్థితులపై ఆదారపడకుండా శ్రమల కాలంలో ఉండాలి. ఫిలిప్పి 4:4; థెస్స 5:16,18.

**5:3,4 "ఓర్పు"** ఈ పదము "స్వచ్ఛంధంగా" "చురుకుగా" "నిలకడగా" "సహనంతో" అని అర్థమిచ్చును. ప్రజలతో మరియు పరిస్థితులతో సహనం కలిగి యుండుటంను సూచిస్తుంది.

**ప్రత్యేక అంశం : శ్రమ**

పౌలు వాడుకకు మరియు యోహాను వాడుకకు వేదాంత వ్యత్యాసం యొక్క అవసరత ఉంది.

1. పౌలు వాడు (యేసుని వాడుకను చూపిస్తుంది)

ఎ. సమస్యలు, హింసలు, పతనలోకములోని దుష్టత్వం యొక్క జోక్యం.

(1) మత్తయి 13:21

(2) రోమా 5:3

(3) కొరి 7:28

(4) కొరి. 7:4

(5) ఎఫెసి. 3:13

బి. సమస్యలు, శ్రమలు, అవిశ్వాసుల వలన కల్గిన దుష్టత్వం

(1) రోమా 5:3; 8:35; 12:12

(2) కొరి 1:4, 8, 6:4; 7:4; 8:2, 13

(3) ఎఫెసి 3:13

(4) ఫిలిప్పి 4:14

(5) 1 థెస్స 1:6

(6) 2థెస్స 1:4

సి. సమస్యలు, శ్రమలు, అంత్యకాలపు శ్రమలు

(1) మత్త 24:21,29

(2) మార్కు 17:19,24

(3) 2థెస్స 1:6

2. యోహాను ఉపయోగం

ఎ. ప్రకటన గ్రంథంలో యోహాను థిలిప్సిస్‌నకు ఒర్గే లేక తువ్‌స్‌నకు స్పష్టమైన తేడాను చూపించినాడు. థిలిప్సిస్ అనేది అవిశ్వాసులు విశ్వాసులకు కలుగజేసేది మరియు ఓర్గే అనేది అవిశ్వాసులకు దేవుడు చేసేది.

(1) దిలిప్సిస్ - ప్రకటన 1:9;2:9;2:9-10,22;7:14

(2) ఒర్గే - ప్రకటన 6:16-17; 11:18;16:19;19:15

(3) తుమ్‌స్ - ప్రకటన 12:12; 14:8, 10,19; 15:2, 7; 16:1; 18:3

బి. ప్రతి యుగంలోనూ విశ్వాసులు ఎదుర్కొనే శ్రమలను యోహాను తన సువార్తలో కూడా చూపినాడు యోహాను 16:33.

**5:4**

NASB **"ఒర్పు పరీక్షను"**

NKJV **"గుణిమును"**

NRSV

TEV **"దేవుని సమ్మతి"**

NJB **"పరీక్షింపబడిన గుణము"**

గ్రీకు బైబిల్‌లోని ఆది. 23:16; రాజులు 10:18; 1 ధిన. 28:18లో లోకముల స్వచ్ఛత మరియు యదార్ధతల పరీక్ష కొరకు ఈ పదమును వాడినారు. (కోరి. 2:9;8:2; 9:13; 13:3; ఫిలిప్పి 2:22; తిమో 2:15; యాకోబు 1:12).

దేవుని పరీక్షలన్ని ఎల్లప్పుడు బలపర్చుటకే (హెబ్రీ 12:10-11) ప్రత్యేక అంశం : పరీక్షను 2:18లో చూడండి.

5:5 "దేవుని ప్రేమ మన హృదయములలో కుమ్మరింపబడియున్నది" ఇది పెర్‌ఫెక్ట్ పాసివో ఇండికేటివ్ అక్షరార్ధంగా, "దేవుని ప్రేమ మన హృదయములలో కుమ్మరించబడుచున్నది". ఈ క్రియ ఎప్పుడూ పరిశుద్దాత్మ కొరకు వాడబడేది. (అపో. 2:17,18,33,10:45, తీతు 3:6) ఇది యేవేలు 2:28-29ను ప్రతిబింబిస్తుంది.

- **"దేవుని ప్రేమ"** అన్న ఈ మాట వ్యాకరణ రీతిగా (1) దేవుని కొరకు మన ప్రేమ; లేక 92) మన కొరకు దేవుని ప్రేమ (కొరి. 5:14). గా సూచిస్తుంది. దీనిలో రెండవది సందర్భానుసారం.

  జెరోమ్ బైబిల్ వ్యాఖ్యనం, సంపుట, 2, 306 పే. శ్రద్ద గొలిపే విషయాలు కలవు.

- **"పాతనిబంధనలో" "కుమ్మరింపబడుట"** అనేవి దైవిక లక్షణం ("కరుణ", సర్ 18:11; జ్ఞానం; సర్. 1:9; '3దయ", 'కృప' కీర్తన 45:3; 'ఉగ్రత' , 'హోషేషా 5:10). ప్రత్యేకంగా యెవేలు 2:28, 'ఆత్మకుమ్మరింపు'.

- **"మనకు అనుగ్రహింపబడిన పరిశుద్ధాత్మ"** ఇది ఒక ఆరిస్ట్ పాసివ్ పార్టిసిపల్, ఇక్కడి కర్మార్ధకము దేవుని కార్యంగా చెప్పబడింది. ఇది విశ్వాసులకు ఇంకా అధికమైన ఆత్మ అవసరం లేదని సూచిస్తుంది. వారు ఆత్మను కల్గియున్నారు. లేక వారు క్రైస్తవులు కాదు (8:9). ఆత్మకుమ్మరింపు క్రొత్త యుగమునకు (యోవేలు 2:28-29), మరియు క్రొత్త నిబంధనకు సూచన (యెహె 36:22-32).

- ఈ వాక్యంలో త్రిత్వం యొక్క ముగ్గురు వ్యక్తులను గమనించండి.

  1. దేవుడు, 1,2,5,8,10
  2. యేసు, 1,6,8,9,10
  3. ఆత్మ, 5

**ప్రత్యేక అంశం : త్రిత్వం 8:11లో చూడండి.**

NASB (నవీన) వాక్యము : **5:6-11**

**6. ఏలయనగా మనమింక బలహీనులమై యుండగా, క్రీస్తు యుక్తకాలమున భక్తి హీనుల కొరకు చనిపోయెను. 7. నీతిమంతుని కొరకు సహితము ఒకడు చనిపోవుట అరుదు; మంచివానికొరకు ఎవడైన ఒక వేళ చనిపోవ తెగింపవచ్చును. 8. అయితే దేవుడు మన యెడల తన ప్రేమను వెల్లడి పరుచుచున్నాడు. ఎట్లనగా మనమింక పాపులమై యుండగానే క్రీస్తు మన కొరకు చనిపోయను. 9. కాబట్టి ఆయన రక్తము వలన ఇప్పుడు నీతిమంతులుగా తీర్చబడి, మరింత నిశ్చయంగా ఆయన ద్వారా ఉగ్రత నుండి రక్షింపబడుదము. 10.ఏలయనగా శత్రువులమై యుండగా, ఆయన కుమారుని మరణము ద్వారా మనము దేవునితో సమాధాన పరచబడిన పక్షమున, సమాధానముపరచబడిన వారమై ఆయన జీవించుటచేత మరి నిశ్చయముగా రక్షింపబడుదము. 11. అంతే కాదు; మన ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా మనము దేవుని యందు అతిశయపడుచున్నాము; ఆయన ద్వారానే మనమిప్పుడు సమాధాన స్థితి పొందియున్నాము.**

**5:6**

NASB **"మనమింక బలహీనులమై యుండగా"**

NKJV **"మనం బలం లేని స్థితిలో యుండగా"**

NRSV **"మనమింక నిస్సహాయులమై యుండగా"**

TEV **"మనం నిస్సహస్థితిలో ఉండినప్పుడు"**

NJB **"మనమింక నిస్సహాయులమై యుండగా"**

ఈ క్రియ ప్రెసెంట్ పార్టీసపల్. ఇది ఆదాములో పతనమైన మానవుని పాపపు స్వభావమును సూచిస్తుంది. మానవులు పాపమునకు విరుద్ధంగా శక్తి హీనులు.

- **"మనం"** అన్న సర్వనామము 66లో నామవాచకైన "భక్తిహీనులు"కు మరియు 8 లోని "పాపులు"కు, మరియు 10లోని "శత్రువులు"కు సాదృశ్యంగా ఉంది. 6 మరియు 8 వచనాలు వేదాంతపరంగా మరియు నిర్మాణాత్మకంగా సాదృశ్యమైనవి.

- NASB, NRSV **"యుక్తకాలమందు""**

  NKJV **"సరి అయిన కాలమందు"**

  TEV **"దేవుడు ఏర్పాటు చేసుకొన్న సమయంలో"**

  JB **"దేవుడు నిర్దేశించిన క్షణమున"**

ఇది చారిత్రాత్మకంగా (1) ఉచిత ప్రయాణపు అనుమతికల రోమా సమాధానం (2) భిన్నజాతుల సమాచార సంబంధములను అనుమతించిన గ్రీకు భాష; మరియు (3) గ్రీకు మరియు రోమా దేవుళ్ళ పతనంతో, ఆత్మీయంగా ఆకలిగోన్న ప్రపంచకాలం (మార్కు 1:15; గలతీ 4:4; ఎఫెసి. 1:10; తీతు 1:3)ను సూచించవచ్చు. వేదాంత పరంగా యేసుని అవతరం ప్రణాళిక గాబడిన దైవిక సంఘటన. (లూకా. 22:22; అపో 2:23; 3:18; 4:28; ఎఫెసి. 1:11).

**5:6,8,10 "భక్తి హీనులకొరకు చనిపోయెను"** ఇది ఆరిస్ట్ ఎక్టివ్ ఇండికేటివ్. ఇది యేసుని జీవితము మరియు మరణమును సమైఖ్య సంఘటనగా వ్యక్తపరుస్తుంది. యేసుని చేయని ఋణమును, మన ఋణమును బట్టి ఆయన ఋణమును చెల్లించెను. (గలతీ 3:13; 1 యోహాను 4:10).

పౌలు రచనాలలో క్రీస్తు మరణింపునరావృతి అంశం. పౌలు యేసు యొక్క ప్రాయశ్చిత్తార్ధపు మరణము కొరకు వేర్వేరు పదములను వాక్యములను ఉపయోగించినాడు (1) "రక్తము" (3:25;5:9; 1 కొరి 11:25,27; ఎఫెసి 1:7 2:13; కొలస్సి 1:20) ; (2) "తన్నుతాను అప్పగించుకొనెను" (ఎఫెసి 5:2,25)' (3) "విడిచి పెట్టెను" (రోమా 4:25; 8:32) (4) "యాగము" (1. కొరి 5:7); 95) "మరణించెను" (రోమా 5:6; 8:34; 14:9,15, 1 కొరి 8:11; 15:3; కొరి 5:15; గలతీ 5:21; 1 థెస్స 4:14; 5:10); (6) "సిలువ" (కొరి 1:17 – 18; గలతీ 5:11; 6:12–14; ఎఫెసి 2:16; ఫిలిప్పి 2:8; కొలస్సి 1:20; 2:14); (7) "సిలువ మరణం" (1 కొరి 1:23; 2:2 కొరి 13:4; గలతీ 3:1). హుపర్ విభక్తి ఈ సందర్భంలో ఈ విధమైన అర్ధము నిచ్చును.

1. ప్రాతినిధ్యం, "మన పక్షమున"
2. బదులుగా, "మనస్థానంలో"

సాధారణంగా షష్ఠీ విభక్తితోని హుపర్ "తరుపున" అనే అర్ధమునిచ్చును. (లే మరియు నిడ). ఇది ఒక వ్యక్తికి కలిగే ప్రయోజనమును వ్యక్తపరుస్తుంది. (దాన్యూ ఇంటర్‌నేషనల్‌డిక్షరీ ఆఫ్ న్యూటెస్ట మెంట్ థియాలజీ, సంపుట. 31196పే).అలాగుననే, హుపర్ "ఏంటి" అనే భావంను కల్గియుంది. ఇది "స్థానంలో" అని అర్ధమిస్తుంది. కాబట్టి వేదాంతపరంగా ఇది ఒకపాపపరిహారార్ధప్రాయశ్చిత్త మరణమును సూచిస్తుంది.(మార్కు.10:45;యోహను.11:50;18:14;11.కొరింది.5:14;1.తియో.2:6) యం.జె. హరిs

"క్రీస్తు,బదులుగామరణించెనని ఎందుకు చెప్పలేదు?(1.తియో.2:6లో దాని దగ్గరకు వచ్చెను–ఏంటిలిత్రోన్ హైపర్ పాంటోన్)? హైపర్ దిభక్తి, ఏంటి వలె కాకుండా, ప్రాతినిధ్యం మరియుప్రత్యా మమునుసూచించవచ్చు.యం.అర్ విన్సెంట్, వర్డ్సటడీస్,సంపుట.2 ఈవిదంగాచెప్పు చున్నాడు. "హుపర్‌బదులుగా"ఎల్లప్పుడు ఏంటి తరుపున సమానత్వం అనేది వివాదస్పదమైనది. అర్ధములు పరస్పర మార్పు చెందుతున్నట్టు

కనిపిస్తున్నప్పుడు పురాతన గ్రధకర్తలు సంధర్భములు చూపెటెవారు. వాక్యం యొక్క అర్ధం అనిశ్చయం.కాబట్టి ఋజువులలో చెప్పబడజాలదు. విభక్తి, స్థానిక అర్ధమైన "చనిపోయిన వారిపైన" అని సూచిస్తుంది. ఈ వాక్య భాగములు ఏవియు నిర్దేశితమైనవి కావు. హుపర్ అనేది ఎంటి అంచుల అర్ధమునకు సిద్ధాంతపరంగా వాదించబడుతుంది. ఆదిక్యంగా చాలా వాక్య భాగాలలో దీని భావన నిమిత్తం, తరుపునగా కనిపిస్తుంది. నిజమైన వివరణ ప్రాథమికణా ప్రశ్నలో ఉంది. నామకార్ధంగా ఇది క్రీస్తు మరణమునకు చెందినదిగా ఉంది. గలతీ 3:13; రోమా 14:15; పేతురు 3:18 హుపర్, అనిశ్చయమైన మరియు సాధారణ విభక్తితో క్రీస్తు వారి పక్షమున మరణించెను అని తెలియజేస్తుంది." 692 పే.

**5:7 ఈ వచనం ధి మానవ ప్రేమను చూపితే, 8వ వచనం దేవుని ప్రేమను చూపుతుంది.**

NASB, NKJV **"నీతిమంతుని కొరకు"**

TEV **"నీతిగల వ్యక్తికొరకు"**

JB **"మంచివానికొరకు"**

ఈ పదము, నోవహు వలె మరియు యోబు వలె నీతిమంతులు రే నిందారహితులు వంటి వారి కొరకు అన్న భావనతో వాడబడింది. వారు వారి కాలమునాటి నైతిక నియమాలను పాటించినారు. ఇది పాపరాహిత్యంను సూచించదు. 1:17లో ప్రత్యే అంశంను చూడండి.

**5:8 "దేవుడు తన ప్రేమను వెల్లడిపరుచుచున్నాడు"** ఇది ప్రెజెంట్ ఏక్టివ్ ఇండికేటగివ్ (3:5) తండ్రి కుమారుని పంపెను (8:3,32; కొరి 5:19) దేవుని ప్రేమ భావగర్భితమైనది కాదు క్రియాశీలమైనది (యోహాను 3:16; యోహాను 4:10) మరియు స్థిరమైనది.

**5:9 "మరింత"** ఇది పౌలు యొక్క అభిమాన వ్యక్తీకరణ (10,15,17) విశ్వాసులు పాపులుగా ఉంటుండగానే దేవుడు ప్రేమించినట్లయితే, ఇప్పుడు వారు దేవుని పిల్లలు కాబట్టి మరి ఇంక ఎంతగా దేవుడు వారిని ప్రేమించును. (5:10;8:22).

- **"నీతిమంతులుగా తీర్చబడి"** ఇది ఆరిస్ట్ పాసివ్ పార్టిసిపల్. ఇది నీతిమంతులుగా తీర్చబడటం అనేది దేవుని సంపూర్తి చేసిన కార్యమని సూచిస్తుంది. 1వ వచనం సత్యం పౌలు పునరావృతం చేస్తున్నాడు. అదేవిధంగా "నీతిమంతులుగా తీర్చబడటం" (9వ) మరియు "సమాదానపడటం" అన్న పదములను మద్య సాదృశ్యంను గమనించండి (10–11వ).

- **"ఆయన రక్తము వలన"** ఇది క్రీస్తు త్యాగపూరిత మరణమునకు సూచన (3:5; మార్కు 10:45; కొరి 5:21) బలియాగం అన్న అంశం, అపరాది స్థానంలో నిరాపరాద జీవం ఇచ్చుట అన్నది లేవి 1-7 మరియు నిర్గమ 12 (పస్కాగొఱ్ఱెపిల్ల)నకు వెళ్ళుతుంది.

ఇది వేదాంతపరంగా యెషయా 53:4–6లో యేసుని జీవితంనకు అన్వయింపబడుతుంది. హీబ్రూ పుస్తకంలో ఇది క్రీస్తు శాస్త్ర భావనగా వృద్ధి చెందినది. హీబ్రూ పుస్తకం అనేక రీతులుగా పాత మరియు క్రొత్త నిబంధనలను పోల్చి చూపుతుంది.

- **"మనము రక్షింపబడుదము"** ఇది భవిష్యత్ కర్మార్ధకపు సూచన. (10వ) ఇది మన అంతిమ రక్షణ అని పిలువబడుతున్న మహిమ పర్చబడటంను సూచిస్తుంది. (2వ; 8:30, యోహాను 3:2).

నూతన నిబంధన రక్షణను వివిధ కాలపు క్రియలలో వివరిస్తుంది. (1) సంపూర్తి కార్యం (ఆరిస్ట్), అపొ 15:11; రోమా 8:24; తిమో 1:9; తీతు 3:5; (2) గతకాలపు చర్య యొక్క ప్రస్తుతపు స్థితి (పెర్ఫెక్ట్), ఎఫెసి. 2:5,8; (3) క్రమేణ విధానం (భూతకాలం), కొరి 1:18; 15:2; కొరి 2:15; థెస్స 4:14; పేతురు 3:21; మరియు (4) భవిష్యత్ సంపూర్తి (భవిష్యత్కాలం), రోమా 5:9,10; 10:9 ప్రత్యేక అంశం 10:13ను చూడండి.

రక్షణ ఒక వ్యక్తిగత నిర్ణయంతో ప్రారంభమై, ఒక సంబంధంలోని క్రమేణ వెళ్ళి ఒక రోజు సంపూర్తి చేయబడుతుంది. ఈ అంశం మూడవేదాంతపదములతో వివరించబడుతుంది. నీతిమంతులుగా తీర్చబడటం, అనగా "పాపపు శిక్ష నుండి విడిపింపబడటం" పరిశుద్ధపర్చబడుట. అనగా, "పాపపు శక్తి నుండి విడిపించబడటం". మరియు మహిమపర్చబడటం, అనగా "పాపపు సన్నిది నుండి విడిపించబడటం".

నీతిమంతులుగా తీర్చబడటము మరియు పరిశుద్ధపర్చబడటం అనేవి దేవుని కృపకార్యాలు. ఇవి క్రీస్తునందు విశ్వాసం ద్వారా విశ్వాసికి ఇవ్వబడినవి. అదే విధంగా, పరిశుద్దపర్చబడటం అనే క్రీస్తు సారూప్యతలోనికి క్రమంగా మార్చబడే విధానంగా క్రొత్త నిబంధన చెప్పుతుంది. ఈ కారణము చేతనే వేదాంతకారులు "స్థాన పరిశుద్దీకరణ" అని "వృద్ధిచెందుతున్న శుద్దీకరణ" అని చెప్పుదురు. దైవిక జీవితంతో ముడిపడియున్న ఉచిత రక్షణ యొక్క మర్మము.

- **"దేవుని ఉగ్రత నుండి"** ఇది అంత్యకాల సందర్భపు వాక్యం. దేవుని యొక్క గొప్ప కృప, జీవి గురించి బైబిల్ చెప్పుతుంది. అదే విధంగా పాపము యెడల దేవుని స్థిర విరోధమును స్పష్టంగా చెప్పుతుంది. దేవుడు రక్షణకు మార్గమును మరియు క్రీస్తు వలన పాపపు క్షమాపణనను కల్గించినాడు. కాని ఆయనను తృణీకరించువారు ఉగ్రత పాలగదురు. (1:18–3:20). ఇది దేవునికి మనుష్య రూప లక్షణములతో వివరించే వాక్యమైనప్పటికి, ఇది ఒక నిజమును వ్యక్తపరుస్తుంది. ఉగ్రత గల దేవుని చేతులలో పడుట అతి భయంకరము (హెబ్రీ 10:31).

  **5:10 "పక్షమున"** ఇది మొదటి తరగతి షరతుల వాక్యము. ఇది గ్రంథకర్త దృక్పధం నుండి సత్యమై, తన సాహిత్య ఉద్దేశ్యం కొరకు వాడబడినది. దేవుని చివరి సృష్టి అయిన మానవత దేవునికి శత్రువులైనారు! మానవులు (ఆది 3:5) మరియు సాతాను (యెషయా 14:14; యెహె 28:2, 12–17)లకు ఒకేలాంటి సమస్యలు ఉన్నవి. అవేవనగా, స్వాతంత్ర్యంకొరకైన ఆశ; ఆదికారపు ఆశ; దేవుళ్ళగా ఉండాలనే ఆశ.

- **"సమాధాన పరచబడిన వారమై ......మనము దేవునితో సమాధాన స్థితి కల్గి యున్నాము"** ఇక్కడ క్రియ, "సమాధానపర్చబడుట" అనేది "వినిమయము చేయు" అని అర్థము నిచ్చును. దేవుడు మన పాపములకు క్రీస్తు నీతితో వినిమయం / మార్పు చేసినాడు. (యెషయా 53:4–6) సమాధానం నెలకొల్పబడింది (1.వ).

- **"తన కుమారుని మరణం ద్వారా"** క్షమాపణ సువార్త (1) దేవుని ప్రేమ పైన; (2) క్రీస్తు కార్యం పైన ; (3) ఆత్మ ఒప్పుదలపైన ; (4) విశ్వాసం / మారుమనుస్సుతో వ్యక్తిగత స్పందనపైన ఆధారపడియుంది. దేవునితో సరిగా ఉండుటకు వేరే మార్గము లేదు (యోహాను 14:6). రక్షణ నిశ్చయం త్రియేక దేవుని గుణముపైన గాని మానవ కార్యముపైన లేదు. రక్షింపబడిన తరువాత మానవుని క్రియలు ఉచిత రక్షణకు ఋజువుగా ఉండుటం విరుద్ధంగా కనిపిస్తుంది. (యాకోబు మరియు యోహాను).

- **"మనము రక్షింపబడుదము"** క్రొత్త నిబంధన రక్షణ అనేది వర్తమాన, భూత, భవిష్యత్ కాలములు జరుగునది అని వివరిస్తుంది. ఇక్కడ వచనం, రెండవ రాకడలో అంతమయ్యే రక్షణ కార్యంను సూచిస్తుంది. 9వ మరియు 10:13లోని ప్రత్యేక అంశంను చూడండి.

- **"ఆయన జీవించుటచేత"** జీవం కొరకైన గ్రీకు పదం జో ఈ పదం యోహాను రచనలలో ఎప్పుడూ, పునరుత్థాన జీవితం, నిత్యజీవం, లేక రాజ్యపు జీవితంను సూచిస్తుంది. పౌలు కూడా ఇదే వేదాంత భావనలో ఉపయోగించినాడు. ఈ సందర్భం యొక్క మూలాదారం ఏమిటంటే, విశ్వాసుల క్షమ కొరకు దేవుడు ఉన్నత వెలను చెల్లించినాడు కాబట్టి దేవుడు నిశ్చయంగా దాని ప్రభావంను కొనసాగింపజేయును.

- **"జీవం"** 91) యేసు యొక్క పునరుత్థానం (8:34; కొరి 15); (2) యేసు విజ్ఞాపన పరిచర్య (8:34; హెబ్రీ 7:25;1 యోహ 2:1); లేక (3) మనలో ఆత్మ కల్గించు క్రీస్తు పోలిక (రోమా 8:29; గలతీ.4:19)లను సూచించవచ్చు. క్రీస్తు యొక్క భూమిమీద జీవితం, మరణం మరియు పునరుత్థాన జీవితం మన సమాధానంనకు ఆదారమని రూడిపరచుచున్నాడు.

**5:11 "అంతేకాదు" 3వ వచనం నోట్ చూడండి.**

- **"మనము అతిశయమపడుదము"** 5:2లోని నోట్ చూడుము. ఈ సందర్భంలో అతిశయం అనేది మూడవసారి ఉపయోగించబడింది.

1. మహిమ నిరీక్షణను బట్టి అతిశయం 2వ.
2. శ్రమ యందు అతిశయం 3వ.
3. సమాధానం యందు అతిశయం 11.వ. 2:17&23లో ప్రతికూల అతిశయం చూడబడింది.

- **"ఇప్పుడు సమాధాన స్థితి పొందియున్నాము"** ఇది సంపూర్తి కార్యం 10వ వచనంలో మరియు కొరి 5:18–21; ఎఫెసి.2: 16–22; కొలస్సి 1:19–23లో విశ్వాసుల సమాధానం చర్చించబడింది. ఈ సందర్భంలో "సమాధానం" "నీతిమంతులుగా తీర్చబడటం"నకు వేదాంత పర్యాయపదము.

NASB (నవీన) వాక్యము:5:12-14

**12. ఇట్లుండగా ఒక మనుష్యుని ద్వారా పాపమును, పాపము ద్వారా మరణమును లోకములో ఏలాగు ప్రవేశించెనో, మనుష్యులందరూ పాపము చేసినందున అ బిగుననే మరణము అందరికి సంప్రాప్త మాయెను. 13. ఏలయనగా ధర్మశాస్త్రము వచ్చెను గనుక పాపము లోకములో ఉండెను గాని ధర్మశాస్త్రము లేనప్పుడు పాపము ఆరోపింపబడదు. 14. అయినను ఆదాము చేసిన అతిక్రమమును బోలి పాపము చేయని వారి మీద కూడ, ఆదాము మొదలుకొని యోషే పర్యంతము మరణమేలెను; ఆదాము రాబోవానికి గురుదై యుండెను.**

**5:12 "కావునన"** రోమాలో "కావునాత" క్రమానుసారంగా ఉంచబడినవి (5:1; 8:1, 12:1). ఇది పౌలు యొక్క వాడిన అంతటివి చూపించే ఒక మార్గంగా ఉంది. నిజంగా ఇది ఆదికాండమునకు సంబంధించినది. కావున రోమా 1:18-32నకు బహుశా వెనుకకు వెళ్ళవచ్చు.

- **"ఒక్క మనుష్యుని ద్వారా పాపములోకములోని ప్రవేశించెను".** 12వ వచనంలోని క్రియలు అన్నియూ ఆరిస్ట్ కాలమునకు చెందినవి. ఆదాము పతనము మరణమును తెచ్చెను (1 కొరి 15:22) బైబిల్ పాపపు ఉత్పత్తి దగ్గరే ఉండుట లేదు. పాపము దూతల సముదాయంలో కూడా జరిగినది. (ఆది 3 మరియు ప్రకటన 12:79) ఎలా, ఎప్పుడూ అనేది అనిశ్చయము (యెషయా 14:12-27; యెహె 28:12-19; యోబు 4:18; మత్తయి 25:41) లూకా 10:10; యెహోను 12:31; ప్రక 12:7-9).

  ఆదాము పాపము రెండు దృక్పదములను కల్గియుంది.

  (1) ఆదాము ఒక ప్రత్యేకమైన ఆజ్ఞకు అవిదేయతను చూపినాడు (ఆది 2:16-17), మరియు (2) స్వార్ధపూరిత గర్వము (ఆది 3:5-6). ఇది ఆదికాండములోని మాదిరిగా కొనసాగి రోమా 1:18-32లో ప్రారంభమైనది.

  రబ్బీల బోద నుండి స్పష్టంగా పాపపు వేదాంతం పౌలును వేరుపరుచతుంది. రబ్బీలు ఆదికాండము 3ను దృష్టించరు. వారు ప్రతివ్యక్తిలో "తలంపులు" (యట్జర్స్)ను రూడి పరుస్తారు. ఖ్యాతినొందిన రబ్బీలపదము "ప్రతిమనుష్యుని హృదయంలో ఒక తెల్ల కుక్కను మరియు నల్లకుక్క ఉంటుంది. దేనినైతే అదికంగా పోషిస్తావో అది పెరగుతుంది". పరిశుద్ధ దేవుని మానవునికి మధ్య పాపము ఒక అడ్డుగా పౌలు చూస్తున్నాడు. పౌలు ఒక క్రమానుసారమైన వేదాంతి కాదు. (జేమ్స్ స్టువర్ట్, ఎమేన్ ఇన్ క్రైస్ట్). పౌలు పాపము యొక్క ఉత్పత్తులను చాలా ఇచ్చినాడు.

(1) ఆదాము పతనము, (2) సాతానీయ శోదన, మరియు (3) కొనసాగుతున్న మానవుని అపరాధము.

వేదాంత పోలిక వ్యత్యాసాలలో ఆదామునకు క్రీస్తునకు రెండు సాధ్యమైన సూచనలు.

1. ఆదాము ఒక చారిత్రాత్మక వ్యక్తి.
2. క్రీస్తు ఒక నిజమైన వ్యక్తి.

   తప్పుడు బోదలను ఎదుర్కొంటు బైబిల్ ఈ రెండు సత్యములను రూడిపరుస్తుంది. "ఒకమనుష్యుడు" మరియు "ఒక్కడు" పునరావృతం అగుట గమనించండి. ఈ రెండు ఆదామునకు యేసు క్రీస్తునకు సంబంధించి ఈ సందర్భంలో 11 సార్వు వాడబడినది.

   "పాపము ద్వారా మరణములీ" బైబిల్, మరణము యొక్క మూడు దశలను చూపిస్తుంది.

1. ఆత్మీయ మరణం (ఆది 2:17;1-7;ఎఫెసి2:1);
2. బౌతిక మరణిం (ఆది.5); మరియు (3) నిత్యమరణం (ప్రకటన 2:11; 20:6,14;21:8)/ ఈ వాక్య భాగంలో మాట్లాడినది. ఆత్మీయ మరణము (ఆది: 3:14-19).

   ఇది మానవ జాతికి బౌతిక మరణమును తెచ్చినది. (ఆది.5).

- **"మరణము అందరికి సంప్రాప్తమాయెను".** ఈ వాక్యభాగంలోని ముఖ్యాంశం, పాపం యొక్క సార్వత్రకత (16-19; కొరి 15:22; గలతీ 1:10).

- **"అందరూ పాపము చేసినందున"** మానవులందరూ సమైక్యంగా ఆదాములో పాపము చేసినవారు. ప్రతిఒక్కరూ వ్యక్తిగతంగా పాపము చేయుటకు ఎంచుకొనిన కారణము చేత. మానవులందరూ సమైఖ్యంగా మరియు వ్యక్తిగతంగా పాపము చేసిన వారని బైబిల్ నొక్కి

చెప్పుతుంది. 91 రాజులు 8:46; దిన 6:36; కీర్తన 14:1-2; 130:3; 143:2; సామె 20:9; ప్రసంగి 7:20; యెషయా 9:17; 53:6; రోమా 3:9-18; 5:18; 11:32; గలతీ 3:22; 1 యోహాను 1:8-10.

సందర్భోచితంగా, ఒకని కార్యము మరణమును కలుగజేసింది. ఇంకొకని కార్యము జీవమును కల్గించింది (యేసు) ఎదేమి అయిననూ, దేవుడు మానవునితో తన సంబంధమును మానవుని నీతిమంతులుగా తీర్చి మానవుని స్పందనతో ఈ సంబంధమును నిర్మించుచున్నాడు. మానవులు వారిస్వేచ్ఛ చిత్త నిర్ణయమును బట్టి వారి భవిష్యత్‌ను నిర్దేశించుకొందురు. వారు పాపములో కొనసాగుటనైన లేక క్రీస్తువైన ఎంపిక చేసుకో గలరు. ఈ రెండు ఎంపికలను వారు ప్రభావితం చేయలేరు కాని వారి చిత్తమును బట్టి వారు దేనికి చెందినవారో అని చూపించగలరు.

▣ **"కావున"** అన్న అనువాదం సాదారణమే అయినా, తరుచుగా ఇది వివాదమయం. పౌలు కొరి 5:4; ఫిలిప్పి 3:12; మరియు 4:10లో ఎఫోవోను "కావునా" అన్న భావనతో ఉపయోగించినాడు. కావునా ఈ విధంగా ప్రతి మనుష్యుదును వ్యక్తిగతంగా పాపంలో పాల్గొని దేవునికి తిరుగుబాటు చేయుచున్నారు. కొంతమంది ప్రత్యేక ప్రతక్షతను, మరియు అందరు సహజ/ప్రకృతి ప్రత్యక్షతను తృణీకరించుట ద్వారా అవి చేయుచున్నారు.

**5:13-14** రోమా 4:15 మరియు అపొ 17:30లో ఇదే సత్యం బోధించబడింది. దేవుడు న్యాయవంతుడు. మానవులు వారికి లభ్యమైన దానిని బట్టి వారు బాధ్యులు. ఈ వచనం ప్రత్యేక ప్రత్యక్షత గురించి మాటలాడుతుంది. (పాతనిబంధన, యేసు, క్రొత్తనిబంధన), కాని సహజ ప్రత్యక్షత గురించి కాదు. (కీర్తన. 19, రోమా 1:18-23; 2:11-16).

**5:14**

NASB, NKJV, JB **"మరణమేలెను"**

NRSV **"మరణము పాలన చేసెను"**

TEV **"మరణము పరిపాలించెను"**

మరణము రాజు వలె పరిపాలించెను (17&21వ). పాపమునకు మరియు మరణమునకు ఒక నియంతవలె మనుష్య గుణారోపణము చేయుట ఈ అధ్యాయంలోనూ 6వ అధ్యాంలోనూ కనిపిస్తుంది. సర్వమానవుల మరణం, సర్వమానవ పాపమును రూడిపరుచుతుంది. 17 మరియు 21 వచనలలో, కృపకు మనుష్యదీ గుణారోపణము చేయబడింది. కృప పాలిస్తుంది! మానవులకు ఎంపిక కలదు (రెండు పాత నిబంధన మార్గాలు) మర?ణము లేదా జీవము. ఎవరు నీజీవితంలో పాలిస్తున్నారు.

JB **"పాపము చేని వారి మీదను కూడాను మరణమేలెను"** ఆదాము, చెప్పబడిన దేవుని ఆజ్ఞను మీరెను. ఈ రీతిలో అవ్వ పాపము చేయలేదు. ఆమె చెట్టు గురించి ఆదాము నుండి వినినది కాని దేవుని నుండి స్వయంగా కాదు. ఆదామునుండి యోషే వరకు ఉన్న మానవులు ఆదాము తిరుగుబాటు వలన ప్రభావితం చేయబడినారు. వారు దేవుని నుండి వచ్చిన ప్రత్యేక ఆజ్ఞను మీరలేదు, కాని 1:18-32, ఈ వేదాంత సందర్భంలోని భాగం, సృష్టి నుండి వారికి కలిగిన వెలుగును మీరిన కారణము చేతనూ మరియు వారు పాపమునకు/తిరగుబాటునకు భాధ్యులు అన్న సత్యం పై వచనలు తెలియజేస్తున్నాయి. ఆదాము యొక్క పాపపు మనస్సు తన సంతతికి అంతటికి వ్యాప్తి అయినది.

NASB, NKJV, NRSV **"రాబోవు వానికి ఆయన గురుతుగా ఉండెను"**

JB **"ఆదాము రానున్నవానికి ముందుగురుతుగా ఇది చాలా బలమైన రీతిలో ఆదాము"**

క్రీస్తు మాదిరిని వ్యక్తపరుస్తుంది. (కొరి. 15:21-22, 45-49; ఫిలిప్పి 2:6-8) వారిరువురు వరుసలోనూ, ఉత్పత్తిలోనూ మొదటివారుగా కనిపిస్తున్నారు. 9కొరి 15:45-49). ఆదాము ఒక్కడే పాతనిబంధ నుండి ప్రత్యేక,గా క్రొ.నికు మాదిరిగా చూపబడుతున్నాడు.

NASB (నవీన) వాక్యముచ: 5:15-17

**15 అయితే అపరాదము కలిగినట్లు కృపావరమును కలుగలేదు. ఎట్లనగా ఒకని అపరాధం వలన అనేకులు ఎట్లనగా ఒకని అపరాధం వలన అనేకులు చనిపోయిన పక్షమున, మరి నిశ్చయముగా దేవుని కృపయు, యేసుక్రీస్తు అను ఒక మనుష్యుని కృప చేతనైన దానమును, అనేకులుకు కలిగినట్లు అవి విస్తరించెను 16 మరియు పాపము చేసిన యొకని వలన శిక్షావిధి కలుగునట్లు ఆ ధానము కలుగ లేదు. ఏలయనగా తీర్పు ఒక్క అపరాధమూలముగా వచ్చినదై శిక్షావిదికి కారణమయెను; కృపావరమైతే అనేకమైన అపరాధముల మూలంగా వచ్చినదై మనుష్యులు నీతిమంతులుగా తీర్చబడుటకు కారణమాయెను. 17 మరణము ఒకని అపరాధము మూలమున వచ్చినదై ఆ యెకని ద్వారానే యేలిన పక్షమున, కృపాబాహుళ్యమును నీతిదానమును పొందు వారు జీవము గలవారై, మరి నిశ్చయమును నీతిదానమును పొందువారు జీవముగలవారై, మరి నిశ్చయముగా యేసుక్రీస్తు అను ఒకని ద్వారానే యెలుదురు.**

**5:15-19** ఇది సాదృశ్య వాక్యములను వాడుతున్న నిలకడ వాదన. NASB, NRSV, & TEV 18వ వచనం దగ్గర వాకభాగమును విడదీసాయి. UBS[4], NKJV, JB దీనిని ఒకే యూనిట్‌గా అనువదించాయి. గ్రంథకర్త యొక్క అసలు తలంపును వ్యాఖ్యానించుటకు ఒక్కొక్క వాక్యభాగమునకు ఒక ముఖ్య సత్యము అన్న మూలంను గుర్తు చేసుకో. 15&19 వచనాలలోని "అనేకులు", 12&18వచనాలలోని "అందరు పర్యాయపదముగా గమనించాలి. ఇది యెషయా 53:11-12 మరియు 6వ వచన విషయంలో కూడా సత్యమే. ఈ వచనములను ఆదారం చేసుకొని ఎటువంటి వేదాంత వ్యత్యాసాలను చేయకూడదు.

**5:15 "ఉచిత దానము"** ఈ సందర్భంలో రెండు వేర్వేరు గ్రీకు పదములు "దానము" కొరకు వాడబడినవి - కరిస్మా, 15,16 (6:23) మరియు డోరియా / డోరామా, 15,16,17 - కాని అవి పర్యాయం; ఎఫెసి. 2:8,9) క్రీస్తునందు విశ్వాసము ఉంచు వారి అందరికి ఉచిత వరము. "పక్షమున" ఇది మొదటి తరగతి షరతులతొ కూడిన వక్తమై గ్రంథకర్త దృక్పదము నుండి సత్యమై, తన సాహిత్య ఉద్దేశ్యము కొరకు వాడబడినది. ఆదము పాపము అందరికి మరణమును తెచ్చినది. ఇది17వ వచనంలో సాదృశ్యంగా ఉంది. 5:16 శిక్షావిధి????నీతిమంతులుగా తీర్చ బడుటము' ఇది రెండునూ న్యాయ సంబంధ పదయములే. తరు చుగా పాతనిబవధనప్రవక్తల వర్తమానములు ఒక కోర్టు దృశ్యంగా కనిపించేవి.పౌలు ఈరీతినే వాడు చున్నాడు. (రోమా. 8:1, 31-34). 5:17 "పక్షమున" ఇదిమొదటి తరగతి షరతులు వాక్యమై, గ్రంధకర్త దృక్పధమునుండి సత్యమై, తనసాహిత్య ఉద్దూశ్యం కొరకు వాడబడినది. ఆదాము అతిక్రమము మావులందరి మరణమునకు దారి తీసింది.

JB **"స్వీకరించు వారు మరింత నిశ్చయముగా"**18-19వచనాలు వేదాంత పరంగా సమతుల్యమైనవికావు. విక్యము రోమా1-0 యొక్క సంధర్భము నుండి తోలగించ బడజాలవు. ఈవచన భాగములు సార్వత్రిక వాదమును ఋజువు చేసే వ్యాభాగములు (అందరూ ఎదో రీతిలో రక్షింపబడుదురు) క్రీస్తులోనిదేవుని వరమును మానవులు తప్పక స్వీకరించాలి (176).రక్షణ అందరికి లభ్యమే, కాని దానిని వ్యక్తిగతంగా అంగీకరించాలి( యెప. 1:12.;3:16;రోమా. 10:9-13) ఆదాము యొక్క ఒక తిరుగును బాటు చర్య హెచ్చింపబడింది. అయితే క్రీస్తు లో ఒక్కనీతి యాగము అనేక వ్యక్తుల పాప మును మరియు పాపము యొక్క సమైఖ్య ప్రభావమును కప్పి వేయుటలో హెచ్చుయినది. "మరింత" అనిక్రీస్తు కార్యమునునోక్కి చెప్పబడింది. (9,10,15,17)కృపవిస్తరించును. 5:17,18"నీతిదానమును పొందువారు జీవనము గలవార్తె, మరి నిశ్చయము గా పలుదురు". పతనమైన మానవుల ఆత్మీయ అవసర తలకు యేసు క్రీస్తు దేవుని వరము మరియు ఆదారము.(1కొరి. 1:30). ఈ సాదృశ్య వాక్యములు:(1) క్రీస్తు సంపూర్తి కార్యము వలన పాపభరితమైన మానవులు దేవుని తోసరి అయి దాని ఫలితంగా"దైవికజీవితమును" పొందురు; లేక(2) ఈవాక్యమునిత్యజీవణమునకు పర్యాయ పదము. సంధర్భము మొదటి దానిని బలపర్చుతుంది. నీతి, పదద్యానమునకు ఽప్రత్యేక అంశం:1:17ను చుడుము

**ప్రత్యేకఅంశం : దేవుని రాజ్యంలో పరిపాలన**

దేవునిరాజ్యంలో పరిపాలన క్రీస్తుతో పరిపాలన అన్న అంశం విశాలమైన వేదాంత వర్గము నకు చెందిన "దేవునిరాజ్యము" లో ఇకభాగము. ఇది పాతనిబంధమునలో దేవుడు రాజు గా ఉన్న అభిప్రాయం నుండి వచ్చినది (సమూ. 8:7). దేవుడు, యూదాగోత్రము నుండి (ఆది49:10) మరియు యెషయి యొక్క కుటుంభం నుండి (11.సమూ. 7) పరిపాలన చేసినాడు (1.సమూ. 8:7; 10:17-19).యేసుక్రీస్తు, పాతనిమంధనలో మెస్సియా ప్రవచనం లకువాగ్దానమునకు నెరవేర్పు. యేసు, బెద్లేహము అవతారముతో. దేవునిరాజ్యమును ప్రారంబించినాడు.యేపు క్రీస్తు వర్తమానంలో దేవుని రాజ్యం అన్న భోద కేంద్ర స్థంభంగా ఉంది. దేవునిరాజ్యము యేపులో సంపూర్తిగా వచ్చినది. (మత్తయి. 10:7;11:12;12:28;మర్కూ 1:15;లూకా. 10:9,11;11:20;16:16;17:20-21). అలాగుననే,దేవుని రాజ్యచము భవిష్యత్ సంబంధమైనది(అంత్యకాలం) అదిప్రస్తుం ఉంది కాని ముగియలేదు (మత్తయి. 6:10; 8:11;

16:28;22:1-14;26:29;లూకా. 27;11:2;13:29;14:10-24;22:16,18). యేసుమొదటశ్రమపోందే సేవకుడిగా వచ్చెను(యెషయా. 52:13-53:12); సాత్వికుడిగా(జకర్యా. 9:0), వచ్చెను కానిచివరగా రాజుల రాజుగా రానైయున్నాడు (మత్తయి. 2:2;21:5;27:11-14) "పరిపాలన" అన్న అంశం నిశ్చయంగా "రాజ్యము" వేదాంతలో భాగమే. యేసు అనుసరులకు దేవుడు రాజ్యనిచ్చెను.(లూకా. 12:32చూడండి).

1. దేవుడు విశ్వాసులకు క్రీస్తు ద్వారా"రాజ్యము"ను ఇచ్చెనుసూచిస్తున్నాయా?(మత్తయి. 5:3;లూకా. 12:32)?
2. మొదటి శతాబ్దపు సంధర్భంలో అసలు శిష్యులతో యేసు చెప్పిన మాటలు విశ్వాసులందరికి సూచిస స్తాయా? (మత్తయి. 19:28; లూకా. 22:28-30)?
3. ఇప్పటిజీవితంలో పరిపాలన అని నొక్కి పలుకుతున్న పౌలు మాటలు పై వాక్య భాగములతో విభేదిస్తున్నాయా? లేక అభినందిస్తున్నాయా? (రోమా. 5:17;1.కొరి. 4:8) ?
4. శ్రమమరియుపరిపాలన ఎలా సంబంధం కల్గియున్నవి ?
5. ప్రకటన గ్రంథంలో పునరావృతం అవుతున్న అంశం, మహిమ పొందిన క్రీస్తు పరిపాలనలో పొందటం
   ఎ. భూలోక సంబంధమైన, 5:10
   బి. వెయ్యేండ్ల పాలన, 20:5, 6
   సి. నిత్యం, 2:26; 3:21; 22:5 మరియు దాని 7:14,17, 27

**NASB (నవీన) వాక్యము 5:18-21**

**18. కాబట్టి తీర్పు ఒక్క అపరాదమూలమున వచ్చినదై మనుష్యుల కందరికి శిక్షా విధి కలుగుటకు ఏలాగు కారణమాయెనో, అలాగే ఒక్కక పుణ్యకార్యము వలన కృపాదానము మనుష్యుల కందరికి జీవ ప్రదమైన నీతి విధింపబడుటకు కారణమాయెను. 19. ఏలయనగా ఒక మనుష్యుని అవిధేయత వలన అనేకులు పాలపులుగా ఏలాగు చేయబడిరో, అలాగే ఒకని విధేయత వలన అనేకులు నీతిమంతులుగా చేయబడుదురు. 20. మరియు అపరాధము విస్తరించునట్లు ధర్మశాస్త్రము ప్రవేశించును. 21. అయినను పాపము మరణమును ఆధారము చేసికొని యేలాగు ఏలెనో, అలాగే నిత్యజీవము కలుగుటకై, నీతి ద్వారా కృపయు మన ప్రభువైన యేసుక్రీస్తు మూలముగా ఏలు నిమిత్తము పాప యెక్కడ విస్తరించెనో అక్కడ కృప అపరిమితముగా విస్తరించెను.**

**5:18**

**NASB, NKJV "ఒక్క పుణ్యకార్యము వలన కృపాదానము మనుష్యులందరికి జీవప్రదమైన నీతి విధింపబడుటకు కారణమాయెను.**

**NRSV "ఒక్క మనుష్యుని నీతి కార్యము వలన కృపదానం అందరికి కలిగెను"**

**TEV "ఒక్క మనుష్యుని నీతికార్యము నీతికిని మరియు జీవమునకు దారితీసింది"**

**JB "ఒక్క మనుష్యుని మంచి కార్యము అందరికి జీవమును మరియు నీతిమంతులుగా తీర్చబడువలెనే"**

ఇది ప్రతి ఒక్కరూ ఎదోవిధంగా రక్షింపబడుదురు. (సార్వతిక రక్షణవాదం) అన్న మాటకాదు. ఈ మాట, రోమా పత్రిక మరియు అక్కడి సందరభములో కాకుండా అనువాదం చేయబడకూడదు. ఇది యేసుక్రీస్తు జీవితం / మరణం / పునరుత్థానముద్వారా అందరూ రక్షింపబడగలరనే దాని మాత్రమే సూచిస్తుంది. సువార్త వరమునకు మానవుడు విశ్వాసంతోనూ మారు మనస్సుతో తప్పక స్పందించాలి. (మార్కు 1:15; అపొ 3:16, 19; 20:21) దేవుడే ఎల్లప్పుడు ముందు అడుగు వేస్తాడు. (యోహాను 6:44, 65) కాని, ప్రతి వ్యక్తి వ్యక్తిగతం స్పందించాలని నియమించెను. (మార్కు 1:15; యోహాను 1:12; మరియు రోమా 10:9-13) దేవుని వరం విశ్వవ్యాప్తమైనది. (1తిమో 2:4,6; 2 పేతురు 3:9; 1 యోహాను 2:2) అతిక్రమము యొక్క మర్మమేమిటంటే అనేకమంది "కాదు" అని చెప్పుదురు.

- **"నీతి కార్యము"** అనేది (10 యేసు మన యియొక్క విధేయత జీవితము మరియు దేవుని ప్రత్యక్షత (2) ప్రత్యేకంగా పాపభరిత మానవులు పక్షమున యేసుని మరణము ఒక్క మనుష్యుని జీవితం అందరిని ఎలాగు ప్రభావితం చేసినదో (యూదుల సమైఖ్యత, యెహోషువ. 7) ఆ రీతిగానే ఒక్క నిరపరాధ జీవితం అందరికి ప్రభావితం చేస్తుంది. కాని విశ్వాసులు మాత్రమే నీతిమంతులుగా తీర్చబడువరమును

స్వీకరించుదురు. యేసుని కార్యము మానవ పాపమంతటిని ప్రభావితం చేయును. విశ్వసించి, స్వీకరించువారికి గతంలో ప్రస్తుతం మరియు భవిష్యత్‌లో కూడా.

**5:18-19 "మనుష్యులందరికి శిక్షావిధి...... మనుష్యులందరికి జీవప్రదమైన నీతి విధింపబడుట....... అనేకులు పాపులుగా.......... అనేకులు నీతిమంతులుగా..."** ఈ సాదృశ్యవాక్యభాగములు "అనేకులు" అన్నపదమును మితములో నుండెడి భావనతో కాకుండా చేర్చుకొనునట్టి భావనతో వాడబడినది. ఇదే సాదృశ్యము యెషయా 53:6 లోని "అందరి" మరియు 53:11,12 "అనేకులు. అని కనిపిస్తుంది. "అనేకులు" అన్న పదము, మానవులకందరికి దేవుని రక్షణ వరంను మిత భావనతో చూడకూడదు. (కాల్విన్ యొక్క ఎన్నిక చేయబడినవారు & ఎన్నిక చేయబడనివారు)

రెండు క్రియల యొక్క కర్మార్థకమును చూడండి. అవి దేవుని కార్యమును సూచిస్తున్నాయి. దేవుని యొక్క గుణమునకు మానవుని పాపము సంబంధముతో మరియు దేవుని గుణమునకు సంబంధించి వారు నీతిమంతులుగా తీర్చబడినారు.

**5:19 "ఒక మనుష్యుని అవిధేయత.... ఒక్కని విధేయత"** పౌలు పాత నిబంధన సమైఖ్యవాదనను ఉపయోగించుచున్నాడు. ఒక మనుష్యుని కార్యము సమాజమంతటిని ప్రభావితం చేసింది. (ఆకాను యెహోను వా. 7) ఆదాము, అవ్వల అవిధేయత సృష్టి అంతటికి మీదకి దేవుని తీర్పును తీసుకొని వచ్చింది. (ఆది.3) ఆదాము తిరుగుబాటు పర్యావసనములు సృష్టి అంతటిని ప్రభావితం చేసినది (8:18-25). ప్రపంచం ఒకేలా లేదు. మానవులు ఒకేలా లేరు. ఇహ లోక జీవిత అంతంగా మరణం మారినది (ఆది. 5) ఇటువంటి లోకము కొరకు దేవుడు తలంచలేదు.

ఇటువంటి సమైఖ్య భావనలోనే యేసు విధేయత జీవితం, కలువరి, (1) ఒక నూతన యుగం, (2) ఒక నూతన జనాంగం, మరియు (3) ఒక క్రొత్తనిబంధనలో ఫలితమిచ్చింది. ఈ ప్రాతినిధ్యను వేదాంతంను "ఆదాము-క్రీస్తు మాదిర"గా పిలువబడుతుంది. (ఫిలి 2:6) యేసుక్రీస్తు, నూతన ఆదాము, ఆయన పతన మానవ జాతి కొరకు నూతన ప్రారంభం.

▣ **"నీతి మంతులుగా తీర్చబడుట"** 1:17 ప్రత్యేక అంశంను చూడండి

**5:20**

**NASB "అపరాధము విస్తరించునట్లు ధర్మశాస్త్రము ప్రవేశించెను"**

**NKJV "అపరాధము విస్తరించునట్లు ధర్మశాస్త్రము వచ్చెను"**

**NRSV "ధర్మశాస్త్రము వచ్చి ఫలితంగా అతిక్రమం విస్తరించెను"**

**TEV "తప్పుడు పనులను విస్తరింపచేయుటకు ధర్మశాస్త్రము వచ్చెను"**

**JB "ధర్మశాస్త్రము వచ్చినపుడు, ఏడుటక అవకాశములను విస్తరింపజేసెను"**

ధర్మశాస్త్రము యొక్క ఉద్దేశ్యం, పతనమైన మానవుని అవసరతను నిస్సహాయ స్థితిని చూపుటకు గాని మానవులకు రక్షించుట కాదు (ఎఫెసి 2:1-3) తద్వారా మానవులు యేసు యొద్దకు వచ్చుట కొరకు (3శ20; 4:15; గలతీ 3:19, 23-26). ధర్మశాస్త్రము మంచిదే, కాని మావనజాతి పాపభరితం (7వ ఆదాము)

▣ **"కృప అపరిమితంగా విస్తరించెను"** ఈ భాగంలో పౌలు యొక్క ముఖ్య వాదన ఇది. పాపము భయంకరమైనది, అసహ్యకరమైనది. కాని కృప విస్తరించి పాపపు ప్రభావమును మించినది. ఎదుగుతున్న మొదటి శతాబ్దపు సంఘమునకు ఈ రీతిగా ప్రొత్సాహపరుస్తున్నాడు. క్రీస్తులో వారు జయశీలురు. (5:9-11, 8:31-39; 1 యెహో 5:4) ఇది అధికంగా పాపము చేయుటకు ఉత్తరువు కాదు. ప్రత్యేక అంశం పౌలు యొక్క హోపర్ మిళితపదములు 1:30లో చూడండి.

**5:21 "పాపము" మరియు "కృప"** రాజులుగా మనుష్య గుణ అరోపణతో చెప్పబడినవి. పాపము సార్వత్రిక మరణ నియమముతో పాలించింది. (14,17వ) కృప, క్రీస్తు సంపూర్తి చేసిన కార్యమునందు విశ్వసించి, వ్యక్తిగత విశ్వాసం, మారుమనస్సు గలవారిని నీతిమంతులుగా తీర్చుబడుట ద్వారా పాలించినది.

దేవుని నూతన జనాంగంగా, క్రీస్తు ద్వారా పాలించినది. పరిపాలన చేయుదురు. (5:17; 2తిమో 2:12; ప్రక 22:5). ఇది ఇహలోకమైనది లేక వెయ్యేండ్ల పరిపాలనగా చూడవచ్చు. (ప్రకటన 5:9-10; 20) ఇదే సత్యరిమును రూఢిపరుస్తూ, పరిశుద్ధులకు దేవుని రాజ్యము ఇవ్వబడినట్టు బైబిల్ చెపుతుంది. (మత్తయి 5:3,10;లూకా12:32; ఎఫెసి 2:5-6) 5:17లో ప్రత్యేక అంశం చూడండి)

**చర్చాప్రశ్నలు :**

ఇది ధ్యాన మార్గదర్శక వ్యాఖ్యానం కావునా బైబిల్ యొక్క మీ స్వంత వ్యాఖ్యానమునకు మీరు భాద్యులు. మనమందరం మన కివ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, బైబిల్ మరియు పరిశుద్ధాత్మ భావ వ్యక్తీకరణలో ప్రముఖులు నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు దానిని విడిచి పెట్టకూడదు. ఈ పుస్తకంలోని బహుళ విషయములను ఆలోచించుటకు ఈ చర్చా ప్రశ్నలు సహాయపడతాయి. అవి ఆలోచింపజేసేవే కాని, నిశ్చితమైనవి కావు.

1. దేవుని "నీతి"ని నిర్వచించండి.
2. "స్థానీయ పరిశుద్ధత" మరియు "క్రమణ పరిశుద్ధత"కు మద్య వ్యత్యాసం ఏమిటి ?
3. మనం కృపచేతనా లేక విశ్వాసం చేతనా రక్షింపబడతాం ?
4. క్రైస్తవులు ఎందుకు శ్రమపడుదురు ?
5. మనం రక్షింపబడినామా లేక రక్షింపబడుచున్నామా లేక రక్షింపబడుదుమా ?
6. మనం పాపం చేయుట వలన పాపులమా లేక మనం పాపులం కాబట్టి పాపం చేయుచున్నామా ?
7. "నీతిమంతులుగా తీర్చబడటం" "రక్షింపబడటం" మరియు "సమాధాన పడటం" ఈ అద్యాయంలో ఈ పదములకున్న సంబంధమేమి ?
8. వేల కొలది సంవత్సరాలకు ముందు జీవించిన మానవుని పాపము కొరకు దేవుడు నన్నెందుక బాద్యత వహించమని అడుగుచున్నాడు? (12-21) ?
9. ఆదామునకు మోషేకు మద్యకాలంలో పాపము లెక్కించబడకపోతే ఎందుకు అందరూ చనిపోయినారు ?
10. "అందరూ మరియు "అనేకులు" పర్యాయపదములా ? (18-19 యెషయా 53:6, 11-12) ?

# ద్వితీయోపదేశకాండము - 6వ అధ్యాయము

నవీన అనువాదముల యొక్క వాక్య విభజన

| UBS | NKJV | NRSV | TEV | JB |
|---|---|---|---|---|
| పానమునకు చనిపోయి | పాపమునకు చనిపోయి | చనిపోయి క్రీస్తుతో | పాపమునకు చనిపోయి | బాప్తిస్మము |
| క్రీస్తులో బ్రతుకుల | క్రీస్తులో బ్రతుకుట | లేచుట | క్రీస్తులో బ్రతుకుట | |
| 6:1-11 | 6:1-14 | 6:1-4 | 6:1-4 | 6:1-7 |
| | | 6:5-11 | 6:5-11 | |
| | | | | 6:8-11 |
| | | | | పరిశుద్ధత |
| 6:12-14 | | 6:12-14 | 6:12-14 | 6:12-14 |
| నీతికిదాసులు | పాపపు దాసుల నుండి | రెండు దాసత్వాలు | నీతికి దాసులు | క్రైస్తవుడు పాపు |
| | దేవునికి దాసులు | | | బానిసత్వం నుండి |
| | | | | విడిపించబడినాడు |
| 6:15-23 | 6:15-23 | 6:15-19 | 6:15-19 | 6:15-19 |
| | | | | పాపపు ప్రతి |
| | | | | ఫలం మరియు |
| | | | | పరిశుద్ధత ప్రతిఫలం |
| | | 6:20-23 | 6:20-23 | 6:20-23 |

వాక్యపు పరిధి యొద్ద అసలైన గ్రంధకర్త ఉద్దేశ్యంను అనుసరించుట....

ఈ వ్యాఖ్యానం చదువుటకు ఉపయోగపడే మార్గదర్శిని......

కావున బైబిల్ యొక్క వ్యాఖ్యానమును నీవు సొంతంగా చేసుకొనుటకు భాద్యుడవు. మనమందమం మనకు ఇవ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, పరిశుద్ధ గ్రంధం మరియు పరిశుద్ధాత్మ వ్యాఖ్యానంలో ప్రాధాన్యత వహించవలెను. దీనిని నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు విడిచిపెట్టకూడదు.

అధ్యాయమంతటినీ ఒకేసారి చదవాలి, అంశాలను గుర్తించాలి. నీ అంశ విభజనము పైన ఇవ్వబడిన నవీన అనువాద విభజనలతో సరి పోల్చుకోవాలి. విభజన అనేది ప్రేరణ కాదు. కాని ఇది అసలు గ్రంధకర్త యొక్క ఉద్దేశ్యమును తెలుసుకొనుటకు ఉపయోగపడును వ్యాఖ్యానమునకు ఇది కేంద్రమై వున్నది. ప్రతి వాక్య విభజనకే ఒక్క విభజనను కలిగి ఉండును.

1. మొదటి వాక్య భాగం
2. రెండవ వాక్య భాగం
3. మూడవ వాక్య భాగం
4. మొదలగునవి.

**సందర్భోచిత తలంపులు**

ఎ. 6:1-8:39, పాపముతో క్రైస్తవులని సంబంధమును చర్చించే భాగం. క్రీస్తు ద్వారా ఉచిత కృపపైన సువార్త ఆధారపడి ఉంది. కనుక ఇది చాలా ప్రాముఖ్యమైనది. (3:21- 5:21). పాపము విశ్వాసిని ఎలా ప్రభావితం చేస్తుందో వాక్యభాగం చర్చిస్తుంది. (1 మరియు 15 వచనాలు)1వ వచనం 5:20నక సంబంధించినది, 15వ వచనం 6:14నక సంబందిచినది. మొదటిది పాపము ఒక జీవిత విధనంగా (భూతకాలం), రెండవది వ్యక్తిగత పాపపు చర్యలు (ఆరిస్ట్కాలం) 1-14 వచనాలు పాపపు అధికారం నుండి విశ్వాసుల స్వాతంత్ర్యము గురించి, 15-13 వచనాలు గతంలో పాపమునక సేవచేసినట్టుగా దేవునికి సంపూర్తిగా మరియు హృదయపూర్వకంగా సేవ చేయుటకు విశ్వాసుల స్వాతంత్ర్యము గురించి మాట్లాడుతున్నాయి.

బి. రెండు రకాల పరిశుద్దీకరణ

1. ఒక స్థానం (రక్షణతో నీతి నింపబడినట్టుగా 3:21-5:21)
2. వృద్ధి చెందెది క్రీస్తు సారూప్యము

ఎ. 6:1-8:39 ఈ సత్యమును వేదాంతపరంగా వ్యక్తపరుచుట.

బి. 12:1-15:13 అభ్యాసపూర్వకంగా వ్యక్తపరుచుట.

సి. తరుచుగా వ్యాఖ్యానకర్తలు, బైబిల్ అర్ధములును గ్రహింపుచేయుటకు నీతిమంతులుగా తీర్చబడుటను వేరుచేయుదరు. నిజముగా అవిరెండునూ కృప యొక్క సమకాలికమైన కార్యములు (1కొరింది 1:30; 6:11) రెండింటికి కావలసనిది ఒక్కటే యేసు క్రీస్తు జీవము మరియు మరణం ద్వారా ప్రత్యక్ష పృబడిన కృపను విశ్వాసంతో స్వీకరించటం (ఎఫెసి 2:8-9)

డి. ఈ అద్యాయం క్రీస్తులో దేవుని పిల్లల శక్తివంతమైన సంపూర్ణ పరిపక్వతను బోదిస్తుంది(పాపంలేని తనం, 1యెహాను 3:6,9; 15:18) 7వ అద్యాయము మరియు 1 యెహాను 1:8-2:1 విశ్వాసుల యొక్క పాపపు కొనసాగింపును చూపిస్తుంది. క్షమాపణ నైతిక జీవితమునకు సంబంధించనది అన్న పౌలు అభిప్రాయమునక అనేక వివాదములు కలవు. నూతన విశ్వాసులు మోషే ధర్మశాస్త్రమునక లోబడుట దైవిక జీవితమును రూడిపరిచేది అన్నట్లుగా యూదులు ఆశించేవారు. కొంతమంది దీనిని చేసినట్టుగా, మరి కొంత మంది పాపము చేయుటకు ఉత్తరువుగా వాడుకొన్నట్లు ఒప్పుకొక తప్పదు. (1,15; 2పేతురు 3:15-16) అంతరంగంలో వశించే ఆత్మ విశ్వాసిలో క్రీస్తు సారూపత్యతను కలిగిస్తుందని పౌలు నమ్మెడివాడు నిజంగా, పాత నిబంధనకు (ద్వితి 27-28) మరియు క్రొత్త నిబంధనకు (యిర్మీయా 31:31-34; యెహెజ్కెలు 36:26-27)నకు మద్య ఉన్న వ్యత్యాసం ఇదే.

ఇ. నీతిమంతులుగా తీర్చబడటం / పరిశుద్ద పర్చబడటం యొక్క ఆత్మీయ నిజమునకు బాప్తిస్మము ఒక భౌతిక సూచన. రోమా పత్రికలో స్థాన పరిశుద్దీకరణ (నీతిమంతులుగా తీర్చబడటం) మరియు అనుభవీయ పరిశుద్దీకరణ అనే కవలన సిద్దాంతములు నొక్కి చెప్పబడ్డాయి. “ఆయనతో పాతిపెట్టబడటం” (4వ) అనేది “ఆయనతో సిలువ వేయబడటం” (6వ)తో సాదృశ్యం.

ఎఫ్. క్రైస్తవ జీవితంతో శోదనను మరియు పాపమును జయించుటకు మూలములు.

1. క్రీస్తులో నీవెరివో తెలుసుకో. ఆయన నీ కొరకు ఏమి చేసినో తెలుసుకో నీవు పాపమునుండి విడిపింపబడినావు. నీవు పాపమునకు మృతుడవు.
2. నీదైదంనదిక జీవి పరిస్థితులతతో క్రీస్తులోని స్థానమును లెక్కించుకొ.
3. మనం మన స్వంతం కాదు! మనం మన యజమానిని సేవించాలి / లో బడాలి. మనలను ప్రేమిచంని వానిని కృతజ్ఞతతో మరియు ప్రేమతో సేవించుదము.
4. క్రైస్తవ జీవితం సహజ అతీత జీవితం. ఇది రక్షణ వలె క్రీస్తులో దేవుని బహుమనాం. ఆయనే దీనిని ప్రారంబించాడు. ఆయనే శక్తిని అనుగ్రహిస్తాడు. మొదట మనం విశ్వాసం మారుమనస్సుతో స్పందించి దానిలో కానసాగాలి. పాపపు పరిసరాలతో ఆటలాడకు. అది ఏమిటో దానికి పేరును పెట్టు దానినుండి తొలగిపో; పారిపో; శోదన స్థలంఓ నిన్ను నీవు ఉంచుకోకు.
5. పాపాము పోయే అలవాటే, కాని దానికి సమయం, ప్రయత్నం మరియు చిత్తం అవసరం.

పద మరియు వాక్య ధ్యానం :

**NASB (నవీన) వాక్యము 6:1-7**

**1. అలాగూన ఏమందుము? కృప విస్తరించవలెనని పాపమందు నిలియుందుమా? 2 అట్టనరాదు పాపము విషయమూ చనిపోయిన మనము ఒక మీదట ఏలాగు దానిలో జీవించుదుము ? 3. క్రీస్తు యేసులోకి బాప్తిస్మము పొందిని మనమందరము ఆయన మరణములోనికి బాప్తిస్మము పొంఇతమని మీరెరుగరా? 4. కాబట్టి తండ్రి మహిమ వలన క్రీస్తు మృతులలో నుండి యే లాగు లేపబడెనో, అలాగే మనమును నూతన జీవము పొందిన వారమైనడుచుకొనునట్లు మనము బాప్తిస్మము వలన మరణములో (పౌలు పొంగుటకై) ఆయనతో కూడా పాతి పెట్టబడితిమి. 5. మరియు ఆయన మరణము యొక్క సాదృశ్యమందు ఆయనతో సంయుక్తలమైన యెడల, ఆయన పురుత్థానము యొక్క సాదృశ్యముందును ఆయనతో సంయుక్తలమై యుందుము. ఏమనగా మనమికను పాపంనకు దాసులము కాకుంటకు పాప శరీరము నిరర్ధక మగునట్లు, మన ప్రాచిన స్వభావము ఆయనతో కూడా సిలువ వేయబడినవి. యెరుగుదము 7 చనిపోయిన వాడు పాప విముక్తుడని తీర్పు పొందియున్నాడు.**

**6:1**

**NASB "కృప విస్తరింపవలెనని పాపమందు నిలిచియుందుమా?"**

**NKJV "కృప విస్తరింపవలెనని పాపములో కొనసాగుదుమా?"**

**NRSV "కథప విస్తరించుటకొరకు పాపములో కొనసాగుదుమా?"**

**TEV "దేవుని కృప విస్తరించునని పాపములో జీవిందుమా?"**

**JB "కృపకు విస్తారత ఉందని పాపములో నిలిచియుందుమా?"**

ఇది ప్రెసెంట్ ఎక్టివ్ ఇండికేటివ్, ఇది క్రైస్తవులు "పాపముతో నిలిచియుందురా" లేక "పాపమును హత్తకొందురా" అని అక్షరార్ధముగా అడుగుతుంది. ఈ ప్రశ్న 5:20 వైపునకు చూస్తుంది. కృప దుర్వినియోగం కాకుండా పౌలు ఒక విషయంను చూపించి సత్యమును తెలిపే )డైట్రాబ్) పద్ధతిని ఉపయోగిస్తున్నాడు (1. యోహ 3:6, 9; 5:18) తిరుగుబాటు జీవితం కొరకు దేవుని కృప మరియు జాలి మార్గం కాదు. క్రీస్తు ద్వారా ఉచిత రక్షణ దేవుని వరమని పౌలు సువార్త (3:24; 5:15, 17; 6:23) ఇది నీతి జీవిత విధానమునకు అనేక ప్రశ్నలను లేపినది. ఒక ఉచిత వరం నైతిక జీవితంను ఎలా కలిగిస్తుంది? నీతిమంతులుగా తీర్చబడటం మరియు పరిశుద్ధ పర్చబడటం వేరు పర్చకూడదు. (మత్తయి 7:24-27; లూకా 8:21; 11:28; యెహాను 13:17; రోమా 2:13; యాకోబు 1:22-25; 2:14-26) ఈ విషయంలో ఎఫ్.ఎఫ్. బ్రూస్ మాటను చెప్పనివ్వండి.

పౌలు : అపొస్టల్ ఆఫ్ థా హార్ట్‌సెట్ ఫ్ర "క్రైస్తవుల బాప్తిస్మము, పాత పాపపు ఉనికికి మరియు క్రీస్తులో నూతన జీవితమునకు సరిహద్దును ఏర్పరుస్తుంది. ఇది వారి పాత జీవితం యొక్క మరణమునకు అనవాలు. ఆవిధంగా బాప్తిస్మఉ పొంఇన క్రైస్తవుడు పాపములో కొనసాగటం అనేది అక్రమము / అయుక్తము. ఇది విడిపించాలిని ఎదురుచూసే ఒక దాసుడు మరళా. పాతఈగీ యాజమాని క్రింద ఉండి పోవుటతో సమానం. (రోమా 6:1-4; 15-23) లేక ఒక విదవరళు 'ధర్మశాస్త్రంవలని భర్తకు" లోబడిన దానితో సమానం". 281-82 (రోమా 7:1-6) జేమ్స్ యస్. స్టువర్ట్ పుస్తకంలో, ఎమేన్ ఇన్ క్రెస్ట్‌లో అతడు ఈవిధంగా వ్రాసెను, అనోస్థలుని ఆలోచన పక్షమున లోకస్ క్లాసికస్ రోమా 6లో కనిపిస్తుంది. అక్కడ పౌలు, శక్తివంతమైన పౌరుషంతో, ప్రయత్నంతో హృదయమునకు, మనస్సాక్షికి పాఠము చెప్పుచూ, క్రీస్తు మరణంతో ఐక్యపర్చబడటము. అనగా ఒక విశ్వాసి పాపముతో సంపూర్తి మరియు బలమైన తెంపు 187-88.

**6:2 "అట్లనరాదు"** ఇది తరుచుగా ఉపయోగించే ఆశీరర్ధకమైన రూపం ఇది ఒక ఆశను లేక ప్రార్ధనను తెలియజేసే వ్యాకరణ భావం ఊహింపబడిన ఒక విషయమునకు జవాబునిచ్చే పౌలు రచనా శైలి ఇది. విశ్వసించని మానవులు దేవుని కృపను అపార్ధం చేసి దానిని దుర్వినియోగ పర్చుకోవటం పట్ల పౌలు తన విభ్రాంతిని మరియు భయమును వ్యక్తపరుస్తున్నాడు. (3:4,6)

▣ **"పాపమునకు చనిపోయిన మనము"** ఇది ఒక ఆరిస్ట్ ఎక్టిల్ ఇండికేటివ్, దాని అర్ధము "మనము చనిపోయాము". ఏకవచనమైన "పాపము" ఈ అధ్యాయమంతా కనిపిస్తుంది. ఇది ఆదాము నుండి సంక్రమించిన మన "పాపస్వభావమును" సూచిస్తుంది. (రోమా 5:12-21; 1కొరి 15:21-22). పౌలు తరుచుగా మరణం యొక్క ఉపమానమును యేసు క్రీస్తు విశ్వాసుల యొక్క నూతన సంబంధమును చూపించుటకు ఉపయోగించేవాడు. విశ్వాసులు పాపు యాజమానికి లోబడరు. "ఇక మీదట ఏలాగుదానిలో జీవించుదుము?

ఇది అక్షరార్థముగా **"నడక"** ఈ ఉపమానం మన విశ్వాత జీవిత విధానం (ఎఫెసి 4:1; 5:2, 15) లేక పాపపు జీవితవిధానం (4) గురించి గాని మాట్లాడుతుంది. విశ్వాసులు పాపంలో సంతోషించలేరు.

**6:3-4 "బాప్తిస్మఉ పొందిన మనం..... మనం పాతి పెట్టబడితిమి"** ఇవి రెండనూ ఆరిస్ట్ పాసిక ఇండికేటివ్ బాహ్యాకారకము వలన సంపూర్తి అయిన కార్యమును నొక్కి చెప్పుటకు వాడీ వ్యాకరణ రూపం ఇక్కడి కారకము, ఆత్మ. అవి ఇక్కడ సాదృశ్యం.

- **"క్రీస్తు యేసులోనికి"** ఎయిస్(లో), మత్తయి 28:19 లోని గొప్ప ఆజ్ఞతో సాదృశ్యంగా ఉంది. అక్కడ నూతన విశ్వాసులు తండ్రి, కుమార మరియు పరిశుద్ధాత్మ నానమములోనికి బాప్తిస్మము పొందుదురు. విభక్తి కూడా విశ్వాసులు ఆత్మద్వారా క్రీస్తు శరీరంలోనికి బాప్తిస్మము పొందుదురు. 1కొరి. 12:13. ఈసందర్భంలోని ఎయిస్(లో) 11వ వచనంలో ఎన్ (క్రీస్తులో) నక సాదృశ్యంగా ఉంది. ఇది విశ్వాసులను వివరించటానికి పౌలు యొక్క అభిమాన పద్ధతి. ఇది ఒక స్థితి యొక్క స్థానం. విశ్వాసులు క్రీస్తులో ఉండి జీవించుదురు మరియు కదులుదురు. ఈ విభక్తులు సన్నిహిత ఐక్యతను, సహవాస వ్యాప్తిని, మరియు ద్రాక్షావళ్ళి మరియు తీగెల సంబంధమును వ్యక్తపరుస్తున్నాయి. విశ్వాసులు క్రీస్తు మరణంలో, పునరుత్థానంలో, విధేయతలో, పరిచర్యలో మరియు ఆయన రాజ్యంతో పోల్చబడి చేర్చబడుదురు.

- **"ఆయన మరణంలోనికి ఆయనతో కూడ పాతి పెట్టబడితిమి"** మునుగుట వలనైన బాప్తిస్మము మరణమునకు మరియు పాలపెట్టిబడటమును ఉపహరిస్తుంది. (5వ మరియు కొలస్సి 2:12). యేసు తన మరణమును గురించి బాప్తిస్మమును ఉపమానంగా ఉపయోగించినాడు (మార్కు 10:38-39; లూకా 12:50) ఇక్కడ వాప్తిస్మము పై సిద్దాంతముకాదు గాని, క్రీస్తు మరణం, పాతిపెట్టబడటముతో క్రైస్తవుల నూతన సన్నిహిత సంబంధము పైన వక్కాణము విశ్వాసులు క్రీసుతో, క్రీస్తు గుణముతో, క్రీస్తు యాగముతో క్రీస్తు పనితో సరిపోట్చుకొందురు. విశ్వాసులపైన పాపమునకు శక్తిలేదు.

**6:4 "బాప్తిస్మము వలన మరణములో ఆయనతో కూడా పెట్టబడితిమి"** ఈ అద్యాయంలో పౌలు రచనా వర్ణణ కనిపిస్తుంది. పౌలు చాలా సన్(తో) మిశ్రమ పదములను వాడినాడు.

1. సన్ + థాప్టో కలిసి పాతిపెట్టబడటం 4వ కొలస్సి 2:12; 8వ
2. సన్ + పూడీ కలిసి సంయుక్తం, 5వ
3. సన్ + స్టావురో, కలిసి నాటబడుట, 5వ
4. సన్ + స్టావురో, కలిసి సిలువ వేయబడటం 6వ గలతీ 2:20
5. సన్ + జావో, కలిసి జీవించటం, 8వ; 2తిమోతి 2:11

(అదేవిదంగా కలిసి చనిపోవటం, మరియు కలిసి పరిపాలిచటం)

- **"నూతన జీవము పొందిన వారమై నడుచుకొనినట్లు"** ఇది అరిస్ట్ ఎక్టివ్ సబ్‌జంక్టివ్ రక్షణ ఫలితము పరిశుద్ధకరణ. క్రీస్తు ద్వారా దేవుని కృపను విశ్వాసులు యెరిగినవారు కనుక, వారి జీవితములు వ్యత్యాసంగా ఉండును. మన నూతన జీవితం మనకు రక్షణను తీసుకొనిరాదు కాని నూతన జీవితం రక్షణ యొక్క ఫలితం (16,19; మరియు ఎఫెసి 2:8, 10; యాకోబు 2:14-26) ఇది రెండిలో ఒకటి) ప్రశ్న, విశ్వాసం లేక పని కాదుగాని, ఇది ఒక వరుస క్రమం.

**ప్రత్యేక అంశం : పరిశుద్ధ పరచబడుట**

పాపులు మారుమనసు పొంఇ యేసునందు విశ్వాసముంచినపుడు వారు వెంటనే నీతిమంతులుగా తీర్చబడి, పరిశుద్ధపరచబడెదరు. అని క్రొత్త నిబంధన రూడి పరుస్తుంది. ఇది క్రీస్తులో వారి నూతన స్థానం యేసుని నీతి వారికి నింపబడుతుంది. (రోమా 4) వారు పరిశుద్దులుగా దృవీకరించబడతారు.

అదేవిధంగా క్రొత్త నిబంధన విశ్వాసులు పరిశుద్దాతలోనికి వెళ్ళుదురు అని బోదిస్తుంది. క్రీస్తు సంపూర్ణ కార్యము వలన వారి వేదాంత స్థానము మరియు వారి దైనందికి జీవితాలలో క్రీస్తు వంటి జీవితమును జీవించుటకు ఒక పిలుపు. రక్షణ ఏవిధంగా ఉచిత వరమో, పరిశుద్ధపరచబడటము జీవిత విధానమంత చెల్లించబడటం లాంటిది.

| **ప్రారంభ స్పందన** | **వృద్ధి చెందెడి క్రీస్తు సారూప్యం** |
|---|---|
| అపొ 20:23; 26:18 | రోమా 6:19 |

| | |
|---|---|
| రోమా 15:16 | 2కొరి 7:1 |
| 1కొరి 1:2-3; 6:11 | 1థెస్స 3:13; 4:3-4,7; 5:23 |
| 2థెస్స 2:3 | 1తిమో 2:15 |
| హెబ్రూ 2:11, 10:10,14; 13:12 | 2తిమో 2:21 |
| 1 పేతు 1:1 | హెబ్రూ 12:14 |
| | 1 పేతు 1:15-16 |

- **"క్రీస్తు మృతులలో నుండి లేపబడెను"** ఈ సందర్భంలో కుమారుని యొక్క మాటను, పనులను తండ్రి ఏవిధంగా అంగీకరించెనో, ఆమోదించెనో రెండు గొప్ప సంఘటనల ద్వారా వ్యక్తపరిచినట్టుగా కనిపిస్తుంది.

  1. మరణము నుండి యేసుని పునరుత్థానము.
  2. తండ్రి కుడి పార్శ్వమునకు యేసుని ఆరోహణము.

- **"తండ్రి మహిమ" "మహిమ"** కొరకు ప్రత్యేక అంశం 3:23ను చూడండి. "తండ్రి" కొరకు ప్రత్యేక అంశం 1:7ను చూడండి.

  **6:5 "యెడల"** ఇది మొదటి తరగతి షరతులతో కూడిన వాక్యమై గ్రంథకర్త దృక్పదము నుండి సత్యమై మరియు తన సాహిత్య ఉద్దేశ్యం కొరకు వాడబడినది.

- **"ఆయనతో సంయుక్తలమై యుందుము"** ఇది, ఆయనతో కలిసియుంటూ కొనసాగుదము అని అనువదించవచ్చు. లేక "ఆయనలో కలిసి నాటబడియుందుము" అని అనువదించవచ్చు. ఈ సత్యం వేదాంతపరంగా యోహాను 15లోని "నిలిచియుండుట"కు సమరూపము. విశ్వాసులు యేసుని మరణంతో సంయుక్తులైతే (గలతీ 2:19-20; కొలస్సి 2:20; 3:3-5) వేదాంతపరంగా వారు ఆయన పునరుత్థానంలో కూడా సంయుక్తులైయుందురు (10వ)

  బాప్తిస్మ అంశమును మరణముగా ఉదాహరించుట అనేది (1) మనం పాత జీవితమునకు, పాత నిబంధనకు మరణించుట (2) ఆత్మకును, నూతన నిబంధనకు జీవించుట అన్న అర్థమును చూపిస్తుంది. కావునా క్రైస్తవ బాప్తిస్యము అన్నది పాత నిబంధన చివరి ప్రవక్త అయిన యోహాను ఇచ్చిన వాప్తిస్మము లాంటిదికాదు. వాప్తిస్మము అనేది ఆది సంఘంలో విశ్వాసులు బహిరంగంగా వారి విశ్వాసమును ఒప్పుకొనుటకు ఒక అవకాశం మొదటి బాప్తిస్మపు నియమము ఏమిటంటే, "యేసుప్రభువని నేను విశ్వసిస్తున్నాను. (రోమా 10:9-13) అని ఒక వ్యక్తి తిరిగి చెప్పటమే. ఈ బహిరంగ దృవీకరణ అనేది, గత అనుభావంలో జరిగిన దానిని వ్యక్తపరిచే ఒక కార్యము. బాప్తిస్మము అనేది పాపక్షమాపణకు, రక్షణకొరకు, పరిశుద్దాత్మ వచ్చుటకు యంత్రంకాదు, కాని బహిరంగంగా విశ్వాసమును ఒప్పుకొనుటకు ఒక అవకాశము (1పె 2:38). అలాగుననే, బాప్తిస్మము ఒక ఎంపిక కాదు, గాని యేసు దీనిని చేయుమని ఆజ్ఞాపించాడు. (మత్తయి 28:19-20), దీనికి మాదిరిని చూపించాడు (మత్తయి 3; మార్కు 1; 1థెస్స 3)

**6:6**

**NASB** **"మన ప్రాచీన స్వభావము ఆయనతో కూడా సిలువ వేయబడినది యెలిగి"**

**NRSV** **"మన ప్రాచీన మనుష్యుడు ఆయనతో కూడా సిలువ వేయబడెనని యెరిగి"**

**NKJV** **"మన ప్రాచీన స్వభావం ఆయనతతో సిలువ వేయబడి నని మనము యెరుగుదుము"**

**TEV** **"ఇది మనకు తెలుసు, మన పాతస్థితి క్రీస్తు సిలువ మీద సిలువ వేయబడెను"**

**JB** **"మన మొదటి స్వభావము ఆయనతో సిలువ వేయబడెనని మనం తప్పక గుర్తించాలి"**

- **"మన పాత వ్యక్తిత్వం ఆత్మవలన ఎల్లప్పటికి సిలువ వేయబడెను".** అని ఇది అర్థమిచ్చెను. విజయవంతమైన క్రైస్తవ జీవితమునకు ఈ సత్యము ఎంతో ప్రాముఖ్యమైనది. విశ్వాసులు పాపముతో వాని నూతన సంబంధమును గుర్తించాలి. (గలతీ 2:20; 6:4). మానవుల పతన స్థితి (ఆదాము స్వభావము) క్రీస్తుతో మరణించింది. (7వ ఎఫెసి 4:22 & కొలస్సి 3:9) విశ్వాసులు మనకు ఎంపిక కలదు.

▣ **NASB, NKJV "పాప శరీరము నిరర్థక మగునట్లు"**

**NRSV "పాపశరీరము నశించినట్లు"**

**TEV "పాపపు స్వభావపు శక్తి నశించులాగున"**

**JB "పాప శరీరమును నశింపజేయునట్లు"**

పౌలు "శరీరము" (సోమా) అన్న పదమును చాలా షష్టి విభక్తి పదము (ఉత్పత్తిని దెలిపె) లో ఉపయోగించినాడు.

1. పాపపు శరీరం, రోమా 6:6
2. ఈ మరణపు శరీరం, రోమా 7:24
3. మాంసపు శరీరం, కొలస్సి 2:11

పౌలు ఈయుగపు భౌతిక జీవితమును పాపముగా మరియు తిరుగుబాటుగా మాట్లాడుచున్నాడు. యేసు క్రీస్తుని నూతన పునరుత్థాన శరీరము, నూతన యుగపు శరీరంగా వర్ణించుచున్నాడు (2కొరి 5:17) భౌతికంగా సమస్యకాదు (గ్రీకుతత్వం), కాని పాపము మరియు తిరుగుబాటే. శరీరము దుష్టమైనదికాదు. నిత్యత్వంలో భౌతిక శరీరమును క్రైస్తవ్యం దృడపరుస్తుంది. (1కొరి 15) అలాగైననూ, ఈ భౌతిక శరీరము, శోదరనకు, పాపమునకు, మరియు వ్యక్తిత్వంనకు యుద్ధభూమి.

ఈ పదము **"నిరర్థకమగునట్టు"** అనగా **"పనిచేయకుండా చేయటం" "శక్తి హీనం చేయటం"** లేక "నిరుత్పత్తిగా చేయటం", కాని "నాశనం" మాత్రం కాదు. ఇది పౌలు యొక్క అభిమాన పదము, దీనిని 25 సార్లు వాడినాడు. 3:3లో ప్రత్యేక అంశంను చూడండి. మన భౌతిక శరీరము నైతికంగా తటస్థమైనది, అదేవిధ:గా కొనసాగుతున్న ఆత్మీయ వివాదమునకు యుద్ద స్థలం (12-13; 5:12-21; 12:1-2)

**6:7 "చనిపోయినవాడు పాపవిముక్తుడని తీర్పుపొందియున్నాడు"** "చనిపోయిన వాడు పాపమునుండి ఎప్పటికి విడుదల పొందియున్నాడని" అర్థము. ఎందుచేతననగా విశ్వాసులు క్రీస్తులో నూతన సృష్టి కాబట్టి ఆదాము పతనము నుండి వచ్చిన పాపపు బానిసత్వము నుండి విడిపింపబడినాడు. (7:1-6)

▣ **"విముక్తుడు"** అన్న పదము గ్రీక పదమునుండి వచ్చినదై ప్రారంభ అధ్యాయాలలో "నీతిమంతులుగా తీర్చబడి నట్టుగా (ఎ.ఎస్.వి.) అనువదించబడింఇ. ఈ సందర్భములో "విముక్తుడు" ఎక్కువ అర్థమును ఇస్తుంది. (అపో 13:38) గుర్తుంచుకో, అక్కడి సందర్భమే అర్థమును నిర్ణయిస్తుంది. కాని నిఘంటువో లేక సాంకేతిక నిర్వచనమోకాదు. పదములు వాక్యములోనే అర్థములను, మరియు వాక్యములు వాక్య భాగములలోనే అర్థములను కల్గియుంటాయి.

**NASB (నవీన) వాక్యము 6:8-11**

**8. మనము క్రీస్తుతో కూడ చనిపోయిన యెడల, మృతులలో నుండి లేచిన క్రీస్తు ఇకను చనిపోడనియు, మరణమునకు ఇకను ఆయన మీద ప్రభుత్వము లేదనియు ఎరిగి ఆయనతో కూడ జీవించుదమని నమ్ముచున్నాము. 10. ఏలయనగా ఆయన చనిపోవుట చూడగా, పాపము విషయమై ఒక్క మారే చనిపోయెను గాని ఆయన జీవించుట చూడగా, దేవుని విషయమై జీవించుచున్నాడు. 11. అటువలె మీరును పాపము విషయమై మృతులుగాను, దేవుని విషయమై క్రీస్తు యేసునందు సజీవులుగాను మిమ్మును మీరే యెంచుకొనుడి.**

**6:8 "యెడల"** విశ్వాసుల బాప్తిస్మము, క్రీస్తుతో మరణమును ఉదాహరిస్తుంది.

▣ **"ఆయనతో కూడా జీవించుదము"** ఈ సందర్భము "ఇక్కడ మరియు ఇప్పుడు" అని తెలియజేస్తుంది. (1 యోహ 1:7) కాని పూర్తిగా భవిష్యత్ సంబంధమైనది కానట్లు సూచిస్తుంది. 5వ వచనం క్రీస్తుని జీవంలోని ఐక్యతను సూచిస్తుంఇ. బైబిల్ అంశం అయిన దేవుని రాజ్యమునకు ఇదే తన్యత కలదు. ఇది ఇప్పుడు అదేవిధంగా భవిష్యత్ సంబంధమైనది. ఉచిత కృప దీర్ఘశాంతమును కలిగించాలి కాని ఉత్తరువుని కాదు.

**6:9 "క్రీస్తు మృతులలో నుండి లేచెను"** 6:4ను చూడండి.

యేసు క్రీస్తు పునరుత్థానంలో త్రిత్వము యొక్క ముగ్గురు వ్యక్తులు పనిచేసారని క్రొ॥ని॥ రూడిపరుస్తుంది. (1) ఆత్మ (రోమా 8:11); (2) కమారుడు (యోహాను 2:19-22; 10:17-18); మరి తరచుగా (3) తండ్రి (అపో 2:24, 32; 3ఽ15, 26; 4:10; 5:30; 10:40; 13:30, 33, 34, 37; 17:31; రోమా 6:4, 9) తండ్రి కార్యములు యేసుని జీవితం, మరణం మరియు బోధల అంగీకారం యొక్క దృవీకరణ. ఇది ఆది అపొస్తులుల వర్తమానంలో ముఖ్య అంశం. 2:14లో కర్జిమాను చూడండి.

- **NASB "మరణమునకు ఇకను ఆయన మీద ప్రభుత్వం లేదనియు"**

  **NKJV, NRSV "మరణమునకు ఇకను ఆయన మీద పరిపాలన లేదనియు"**

  **TEV "మరణమునకు ఇకను ఆయన మీద పరిపాలన చేయదనియు"**

  **JB "మరణమునకు ఇకను ఆయన మీద అధికారము లేదనియు"**

కురైయ అనే క్రియ గ్రీకుపదమైన కురియాసి నుండి వచ్చినదై "యాజమాని", "ప్రభువు", "భర్త" లేక "అధిపతి" అని అర్ధమిస్తుంది. యేసు ఇప్పుడు మరణమునకు ప్రభువు. (ప్రక 1:18) మరణము యొక్క శక్తిని పగులకొట్టిన మొదటి వ్యక్తి యేసు (1కొరి15)

**6:10 "పాపము విషయమై, కొక్క మారే చనిపోయెను".** యేసు పాపభరిత లోకములో జీవించిన యేసు పాపము చేయలేదు, పాపపు లోకము ఆననను సిలువ వేసిది (హెబ్రీ 10:10) మానవులు పక్షమున యేసుని ప్రాపప్రాయశ్చితార్థపు మరణము ధర్మశాస్త్ర విధులను వాటి పర్యవసములను కొట్టి వేసినది. (గలతీ 3:13; కొలస్సి 2:13–14

- **"ఒక్క మారే అందరికొరకు"** ఈ సందర్భంలో యేసుని సిలువ మరణమును పౌలు అభివర్ణిస్తున్నాడు. పాపమున కొరకైన యేసుని మరణము ఆయన శిష్యులు పాపమునకు చనిపోవుటకు ప్రభావితం చేసింది.

హీబ్రూ గ్రంథము కూడాను యేసుని ఒక్కసారి యాగపూరిత మరణము యొక్క విజయమును నొక్కిపలుకుతుంది. ఈ ఒక్కసారి కార్యము ద్వారా రక్షణ మరియు క్షమాపణలు నిరంతముగా సంపూర్తి అయినవి. (ఒక్కసారి (ఎఫాపాక్స్), 7:27; 9:12; 10:10 మరియు "ఒక్కసారే అందరికొరకు" (హాపాక్స్), 6:4; 9:7, 26, 27, 28; 10:2; 12:26, 27) ఇది మాటి మాటికి పునరావృతం అవుతున్న త్యాగపూరిత, రూఢిగా చెప్పబడిన విషయము.

- **"ఆయన జీవించుట చూడగా, దేవుని విషయమై జీవించుచున్నాడు".** 10ఎ వచనంలోని ఆరిస్ట్, 10బి వచనంలోని ప్రెసెంట్ ఎక్టివ్ ఇండికేటివ్‌ను విభేదిస్తుంది. విశ్వాసులు క్రీస్తుతో మరణించారు. విశ్వాసులు దేవుని కొరకు క్రీస్తుద్వారా జీవించుదురు. రక్షణ యొక్క ఉద్దేశ్యము క్షమాపణ మాత్రమే కాదు (నీతిమంతులుగా తీర్చబడటం) కాని దేవునికి పరిచర్య (పరిశుద్ధపర్చబడటము) విశ్వాసులు పరిచర్య కొరకు రక్షింప.

**6:11 "అటువలె మీరును పాపము విషయమై మృతులుగాను, దేవుని విషయమై క్రీస్తు యేసునందు సజీవులుగాను యెంచుకొనుడి"** ఇది ప్రెసెంట్ మిడిల్ యొక్క ఆజ్ఞార్థపు వాక్యము ఇది విశ్వాసులు నిరంతరము అలవాటు చేసుకోవలసిన ఆజ్ఞ. క్రీస్తు వారి పక్షమున మరణించెనని యెరుగుట విశ్వాసి దైనందిక జీవితమునకు ప్రాముఖ్యమైనది. "యెంచుకొనుడి" అనే పదము (4:4,9) లెక్కల పదమై "జాగ్రత్తగా దానిచేర్చి" తెలిసిన దాని ద్వారా పనిచేయుట అని అర్థమిచ్చెను. 1–11 వ.లు క్రీస్తులో ఒకని స్థానమును గుర్తిస్తే స్థానియ పరిశుద్దీకరణ) 12–13 వచనాలు ఆయనలో జీవితంను నొక్కి పలుకుతున్నాయి. (వృద్ధి చెందెడి శుద్దీకరణ) 4వ.లో ప్రత్యేక అంశం చూడండి.

**NASB (నవీన) వాక్యము 6:12–14**

**12. కాబట్టి శరీర దురాశలకు లోబడునట్లుగా చావుకు లోనైన మీ శరీరమందు పాపమును పలనియ్యకుడి. 13. మరియు మీ అవయువలములను దుర్ణీతి సాధనములుగా పాపమునకు అప్పగింపకుడి, అయితే మృతులలో నుండి జీవులమనుకొని, మిమ్మును మీరే దేవునికి అప్పగించుకొనుడి. మీ అవయువలములను నీతి సాధనములుగా దేవునికి అప్పగించుడి 14. మీరు కృపకే గాని ధర్మశాస్త్రమునకు లోనైన వారు కారు గనుక పాలపము మీ మీద ప్రభుత్వము చేయదు.**

**6:12 "చావునకు లోనైన మీ శరీరముమందు పాపమను ఏలనియ్యకుడి."** ఇది ప్రెసెంట్ ఎక్టివ్‌లో అజ్ఞాపూరకమైన వ్యతిరేఖించే వాక్యం. దీని అర్థము ఒక విధానములో ఉన్న కార్యమును ఆపివేయమని "ఏలుట" అన్న పదము 5:17–21 మరియు 6:23నకు సంబంధించినది. పౌలు చాలా వేదాంత అంశములను మనుష్య గుణ ఆరోపణములతో వివరించాడు. (1) మరణము రాజ్యమేలెను (5:14, 17, 21; 6:23) (2) కృప రాజ్యమేలెను (5:21); మరియు (3) పాపము రాజ్యమేలెను (6;12, 14) నిజమైన ప్రశ్న ఏమిటంటే, నీ జీవితమును పాలిస్తున్నారు. విశ్వాసులు ఎంచుకొనుటకు క్రీస్తులో శక్తిని కలిగియున్నారు. కృప అని చెప్తూతూ వ్యక్తులకు స్థానిక సంఘమును మరియు దేవుని రాజ్యమునకు సమస్య ఏమిటంటే విశ్వాసులు పాపమును స్వార్థమును ఎంచుకొనుట.

**6:13 "మీ అవయువములను దుర్ణీతి సాధనములుగా పాపమునకు అప్పగింపకుడి"** ఇది ప్రెసెంట్ ఎక్టివ్ ఆజ్ఞాపూరకమైన వ్యతిరేకించే వాక్యము. ఒక విధానంలో ఉన్న కార్యమును అపివేయుమని దీని అర్ధము. ఇది విశ్వాసిలో పాపము చేయుటకు ఉన్న శక్తిని చూపిస్తుంది. (7:1; 1యోహా 1:8–2:1) విశ్వాసులతో క్రీస్తుతోని సంబంధము పాపము యొక్క అవసరతను పారద్రోలింది. 1–11వ.లు

▣ **"సాధనములుగా"** ఈ పదము "ఒక సైనికుని ఆయుధములు"ను సూచిస్తుంఇ. మన భౌతిక శరీరము శోదనలకు యుద్ద భూమి (12–13; 12:1–2; 1కొరి 6:20; ఫిలి 1:20) మన జీవితములు బహిరంగంగా సాదృశ్యపదములను చూడండి.

1. రెండు క్రియలే మరియు ఆజ్ఞాపూరిత వాక్యములే
2. యుద్దపు రూపక అలంకరాలు
   ఎ. దుర్ణితి సాధనములు
   బి. నీతి సాధనములు
3. విశ్వాసులు వారి శరీరములను పాపమునకు గాని లేదా దేవునికి గాని సమర్పించుకోవచ్చు. జ్ఞాపకం ఉంచుకొ, ఈ వచనము విశ్వాసులనుద్దేశించినది ఎంపిక కొనసాగుతుంది; యుద్దము కొనసాగుతుంది.

**6:14 "పాపము మీ మీద ప్రభుత్వము చేయదు"** ఇది భవిష్యత్‌ను సూచించే వాక్యము. (కీర్తన 19:13) అదే విదంగా ఆజ్ఞాపూరకమైనదిగా పనిచేస్తుంది. "పాపము మీ మీద అధికారం చేయదు". పాపము క్రీస్తు మీద ప్రభుత్వం చేయలేదు కనుక విశ్వాసుల మీద పాపము అధికారమునుంచలేదు (9; యోహాను 16:33)

**NASB (నవీన) వాక్యము 6:15–19**

**15. అట్లయిన యెడల కృపకేగాని ధర్మశాస్త్రమునకు లోనగువారము కామని పాపము చేయుదుమా? అదెన్నటికి కూడదు. 16. లోబడుటకు దేనికి మిమ్మును మీరు దాసులుగా అప్పగించు కొందురో, అది మరణార్ధముగా పాపమునకు గాని, నీతి నిమిత్తము గా విథేయతకే గాని దేనికి మీరు లోబడుదురో దానికే దాసులగుదురని మీరెరుగురా? 17. మీరు పాపమునకు దాసులై యుంటిరిగాని యే ఉపదేశ క్రమమునకు మీరు అప్పగింపబడితిరో, దానికి హృదయపూర్వకముగా లోబడిన వారై 18. పాపము నుండి విమోచించబడి నీతికి దాసులైతిరి. ఇందుక దేవునికి స్తోత్రము 19. మీ శరీర బలహీనతను బట్టి మనుష్య రీతిగా మాటలాడుచున్నాను. ఏమనగా అ క్రమము చేయుటకై, అపవిత్రతకును, అక్రమమునకును, మీ అవయువములను దాసులుగా ఏలాగు అప్పగించితిరో, అలాగే పరిశుద్ధత కలుగుటకై ఇప్పుడు మీ అవయువములను నీతికి దాసులుగా అప్పగించుడి.**

**6:15** ఇది రెండవ దయోట్రైబ్ 6:1వలె. రెండును పాపముతో విశ్వాసులు సంబంధము గురించిన ప్రశ్నకు జవాబిస్తున్నాయి. 1వ వచనం కృప, పాపము చేయుటకు ఉత్తరువు కానట్టిగా, 15వ వచనం, వ్యక్తిగత పాపపు చర్యలతో పోరాడవలసిన, ఎదిరించవలసిన విషయములతో వ్యవహరిస్తుంది. అదేవిధంగా విశ్వాసులు అంతకు ముందు పాపమునకు ఎలా సేవ చేసారో అలాగుననే ఆనందముతో దేవునికి సేవ చేయాలి. (6:14)

▣ **NASB, NKJV, TEV "పాపము చేయుదుమా"**

**NRSV "పాపము చేయవలెనా?"**

**JB "మనము పాపము చేయుటకు స్వేచ్ఛకలవారమా?**

విలియమ్స్ మరియు ఫిలిప్స్ ఈ ఆరిస్ట్ సబ్‌సంక్టివ్‌ను ప్రెసెంట్ ఎక్టిల్ సబ్‌జంక్టివ్‌గా అనువదించినారు. ఇది సరిఅయిన దృష్టికాదు. ఇతర అనువాదములను గమనించండి. (1) "మనము పాపు చేయుదుమా?". (2) సెంటెనరీ అనువాదము – "మనము పాపపు చర్చను చేయుదుమా?". (3) "మనము పాపము చేయుటకు ఉన్నామా?" ఈ ప్రశ్న గ్రీకులో నొక్క పలికి "అవును" అన్న జవాబును ఆశించునది. ఒక సత్యమును తెలియజేసే పౌలు డయాట్రైబ్‌పద్దతి ఇది. ఈ వచనము ఒక తప్పుడు వేదాంతమును వ్యక్తపరుస్తుంది. పౌలు తన వర్ణనతో "అదెన్నటికి కూడదు" అని పౌలు జవాబిచ్చుచున్నాడు. పౌలు సువార్త యొక్క దేవుని ఉచిత కృప చాలా తప్పుడు బోధకులచే అపార్ధము చేయబడింది. దుర్వినియోగము చేయబడింది.

**6:16 ఈ ప్రశ్న "అవును"** అన్న స్పందనను ఆశిస్తుంది. మానవులు ఎదో ఒకదానిని లేక ఎవరో ఒక్కరిని సేవిస్తారు. ఎవరు నీ జీవితంను పాలిస్తున్నారు? పాపమా లేదా దేవుడా? మానవులు ఎవరికి లోబడతారో వారిని సేవిస్తారు. (గలతీ 6:7–8)

**6:17 "దేవుని స్తోత్రము"** పౌలు తరచుగా దేవని స్తుతించుటలో మునిగిపోతుంటాడు. పౌలు యొక్క రచనలు ప్రార్ధనల నుండి మరియు ఆయన ప్రార్ధనలు సువార్త జ్ఞానము నుండి వచ్చినవి. ప్రత్యేక అంశం పౌలు యొక్క ప్రార్ధన స్తుతి మరియు దేవునికి కృతజ్ఞత 7:25

- **"పాపమునకు దాసులై యుంటిరి...."** ఇది క్రియ యొక్క అసంపూర్ణ కాలం. "ఇది వారి పాత జీవితపు స్థితిని ఆరిస్ట్‌కాలంలో చెప్తూతూ ఇప్పుడు వారి తిరుగుబాటు స్థితి అంతమొందినదని తెలియజేస్తుంది.
- **"దానికి హృదయపూర్వకముగా లోబడిన వారై"** ఈ సందర్భంలో, విశ్వాసం వలన నీతిమంతులుగా తీర్చబడిన జీవితం దైనందిక జీవితంలో క్రీస్తు సారూప్యతను సూచిస్తుంది. "బోధ" అన్న పదం అపొస్థలుల బోధ లేదా సువార్తను సూచిస్తుంది.
- **"హృదయము" ప్రత్యేక అంశం 1:24లో చూదండి.**
- **NASB "యే ఉపదేశక్రమమునకు మీరు అప్పగింపబడితిరో"**

**NKJV "యే ఉపదేశ సిద్ధాంతమునకు మీరు అప్పగింపబడితిరో"**

**NRSV "యే ఉపదేశ రూపకమునకు మీరు అప్పగింపబడితిరో"**

**TEV "మీరు స్వీకరించిన సువార్తలో ఏ సత్యమును కనుగొంటిరో"**

**JB "మీరు స్వీకరించిన సువార్తలో ఏ సత్యమును కనుగొంటిరో"**

టుపోస్ (క్రమమునకు వేర్వేరు ఉపయోగములు ఉండటం సమస్య.

1. మౌల్టన్ & మిల్లిగాన్, దావకాబులరీ ఆఫ్ గ్రీకు న్యూటెస్ట్‌మెంట్, పే. 645

ఎ. మాదిరి

బి. ప్రణాళిక

సి. రూపం / వ్రాసే పద్ధతి

డి. శాసనం / తిరిగి వ్రాసినది

ఇ. ఆజ్ఞ లేక నిర్ణయం

ఎఫ్. స్వస్థపరిచే దేవునికి అర్పించే మావన శరీరాల మాదిరి

జి. ధర్మశాస్త్ర శాసనములను అమలుపర్చుటకు వాడే క్రియ భావనలో

2. లౌ మరియు నిడా, గ్రీకు ఇంగ్లీష్ లెక్సికాన్ సంపుటి 2. పే. 249

ఎ. మచ్చ (యోహాను 20:25)

బి. ప్రతిమ (అపొ 7:43)

సి. మాదిరి (హెబ్రీ 8:5)

డి. ఉదాహరణ (1కొరి 10:6; ఫిలిప్పి 3:17)

ఇ. ఆదర్మము (రోమా 5:14)

ఎఫ్. జాతి (అపొ 23:25)

జి. పట్టీ (అపొ 23:25)

3. హరాల్డ్ కె. మౌల్టన్, దా అనాలిటికల్ గ్రీకు లెక్సికన్, రివైస్‌డు

ఎ. ఒక గురుతు, ఒక అభిప్రాయం, ఒక దెబ్బ (యోహాను 20:25)

బి. ఒక రూపము

సి. ఒక ప్రతిమ (అపొ 7:43)

డి. ఒక సూత్రం, క్రమం (రోమా 6:17)

ఇ. రూపం, తాత్పర్యం (అపొ 23:25)

ఎఫ్. ఒక చిత్రం, భాగం (1కొరి 10:6)

జి. ఎదురుచూడదగిన చిత్రం, అకారం (రోమా 5:14; 1కొరి 10:11)

హెచ్. ఒక మాదిరి నమూనా (అపొ 7:44; హెబ్రీ 8:5)

ఐ. ఒక నీతి మాదిరి (ఫిలి 3:17; 1థెస్స 1:7; 2 థెస్స 3:9)

1. తిమో 4:12; 1 పేతురు 5:3)

ఈ సందర్భంలో (ఐ)లో ఉన్న అర్ధం శ్రేష్టమైనదిగా కనిపిస్తుంది. సువార్త, సిద్ధాంతమును అదేవిధంగా జీవితమునకు సూచనలును ఇస్తుంది. క్రీస్తులోని ఉచిత రక్షణ క్రీస్తు వంటి జీవితమును అడుగుతుంది.

**6:18 "పాపమునుండి విమోచింపబడి"** ఇది ఆరిస్ట్ పాసిల్ పార్టిసిపర్ క్రీస్తుని కార్యముద్వారా ఆత్మ కారకము వలన విశ్వాసులు పాపమునుండి విడిపింపబడినారు. విశ్వాసులు పాపపు నియంత నుండి (పరిశుద్ధపర్చబడి వ.7 మరియు 22)

▣ **"నీతికి దాసులైతిరి"** ఇది ఆరిస్ట్ పాసివ్ ఇండికేటివ్ "మీరు నీతికి బానిసలైతిరి" ప్రత్యేక అంశం 1:17లో చూడండి. దేవుని సేవించుటకు విశ్వాసులు పాపము నుండి విడిపింపబడినారు (14, 19, 22; 7:4; 8:2) ఉచిత కృప యొక్క గురిదైవిక జీవితము నీతిమంతులుగా తీర్చబడుట అనేది న్యాయపరమైన ధృవీకరణ మరియు వ్యక్తిగత నీతి నింపుదల. మనము ఇతరులను సువార్తతో చేరుకొనవలెనని మనలను రక్షించెను, మార్చెను. దేవుడు మనతో ఆగిపోడు.

**6:19 "మీ శరీర బలహీనతను బట్టి మనుష్య రీతిగా మాటలాడుచున్నాను"** రోములోని విశ్వాసులక ఈ పత్రికను వ్రాస్తున్నాడు. పౌలు వినిన స్థానిక సంఘ సమస్యతో వ్యవహరిస్తున్నాడా? లేక అందలి విశ్వాసులు గురించి సత్యమును రూడిపరుస్తున్నాడా? పౌలు గలతీ 3:15లో వలె రోమా 3:5 కూడా దీనిని మొదట ఉపయోగించినాడు.

19వ వచనం 16వ వచనంకు సాదృశ్యంగా ఉంది. పౌలు, ఆయన వేదాంత అంశమును వర్ణించుటకు దీనిని మరలా చెప్పుచున్నాడు. కొంతమంది ఈ వాక్య భాగం గురించి దాసుని రూపక అలంకారమును ఉపయోగించినందుకు క్షమాపణగా అని అర్ధమిస్తుందని చెప్పుచున్నాడు. ఎలాగైననూ, "మీ శరీర బలహీనతను బట్టి" వలన అది అమరదు. ప్రత్యేకంగా రోములో, మొదటి శతాబ్దంలో దాసరికం / బానిసత్వం దుష్టత్వం కాదు. ఇది కేవలం ఆ దినపు సంస్కృతి మాత్రమే.

▣ **"పరిశుద్ధత కలుగుటకై"** నీతిమంతులుగా తీర్చబడటం యొక్క గురి ఇది (22వ.) రక్షణకు సంబంధించి క్రొ॥ని॥ రెండు వేదాంత భావనలో చెప్పబడింది. (1) స్థానియ పరిశుద్దీకరణ, క్రీస్తు నందు విశ్వాసముంచుట వలన ఉచితంగా నీతిమంతులుగా తీర్చబడి, రక్షణతో కలిసి వచ్చే దేవుని బహుమానం (బాహ్య దృశ్యం) (అపొప 26:18; 1కొరి 1:2; 6:11; ఎఫెసి 5:26-27; 1థెస్స 5:23; 2థెస్స 2:13; హెబ్రీ 10:10; 13:12; 1పేతురు 1:2) మరియు (2) వృద్ధి చెందెడి పరిశుద్ధీకరణ, ఇది పరిశుద్ధాత్మ విశ్వాసి జీవితంను రూపాంతర పరిచి క్రీస్తు రూపంలోనికి తీసుకొని వచ్చేది. (అంతరంగిక దృశ్యం, 2కొరి 7:1; 1థెస్స 4:3,7; 1 తిమో 2:15; తిమో 2:21; హెబ్రీ 12:10, 14), 6:4లో ప్రత్యేక అంశం చూడండి.

**NASB (నవీన) వాక్యము 6:20-23**

**20. మీరు పాపమునకు దాసులైయున్నప్పుడు నీతి విషయమై నిర్బంధము లేనివారై యుంటిరి. 21. అప్పటి క్రియల వలన మీ కేమి ఫలము కలిగెను? వాటిని గురించి మీరిప్పుడు సిగ్గుపడుచున్నారు కారా? వాటి మరణము అంతమే 22 అయిననూ ఇప్పుడు పాపము నుండి విమోచించబడి దేవునికి దాసులైనందున పరిశుద్దత కలుగుటయే మీకు ఫలము; దాని అంతయు నిత్య జీవము 23 ఏలయనగా పాపము వలన వచ్చు జీతము మరణము, అయితే దేవుని కృపావరము మన ప్రభువైన క్రీస్తు యేసునందు నిత్యజీవము.**

**6:20-21** ఇది 18 మరియు 19 వచనములకు వ్యతిరేకంగా చెప్పటమే విశ్వాసులు ఒక్క యాజమానికి మాత్రమే సేవించగలరు (1థెస్స 16:13)

**6:22-23** ఇది ఒకనిని సేవించుట ద్వారా వచ్చే జీతం యొక్క తర్కశాస్త్రఅనుసారము ఈ పాపము మరియు విశ్వాసుల అంతము కృపాదృష్టిలో ఉన్న దానిని బట్టి దేవునికి స్తోత్రము మొదట రక్షణ వరము మన సహకారమువలననే అదేవిధంగా క్రైస్తవ జీవిత వరము కూడా మన సహకారం వలననే. రెండునూ విశ్వాసము, మారు మనస్సుతో స్వీకరింపదగినవే.

**6:22 "పరిశుద్ధత కలుగటయే మీకు ఫలము, దాని అంతయు నిత్య జీవమే".** "ప్రయోజనం" అన్న పదం "ఫలం" యొక్క ఫలం గురించి మాట్లాడుతుంది, కాని 21వ వచనం దేవుని సేవించుట ద్వారా కలిగే ఫలము గురించి మాట్లాడుతుంది. తక్షణ పలము, విశ్వాసుల క్రీస్తువంటి జీవితం. అంతిమ ఫలము ఆయనవలె ఆయనతో నిత్యము ఉండటం (1 యోహాను 3:2) తక్షణ ఫలితం లేనట్లయితే (మార్పు చెందిన జీవితం, యాకోబు2) చివరి ఫలితం న్యాయబద్ధంగా ప్రశ్నించబడుతుంది. (నిత్యజీవం. మత్తయి7) "ఫలంలేదు, వేరు లేదు"

**6:23** ఈ అధ్యాయమంతటి సంగ్రహం ఇది. పౌలు ఎంపికను నలుపు తెలుపులో చూపిస్తున్నాడు. ఎంపిక మనదే – పాపము మరియు మరణము లేదా క్రీస్తు ద్వారా ఉచిత కృప మరియు నిత్యజీవము. పాతనిబంధనలోని జ్ఞానసాహిత్యములో "రెండు మార్గములు"కు సాదృశ్యంగా ఉన్నవి (కీర్తన 1; సామె4; 10-19; మత్తయి 7:13-14)

- **"పాపపు జీతము"** పాపము మనుష్య గుణ ఆరోపణముతో (1) బానిస యాజమానిగా (2) సైన్యపు అధికారిగా (3) జీతమును చెల్లించే రాజుగా (3:9; 5:21; 6:9, 14, 17)

- **"దేవుని కృపావరము క్రీస్తునందు నిత్యజీవము"** ఈ పదము "ఉచిత వరము"గా (కరిస్మా)గా అనువదించబడింది. ఇది మూల పదమైన (ఖారిస్ 3:24; 5:15, 16, 17; ఎఫెసి 2:8-9) నుండి వచ్చినది.

**ప్రత్యేక అంశం 3:24లో చూడండి**

**చర్చాప్రశ్నలు :**

ఇది ధ్యాన మార్గదర్శక వ్యాఖ్యానం కావునా బైబిల్ యొక్క మీ స్వంత వ్యాఖ్యానమునకు మీరు భాద్యులు. మనమందరం మన కివ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, బైబిల్ మరియు పరిశుద్ధాత్మ భావ వ్యక్తీకరణలో ప్రముఖులు నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు దానిని విడిచి పెట్టకూడదు. ఈ పుస్తకంలోని బహుళ విషయములను ఆలోచించుటకు ఈ చర్చా ప్రశ్నలు సహాయపడతాయి. అవి ఆలోచింపజేసేవే కాని, నిశ్చితమైనవి కావు.

1. రక్షణతో మంచి కార్యముల సంబంధమేమిటి ?
2. కొనసాగుతున్న పాపము, విశ్వాసి రక్షణతో ఎలాంటి సంబంధం కలిగి ఉంటుంది ?
3. "పాపములేని సంపూర్ణత"ను ఈ అధ్యాయం బోధిస్తుంది ?
4. 5 మరియు 7 అధ్యాయాలలో 6వ అధ్యాయం సంబంధం ఏమిటి?
5. బాప్తిస్మము ఎందుకు ఇక్కడ చర్చింపబడింది ?
6. క్రైస్తవులు పాత స్వభావమును విడిచిపెట్టెదురా ? ఎందుకు ?
7. 1-14లోని ప్రెసెంట్‌టెన్స్ మరియు 15-23లోని ఆరిస్ట్ టెన్స్ క్రియలను అధిగమిస్తున్న సూచనలు ఏమిటి ?

# ద్వితీయోపదేశకాండము - 7వ అధ్యాయము

నవీన అనువాదముల యొక్క వాక్య విభజన

| UBS | NKJV | NRSV | TEV | JB |
|---|---|---|---|---|
| వివాహము నుండి ఒక పోలిక | ధర్మశాస్త్రం నుండి విడిపింపబడటం | వివాహము నుండి ఒక పోలిక | వివాహము నుండి ఒక ఉపమానం | క్రైస్తవుడు ధర్మశాస్త్రమునకు లోబడిలేదు |
| 7:1-6 | 7:1-6 | 7:1-3 | 7:1-6 | 7:1-6 |
| | | 7:4-6 | | |
| అంతరంగంలోని పాపం సమస్య | ధర్మశాస్త్రమునందు పాపపు లాభం | ధర్మశాస్త్రము మరియు పాపము | ధర్మశాస్త్రము మరియు పాపము | ధర్మశాస్త్రం యొక్క పని |
| 7:7-12 | 7:7-12 | 7:7-12 | 7:7-11 | 7:7-8 |
| | | | | 7:9-11 |
| | ధర్మశాస్త్రము పాపము నుండి రక్షించజాలదు | | 7:12-13 | 7:12-13 |
| 7:13-25 | 7:13-25 | 7:13 | | |
| | | అంతరంగ పోరాటం | మానవునిలో అంతరంగ పోరాటం | పోరాటం యొక్క ఫలితం |
| | | 7:14-20 | 7:14-20 | 7:14-20 |
| | | 7:21-25ఎ | 7:21-25ఎ | 7:21-23 |
| | | | | 7:24-25ఎ |
| | | 7:25బి | 7:25బి | 7:25బి |

వాక్యపు పరిధి యొద్ద అసలైన గ్రంధకర్త ఉద్దేశ్యంను అనుసరించుట....

ఈ వ్యాఖ్యానం చదువుటకు ఉపయోగపడే మార్గదర్శిని......

కావున బైబిల్ యొక్క వ్యాఖ్యానమును నీవు సొంతంగా చేసుకొనుటకు భాద్యుడవు. మనమందమం మనకు ఇవ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, పరిశుద్ధ గ్రంధం మరియు పరిశుద్ధాత్మ వ్యాఖ్యానంలో ప్రాధాన్యత వహించవలెను. దీనిని నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు విడిచిపెట్టకూడదు.

అధ్యాయమంతటినీ ఒకేసారి చదవాలి, అంశాలను గుర్తించాలి. నీ అంశ విభజనము పైన ఇవ్వబడిన నవీన అనువాద విభజనలతో సరి పోల్చుకోవాలి. విభజన అనేది ప్రేరణ కాదు. కాని ఇది అసలు గ్రంధకర్త యొక్క ఉద్దేశ్యమును తెలుసుకొనుటకు ఉపయోగపడును వ్యాఖ్యానమునకు ఇది కేంద్రమై వున్నది. ప్రతి వాక్య విభజనకే ఒక్క విభజనను కలిగి ఉండును.

1. మొదటి వాక్య భాగం
2. రెండవ వాక్య భాగం
3. మూడవ వాక్య భాగం
4. మొదలగునవి.

**సందర్భోచిత తలంపులు : 1-6 వచనాలు**

ఎ. 7వ అధ్యాయంలో (1) అవ ఆద్యమపు వెలుగులో, ప్రత్యేకంగా 12-14వ (అదేవిధంగా 3:20, 21-31; 4:13-16; 5:20) (2) అలాగుననే 9-11లో చూపబడిన విశ్వసించిన అన్యజనులు మరియు విశ్వసించిన యూదుల మధ్య తన్యతకు సంబందించినది. సమస్య యొక్క స్వభావం అనిశ్చయం; కాని ఇది

1. మోషే ధర్మశాస్త్రం న్యాయవాదం
2. మొదట మోషే, తరువార క్రీస్తు అన్న జూడైజర్స్ యొక్క వాదం.
3. సువార్త ఏవిధ:గా యూదులకు అన్వయం అనే అపార్ధం.
4. పాత, క్రొత్త నిబంధన మధ్య సంబంధ: యొక్క అపార్ధం.
5. విశ్వాస యూదుల నాయకత్వపు స్థానంలో విశ్వాస అన్యజనుల నాయకులు నిమచించబడ్డారనే అసూయ.

బి. రోమా 7:1-6, 6వ అధ్యాయంలోని విశ్వాసికి, తన పాత స్వభావమునకు సంబంధము యొక్క కొనసాగింపు ఉపయోగించిన రూపక అలంకారములు.

1. మరణము మరియు అసత్యము నుండి విడిపింపబడి వేరొక యాజమానికి అప్పగించబడటం (అధ్యాయం 6)
2. మరణము మరియు వివాహపు భాధ్యతల నుండి విడుల (అధ్యాయం 7)

సి. 6 మరియు 7 అధ్యాయాల సాహిత్యపరంగా సాదృశ్యం కలవు. 6 అధ్యాయం విశాసుల "పాపము"తోని సంబంధంతో వ్యవహరిస్తే, 7వ అధ్యాం విశ్వాసులు "ధర్మశాస్త్రము"తోని సంబంధంను వ్యవహరిస్తున్నాయి. మరణము ఒక దాసుని విడిపించే ఉపమానం (6:12-23), మరణము వివాహపు బాధ్యతల నుండి విడిపించిన దానికి సాదృశ్యంగా ఉంది 7:1-6)

| 6వ అధ్యాయం | 7వ అధ్యాయం |
|---|---|
| **6:1 "పాపము"** | **7:1 "ధర్మశాస్త్రం"** |
| **6:2 "పాపమునకు చనిపోవుట"** | **7:2 "ధర్మశాస్త్రమునక చనిపోవడం"** |
| **6:4 "నూతన జీవితంలో నడుచునట్లు"** | **7:6 "నూతన ఆత్మలో సేవ చేయునట్లు"** |
| **6:7 "మరణించిన వాడు పాపము నుండి విడిపించబడినట్లు** | **7:6 "నిర్బందించబడిన దాని విషయంలో చనిపోంనజి వారై ధర్మశాస్త్రము నుండి విడుదల"** |
| **6:18 "పాపము నుంఇ విడిపింపబడిన వారమై** | **7:3 "ధర్మశాస్త్రము నుండి విడుదల"** |

(ఎండర్స్ నైగ్రెన్ కామెంటరీ ఆన్ రోమన్స్, కార్ల్. సి. రాస్ ముస్సెన్ నుండి అనువదించబడినది. 256 పే నుండి తీయబడినది)

డి. ధర్మశాస్త్రము దాని శాసములతో మరణశిక్ష మానవులందరు ధర్మశాస్త్రమున క్రింద శిక్షావిధజకా అర్హులు. (రోమా 6:14; 7:4; గలతీ 3:13; ఎఫెసి 2:15; కొలస్సి 2:14) ధర్మశాస్త్రము ఒక శాపము.

ఇ. 7వ అధ్యాయంను వ్యాఖ్యానించుటకు 4 పెద్ద సిద్దాంతాలు కలవు.

1. పౌలు తన్ను గురించి తాను చెప్పుకొనేది (స్వీయ చరిత్ర సంబంధం)
2. మానవులందరికి ప్రతినిధిగా పౌలు మాట్లాడుచున్నాడు (ప్రాతినిధ్యం, క్రిసోస్టమ్)
3. పౌలు ఆదాము అనుభవమును మాట్లాడుచున్నాడు (మోప్సుటియా థియోడర్)
4. పౌలు ఇశ్రాయేలు అనుభవంను మాట్లాడుచున్నాడు.

ఎఫ్. చాలా రీతులుగా 7వ అధ్యాయం, ఆది 3వ అధ్యాయందలి పనిచేస్తుంది. దిగజారిన స్థితిని తెలియజేస్తుంది. జ్ఞానం, పతనమైన మానవుని రక్షించలేదు. దేవుని కృప, నూతన హృదయం మాత్రమే దానిని చేయగలదు. (నూతన నిబంధన, యిర్మియా 31:31-34; యెహె 36:26-27) అలా అయినప్పటికి ఇంకా పోరాటమే పద మరియు వాక్యధ్యానం.

**NASB (నవీన) వాక్యము : 7-1-3**

**1. సహోదరులారా, మనుష్యుడు బ్రతికినంతకాలమే ధర్మశాస్త్రమతని మీద ప్రభుత్వము చేయుచున్నదని మీకు తెలియదా? ధర్మశాస్త్రము ఎరిగిన మీతో మాటలాడుచున్నాను. 2. భర్తగల స్త్రీ, భర్త బ్రతికియున్నంత వంకేకు ధర్మశాస్త్రము వలన అతనికి బద్ధురాలు గాని, భర్త చనిపోయిన యెడల భర్త విషయమైన ధర్మశాస్త్రము నుండి ఆమె విడుదల పొందును. 3. కాబట్టి భర్త బ్రతికి యుండగా ఆమె వేరొక పురుషుని చేరిన యెడల వ్యభిచారిణి యనబడును. గాని, భర్త చనిపోయిన యెడల ఆమె ధర్మశాస్త్రమునుండి విడుదల పొందెను గనుక వేరొక పురుషుని వివాహము చేసికొనినను వ్యభిచారిణి కాకపోవును.**

**7:1 "ధర్మశాస్త్రము ఎరిగిన మీతో మాటలాడుచున్నాను"**

(1) విశ్వసించిన యూదులకు మాత్రమే; (2) రోమా సంఘంలోని విశ్వసించిన యూదుల మరియు అన్యజనుల మధ్య తన్యతను; (3) మానవులందరికి సంబంధించిన సాధారణ ధర్మశాస్త్రము (2:14-15); లేక (4) పాత నిబంధన లేఖనాల నుండి నూతన విశ్వాసం గురించి నేర్చుకొనుచున్నా నూతన అన్య విశ్వాసులను సూచించవచ్చు.

- **"ధర్మశాస్త్రము"** ఇది అద్యాయం యొక్క ముఖ్య అంశం (1,2,4,5, మొ॥) పౌలు అనేక భావనలతో ఈ పదమును ఉపయోగించినాడు. 6:14లోని వలన పౌలు చర్చ గురిపెట్టబడినట్టుగా కనిసిస్తుంది. 6వ అధ్యాయపు అమరికతో ఇది సాదృశ్యం కలిగియుంది. ధర్మశాస్త్రము మరియు క్రీస్తులోని నూతన నిబంధనకు దాని సంబంధము 3:21-31&4:13-16లో కూడా చర్చించబడినది.

- **NASB "మనుష్యుడు బ్రదికినంతకాలమే ధర్మశాస్త్రమతని మీద ప్రభుత్వం చేయుచున్నది"**

  **NKJV "మనుష్యుడు బ్రతికినంతకాలమే ధర్మశాస్త్రమతని మీద పరిపాలన చేయుచున్నది"**

  **NRSV "ఒక మనుష్యుని జీవితకాలము మట్టుకే ధర్మశాస్త్రమతనిని బందించుచున్నది"**

  **TEV "మనుష్యుడు జీవించునంతకాలమే ధర్మశాస్త్రము ఒక మనుష్యుని ఏలును"**

  **JB "ఒక వ్యక్తి జీవితకాలములోనే ధర్మశాస్త్రమతనినిన ప్రభావితం చేయును"**

  ఇది అక్షరార్ధముటా "మీద ప్రభువు"గా (కురియోము 6:9, 14) మోషే ధర్మశాస్త్రము గొప్ప ఆశీర్వాదమును (కీర్తన 19; 119), అదేవిధ:గా భయంకరమైన శాపమును (గలతీ 3:13; ఎఫెసి 2:15; కొలస్సి 2:14) భౌతిక మరణంతో, ధర్మశాస్త్రమునకు బాధ్యత రద్దవుతుంది. ఇదే రూపకఅలంకారం పాపమునకు విశ్వాసుల మరణము గురించి 6వ అద్యాయంలో వాడబడింది.

  **7:2 "భర్తగలస్త్రీ"** ఇది 1-6 వచనాలలో పౌలు యొక్క పెద్ద ఉపమానం. 6వ అధ్యాంలో మరణము, దాసత్వమునకు అంతమెందించెదిగా పౌలు చెప్పినాడు. ఇక్కడ వివాహము మరియు దాని బాధ్యతలు గురిగా ఉన్నాయి. ఈ ఉపమానము తలక్రిందులు చేయబడింది. ఎందుకంటే భర్త చనిపోయినాడు కనుక స్త్రీ వేరొకని వివాహము చేసుకొనవచ్చును, కాని పౌలు పోలికలో, విశ్వాసి మరణించెను, కను అతడు దేవుని కొరకు జీవించును.

- **"ఆమె విడుదల పొందను"** ఇది 6:6లోని క్రియనను సమానం "పని చేయకుండా చేయటం" "నిరూపయోగం చేయుట" లేక "సంబంధం లేకుండా చేయుట". విడిపించబడుతూ ఉండటం.

**ప్రత్యేక అంశం 3:3లో చూడండి :**

**7:3 "వ్యభిచారిణి"** యనబడును॥ ఈ వ్యాఖ్యానము, షామ్మె మరియు హిల్లెల్ యొకక రబ్బీయుల స్కూల్‌నకు చెందినది. ద్వితి 24:1-4పైన ప్రత్యేకంగా "ఒక అసభ్యమైన" హిల్లెల్ స్కూల్ స్వేచ్ఛ వర్గమునకు చెందినదై, పకారణమునకైననూ విడాకులను అనుమతించేది. షామ్మెస్కూల్ సాంప్రదాయకమైనదై, వ్యభిచారము లేక వేరే లైంగిక అసభ్యతనకు తప్ప విడాకులను అనుమంతిచినది (మత్తయి 5:32; 19:9)

**NASB (నవీన) వాక్యము : 7:4-6**

**4. కావునా నా సహోదరులారా, మనము దేవుని కొరకు ఫలమును ఫలించునట్లు మృతులలో నుండి లేపబడిన క్రీస్తు అను వేరొకని చేరుటకై మీరును ఆయన శరీరము ద్వారా ధర్మశాస్త్రము విషయమై మృతులైతిరి. 5. ఏలయనగా మనము శరీర సంబంధులమై యుండినప్పుడు మరణార్ధమైన ఫలమును ఫలించుటకై ధర్మశాస్త్రము వలననైన పాపేచ్ఛలు మన అవయువములలో కార్యసాధకములై యుండెను. 6. ఇప్పుడైతే దేని చేత నిర్బంధింపబడితిమో దాని విషయమై చనిపోయిన వారమై ధర్మశాస్త్రము నుండి విడుదల పొందితిమి గనుక మనము అక్షరానుసారమైన ప్రాచిన స్థితిగలవారము కాక ఆత్మానుసారమైన నవీన స్థితిగల వారమై సేవ చేయుచున్నాము.**

**7:4 "మీరును మృతులైతిరి"** ఈ వాక్యబాగపు ముఖ్య పట్టు ఇది. 6వ అధ్యాయంలోని, పాపమునకు విశ్వాసులు మరణించుట అన్న సాదృశ్యమునకు సమరూపము. నూతన యుగపు ఆత్మకును, మరియు క్రీస్తు విశ్వాసులు నూతన సృష్టి (2కొరి. 5:17)

- **"క్రీస్తు శరీరము ద్వారా"** ఇది క్రీస్తు శరీరమైన సంఘము యొక్క వేదాంత అభిఅప్రాయంకాదు (2కొరి. 12:12, 27) కాని 6:3–11లో వలె క్రీస్తు భౌతిక శరీరమునకు, క్రీస్తు వారు చనిపోయినారు. యేసుని మరణము వారి మరణము (2కోరి 5:14–15; గలతీ 2:20) యేసుని పురుత్థాన జీవితం, దేవుని సేవించుటకు మరియు ఇతరులను సేవించుటకు వారిని విడిపించెను.

- **"మనము దేవుని కొరకు ఫలమును ఫలించునట్లు"** ఇది కూడా, 6వ అ॥నకు ప్రత్యేకంగా 6:22నకు సమరూపము విశ్వాసులు ఇప్పుడు క్రీస్తు ద్వారా విడిపింపబడి క్రీస్తునకు లోబడేవారు. ఇది కొనసాగుతున్న వివాహపు పోలిక, క్రీస్తు విశ్వాసుల కొరకు చనిపోయినట్టు, విశ్వాసులు ఇప్పుడు పాపమునకు చనిపోవాలి. (2కోరి. 5:13–14; గలతీ 2:2) క్రీస్తు లేపబడిన విధంగా విశ్వాసుల కూడా దేవుని సేవించే నూతన ఆత్మీయ జీవితమునకు లేపబడితిరి (రోమా 6:22)

**7:5**

**NASB "శరీర సంబంధులమై యున్నప్పుడు"**

**NKJV "మనము శరీరమలో యున్నప్పుడు"**

**NRSV "మనము శరీరములో జీవించుచుండగా"**

**TEV "మనం మన శరీర స్వభావము ప్రకారము జీవించున్నప్పుడు"**

**JB "మన మారుమనస్సు ముందు"**

ఈ వచనము 4వ వ॥నక విరుద్దము 4వ వ॥, 6వ వ॥ వలే విశ్వాసుల అనుభవంనక సంబంధించినది. 5వ వచనం దేవుని శక్తి లేకుండిన జీవిత "ఫలము"ను వివరించనది (గలతీ 5:18–24) ధర్మశాస్త్రము విశ్వాసుల పాపమును చూపును. (7–9; గలతీ 3:23–25), కాని దానిని జయించుటకు వారికి శక్తిని ఇవ్వదు.

ఈ సందర్భంలో ఇది ఆదాము నుండి సంక్రమించిన విశ్వాసుల పతనమైన పాప స్వభావమును సూచిస్తుంది. (6:19) పౌలు సార్భ్ అన్న పదమును రెండు రీతులుగా ఉపయోగించుచున్నాడు. (1) పాప స్వభావం (ప్రాచీన మనుష్యుడు), మరియు (20 భౌతిక శరీరము (1:13; 4:1; 9:3,5) ఇక్కడ ఇది వ్యతిరేకంకాని రోమా 1:3; 4:1; 9:3,5; గలతీ 2:20ను గమనించండి. శరీరము /మాంసం (సార్భ్/ సోమా)లు లోపల దుష్టంకావు. కాని మనస్సు (నౌస్,) యుద్ద రంగము ఈ యుగపు దుష్ట శక్తులకు మరియు పరిశుద్మానకును మద్య వివాదము గ్రీకు బైబిల్ యొక్క స్థిరతను ఉపయెగించి పౌలు మాట్లాడుచున్నాడు.

- **"ధర్మశాస్త్రము వలనైన పాపేచ్ఛలు మన శరీరములో కార్యసాధకములై యుండెను"** తిరుగుబాటు చేసే మానవ స్వభ్యావము సాధారణవ ుగా ఏ కట్టుబాట్లుకైననూ గర్వముగా ఎదిరించునటువంటి ఆది3లో మరియు మానవులందరిలో స్పష్టంగా కనిపించుచున్నది. ధర్మశాస్త్రము సరిహద్దులను నియమించును (7–8 వ॥లు). ఈ సరిహద్దులు మానవుని రక్షణకొరకు నియమింపబడ్డాయి. కాని మానవుడు వాటిని గొలుసులుగా పరిమితులుగా పరిగణించినడు. పాతభరితమైన, స్వేచ్ఛాత్మ దేవుని ధర్మశాస్త్రము చేరేపబడుతుంది. హద్దులు సమస్యకాదు (ధర్మశాస్త్రం 12–13వ॥లు), కాని మానవుని స్వయం చేదకం మరియు స్వయం చిత్తం.

**7:6 "కాని ఇప్పుడు"** న్యూమేక్ మరియు నిడా, ఏట్రాన్స్ లేటర్"స్ హేండ్‌బుక్ ఆన్ పౌల్స్ లెటర్ టూ థి రోమాన్స్ శ్రద్ద గొలిపే వ్యాఖ్య కల్గియుంది.

- **"5 మరియు 6"** వచనముల మద్య సమరూపం గమనించుట చాలా ప్రాముఖ్యము, అదేవిధంగా వాటి వెంబడివచ్చే వాటి సంబంధము. 5వ వచనం పూర్వ క్రైస్తవ అనుభవం, ఇది 7:7–25లో సాదృశ్యం కల్గియుంది; 6వ వచనం, దేవుని ఆత్మ నాయకత్వం క్రింద ఉండిన ప్రస్తుతపు విశ్వాసజీవితమును వివరిస్తుంది, ఇది 8:1–11లో సాదృశ్యం కల్గియుంది (130 పే)

- **"విడుదల పొందితిమి"** విశ్వాసులుధర్మశాస్త్రంలో చూపబడిన ప్రకారము పాపముచే పట్టబడియుంటారు, కాని ఆత్మవలన సువార్త శుభసందేశ ద్వారా విడిపంచబడినారు. 2వలో భర్త చనిపోయిన స్త్రీ విషయంలో కూడా ఇదే పదం ఉపయోగించబడింది.

- **"దీని చేత నిర్బందింపబడితిమో దాని విషయమై చనిపోయిన వారమై"** దేవుడు విశ్వాసులను క్రీస్తు మరణం ద్వారా (1) పాత నిబంధన శాపము నుండి; మరియు (2) వారి అంతరంగపు పాపము నుండి విడిపించబడినారు. వారు నిరంతరము దేవుని చిత్తమునకు తిరుబాటు చేయుచు, పతన స్వభావంతో వ్యక్తిగత పాపముతో అసాధారణ శోదనలతో ఉండెదరు (ఎఫెసి 2:2–3)

- **"నవీన స్థితి......ప్రాచీన స్థితి"** ఈ నూతన ఆత్మీయ మార్గము నూతన నిబంధనను సూచిస్తుంది (యిర్మియా 31:31-34; యెహె 36:22-32) గ్రీకు పదం (కైనోస్ -కైనోట్స్) "నవీనం" కొరకు పౌలుచే వాడబడినది.
  1. నూతన జీవము, రోమా 6:4
  2. నూతన ఆత్మ, రోమా 7:6
  3. నూతన నిబంధన, 1కొరి, 11:2; 2కొరి. 3:6
  4. నూతన సృష్టి, 2కొరి 5:17; గలతీ 6:15
  5. నూతన పురుషుడు, ఎఫెసి 2:15; 4:24
- **"ప్రాచీన"** అన్న పదం మోషే ధర్మశాస్త్రమునక అన్వయం చేయబడినది. "పూర్తిగా పాతతిలినది". పౌలు, హీబ్రూ గ్రంధకర్త ఏవిధంగా చేసినో, ఆవిధంగా నూతన మరియు పాత నిబంధనలను విభేదించుచున్నాడు. (8:7 మరియు 13)
- **NASB, NKJV "ఆత్మానుసారమైన నవీనస్థితిగల వారమై"**

**NRSV "కావునా మనము వ్రాయబడిన పాత చిహ్నంనకు కాకుండా, ఆత్మ యొక్క నవీన మార్గములో"**

**TEV "కాని ఆత్మ యొక్క నూతన మార్గములో"**

**JB "నూతన ఆత్మ రీతిలో స్వేచ్ఛగా సేవచేయుటకు"**

ఇది అక్షరార్ధముగా "ఆత్మ యొక్క నూతనత్వంలో" అని అర్ధము. ఇది పరిశుద్ధత్మయో లేక వెలిగింపబడిన మనుష్య ఆత్మయో అని సూచించుట అనిశ్చయం. చాలా ఇంగ్లీషు అనువాదాలు పెద్ద అక్షరములతో ఆత్మ అని చెప్పినారు. కనుక ఇది పరిశుద్ధాత్మ కావచ్చు. ఇది 8వ అధ్యాయంలో సందిగ్ధంగా (15సార్లు0 వ్రాయబడింది. "ఆత్మ" అన్నపదం (1) సువార్త వలన శక్తిని పొందిన, వెలిగింపబడిన మానవ ఆత్మ; (2) పరిశుద్ధాత్మ (రోమా 1:4, 9; 2:29; 7:6; 8:15; 11:8; 12:11; 1కొరి 12:11; 4:21; 5:3,4,5; 7:34; 14:15,16,32; 16:18)

పౌలు రచనలలో **"శరీరము"** మరియు "ఆత్మ" వేర్వేరు ఆలోచన మరియు జీవితమను విభేదించినదిగా చూడబడుతుంది (7:14; 8:4; గలతీ 3:3; 5:16, 17, 25; 6:8) దేవుడే లేని జీవితం "శరీరము" కాని దేవునితో జీవితం "ఆత్మ" అంతరంగంలో వశించే పరిశుద్మా (8:9,11) విశ్వాసిని క్రీస్తులో నూతన సృష్టిగా మార్చుతుంది (స్థానీయంగా మరియు అనుభవ పూర్వకంగా)

రోమా 7:7-25 యొక్క సందర్భోచిత తలంపులు

ఎ. రోమా 7:7-25 మానవుల నిజ దృశ్యాన్ని వ్యక్తపరుస్తుంది. మానవులందరూ రక్షింపబడినవారు మరియు రక్షింపబడని వారు, ఈ లోకములోని మంచి చెడుల మరియు వారి స్వతం హృదయముల మనస్సుల మధ్య ఉన్న అన్యతను అనుభవించిన వారే, వ్యాఖ్యాన సంబంధ ప్రశ్న, ఏవిధ:గా ఈ వాక్య భాగము అర్ధము చేసుకోవాలని పౌలు చెప్పుచున్నాడు? ఈ వాక్యభాగము 1:18-6:23 మరియు 8:1-39లకు సందర్భపరంగా సందర్భపరంగా సంబంధించినది కొంతమంది దీనిని మానవులందరిని దృష్టిలో ఉంచుకొన చెప్పబడినదిగా చూస్తున్నారు. కాబట్టి పౌలు యొక్క స్వంత అనుభమును ఒక మాదిరిగా చూస్తున్నాడు. ఈ అనువాంను "స్వీయచరిత్ర సిద్ధాంతం" అని చెప్పుదురు.

పౌలు **"నేను"** అన్నమాటను 1కొరి. 13:1-3లో వ్యక్తిగతం కాని రీతిలో ఉపయోగించినాడు. వ్యక్తిగతం కాని ఈ "నేను" అన్న ఉపయోగం రబ్బీల నుండి కూడా వ్రాయబడినట్టుగా చూడవచ్చు. అది ఇక్కడ నిజమైతే ఈ వాక్యభాగము మానవుల అజ్ఞానము నుండి ఒప్పుదల ద్వారా రక్షణకు మార్పు చెందిన దశనే సూచించవచ్చు (8వఅ) "ప్రాతినిధ్యపు సిద్ధాంతము"

ఎందేమైననూ ఇతరులు ఈ వచనములను విశ్వాసుల యొక్క సతనమైన స్వభావముతో పోరాటమునకు సంబందించినదిగా చూస్తున్నారు. 24 వ వచనం యొక్క హృదయపు కేక అంతరంగికి తన్యతను వ్యక్తపరుస్తుంది. 7-13 వచనాలను ఆరిస్ట్ మరియు ఇంపెరెపెక్ట్ వెర్ట్ టెన్సస్ ఆధిక్యంగా ఉంటే 14-25 వచనాలు ప్రెసెంట్ మరియు పెర్‌ఫెక్ట్ టెన్సస్ ఆధజక్యంలో ఉన్నవి. ఇది "స్వీయ చరిత్ర" నుండి తీసుకోబడినదై, పౌలు తన స్వంత అనుభం అయిన, అజ్ఞానము నుండి ఒప్పుదలకు నీతిమంతులుగా తీర్చబడుటకు మరియు తన్యతలమయమైన క్రమంగా వృద్ధియెందెడి పరిశుద్ధీకరణకును వివరించుచున్నాడు. (ఆటోస్ ఇగో "నేను॥ వ 25)

ఈ రెండు అభిప్రాయాలు సత్యమవ్వవచ్చు. 7-13 మరియు 25బిలో పౌలు స్వీయ చరిత్రమయంగా మాట్లాడుచున్నాడు. అదేవిధంగా 14-25ఎలో పాపముతో ఆయన అంతరంగపు పోరాటమును యొక్క అనుభవమును విడిపించబడిన మానవులందరికి చెందినదిగా మాట్లాడుచున్నాడు.

ఏదేమైననూ ఈ వాక్య భాగము పౌలు మారుమనస్సుకు ముందు మతవాదికి విరోదంగా చూడటం మర్చిపోకూడదు. పౌలు యొక్క అనుభం సాటిలేనిది.

బి. ధర్మశాస్త్రము మంచిది. ఇది దేవునినుండి వచ్చినది. ఇదిదేవుని ఉద్దేశ్యమును నెరవేర్చినది మరియు నేరవేర్చుచున్నది (7:7, 12, 14, 22, 25) కాని అది శాంతిని మరియు రక్షణను తీసుకురా జాలదు. జేమ్స్ స్టూవర్ట్, 'ఏ మేన్ ఇన్ క్రైస్ట్' అనే పుస్తకంలో పౌలు యొక్క వైవిధ్య ఆలోచన మరియు రచనలను ఈవిధంగా చూస్తున్నాడు.

"ఒక ఆలోచన వ్యవస్థను నిర్మించే మరియు ఉఒక సిద్దాంతమును రూపించే వ్యక్తినుండి స్థిరత్వమును మరియు ఉపయోగించిన పదములకు అర్థమును సాధారణముగా ఆవ్యక్తినుండిచే ఆశిస్తాము. ఆయన ప్రదాన ఆలోచనలతో యొక్క వాక్యశాస్త్రములలో కుదింపును గురిగా ఆశిస్తారు. గ్రంథకర్త ద్వారా ఒకసారి ఉపయోగించిన పదము యొక్క భావమును ఆవాక్యభాగమంతటితో ఉండాలని ఆశిస్తారు. కాని పౌలు నుండి చూస్తే ఇది నిరాశ జనకము పౌలు యొక్క శబ్ద సముదాయము అస్థిరమైనదిగా, గట్టివి కానివిగా కనిపిస్తాయి. 'ధర్మశాస్త్రము పరిశుద్దమైనది' అని ఆయన వ్రాస్తూ (7:12-13) "ధర్మశాస్త్రము నందు ఆనందిస్తున్నాని వ్రాస్తూ (గలతీ 3:13)లో "ధర్మశాస్త్రపు పాపము నుండి క్రీస్తు విడిపించెనని చెప్పుచున్నాడు" (పే 26)

సి. వాక్యపు ఋజువు "పౌలు సూచిస్తున్నది, రక్షింపబడిన వ్యక్తికా లేక రక్షింపబడని వ్యక్తికా 14-15? అన్న ప్రశ్నతో వ్యవహరిస్తుంది.

1. రక్షింపబడని వ్యక్తి

    ఎ. ఇది ఆది గ్రీకు మాట్లాడే సంఘ పితరులు వ్యాఖ్యానము.

    బి. క్రింది వచనాలు దీనిని బలపరుస్తున్నాయి.

        1. "నేను శరీర సంబంధిని", 14వ.

        2. "పాపమునకు అమ్మబడి", 14వ

        3. "మంచిది ఏదియునివసింపదని", 18వ

        4. "నా అవయువములోనున్న పాపనియమమునకు నన్ను చెరపట్టి"

        5. "అయ్యో, నేనెతం దౌర్భాగ్యుడను? ఇట్టి మరణమునకు లోనగు శరీరమునుండి నన్నెవడు విడిపించును? 24వ

    సి. 6వ అధ్యాయం యొక్క సందర్భము, మనము పాపపు యాజమాని నుండి విడిపించబడటము. 8వ అధ్యాయం యొక్క సందర్భము "తరువాత ఎలా" అని ప్రారంభిస్తుంది.

    డి. ఆత్మ లేక క్రీస్తు అన్న సూచికలు, ఈ సందర్భం ముగింపు వరకు లేకపోవటం (25)

2. రక్షింపబడిన వ్యక్తి :

    ఎ. ఇది అగస్టీన్ కాల్విన్ మరియు సంస్కరణ కర్తల అనువాదము

    బి. ఈ క్రింది వాక్యములు ఈ అభిప్రాయమును బలపరుస్తున్నవి.

        1. "ధర్మశాస్త్రము ఆత్మసంబంధమైనదని యెరుగుదము", 4వ

        2. "ధర్మశాస్త్రము శ్రేష్టమైనట్టు ఒప్పుకొనుచున్నాను", 16వ

        3. "నేను చేయ నిశ్చయించు మేలుచేయక", 19వ

        4. "అంతరంగ పరుషుని బట్టి దేవుని ధర్మశాస్త్రమందు నేను ఆనందించుచున్నాను", 22వ

    సి. రోమా యొక్క విస్తృత సందర్భంలో 7వ అధ్యాయము "పరిశుద్దపర్చబడటం"తో వ్యవహరిస్తుంది.

    డి. తరచుగా ఇంపెర్ఫెక్ట్ మరియు ఆరిస్ట్ టెన్సస్ (7-13వ), 14-24వలోని భూతకాలమునకు వాడబడటం అనేది పౌలు జీవితంలో ఒక వ్యత్యాసం మరియు ఒక నూతన భాగమును సూచిస్తుంది. క్రీస్తు స్వభావంలోనికి వెళ్ళాలని అధికంగా ప్రయత్నం చేస్తే, అధికంగా తన పాప స్వభావమును అనుభవిస్తారు. ఈ విరుద్ద వాక్యము ఈ సంధర్భమునకు మరియు పౌలు యొక్క వ్యక్తిత్వమునకు సరిపోతుంది. (2 విషయమునకు, విశ్వాసులందరికి) ఒక మెథడిస్ట్ పాటలోని వరుస ఇది

"ఎవరూలేరు, ఓ ప్రభువా, పరిపూర్ణ విశ్రాంతిని కలిగి పాపమునుండి సంపూర్తిగా స్వేచ్ఛ కలవారు. ఎవరూలేరు నిన్ను సేవిస్తూ అలసిపోవువారు వారిలో నున్న పాపమును తెలుసుకొందరు (రచయిత పేరు, పాటపేరు తెలియదు)

**NASB (నవీన) వాక్యము : 7:7-12**

**7. కాబట్టి యేమందుము? ధర్మశాస్త్రము పాపమాయెనా? అట్టనరాదు. ధర్మశాస్త్రము వలననే గాని పాపమనగా ఎట్టిదో నాకు తెలియక పోవును. ఆశింపవద్దని ధర్మశాస్త్రము చెప్పనినాకు తెలియక పోవును. ఆశింపవద్దని ధర్మశాస్త్రము చెప్పని యెడల దురాశయన ఎట్టిదో నాకు తెలియక పోవును. 8. అయితే పాపము ఆజ్ఞను హేతువు చేసికొని సకల విధమైన దురాశను నాయందు పుట్టించెను. ధర్మశాస్త్రము లేపనప్పుడు పాపము మృతము. 9. ఒకప్పుడు నేను ధర్మశాస్త్రము లేకుండా జీవించుచుంటిని గాని, ఆజ్ఞ వచ్చినప్పుడు పాపమునకు మరదల జీవము వచ్చెను; నేనైతే చనిపోతిని. 10. అప్పుడు జీవార్ధమైన ఆజ్ఞనాకు మరణార్ధమైనట్లు కనబడెను 11. ఎలయనగా పాపము ఆజ్ఞను హేతువు చేసికొని నన్ను మోసపుచ్చి దానిచేత నన్ను చంపెను. 12. కాబట్టి ధర్మశాస్త్రము పరిశుద్ధమైనది ఆజ్ఞకూడా పరిశుద్ధమైనదియూ నీతిగలదియు ఉత్తమమైయున్నది.**

**7:7 "కాబట్టి యేమందుము"** పౌలు మరల డయోట్రైబ్ ఉపయోగమునకు వెళ్ళుచున్నాడు. (6:1, 15; 7:1, 13)

**"ధర్మశాస్త్రము పాపమాయెనా?"** ప్రత్యక్షత యొక్క విభేదా వాక్యములలో ఇది ఒకటి. పాపమునను ప్రత్యక్షపరుచుటకు దేవుడు, ధర్మశాస్త్రము యొక్క పరిశుద్ధతను మరియు మంచితనము ఒక అర్ధము వలె ఉపయోగించుచున్నాడు. ఆరీతిగా పతనమైన మానవులను పశ్చాత్తాపమునకు మరియు విశ్వాసమునకు నడిపించుచున్నాడు (12-13వ; గలతీ 3) అదేవిధంగా పరిశుద్ధ పరచబడుటలో ధర్మశాస్త్రము పనిచేస్తూ ఉంటుంది కాని నీతిమంతులుగా తీర్చబడుటలో కాదు.

- **"అట్లనరాదు"** ఒక తప్పుడు అభిప్రాయము తృణీకరించె పౌలు పద్దతి (వ. 13; 3:4, 6, 31; 6:2, 15; 9:14; 11:1,11; గలతీ 2:17; 3:21) "విరోధముగా" పౌలు తన విషయములను చెప్పుటకు మరియు బలంగా విభేదించుటకు పౌలు ఉపయోగించే రీతి (3:4, 6, 31; 6:2, 15; 7:13; 9:14; 11:1,11)

- **"నాకు"** 7-25వ॥లలో ఎన్నిసార్లు "నేను", "నాయొక్క" లేక "నాకు" వాడబడినవే మీ బైబిల్‌లో గుర్తించండి అవి మిమ్మును ఆశ్చర్యపరుస్తాయి. 40 సార్లు కంటే ఎక్కువగా ఉన్నవి.

- **"ధర్మశాస్త్రము వలననే గాని పాపమనగా ఎట్టిదో నాకు తెలియకపోవును"** మోషే ధర్మశాస్త్రము వ్యక్తిగత పాపమును చూపించే అద్దంవలె పనిచేస్తుందని చెప్పి ఒక ముఖ్యవచన& ఇది (3:20; 4:65; 5:20; గలతీ 3:14-29, ప్రత్యేకంగా 24) ఒకసారి ధర్మశాస్త్రమును మీరితే అది నిబంధనను మీరినట్లే కాబట్టి దాని పరిణామాలను భరించాలి. (వ.10 మరియు యాకోబు 2:10)

- **"ధర్మశాస్త్రము వలననే"** ఇది రెండవ తరగతి షరతులతో కూడిన వాక్యమై "సత్యమునకు విరోధము"గా తెలియజేస్తుంది. పౌలు పాపమును ఒప్పుకొన్నవాడు. రోమా పత్రికలో ఇది మాత్రమే ఈ వ్యాకరణ శైలికి ఉదాహరణము. పౌలు దీనిని గలతీ 1:10; 3:21; అదేవిధంగా 1కొరి. 2:8; 5:10; 11:31; మరియు 2 కొరి. 12:11

- **"ఆశింపవద్దు"** ఇది పది ఆజ్ఞలలో చివరి ఆజ్ఞ (నిర్గమ 20:17; ద్వితి 5:21) ఈ చివరి ఆజ్ఞ సరియైన స్వభావముపై దృష్టి సారించినది, ఇది అందరికి అవసరమైనది (మత్తయి 5-7) ధర్మశాస్త్రము తరుచుగా "అజ్ఞ"గా సూచించబడినది (8,9,11,12,13) "ఆగించు" అన్నపదము "ఒక దాని మీద ఒకని మనస్సు నిలుపటము" లేక "బలంగా కొరుకోవటము". దేవుడు మానవులుకు సృష్టి ద్వారా అనేక మంచి విషయములనిచ్చెను, కాని దేవుడు ఇచ్చిన హద్దులను దాటి తీసుకోవటం మానవునికి అలవాటైనది. "ఏవిధ:గానైననూ నాకు అధికము" అనేది వారి తలంపు స్వార్ధము భయంకరమైన నియంత.

**7:8**

**NASB, NKJV "హేతువ చేసికొని"**

**NRSV "అవకాశమును చూసుకొని"**

**TEV "అవకాశము దొరికి"**

**JB "అదును తీసుకొని"**

ఇది పౌన్యములో కార్యకలాపములు నిర్వర్తించే పీటమునకు సంబంధమైన పదము. (8&11) ఈ సందర్భంలో ఇది వ్యక్తిగా చూపించబడినది (9వ). పాపము సైనికాదికారి ద్వారా నెరవేర్చే సైనికి కార్యముగా చెప్పబడింది. వ11 మరియు 17; 6:12,14,16)

▣ **"ధర్మశాస్త్రము లేనప్పుడు పాపము మృతము"** పాపము దేవుని చిత్తమునకు విరోధము (రోమా 4:15; 5:13; 1కొరి 15:56). ఈ వాక్యములో క్రియలేదు. ఒకటి సరఫరా చేయబడాలి. భూత కాలమును సరఫరా చేస్తే ఇది ఒక విశ్వసూత్రముగా సూచిస్తుంది. ఆరిస్ కామును సరఫరా చేస్తే, ఇది పౌలు జీవితమును ప్రత్యేకంగా సూచిస్తుంది.

**7:9 "ఒకప్పుడు జీవించుచుంటిని"** ఇది (1) అజా&ఇఫు వయస్సులో ఒక శిశువు; లేక (2) సువార్త సత్యము తన హృదయమును బద్దలు చేయక ముందు నిష్ఠగల పరిసయ్యుడిగా (అపొ 23:1; ఫిలిప్పి 3:6; 2తిమో 1:3) గా సూచించవచ్చు.

మొదటిది 7వ అధ్యాయం యొక్క "స్వీయచరిత్ర సిద్దాంతము" యొక్క అనువాదమును మరియు రెండవది, "ప్రాతినిద్యపు సిద్దాంతము"ను ప్రతినిధులుగా ఉండవచ్చు.

▣ **"ఆజ్ఞ వచ్చినప్పుడు పాపమునక మరలా జీవము వచ్చెను; నేనైతే చనిపోతిని"** నిషేదముల వలన తిరుగుబాటు మనస్సు గల మానవులకు శక్తి వచ్చినది. "వద్దు" అన్న దేవుని ధర్మశాస్త్రము పతనమైన మానవుల స్వయంకృత గర్వమును ఎక్కిబెట్టినది (ఆది 2:16–17; 3:1–6); 5:21 మరియు 7:8, 11, 17, 20లో పాపము ఏవిధ:గా మనుష్యగుణారోపణము చేయబడిందో గమనించండి.

**7:10 "జీవార్ధమైన ఆజ్ఞనాకు మరణార్ధమైనట్టు కనబడెను"** ఇది లేవి 18:5 లేక రోమా 2:13లోని వాగ్దానమును సూచించవచ్చు నెరవేలేని దానిని ధర్మశాస్త్రము వాగ్దానము చేసెను, అది పాపమని కాదు గాని, మానవుల యొక్క బలహీనత మరియు తిరుబాటు వలననే. ధర్మశాస్త్రము మరణశిక్షగా మారినది. (గలతీ 3:13; ఎఫెసి 2:15; కొలస్సీ 2:14)

**7:11 "నన్ను మోసపుచ్చి దానిచేత నన్ను చంపెను"** ఇవి రెండునూ ఆరిస్ట్ ఇండికేటివ్ క్రియలు. ఈ పదము గ్రీకు బైబిల్‌లో అవ్వ విషయమునకు వాడబడినది. ఆది 3:13, పౌలు ఈ పదమును చాలాసార్లు ఉపయోగించినాడు. (రోమా 16:18; 1కిర 3:18; 2కొరి 11:3; 2థెస్స 2:3; 1తిమో 2:14) ఆదాము మరియు అవ్వల సమస్య &ఊదా ఆశయే (2కొరి. 11:3; 1 తిమో 2:14) దేవుని ఆజ్ఞకు అవిధేయత చూపి ఆదాము, అవ్వలు, అదేవిధంగా పౌలు మరియు మానవులందరూ ఆత్మీయంగా మరణించారు (1:18–3:20)

**7:12** ఇది ధర్మశాస్త్రమును గురించి పౌలు యొక్క నిశ్చయం ధర్మశాస్త్రము సమస్యకాదు. ఎలాగైననూ 6వ అధ్యాయంలో "పాపము" మరియు 7వ అధ్యాయంలో "ధర్మశాస్త్రము" యొక్క సాదృశ్య అమరికి న్యాయపరమైన యూదుల విశ్వాసులకు (14:1–15:13లోని బలహీనులు) కలవరం కలిగించవచ్చు)

**NASB (నవీన) వాక్యము 7:13**

**ఉత్తమమైనది నాకు మరణకరమాయెనా? అట్లనరాదు. అయితే పాపము ఉత్తమమైన దాని మూలముగా నాకు మరణము కలుగజేయుచు, పాపము పాపమైనట్టు అగుపడునిమిత్తము, అదినాకు మరణకరమాయెను.**

**7:13**

**NASB "పాపము పాపమైనట్టు అగుపడు నిమిత్తము"**

**NKJV "పాపము పాపముగా కనిపించునిమిత్తము"**

**NRSV "పాపము పాపమువలె కనిపించునిమిత్తము"**

**TEV "పాపము తన నిజస్వభావమును చూపించునిమిత్తము"**

**JB "పాపాము తన నిజ వర్ణమును చూపించు నిమిత్తము"**

పాపము యొక్క దుష్ట స్వభావము స్పష్టమైనది ఎలాగునంటే ఒకదానిని మంచిదానిగా, సంపూర్ణమైనదిగా, ధర్మశాస్త్రమువలె దైవికమైనదిగా (కీర్తన 19&119) తీసుకొని దాని మరణపు శిక్షణా మార్చినది. (ఎఫెసి 2:15; కొలస్సి 2:14) పతన మానవులు దేవుడిచ్చిన ప్రత మంచి దానమును హద్దులను దాటి తీసుకొనిరి.

**"సంపూర్తిగా పాపము" ప్రత్యేక అంశం : పౌలు యొక్క హుపర్ మిళితపదములు 1:30లో చూడండి.**

**NASB (నవీన) వాక్యము : 7:14-20**

**14 ధర్మశాస్త్రము ఆత్మసంబంధమైనదని యెరుగుదము; అయితే నేను పాపమునకు అమ్మబడి శరీర సంబంధినై యున్నాను. 15. ఏలయనగా నేను చేయునది నేనెరుగను; నేను (చేయ) నిశ్చయించునది చేయక ద్వేషించునదియే చేయుచున్నాను. 16. ఇచ్ఛయింపనిది నేను చేసిన యెడల ధర్మశాస్త్రము శ్రేష్ఠమైనదట్టు ఒప్పుకొనుచున్నాను. 17. కావునా ఇకను దాని చేయునది నా యందు నివసించు పాపమే గాని నేనుకాను. 18. నాయందు, అనగా నా శరీరమందు మంచిది ఏదియు నివసింపదని నేనెరుగుదును. మేలైనది చేయవలెనని చేయవలెనను ఇచ్ఛనాకు తటస్థమైయున్నది. గాని దాని చేయుట నాకు తటస్థము కాదు 19. నేను చేయ నిశ్చయించు మేటు చేయక యిచ్ఛయింపని కీడు చేయుచున్నాను. 20 నేను యిచ్ఛయింపని దానిని చేసిన యెడల, అది చేయునది నాయందు నివసించు పాపమేగాని యికను నేనుకాను.**

**7:14 "ధర్మశాస్త్రము ఆత్మ సంబంధమైనది"** దేవుని ధర్మశాస్త్రము మంచిది. అది సమస్యకాదు (12ం16బివ)

▣ **"నేను శరీర సంబందుడనై"** ఈ పదము పౌలుచే (1) తటస్థ బావార్ధమైన భౌతిక శరీరము (1:3; 2శ28; 4:1; 9:3,5)గా; మరియు (2) విరోధ బావార్ధమైన పతనమైన మానవ స్వభావముగా వాడబడినది (వ. 5) ఇది దేవనిన సూచించి చెప్పబడిందో అనిశ్చయము.

▣ **"పాపమునకు అమ్మబడి"** ఇది ఇంకనూ "పాపమునకు అమ్మబడుచున్నాను" అనే పెర్‌ఫెక్స్ పాసిల్ పార్టిసిపల్ పాపము మరళా బాసిన యాజమానిగా మనుష్య గుణారోపణము చేయబడుతుంది. కర్మార్ధకము ఎవరో అనిశ్చయము ఇది సాతానును, పాపమును, పౌలు లేక దేవుడుని సూచించవచ్చు. పాతనిబంధనలో దేవుడు మానవులను ఆయన వైపునకు తీసుకొని వచ్చుట కొరకు ఉపయోగించు పదము "విమోచనము" లేక "విడిపించటం" (మరియు వాని పర్యాయపదములు) ఇది నిజంగా "తిరిగా కొనటము (3:24లో ప్రత్యేక అంలశం చూడండి) వ్యతిరేఖ అర్ధంలో "చేతులకు అప్పగించబడటం.... (న్యాయా 4:2; 10:7; 1సమూ 12:9) వాడబడినది.

**7:15-24 దేవుని పిల్లలు "దైవిక స్వభావము"** (2పేతురు 1:4) ను అదేవిధంగా పాప స్వభావమును కూడా కలిగియుందురు. (గలతీ 5:17, శక్తివంతంగా, పాపము అచేతనం చేయబడినది. (రోమా 6:6) కాని 7వ అధ్యాయంలో మానవుల అనుభవం వివరించబడింది. ప్రతివాని హృదయంలో నల్లని మరియు తెల్లని కుక్కగా ఉంటుందని యూదులు చెప్పుదురు. దేనినైతే అధికంగా పోషిస్తారో అది బలంతమవుతుంది.

ఈ వాక్య భాగమును చదువు చుండగా పౌలు వివరించని రెండు స్వభావాల వివాదము యొక్క నొప్పిని నేను అనుభవించాను. విశ్వాసులు పాప స్వభావము నుండి విడిపించబడినారు, కాని మనము దాని ఆశలలో పడుచుండగా దేవుడు సహాయము చేస్తాడు. తీవ్రమైన ఆత్మీయ యుద్దము రక్షణ తరువాత ప్రారంభమవుతుంది. ఇది ఎంతో ఆశ్చర్యమును కలిగిస్తుంది. పరిపక్వత అనేది త్రియేక దేవునితో తన్యతతో కూడిన దైనందిక సహవాసము మరియు దుష్టత్వముతో దైనందిక వివాదము

**7:16, 20 "అయితే"** ఇది మొదటి షరతులతో కూడిన వాక్యమై గ్రంథకర్త దృక్పదము నుండి సత్యమై ఆయన సాహిత్య ఉద్దేశ్యము కొరకు వాడబడినది.

**7:18 "నాయందు అనగా నా శరీరమందు మంచిది ఏదియు నివసింపదని నేనెరుగుదును"**

భౌతిక శరీరము దుష్టమైనది పౌలు చెప్పటంకాదు గాని, ఇది దేవుని ఆత్మకును మరిము పాప స్వభావమునకు మద్య ఉన్న యుద్దభూమి. గ్రీకు తత్వవేత్తలు, శరీరము మరియు దానిలోనివి అన్నియు దుష్టములు అనిన చెప్పుదురు. ఇది గ్నాస్టిజమ్‌నకు దారితీసింది. (ఎఫెసి, కొలస్సీ మరియు 1యోహాను) గ్రీకులు ఆత్మీయ సమస్యను బట్టి శరీరమును నిందించెదరు. పౌలు ఆత్మీయ వివాదమును ఈ భావనతో వివరించటం లేదు. పౌలు పాపమునకు మనుష్య గుణారోపణ చేసి, అది దేవుని ధర్మశాస్త్రమునకు విరోదముగా నున్న మానవుని తిరుగుబాటు ద్వారా మానవుని స్వభావమునకు జయించినది అని చెప్పుచున్నాడు. పౌలు రచనలలో "శరీరము" అన్న పదము (1) నైతికంగా తటస్థమైన మానవుని భౌతిక శరీరము (1:3; 2:28; 4:1; 9:35); మరియు (2) ఆదాము నుండి సంక్రమించిన పాపస్వభావము (వ. ) అవ్వవచ్చు.

**7:20 "నా యందు నివసించు పాపమే"** రోమా పత్రికలో మానవుని పాపము స్పష్టముగా చూపబడినది. కాని 16:20 వచనం వరకు సాతాను ప్రస్తావన లేదు. మానవుల పాపు సమస్యను బట్టి సాతానును నిందించలేదు. మనకు ఎంపిక కలదు. పాపము రాజుగా, నియంతగా మరియు బానిస యజమానిగా మనుష్య గుణారోపణముతో చెప్పబడింది. పాపము దేవుని నుండి స్వాతంత్ర్యముగా ఉండాలనే కోరిక మరియు ఏవిధ:గానైననూ తన స్వార్దమును ప్రేరేపించును. పౌలు పాపము యొక్క మనుష్య గుణారోపణము ఆది 4:25లో మానవుని ఎంపికను ప్రతిబింబిస్తుంది.

పౌలు **"నివసించు"** అన్న పదమును చాలాసార్లు ఉపయోగించినాడు (17, 18, 20వ) రక్షణలో పాపపు స్వభావము నాశనము చేయబడదు కాని దానిని అచేతనమే చేస్తుంది. మనలో నివసించు ఆత్మక మనమిచ్చే సహకారముపైన దాని అచేతన స్థితి ఆధారపడి ఉంటుంది.

(8:9,11) అపవాదిని, దుష్టత్వమును ఎదిరించుటకు కావలసిన శక్తిని దేవుడు విశ్వాసులకు అనుగ్రహించెను. ఇది పిరశుద్ధాత్మ యొక్క శక్తి మరియు సన్నిధి. దేవుని ఉచిత రోణ బహుమానమును మనం అంగీకరించిన విధంగానే పరిశుద్ధాతమ్మ యొక్క నిరోధిక శక్తి బహుమానమును కూడా స్వీకరించాలి. రక్షణ మరియు క్రైస్తవ జీవితము విశ్వాసుల దైనందిక నిర్ణయములలో ప్రారంభమైముగిసే ఒక జీవిత విధానము. దేవుడు మనకు అవసరమగు వాటినన్నిటిని సమకూర్చెను; ఆత్మ (రోమా. 8), ఆత్మీయ సర్వాంగ కవచం (ఎఫెసి 6:11) ప్రత్యక్షత (ఎఫెసి 6:170, మరియు ప్రార్ధన (ఎఫెసి 6:18) యుద్దము భయంకరమైనది (రోమా. 7)కాని యుద్దము జయించబడినది (రోమా 8.)

**NASB (నవీన) వాక్యము : 7:21-25**

**21. కాబట్టి మేలు చేయ నిశ్చయించునాకు కీడు తటస్థమైయున్నదను ఒక నియమము నాకు కనబడుచున్నది 22. అంతరంగ పురుషుని బట్టి దేవుని ధర్మశాస్త్రము నందు నేను ఆనందిచుచున్నాను గాని, 3. వేరొక నియమము నా అవయువములలో ఉన్నట్లు నాకు కనబడుచున్నది. అది నా మనస్సునందుదున్న ధర్మశాస్త్రముతో పోరాడుచు నా అవయువములలో నున్న పాప నియమమునకు నన్ను చెరపట్టిలో పరుచుకొనుచున్నది 24. అయ్యో నేనెంత దౌర్భాగ్యుడను; ఇట్టి మరణమునకు లోనగు శరీరము నుండి నన్నెవడు విడిపించును". 25. మన ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా దేవునికి కృతాజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాను. కాగా మనస్సు విషయములో నేను దైవ నియమముకును, శరీర విషయములో పాప నియమమునకును దాసుడనైయున్నాను.**

**7:22 "దేవుని ధర్మశాస్త్రము"** యూదులకు ఇది మోషే ధర్మశాస్త్రముగా సూచించబడినది. యూదేతరులకు (1) ప్రకృతి సాక్ష్యము (రోమా 1:19-20; కీర్తన 19:1-6); (2) అంతరంగిక - నైతిక మనస్సాక్షి (రోమా 2:14-15); మరియు (3) సామాజిక ప్రమాణాలు లేక మరికొన్ని.

**NASB "అంతరంగ పురుషునిలో"**

**NKJV "అంతరంగ పురుషుని ప్రకారము"**

**NRSV, NJB "నా అంతరంగంలో"**

**TEV "నా అంతరంగము"**

పౌలు 2కొరి 4:16లో బాహ్యపురుషుని (భౌతికం)తో అంతరంగ పురుషుని (ఆత్మీయ) విభేధిస్తున్నాడు. ఈ సందర్భంలో పౌలు యొక్క బాగమును లేదా దేవుని చిత్తమును మరియు ధర్మశాస్త్రమును స్థిరపరిచే రక్షింపబడే వారి నిమిత్తము సూచిస్తుంది.

1. "ధర్మశాస్త్రము ఆత్మీయమైనది" 7:14
2. "నేను ఇచ్ఛయించుదానిని" 7:15
3. "ధర్మశాస్త్రము శ్రేష్టమైనదట్టు ఒప్పుకొనుచున్నాను" 7:16
4. "మేరైనది చేయవలెనను ఇచ్ఛనాలో ఉన్నది" 7:18
5. "నేను చేయ నిశ్చయించు మేలు చేయక" 7:18
6. నిశ్చయింపని కీడు చేయక" 7:19
7. "నిశ్చయింపని దానిని నేను చేయుచున్నాను" 7:20
8. "మేలు చేయు నిశ్చయించు" 7:21
9. దేవుని ధర్మశాస్త్రము నందు నేనానందిచుచున్నాను" 7:22
10. "నా మనస్సునందున్న ధర్మశాస్త్రము" 7:23
11. "మనస్సు విషయములో నేనుదైవ నియమమునకు" 7:25

7వ అద్యాము దేవుని యొక్క జ్ఞానము మరియు వాక్యము సరిపోదు, విశ్వాసికి ఆత్మ అవసరము అని చూపిస్తుంది.

**7:23** 6:2; 8:2 మరియు 7:23ల మద్య నిజమైన విభేదం కలదు. ఈ వచనము పౌల యొక్క ధర్మశాస్త్ర (నోమోస్)ను సూచిస్తూ (1) పాపనియమము (21,25వ) మరియు (2) దైవనియమము (22, 25)ను సూచిస్తుంది. 4,5,6,7,9 మరియు 12 వచనాలలో పౌలు

పాత నిబంధన కొరకు ఆపదమును వాడినాడు పౌలు క్రమానుసార వేదాంతకర్తకాదు. "ధర్మశాస్త్ర" అంశంతో పౌలు ఇబ్బంది పడినాడు. ఒక రీతిలో ధర్మశాస్త్రము, దేవుని యొక్క ప్రత్యక్షత మరియు దేవుని శ్రేష్టమైన బహుమానము, అయినప్పటికి ఇది పపమును నిర్వచించి పడిపోయిన మానవులు నెరవేర్చలేని హద్దులను నియమించినది. ఈహద్దులు కేవలము పాతనిబంధన ప్రత్యక్షతకాదు గాని అవినైతిక నియమములు సహజ ప్రత్యక్షత (కీర్తన 19; రోమా 1:18-3:31) లేక సామాజిక కట్టడాలు మరియు ప్రమాణాలు. మానవులు తిరుగుబాటు దారులు. వారి జీవితములు వారి ఆధీనములో ఉండాలని కోరుకొనేవారు.

**7:24** రక్షింపబడిన వ్యక్తినుండి వచ్చిన వాక్యభాగమేనా? కొంతమంది కాదు అనిచెప్పుదురు. కాబట్టి ఈ అధ్యాయము నైతిక, మతపరమైన వారైయుండి రక్షింపబడని వారిని సూచిస్తుంది. ఇతరులు, అవును అనిచెప్పుదురు. అది సువార్త యొక్క తన్యతను సూచిస్తుంది "ఇప్పటికే మరియు ఇంకా లేదు" అని విశ్వాసి జీవితములో రాకడ సంబంధనెరవేర్పు ఇంకా ప్రత్యక్షం కాలేదు. పరిపక్వత గల విశ్వాసి ఈ అవధిని ఖచ్చితంగా గ్రహిస్తాడు.

▣ **NASB "మరణ శరీరము"**

**NKJV, NRSV "ఈ మరణ శరీరము"**

**TEV "మరణమునకు నన్ను తీసుకొను ఈశరీరము"**

**NJB "మరణమునకు లోనగు ఈశరీరము"**

భౌతిక శరీరము మరియు ఆత్మవాటిఓ దుష్టమైనవికాదు. అవి భూమి మీద మనము దేవునితో సహవాసము చేయుటకొరకు మరియు మనము జీవించుటకొరకు సృష్టింపబడినవి. అవి "చాలా మంచివి"గా సృష్టింపబడినవి (ఆది 1:31) కాని ఆది.3లో మానవుని మార్పు దేవుని చిత్తమును త్రిప్పివేసినది. ఇది దేవుడు ఆశించిన లోకముకాదు మరియు మనము దేవుడు ఆశించిన మనుష్యులము కాదు. పాపము లోకమునంతటిని ప్రభావితం చేసినది. పాపము మంచిని స్వకేంద్రిత దుష్టత్వమునకు మార్చివేసిది. ప్రాణశరీరములు శోదనకు మరియు పాపము యొక్క యుద్ధభూమికి నిలయముగా మారినవి. పౌలు యుద్ధమును ఖచ్చితంగా భావిస్తున్నాడు. దేవుడు నూతన యుగము కొరకు, నూతన శరీరము కొరకు, దేవునితో నూతన సహవాసము కొరకు ఆశిస్తున్నాడు (8:23)

7:25 ఇది రోమా8 యొక్క ఉన్నత భాగమునకు సంగ్రహము మరియు ఒక మార్పు. 8వ అధ్యాయములో కూడా 5-11వ॥లో తన్యత కనిపిస్తుంది.

వ్యాఖ్యాన కర్తలకు ప్రశ్న ఏమిటంటే, "ఎవరితో పౌలు చెప్పుచున్నాడు"?

1. యూద మంతంలోనున్న తన అనుభవం
2. క్రైస్తవులందరు
3. మానవులందరికి ఆదాము మాదిరిగా
4. ఇశ్రాయేలు మరియు వారి ధర్మశాస్త్ర జ్ఞానము, కాని దానికి విధేయత చూపుటలో విఫలము.

వ్యక్తిగతంగా, నేను 1(7-13, 25బి) మరియు 14-25ఎ)ను కలుపుతుంది. రోమా 7:7-25 సందర్భోచిత తలంపులను చూడండి 7వ అధ్యాయంలోని నొప్పి మరియు ఆవేదన 8వ అధ్యాయపు ఆధజక్యతతో సరిపోల్చబడి అణపబడింది!

▣ **"దేవుని కృతాజ్ఞతాస్తుతులు" ప్రత్యేక అంశం క్రింద చూడండి**

**ప్రత్యేక అంశము : పౌలు యొక్క స్తుతి, ప్రార్ధన మరియు దేవుని కృతజ్ఞతాస్తుతి**

పౌలు స్తుతించే వ్యక్తి. పౌలునకు పాతనిబంధన తెలుసు. మొదటి నాలుగు విభాగాల చివరలు ఆశీర్వచనములతో ముగుస్తుంది. (కీర్తన 41:13; 72:19; 89:52; 106:48) పౌలు వేర్వేరు రీతులలో దేవుని స్తుతించేవాడు ఘనపరిచేవాడు.

1. ఈ పత్రిక యొక్క ప్రారంభ వాక్య భాగములు

    ఎ. ప్రారంభ ఆశీర్వచనములు (రోమా 1:7; 1కొరి. 1:3; 2కొరి 1:2)

    బి. ప్రారంభ ఆశీర్వములు (యూలోగెటోస్, 2కొరి 1:3-4; ఎఫెసి 1:3-14)

2. క్లుప్తస్తుతి వచనాలు

ఎ. రోమా 1:25; 9:5

బి. 2కొరి 11:31

3. ఆశీర్వచనములు (1) డోక్సా (మహిమ) మరియు (2) “నిరంతరము”

ఎ. రోమా 11:36; 16:25

బి. ఎఫెసి 3:20-21

సి. ఫిలిప్పి 4:20

డి. 1తిమోతి 1:17

ఇ. 2 తిమోతి 4:18

4. కృతజ్ఞతాస్తుతి (యూకారిస్టియో)

ఎ. పత్రిక ప్రారంభములు (రోమా 1:8; 1కొరి. 1:4; 2కొరి 1:11; ఎఫెసి 1:16; ఫిలి 1:3; కొలస్సి 1:3,12; 1థెస్స 1:2; 2థెస్స 1:3; ఫిలెమోను 5:4; 1 తిమోతి 1:12; 2 తిమోతి 1:3)

బి. కృతజ్ఞాతాస్తుతి కొరకు పిలుపు (ఎఫెసి 5:4, 20; ఫిలి 4:6; కొలస్సి 3:15, 17; 4:2; 1థెస్స 5:18

5. క్లుప్త కృతజ్ఞతాస్తుతులు

ఎ. రోమా 6:17; 7:25

బి. 1.కొరి 15:57

సి. 2కొరి 2:14; 8:16; 9:15

డి. 1థెస్స 2:13

ఇ. 2థెస్స 2:13

6. ముగింపు ఆశీర్వచనములు

ఎ. రోమా 16:20,24

బి. 1కొరి 16:24

సి. 2కొరి 13:14

డి. గలతీ 6:18

ఇ. ఎఫెసి 6:24

త్రియేక దేవుడు వేదాంతపరంగా మరిము అనుభవపూర్వకంగా పౌలునకు తెలుసు. పౌలు తన పత్రికలను స్తుతి మరియు ప్రార్థనతో ప్రారంచువాడు. పౌలు యొక్క ప్రదర్శనల మద్య కృతజ్ఞతాస్తుతులలో ఆయన నింపబడుతూ ఉండేవాడు. ఆయన పత్రికల ముగింపులో ఎల్లప్పుడూ ప్రార్ధిచుటను, కృతాజ్ఞతా స్తుతిని మర్చిపోయేవాడు కాదు. పౌలు రచనలు ప్రార్థనతో స్తుతితోనూ, మరియు కృతజ్ఞత స్తుతితో ప్రారంభమయ్యేది. పౌలునకు దేవుడు తెలుసు, తన గురించి తెలుసు, సువార్త తెలుసు.

**చర్చాప్రశ్నలు :**

ఇది ధ్యాన మార్గదర్శక వ్యాఖ్యానం కావునా బైబిల్ యొక్క మీ స్వంత వ్యాఖ్యానమునకు మీరు భాద్యులు. మనమందరం మన కివ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, బైబిల్ మరియు పరిశుద్ధాత్మ భావ వ్యక్తీకరణలో ప్రముఖులు నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు దానిని విడిచి పెట్టకూడదు. ఈ పుస్తకంలోని బహుళ విషయములను ఆలోచించుటకు ఈ చర్చా ప్రశ్నలు సహాయపడతాయి. అవి ఆలోచింపజేసేవే కాని, నిశ్చితమైనవి కావు.

1. 6వ అధ్యాయము ఏవిధంగా 7వ అధ్యాయముతో సంబంధం కల్గియుంది ?
2. పాతనిబంధన ధర్మశాస్త్రమునక మరియు క్రొత్త నిబంధన విశ్వాసికి సంబంధమేమి ? (2కొరి 3:11; హెబ్రీ 8:7,13)
3. పౌలు, 6&ı అధ్యాయములలో మన పాత జీవితముతో మన సంబంధమును వివరించుటకు ఉపయోగించిన రెండు ఉపమానములు ఏమిటి?
4. మోషే ధర్మశాస్త్రమునకు విశ్వాసిక సంబంధమేమిటి ?
5. రోమా 7:7-25లో స్వీయచరిత్ర మరియు ప్రాతినిధ్యపు సిద్ధాంతము యొక్క తేడాను నీ స్వంత మాటలలో వివరించండి ?
6. రోమా 7వ అద్యాయము, ఒక నశించిన వ్యక్తికి అపరిపక్వ విశ్వాసికి లేక విశ్వాసులందరికి సంబంధిచినదా ?

# ద్వితీయోపదేశకాండము - 8వ అధ్యాయము

నవీన అనువాదముల యొక్క వాక్య విభజన

| UBS | NKJV | NRSV | TEV | JB |
|---|---|---|---|---|
| ఆత్మయందు జీవితం | అంతరింగిక పాపమునుండి విడుదల | దేవుని రక్షణ కార్యం | ఆత్మయందు జీవితం | ఆత్మయొక్క జీవితం |
| 8:1-11 | 8:1-11 | 8:1-4 | 8:1-8 | 8:1-4 |
| | | శరీరమందు జీవితము మరియు ఆత్మయందు జీవితము | | |
| | | 8:5-8 | | 8:5-11 |
| | | 8:9-11 | 8:9-11 | |
| | | ఆత్మ మరియు దత్తత | | |
| 8:12-17 | 8:12-17 | 8:12-17 | 8:12-17 | 8:12-13 |
| | | | | 8:14-17 |
| భవిష్యత్తు మహిమ | శ్రమనుండి మహిమకు | నేరవేర్పు యొక్క నిరీక్షణ | భవిష్యత్ మహిమ | మన గమ్యం మహిమవలే |
| 8:18-25 | 8:18-30 | 8:18-25 | 8:18-25 | 8:18-25 |
| | | మానవుని బలహీనత ఓర్వదగినది | | |
| 8:26-30 | | 8:26-25 | 8:26-25 | 8:26-25 |
| | | | | దేవుడు తన మహిమను ఇచ్చుటకొరకు మనులను పిలిచెను |
| | | 8:28-30 | 8:28-30 | 8:28-30 |
| దేవుని యొక్క ప్రేమ | దేవుని యొక్క శాశ్వతప్రేమ | దేవుని ప్రేమయందు మన నిశ్చయత | యేసు క్రీస్తులో దేవుని ప్రేమ | దేవుని ప్రేమకొరకు ఒక కీర్తన |
| 8:31-39 | 8:31-39 | 8:31-39 | 8:31-39 | 8:31-34 |
| | | | | 8:35-37 |
| | | | | 8:38-39 |

వాక్యపు పరిధి యొద్ద అసలైన గ్రంధకర్త ఉద్దేశ్యంను అనుసరించుట....

ఈ వ్యాఖ్యానం చదువుటకు ఉపయోగపడే మార్గదర్శిని......

కావున బైబిల్ యొక్క వ్యాఖ్యానమును నీవు సొంతంగా చేసుకొనుటకు భాద్యుడవు. మనమందమం మనకు ఇవ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, పరిశుద్ధ గ్రంధం మరియు పరిశుద్ధాత్మ వ్యాఖ్యానంలో ప్రాధాన్యత వహించవలెను. దీనిని నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు విడిచిపెట్టకూడదు.

అధ్యాయమంతటినీ ఒకేసారి చదవాలి, అంశాలను గుర్తించాలి. నీ అంశ విభజనము పైన ఇవ్వబడిన నవీన అనువాద విభజనలతో సరి పోల్చుకోవాలి. విభజన అనేది ప్రేరణ కాదు. కాని ఇది అసలు గ్రంధకర్త యొక్క ఉద్దేశ్యమును తెలుసుకొనుటకు ఉపయోగపడును వ్యాఖ్యానమునకు ఇది కేంద్రమై వున్నది. ప్రతి వాక్య విభజనకే ఒక్క విభజనను కలిగి ఉండును.

1. మొదటి వాక్య భాగం
2. రెండవ వాక్య భాగం
3. మూడవ వాక్య భాగం
4. మొదలగునవి.

**సందర్భోచిత తలంపులు**

ఎ. ఈ అధ్యాయము 1:18లో పౌలు ప్రారంభించిన వాదము యొక్క ముమ్మురము. ఇది "ఏ శిక్షవిధి లేదు". అన్న విషయముతో ప్రారంభమై "యెడబాటులేదు" అన్న విషయముతో ముగుస్తుంది. వేదాంతపరముగా ఇది నీతిమంతులుగా తీర్చబడటము నుండి పరిశుద్ధ పరచబడుట ద్వారా మహిమ పొందుటకు కదులుతుంది. (29-30వ)

బి. ఇది దేవుడు తన ఆత్మను విశ్వాసులకు ఇచ్చును అన్న వేదాంతపరమైన క్రమాభివృద్ధి (యెహాను 14:12-31; 16:7-16లోని యెహాను యొక్క ప్రదర్శన) 14వ వచనములో ఆత్మ అనే క్రియ పతనమైన మానవుల జీవితాలలో సువార్త చురుకైనదిగా చెప్పబడుతుంది. ఆత్మ విశ్వాసులలో నుండి క్రీస్తు రూపమును వారిలో ప్రారంభిస్తుంది. ఈ ఆత్మ 7వ అధ్యాయంలో ఎక్కడా కనిపించకుండా 8వ అధ్యాయంలో ఆత్మ అను పదము (న్యూమా) 21 సార్లు కంటే ఎక్కువగా ఉపయోగించబడింది.

సి. మానవులు వారి జీవితంలో అనుసరించుటకు రెండు దృక్పదాలు రెండు జీవిత విధానాలు, రెండు ప్రాధాన్యతలు, రెండు మార్గాలు (విశాలమార్గము మరియు ఇరుకైన మార్గము), ఇక్కడ ఆత్మ మరియు శరీరము కనిపిస్తున్నాయి. ఒకటి మరణమునకు నడిపిస్తుంది; మరియొకటి జీవమునకు నడిపిస్తుంది. దీనిని సాంప్రదాయకముగా పాత నిబంధన జ్ఞాన సాహిత్యములో "రెండు మార్గములుగా" పిలువబడుతుంది. (కీర్తన 1 మరియు సామెతలు 4:10-19). నిత్య జీవము, ఆత్మ జీవితము అనేవి గమనించదగిన గుణలక్షణములు (శరీరానుసారము మరియు ఆత్మానుసారము).

ఈ వేదాంత సందర్భములో అపవాది కనిపించకపోవటం గమనార్హం (రోమా 1:8) అపవాది 16:20 వరకు ప్రస్తావలో లేదు. పతనమైన మానవుల యొక్క ఆదాము స్వభావం అనేది కేంద్రీకరించబడింది. పౌలు ఈ రీతిలో మానవులు దేవునికి విరోధముగా తిరుగుబాటులో ఉన్న శోదన యొక్క సాకును తొలగించుచున్నాడు. మానవులు వారి పాపమునకు బాద్యులు.

డి. ఈ అధ్యాయం యొక్క క్రమపట్టీని చేయుట చాలా కష్టతరము. ఎందుచేతననగా ఈ అధ్యాయములో అనేక సత్యముల యొక్క అమరిక తరచు వచ్చు మాదిరిలలో అమర్చబడి సందర్భోచిత భాగము లేకుండా మలచబడింది.

ఇ. 12-17 వచనాలు విశ్వాసికి ధృడ విశ్వాసము యొక్క నమ్మికతను గురించి తెలియచేస్తుంది.

1. మొదటిది, మార్చబడిన దృక్పదము మరియు ఆత్మద్వారా నెరవేర్చబడిన జీవిత విధానము.
2. రెండవది, ఆత్మవలన కుటుంబము యొక్క ప్రేమచే దేవుని యెడల ఉన్న భయమునకు బదులుగా ఉంచబడింది.
3. మూడవది, వసించు పరిశుద్ధాత్మద్వారా కుమారత్వము యొక్క అంతరంగిక నిశ్చయతను తెలియజేస్తుంది.
4. నాలుగవది, ఈ నిశ్చయత పతనమైన లోక సమస్యలలో మరియు వివాదములలో కూడా నిజమైనది.

ఎఫ్. 31-39 వచనాలు ఒక న్యాయస్థానపు దృశ్యమై పాతనిబంధన ప్రవర్తలయొక్క సాహిత్య, సాంకేతికత మాదిరిగా కనిపిస్తున్నది. దేవుడు న్యాయాధిపతి; అపవాది పిర్యాది; యేసు వాదించే న్యాయవాది దేవదూతలు ప్రేక్షకులు; మరియు విశ్వసించే మానవులు అపవాది నింద క్రింద ఉండేవారు.

1. న్యాయపరమైన పదములు

   ఎ. మనకు విరోధం (వ. 31)

   బి. నేరము (వ. 33)

సి. నీతిమంతులుగా తీర్పు (వ.33)

డి. శిక్ష విధించు (వ.34)

ఇ. విజ్ఞాపనచేయు (వ.34)

2. విరోధి "ఎవడు" (వ. 31,33,34(మూడుసార్లు), 35)

3. క్రీస్తులో దేవుని సమకూర్పు (వ. 32, 34బి)

4. దేవునినుండి యెడబాటులేదు

ఎ. భూలోక పరిస్థితులు (వ.35)

బి. కీర్తన 44:22నుండి చెప్పబడిన పాతనిబంధన మాట (వ. 36)

సి. విజయము (వ. 37,39)

డి. అసాధారణ పరిస్థితులు లేక వ్యక్తులు (వ. 37-39)

**పద మరియు వాక్య ధ్యానం**

**NASB (నవీన వాక్యము) 8:1-8**

**కాబట్టి ఇప్పుడు క్రీస్తు యేసు నందున్న వారికి ఏ శిక్షావిధియు లేదు. 2క్రీస్తు యేసునందు జీవము నిచ్చు ఆత్మయొక్క నియమము పాపమరణముల నియమము నుండి నన్ను విడిపించెను. శరీరమును అనుసరింపక ఆత్మ ననుసరించియే నడుచుకొను మనయందు ధర్మశాస్త్ర సంబంధమైన నీతి విధి నెరవేర్చ బడవలెనని పాప పరిహార నిమిత్తము దేవుడు తన స్వకీయ కుమారుని పాప శరీర ఆకారముతో పంపి ఆయన శరీరమందు పాపమునకు శిక్ష విధించేను. ఎలయనగా శరీర స్వభావమును బట్టి ధర్మశాస్త్రము బలహీనమాయెను. గనుక అది దానికి అసాధ్యమాయెను. 5శరీరానుసారులు శరీరవిషయములను మనస్కరింతురు; ఆత్మానుసారులు ఆత్మవిషయములను మనస్కరింతురు. 6. శరీరానుసారమైన మనస్సు మరణము; ఆత్మానుసారమైన మనస్సు జీవమును సమాధానమునై యున్నది. 7. ఎలయనగా శరీరానుసారమైన మనస్సు దేవునికి విరోధమై యున్నది; అది దేవుని ధర్మశాస్త్రమునకు లోబడదు, ఏమాత్రమును లోబడనేరదు. 8. కాగా శరీర స్వభావము గలవారు దేవుని సంతోషపరచనేరరు.**

**8:1**

**NASB "కాబట్టి ఇప్పుడు"**

**NKJV, NRSV "కాబట్టి ఇప్పుడు ఉన్నది"**

**TEV "ఉన్నది"**

**JB "ఈ కారణము వలన"**

ఇది పూర్వపు సందర్భమును వెనకకు కలుపుతున్నది. కొంతమంది దీనిని 7:24-25నకు కలుపుదురు. కాని ఇది 3:21-7:25 వెనుకకు కలుపుదురు.

- **"లేదు"** గ్రీకు వాక్యములో "లేదు" అన్నది మొదట ఉన్నది ఇది క్రీస్తు యేసునందు ఉన్నవారికి, (వ.1-3) మరియు ఆత్మను అనుసరించువారికి (వ. 4-11) "శిక్షావిధిలేదు" అని నొక్కి చెప్పుచున్నవి. ఇక్కడ క్రొత్త నిబంధన ఇరుప్రక్కలు కనిపిస్తున్నవి: (1) ఇది క్రీస్తులో ఉచిత బహుమానం; మరియు (2) జీవిత విధానము, నిబంధాన స్పందన కోరబడినది. నీతిమంతులుగా తీర్చబడడం అనేది బాహ్యామైనది మరియు అంతరంగికమైనది. ఇది ఒక స్థితి మరియు ఒక జీవిత విధానం.

- **"శిక్షావిధి"** కటక్రిమ అనేపదము గ్రీకు బైబిల్‌లో తరుచుగా వాడబడలేదుకాని ఇది ద్వితి. 27:26లో అసంపూర్తియొక్క శాపమును సూచిస్తుంది. దీని అర్థము "ఒక న్యాయ తీర్పు అనుసరించి వచ్చే శిక్ష"ను తెలియజేస్తుంది. ఇది న్యాయపరమైన నీతితత్వానికి విరోధముగా చెప్పబడిన పదము ఇది పౌలు రచనలలో తరచుగా కనిపించేది (5:16,18) మరియు క్రొ॥ని॥లో కూడా ఎక్కడా కనిపించదు. కింగ్‌జేమ్స్ వెర్షన్ 1వ వచనమునకు "శరీరమును అనుసరించక ఆత్మను అనుసరించువారికి" అని చేర్చబడింది. ఈ వాక్యము చాలా పురాతన గ్రీకు ప్రతులలో కనిపించుటలేదు. యు.బి.ఎస్. దీని యొక్క తొలగింపును "ఎ"తో సూచించింది. ఇది 4వ వచనములో కనిపిస్తుంది. ఇది సంపూర్తిగా ఒక వచనములో వేదాంత పరముగా సరిగా అమర్చబడదు కాని నాలుగవ వచనములో సరిగా

అమర్చబడుతుంది. 1 నుండి 3 వచనాలు స్థానియ పరిశుద్ధీకరణతో వ్యవహరిస్తుండగా, 4 నుండి 11వ వచనాలు అనుభవ పరిశుద్ధీకరణ లేక క్రీస్తు సారుప్యతతో వ్యవహరిస్తున్నవి.

రివైజ్డ్ వెర్సన్ "శరీరమును అనుసరించక ఆత్మను అనుసరించువారికి" మన మాటను సరిగా తొలగించినది. మనము కలిగిఉన్న కింగ్ జేమ్ అనువాదము 300 సంవత్సరముల క్రితము చాలా మరియు శ్రేష్టమైన అతి నిక్కచ్చి అయిన పురాతన గ్రీకు ప్రతులు దీనిని తిరిగి నెలకొల్పినవి; అనువాదములలో దొర్లిన అచ్చుతప్పులను ఆశక్తి కల్గిన దైవజనులు చేసి ఫలవంతమైన కార్యమును నెరవేర్చినారు. మనకు, మనందరికి తెలిసిన విధముగానే అసలు లేఖనాల యొక్క ప్రతులు మనకు లేవు: దేవుడు మనుష్య కుమారులుగా విగ్రహారాధనకు లోనైన జీవులనుండి వీటిని ఎత్తివేయుటలో సంతోషించినాడు.

మనము 1వ వచనమును "క్రీస్తు యేసులో" అన్నమాటతో ముగించుటకు నాలుగు కారణములు కలవు: (1) "శరీరమును అనుసరించకే ఆత్మను అనుసరించువారికి" అన్న మాటను తొలగించుటకు గ్రీకు ప్రతులు మనకు అనుకూలముగా ఉన్నట్టు ఋజువై 1వ వచనము విశ్వమంతట నాలుగవ వచనములో చేర్చుటకొరకు అంగీకరించిన ఋజువు కలదు, (2) ఆత్మీయ వివేచన కూడా దీనివిషయమై అంగీకరిస్తుంది, 1 వచనములోని పరిచయము మన నడకపైన దేవుని ఆత్మపైన ఆధారపడుటలో ఉన్న క్షేమమును తెలియజేస్తుంది. కాని క్రీస్తులో ఉన్నవారందరూ శిక్ష నుండి క్షేమముగా ఉందురని పత్రికలన్నింటిలో తేటతెల్లము చేయబడినది. లేని యెడల మన భద్రత మన నడకపైన ఉండి క్రీస్తులో మన స్థానమునపైన కాకుండా ఉంటుంది. (3) ఈ వచనము 4వ వచనము చివరిలోనే స్పష్టముగా సరిగా ఉంచబడింది. అక్కడ విశ్వాసి యొక్క నడత రీతి శిక్షావిధి నుండి తప్పించబడినట్టుగా లేదు. (4) కింగ్‌జేమ్స్‌లో 1వ వచనము యొక్క చివర గ్లోస్ ప్రత్యక్షమవుతుంది, దీనిని గొప్ప యునిషియల్ ప్రతులలో నుండి తొలగించబడడమే కాకుండా, అలెఫ్ ఎ,బి,సి,డి,ఎఫ్,జి; ఎ,డిలో కూడా తొలగించబడింది.

దేవుడు ఆయన వాక్యము అనువదించబడిన దానియొక్క అధికారము పాతనిబంధన హీబ్రూ అనువాదము నుండి, క్రొత్త నిబంధన గ్రీకు అనువాదములలో కూడా ఉండవలెనని దేవుడు కోరుకొనియున్నాడు.

దేవుడు మన కొరకు విడిచిపెట్టిన ప్రతులను చదువుటలో వారి జీవిత కాలములను గడిపిన గొప్ప దైవ సేవకులను బట్టి మరియు వారు యొక్క శ్రేష్టమైన సంపూర్ణమైన అనువాదమును మనకు ఇచ్చినందుకు మనము దేవునికి కృతజ్ఞత కలిగిఉండాలి. వీరిని మనము ఎప్పుడు అహంకారులైన "నవీన వాదుల" నుండి ప్రత్యేక పరచాలి. వీరు దేవుడు బైబిల్‌లో మనకు అవసరమైన దానిని గొప్ప దీనత్వముతో వెదకి మనకు తెలియజేసినాడు. (289 పే.)

▣ **"క్రీస్తు యేసునందు ఉన్నవారికి"** ఇది అధునాతన వ్యక్తీకరణ అయిన "వ్యక్తిగత సంబంధము అన్న పదమునకు సమానమైన గుణవాక్యము (స్థానముయొక్క ఉనికి). పౌలు యేసును తెలుసుకున్నాడు, ప్రేమించాడు, సేవించాడు, యేసులో ఆనందించాడు. సువార్త అనేది నమ్ముటకొరకు ఒక వర్తమానము, మరియు ఆహ్వానించబడుటకు ఒక వ్యక్తి అయిఉన్నది. దమస్కు మార్గమున పౌలు కలుసుకొనిన లేపబడిన క్రీస్తుతో ఉన్న సంబంధము యొక్క శక్తి జీవించుటకు కావలసిని శక్తిని ఇస్తుందని పౌలు నమ్ముతున్నాడు. యేసుతో ఆయన అనుభవం యేసుయొక్క వేదాంతమును అనుసరించింది. పౌలు యొక్క అనుభవం గదిలోపల పెట్టు జప మతమును ఇవ్వలేదు కాని సువార్త సేవను కలిగించింది. యేసును తెలుసుకోవడమే ఆయనను సేవించటం పరిపక్వ క్రైస్తవ్యము ఒక వర్తమానము, ఒక వ్యక్తి మరియు ఒక జీవిత విధానము (1:5 లో నోట్ చూడండి).

**8:2 "జీవమునిచ్చు ఆత్మ నియమము.....పాపమరణముల నియమము"** ఇది (1) పాపముయొక్క ధర్మశాస్త్రమునకు (రోమా 7:10,23,25) మరియు దేవుని యొక్క నూతన నియమము (రోమా 7:6,22,25) నకు మధ్య ఉన్న విభేదము; (2) ప్రేమ నియమము (యాకోబు 1:25; 2:8-12)నకు మరియు మోషే ధర్మశాస్త్రము (7:6-12); (3) పాత యుగము మరియు క్రొత్త యుగము; లేక (4) పాత నిబంధన మరియు క్రొత్త నిబంధన (యిర్మి 31:31,34; క్రొ॥ని॥ హీబ్రూ పత్రిక)

విభేదించే శైలి చూపబడింది.

1. పాప మరణ నియమము మరియు ఆత్మ నియమము వ. 2
2. శరీరానుసారము మరియు ఆత్మానుసారము వ. 4 & 5
3. శరీర విషయములు మరియు ఆత్మ విషయములు వ. 5
4. శరీరవిషయములను మనస్కరించటము మరియు ఆత్మవిషయములను మనస్కరించడము వ. 5
5. ఆత్మానుసారమైన మనస్సు, శరీరానుసారమైన మనస్సు వ. 6

6. శరీరమందు మరియు ఆత్మయందు వ. 9
7. శరీరము మృతము మరియు ఆత్మయొక్క సజీవము వ. 10
8. చావవలసినవారు మరియు జీవించవలసినవారు వ. 13
9. దాస్యపు ఆత్మ మరియు దత్తత ఆత్మ వ. 16

▣ **NASB, NRSV, JB "నిన్ను విడిపించెను"**

**NKJV, TEV "వన్ను విడిపించెను"**

2–3 వచనాలు 6వ అద్యాయపు వేదాంత వర్తమానము. పురాతన గ్రీకు లిపిలో చాలా వేర్వేరు సర్వనామములు కలవు "న్ను" అనేది ఎ.డి., & పి లో కనిపించుచుండా "నిన్ను" ఎన్, బి, ఎఫ్ & జిలో ఉన్నవి "మనలను" అనేవి యున్సియల్ ప్రతులలో తరువాత కనిపించినది. యుఎస్‌బి సంగ్రహకర్తఉ "నిన్ను" అనేవారిని "బి" రేటింగ్‌తో ( అదే నిశ్చయంగా) చెప్పినారు. యుఎస్‌బి వారు "డి" రేటింగ్‌తో (గొప్ప కష్టతరం) గా చెప్పినారు. న్యూమేన్ మరియు నిడా, ఎ ట్రాన్స్‌లేటర్'స్ హేండ్‌బుక్ ఆన్ పౌల్స్ లెటర్ టూ దా రోమన్స్, "యుఎస్‌బి గ్రీకు లిపి "నన్ను" సూచించి "సి" నిర్ణయముతో అసలు ద్యానంను సంబంధించి అనుమానంను వ్యక్తం చేసినారు. (145–146)

"మనను" "నిన్ను" లేక "నాకు/మనం" ల సర్వనామముల సమస్య పౌలు రచనలలోని గ్రీకు వాక్యములలో తరుచుగా కనిపిస్తుంది.

**8:3 "ధర్మశాస్త్రము దేనిని చేయజాలక పోయెనో"** మోషే ధర్మశాస్త్రము మంచిది మారియు పరిశుద్ధమైది, కాని మానవులు బలహీనులు మరియు పాపభరితులు (7:12,16) ఇక్కడి క్రియ నిజంగా విశేషణము. ఇది "అసాద్యము" అనే అర్ధము నిస్తుంది (హెబ్రీ 6:4, 18; 10:4; 11:6), అదేవిధంగా ఇది "బలంలేనిదై" అని అర్దము నిచ్చును. (అపొ. 14:8; రోమా 15:1) ధర్మశ్శాస్త్రము విడుదల నిచ్చుటో సమర్ధత లేనిది. దానికి విరుద్దంగా, అది శిక్షా విధిని, మరణమును మరియు శాపమును ఉతీసుకొని వచ్చింది.

▣ **"శరీరానుసారమైన బలహీనమైది"** ఇది 7వ అద్యాయంలో పౌలు యొక్క ముఖ్యారాధన. ధర్మశాస్త్రము మంచది మరియు పరిశుద్ధమైనది, కాని పాపభరిత పతన మానవులు దాని విధులను నెరవేర్చలేరు. రబ్బీల వలె కాకుండా, పౌలు ఆది3 యొక్క ఫలితములను నొక్కి పలుకుతున్నాడు.

▣ **"దేవుడు తన స్వంత కుమారుని పంపి"** పాత నిబంధన క్రింద దేనినైతే మానవులు చేయలేకపోయారో, క్రొత్త నిబంధన క్రింద క్రీస్తు ద్వారా, దేవుడు దానిని చేసాడు. (యిర్మియా 31:31–34; యెహె 36:22–36; యెషయా 53; యోహాను 3:160, బాహ్యా విధులకు బదులుగా ఒక అంతరంగిక ఆత్మను మరియు ఒక నూతన హృదయమును దేవుడు అనుగ్రహించెను. క్రొత్త నిబంధన క్రీస్తు సంపూర్తి చేసిన కార్యమునైన విశ్వాసముంచి మారు మనస్సు ద్వారా తప్ప , మానవ కార్యములపైప అధారపడిఉండలేదు.

▣ **"శరీరాకరమందు"** ఇదే సత్యము ఫిలిప్పి 2:7–8లో చెప్పబడింది. యేసు క్రీస్తు నిజమైన మానవ శరీరమును కలిగియున్నాడు. (కాని పాపస్వభావము కాదు) ఫిలి 2:7–8; హెబ్రీ 7:26) నిజం ఆయన మనతో ఒకడు. ఆయన మన వలె అన్ని విషయములలో శోదించబడినప్పటికి పాము లేనివాడుగా ఉండెను (హెబ్రీ 4:5) ఆయన మనలను అర్ధము చేసుకొనేవాడు.

▣ **"పాప పరిహారము నిమిత్తము"** ఈ అభిప్రాయము 2కోరి 5:21 మరియు 1పేతురు 2:24లో కూడా చెప్పబడింది. యేసు మరణించుటకే వచ్చెను (యెషయా 53:4|6, 10–12; మార్కు 10:45) యేసు యొక్క నిరాపరాధ జీవిము పాప పరిహారార్ధబలిగా మారినది. (యోహాను 1:29)

▣ **"శరీరమమందు పాపమునకు శిక్షవిధించెను"** యేసుని మరణము మానవ పాప స్వభావపు సమస్యతో, కేవలం వ్యక్తిగత పాపపు కార్యములతోనే కాకుండా (మోషే ధర్మశాస్త్రం చేసినట్టుగా) సర్వ పాపములతో వ్యవహరించెంది. దేవుని నిత్య విమోచన సంకల్పమును యేసుని జీవితము, మరణ పునరుత్థానములు నెరవేర్చినది. (అపొ 2:23; 3:18; 4:28; 13:29) అదేవిధంగా మానవులు ఏవిధంగా ఉండగలరో మరియు ఉండవలెనో కూడా యేసు చూపించినాడు (యోహాను 13:15, పేతురు 2:21)

**8:4** ఈ వచనం క్రొత్త నిబంధనకు సంబంధించినది కావచ్చు (యిర్మియా 31:33। యెహెజ్కెలు 36:26–27) ఇది మన రక్షణలో రెండు దృశ్యములతో వ్యవహరిస్తుంది. మొదటిది, యేసుక్రీస్తు పాత నిబంధన విధులను నెరవేర్చినాడు. మరియు వారి అర్హతను బట్టి కాకుండా యేసునందు విశ్వాసముంచుట ద్వారా యేసుని నీతి ఉచితంగా విశ్వాసులకు బదిలీ చేయబడుతుంది. దీనిని మనము నీతిమంతులుగా తీర్చబడటం లేక స్థానియ పరిశుద్దీకరణ అని పిలుచుదము. దేవుడు విశ్వాసి ఒక నూతన హృదయమును మరియు నూతన ఆత్మను ఇచ్చును. మనము ఇప్పుడు శరీమమందుకాక ఆత్మయందు నడుచుచున్నాము దీనిని "వృద్ధి చెందెడి పరిశుద్దీకరణ" అని పిలుచుదము.

క్రైస్తవ్యము హక్కులను (రక్షణ బహుమానం) మరియు బాధ్యతలను (క్రీస్తు సారూప్యం ) కలిగిన ఒక నూతన నిబంధన. బాధాకరంగా కొంతమంది విశ్వాసుల శరీరానుసారులుగా సరికాని జీవితములను జీవించుచున్నారు (1కరి 3:1-3)

"శరీరమును అనుసరింపక, ఆత్మను అనుసరించియే" ఇదే విభేదము గలతీ 5:16-25లో కూడా కనిపిస్తుంది. జీవిత విధాన నీతి ద్వారా న్యాయపరమైన నీతి సంపూర్తి చేయబడాలి. క్రొత్త నిబంధన యొక్క నూతన హృదయము మరియు మనస్సు మన రక్షణకు ఆధారము కాదు గాని రక్షణ యొక్క ఫలితములు నిత్యజీవం అనేది గమనించగలిగే గుణలక్షణాలు.

8:5 పౌలు 5-8 వచనంలలో "శరీరం" నందు మరియు "ఆత్మ" నందు జీవితములను విభేదిస్తున్నాడు. ("శరీర క్రియలు" గలతీ 5:19-21తో "ఆత్మఫలము" గలతీ 5:22-25)

**8:6 "మనస్సు ఉంచబడిన"** కన్నులు మరియు చెవులు ప్రాణమునకు కిటికీలుగా యూదులు గుర్తించారు. తలంపు జీవితంలో పాపము ప్రారంభమవుతుంది. దేని మీద మనం వశిస్తామో దానిగా మనము మార్చబడతాము. (రోమా 12:1-2; ఫిలి 4:8)!య ఁపౌలు నిజంగా రబ్బీల అచారమైన, మానవులలోని రెండు తలంపులను అనుసరించటం లేదు. పౌలునికు, మంచి తలంపు పతన సృష్టిలో లేదుకాని మారు మనస్సులోనే కలదు. పౌలునకు, అంతరంగంలో వశించే పరిశుద్ధా అంతరంగిక ఆత్మీయ పోరాలమును ప్రారంబించును. (యోహాను 10:7-14)

- **"జీవము"** ఇది నిత్య జీవము, నూతన యుగ జీవితమును సూచిస్తుంది.

- **"సమాధానము"** నిజంగా ఈ పదము "పగులబడిన దానికి తిరిగి కట్టుట" అని అర్ధము నిచ్చుతుంది (యోహాను 14:27; 16:33; ఫిలి 4:7) మూడు రీతులుగా క్రొత్త నిబందన సమాధానం గురించి మాట్లాడుతుంది. (1) క్రీస్తు ద్వారా దేవునితో మన సమాధానం యొక్క బాహ్య సత్యం (కొలస్సీ 1:20); (2) దేవనితో సరిగా ఉన్నమనే అంతరంగిక భావన (యోహాను 14:27; 16:22; ఫిలి 4:7); (3) యూదులను మరియు అన్యులను క్రీస్తు ద్వారా ఒక్క శరీరంలోనికి తెచ్చుట (ఎఫెసి 2:14-17; కొలస్సి 3:15)

8:7-11 దేవునికి వేరుగా ఉన్న మానవుల గురించి పౌలు అనేక రీతులుగా మాట్లాడినాడు (1) దేవునికి విరోధులుగా 7వ; (2) దేవుని లోబడక, 7వ (3) దేవుని సంతోష పరుచలేని వారిగా, 8వ; మరియు (4) ఆత్మీయంగా మరణించి నిత్య మరణంను అనుభవించేవారు 10-11వ.

**8:7**

**NASB, NRSV " శరీరానుసారమైన మనస్సు దేవునికి విరోధము"**

**NKJV "శరీరానుసారమైన దేవునికి శత్రువు"**

**TEV ప్రజలు దేవునికి శత్రువులగుదురు'జ'**

**NJB అక్రమ మనుష్యుని దృశ్యం దేవునిక విరోధము"**

ఈ వాక్యములోని సాదృశ్యములు "శరీరమును అనుసరించే మనస్సు మరణము" అని సూచిస్తుంది. 6 &4 వను గమనించండి. పతన స్వభావము ఒక దృక్పదము మరియు ఒక జీవిత విధానం (7:5)

- **"ఎ మాత్రమును లోబడనేరదు"** పతన మానవులు దేవుని వెంబడించుటను కోరుకోకుండా ఉండటమే కాకుండా, వారు దేవుని వెంబడించలేదరు. పతన మానవులు, పరిశుద్దత్మ సహాయం లేకుండా, ఆత్మీయ విషయములను గ్రహించలేరు. (యెషయా 53:6, 1 పేతురు 2:24-25) ఎల్లప్పుడూ దేవుడే ముండ ప్రారంభిస్తాడు (యోహాను 6:44, 65)

**8:8 "శరీర స్వభావము కలవారు"** పౌలు ఈ పదమును రెండు రీతులుగా ఉపయోగించుచున్నాడు (1) భౌతిక శరీరము (రోమా 1:3; 2:28; 4:1; 9:3, 5) మరియు (2) దేవుడు లేకుండా మనావ ప్రయత్నములు (రోమా 7:5; 8:4-5) ఇక్కడ ఇది 2ను సూచిస్తుంది. ఇది తరుగుబాటు గల అవిశ్వాస మానవులను సూచిస్తుంది.

**NASB (నవీన వాక్యము 8:9-11)**

**దేవుని ఆత్మ మీలో నివసించియున్న యెడల మీరు ఆత్మస్వభావము గలవారే గాని శరీర స్వభాము గలవారు కారు. ఎవడైనను క్రీస్తు ఆత్మలేనివాడైతే వాడాయనవాడు కాదు. 10. క్రీస్తు మీలో నున్నయెడల మా శరీరము పాపవిషయమై మృతమైనది. గాని మీ ఆత్మ నీతి విషయమై జీవము కలిగియున్నది. 11. మృతులలో నుండి యేసును లేపినవాని ఆత్మ మీలో నివసించినయెడల, మృతులలో నుండి క్రీస్తు యేసును లేపినవాడు చావునకు లోనైన మీ శరీరమును కూడా మీలో నివసించుచున్న తన ఆత్మ ద్వారా జీవింపజేయును.**

**8:9 "యెడల"** 9,10,1,,13 (రెండుసార్లు)లతో షరతుల వాక్యముల వరుస కలదు. అవి ఈన్నియూ యొదటి తరగతి షరతుల వాక్యమై గ్రంథకర్త దృక్పం నుండి సత్యమై తన సాహిత్య ఉద్దేశ్యము కొరకు వాడబడినవి. రోమా సంఘంలోని ఈ పత్రిక చదువువారు క్రైస్తవులని పౌలు నమ్ముచున్నాడు (9ఎ.వ)

- **"క్రీస్తు ఆత్మ"** ఆత్మలేని విశ్వాసులు నశించెదరు. మన రక్షణతో పరిశుద్ధాత్మను స్వీరించుదము. అధజకంగా ఆయన మనకు అవసరమేలేదు. మనము ఆయనకు అధికంగా కావాలి.

9ఎ.వ॥లోని "ఆత్మ" అన్న వాక్యము "దేవుని ఆత్మ" 9బి మరియు "క్రీస్తు ఆత్మ" 9సిలోని పదములన్నియూ పర్యాయ పదములే?

**ప్రత్యేక అంశం : యేసు మరియు ఆత్మ**

దేవుని ఆత్మ కార్యమునకు మరియు క్రీస్తు కార్యమునకు చాలా సమీప అర్ధములున్నవి. జీ కాంప్‌జెమ్ పరిశుద్ధాత్మనకు "వేరొక యేసు" అని ప్రత్యేకమైన పేరును పెట్టెను. ఈ క్రింది పట్టీ ఆత్మ మరియు క్రీస్తు కార్యములకును మరియు బిరుదులకును గల పోలికను తెలుపుచున్నది.

1. ఆత్మ "యేసుని ఆత్మ" అని లేక అదే భావముతో పిలువబడుచున్నది. (రోమా 8:9; 2కొరి 3:17; గలతీ 4:6; 1పేతురు 1:11;)
2. రెండునూ ఒకే పదములతో పిలువబడుచున్నవి.

    ఎ. "సత్యం"

    1. యేసు (యెహాను 14:16)
    2. ఆత్మ (యెహాను 14:17; 16:13)

    బి. "ఉత్తరవాది"

    1. యేసు 1 యెహాను 2:1
    2. ఆత్మ (యెహాను 14:16, 26; 15:26; 16:7)

    సి. "పరిశుద్ధ"

    1. యేసు (లోక 1:35; 14:26)
    2. ఆత్మ (లూకా 1:35)

3. రెండునూ విశ్వాసిలో వసించును

    ఎ. యేసు (మత్త 28:20; యెహాను 14:20, 23; 15:4,5; రోమా 8:10; 2కొరి 13:15; గలతీ 2:20, ఎఫెసి 3:17; కొలస్సీ 1:27)

    బి. ఆత్మ (యెహాను 14:16,17; రోమా 8:9,11; 1కొరి 3:16; 6:19; 2తిమోతి 1:14)

    సి. తండ్రి కూడాను (14:23; 2వకొరి 6:16)

**8:10 "క్రీస్తు మీలో"** ఇది బహువచనము "క్రీస్తు" అన్నపదము అంతరంగంలో వశించు కుమారుడు / ఆత్మ (యెహాను 14:16-17; కొలస్సి 1:27)ను సూచిస్తుంది. ప్రజలు కుమారడు / ఆత్మలేనట్ల పౌలునకు "క్రీస్తులో" అన్న వేదాంత అంశం "ఆత్మలో" అన్నదానికి సమరూపం

- **"మీ శరీరము పాప విషయమై మృతమైనది గాని"** ఆదాము పాపము వలన మరియు వ్యక్తిగత తిరుగుబాటు వలన క్రైస్తవులు కూడా భౌతికంగా మరణించుదురు. (5:12-21) పాపము ఎప్పుడూ తన పనిచేస్తుంది. ఆత్మీయ మరణము (ఆది 3; ఎఫెసి 2:1) భౌతిక మరణమునక దాతీసింది. (ఆది5; హెబ్రీ 9:27) విశ్వాసులు ఆత్మయొక్క నూతన యుగములోనూ (యోవేలు 2:28-29; అపొ 2:16) మరియు పాపము యొక్క నూతన యుగములోనూ తిరుగుబాటులోనూ జీవించెదరు (21, 35వ)

- **"మీ ఆత్మ నీతి విషయమై జీవము కలిగియున్నది"** ఈ "ఆత్మ" మానవుని ఆత్మ (..... విలియమ్స్, ) లేక పరిశుద్మా ( .... కార్ల్‌బార్త్ బారెట్, జాన్‌ముర్రే మరియు ఎవరెట్ హర్రిసన్) యా అని అనువాదకారులతో కొంత నిరాంగీకారము కలదు.

విశాల సందర్భము ఈ క్లుప్త వాక్యము యొక్క వివేచనమును విస్తరింపజేస్తుంది. క్రీస్తు నందు నమ్మిక గలవారు కూడా ఈ పతన లోకములో జీవించుచున్న కారణము చేత వారు కూడాను మరణించెదరు. కాని క్రీస్తు నందు విశ్వాసము ద్వారా నీతిని పొందుట ద్వారా ఇప్పటికే వారు నిత్య జీవమును కలిగియున్నారు (ఎఫెసి 2:4-5) ఇది "ఇప్పుడే కాని ఇంకా రాలేదు" యొక్క దేవుని రాజ్యతన్యత ఇది. పాత యుగము మరియు క్రొత్త యుగము కాలములో ఒక దానిపైకి ఒకటి ఎక్కినది.

**"నీతి ప్రత్యేక అంశం 1:17ను చూడండి**

**8:11 "యెడల" 9వ నోట్ చూడండి**

**"మృతులలో నుండి యేసుని లేపిన వాని ఆత్మ మీలో నివసించిన యెడల"** త్రిత్వములోని పవ్యక్తి విశ్వాసిలో నివసిస్తుంది. ఎక్కువ మంది క్రైస్తవులు ఆత్మ అని జవాబు ఇచ్చెదరు. ఇది నిశ్చయంగా సరి అయినదే కాని నిజంగా త్రిత్వం యొక్క ముగ్గురు వ్యక్తులు విశ్వాసిలో నివసిస్తారు.

1. ఆత్మ, యెహాను 14:16-17; రోమా 8:11; 1కోరి 3:16; 6:19; 2 తిమోతి 1:15
2. కుమారడు, మత్తయి 28:20; యెహాను 14:20, 23; 15-45; రోమా 8:10; 2కొరి 13:5; గలతీ 2:20; ఎఫెసి 3:17 కొలస్సి 1:27
3. తండ్రి, యెహాను 14:3, 2కొరి 6:16

రక్షణ కార్యములో త్రిత్వము యొక్క ముగ్గురు వ్యక్తులు నిమగ్నమైయున్నారని క్రొత్త నిబంధన సూచిస్తుందని చెప్పుటకు ఈ వాక్యము గొప్ప అవకాశము తండ్రి అయిన దేవుడు కుమారుని లేపెను (అపొ 2:24; 3:15; 4:10; 5:30; 10:40; 13:30, 33, 34, 37; 17:31; రోమా 6:4,9; 8:11; 10:9; 1కోరి 6:14; 2కొరి 4:14; గలతీ 1:1; ఎఫెసి 1:20; కొలస్సి2:12; 1 థెస్స 1:10); (2) కుమారుడైన దేవుడు తన్ను తాను లేపుకొనెను (యెహాను 2:19-22; 10:17-18; (3) ఆత్మయైన దేవుడు యేసుని లేపెను (రోమా 8:11) 9-10వ॥లలో కూడా ఇదే త్రిత్వ సంబంధమైన అభివర్ణన చూడవచ్చు.

**ప్రత్యేక అంశం : త్రిత్వము**

త్రిత్వము యొక్క ముగ్గురు వ్యక్తుల కార్యములను గుర్తించండి. "త్రిత్వము" అన్న పదము మొదటి సారిగా టెట్‌టూలియన్‌చే వాడబడినది. కాని ఇది బైబిల్ పదము కాదు. అయినప్పటికినీ ఈ అంశము అంతటా వ్యాపితమైనది.

1. సువార్తలు
   ఎ. మత్తయి 3:16-17; 28:19
   బి. యోహాను 14:26
2. అపోస్తుల కార్యములు - అపో 2:32-33, 38-39
3. పౌలు
   ఎ. రోమా 1:4-5; 5:1,5; 8:1-4, 8-10
   బి. 1కొరి. 2:8-10; 12:4-6
   సి. 2కొరి. 1:21; 13:14
   డి. గలతీ 4:4-6
   ఇ. ఎఫెసి 1:3-14, 17; 2:18; 3:14-17; 4:4-6
   ఎఫ్. 1థెస్స 1:2-5
   జి. 2థెస్స 2:13
   హెచ్. తీతు 3:4-6
4. పేతురు - 1పేతురు 1:2
5. యూదా 20-21

**పాత నిబంధనలోని గుర్తింపు :**

1. దేవుని కొరకు బహువచనములను వాడడం.
   ఎ. యెలోహీమ్ అన్న పేరు బహువచనం కాని దేవుని కొరకు వాడబడినప్పుడు ఏకక్రియగా ఎల్లప్పుడు వాడబడినది.
   బి. "మనము" అన్న పదము ఆది 1:26-27; 3:22; 11:7
   సి. ద్వితి 6:4లో "ఒక్కడు" అనేది బహువచనం (ఆవి 2:24; యెహె 37:17లో వలే
2. యెహోవా దూత దైవమునకు ప్రత్యక్ష ప్రతినిధిగా
   ఎ. ఆది 16:7-13; 22:11-15; 31:11,13; 48:15-16
   బి. నిర్గమ 3:2, 4; 13:21; 14:19
   సి. న్యాయ 2:1; 6:22-23; 13:3-22
   డి. జక 3:1-2;
3. దేవుడు మరియు ఆత్మ వేరైనవి, ఆది 1:1-2; కీర్తన 104:30; యెషయ 63:9-11; యెహె 37:13-14
4. దేవుడు మరియు మెస్సియ వేరైనవారు, కీర్తన 45:6-7; 110:1; జక 2:8-11; 10:9-12.
5. మెస్సియ మరియు ఆత్మ వేరైనవారు, జక 12:10.
6. యెషయా 48:16; 61:1లో ముగ్గురు వ్యక్తులు ప్రస్తావించబడినారు.

   యేసు యొక్క దైవత్వము మరియు ఆత్మ యొక్క వ్యక్తిత్వము ఏకైక దేవుడు యందు విశ్వాసము కల ఖచ్చితమైన అదిసంగా విశ్వాసులకు వివాదమునకు కారణమైనవి.

   1. టెర్టూలియన్ - కుమారుడను తండ్రికి ప్రతిగా ఉంచినాడు.
   2. ఓరిజన్ - కుమారుడు మరియు ఆత్మ యొక్క దైవిక ప్రాముఖ్యతను తెలియజేసినాడు.
   3. ఏరియస్ - ఆత్మనకు మరియు కుమారునకు గల దైవత్వమును త్రునీకరించినాడు.
   4. మోనార్కియానిజన్ - దేవుని యొక్క వరుస ప్రత్యక్షతలను నమ్మినది.

   త్రిత్వము అన్న అంశము బైబిల్ వాక్యముల చేత చారిత్రకముగా అభివృద్ధి చెందినది.

   1. యేసు యొక్క సంపూర్ణ దైవత్వము తండ్రితో సమానంగా క్రీ॥శ॥ 325లో నిషియా కౌన్సిల్‌చే ఆమోదించబడినది.
   2. ఆత్మ యొక్క సంపూర్ణ వ్యక్తిత్వము మరియు దైవత్వము తండ్రితో సమానంగా కాన్‌స్టాంటినోపిల్ యొక్క కౌన్సిల్‌చే ఆమోదించబడినది. (క్రీ॥శ॥ 381)
   3. త్రిత్వము యొక్క సిద్ధాంతము ఆగస్టీన్ యొక్క డి త్రినియేట్‌లో సంపూర్తిగా వ్యక్తమైనది.

   ఇక్కడ సత్య మర్మము కలదు కాని ఒక దైవత్వమును ముగ్గురు నిత్య వ్యక్తుల ప్రత్యక్షతతో క్రొత్త నిబంధన రూఢి పరుస్తుంది.

▣ **"చావునకు లోనైన మీ శరీరములను కూడా జీవింపచేయును"** యేసుని మరియు ఆయన అనుసరుల పురుత్థానము ఒక ప్రాముఖ్యమైన సిద్దాంతము (1కొరి 15:1; 2కొరి 4:14) విశ్వాసులు నిత్యత్వంలో శారీరక ఉనికి కల్గియుంటారని క్రైస్తవులు నమ్ముదురు. (1యోహాను 3:2), క్రీస్తు ఆత్మ వలన లేపబడితే ఆయన అనుసరులు కూడా ఆత్మవలనే తేపబడుదురు. (23వ)

**NASB (నవీన) వాక్యము 8:12-17**

**12. కాబట్టి సహోదరులారా, శరీరానుసారముగా ప్రవర్తించుటకు మనము శరీరమునకు ఋణస్థులము కాము. 13. మీరు శరీరానుసారముగా ప్రవర్తించిన యెడల చావవలసినవారై యుందురు గాని ఆత్మచేత శారీర క్రియలను చంపిన యెడల జీవించెదరు. 14. దేవుని ఆత్మచేత ఎందుకు నడిపింపబడుదురో వారందరు దేవుని కుమారులై యుందురు. 15. ఏలయనగా మరల భయపడుటకు మీరు దాస్యపు ఆత్మను పొందలేదు గాని దత్తపుత్రాత్మను పొందితిరి. ఆ ఆత్మ కలిగిని వారమై మనము అబ్బా తండ్రీ అని మొఱ్ఱపెట్టుచున్నాము. 16. మనము దేవుని పిల్లలమని ఆత్మ తానే మన ఆత్మతో కూడ సాక్ష్యమిచ్చుచున్నాడు. 17. మనము పిల్లలమైతే వారసులము, అనగా దేవుని వారసులము; క్రీస్తుతోడి వారసులము.**

**8:12 "కాబట్టి"** 1-11వ॥లలో ఆయన యొక్క ప్రదర్శన యొక్క సూచనలో కొనసాగుతున్నాడు.

- **"మనము ఋణాస్తులముకాము"**, ఇది క్రైస్తవ స్వేచ్ఛ యొక్క వేరొక భాగము (14:1-15:13) ఇది 1-11 వ॥లోని స్థానీయ మరియు క్రమ వృద్ధి చెందిడి పరిశుద్ధీకరణ యొక్క ముగింపు నుండి తీయబడినది. ఇది ఇంకా విశాసులు పాత స్వభూవముతో పోరడవలెనని స్పష్టంగా చూపిస్తుంది. (రోమా 7) ఎంపిక చేసినది (ప్రాంరభ విశ్వాసులు) ఎంపిక చేయవలసినది (జీవిత విధాన విశ్వాసము) కలదు.

**8:13 "యెడల"** 9,10,11,13(రెండుసార్లు), 17(రెండుసార్లు) లో షరుతుల వాక్యముల వరుస కలదు. ఇది అన్నియు మొదటి తరగతి షరతుల వాక్యమై గ్రంథకర్త దృక్పథము నుండి సత్యమై తన సాహిత్య ఉద్దేశ్యము కొరకు వాడబడినది. రోమా సంఘంలో ఈ పత్రిక చదువు వారు ఆత్మవలన జీవించే క్రైస్తవులు అని పౌలు నమ్ముచున్నాడు.

- **"మీరు శరీరానుసారముగా ప్రవర్తించిన యెడల చావవలసిన వారైయందురు"** 13వ॥లోని క్రియలు భూత కాలమునకు చెందినవే. ఇది కొనసాగుతున్న చర్యను గురించి మాట్లాడుతున్నవి. మరణం యొక్క మూడు దశలను బైబిల్ చూపిస్తుంది. (1) ఆత్మీయ మరణము (ఆది 2:17; 3:1-7; ఎఫెసి 2:1); (2) భౌతిక మరణము (ఆది. 5); (3) నిత్య మరణము ప్రక. 2:11; 20:6, 14; 2:18) ఈ వాక్య భాగములో మాట్లాడినది ఆదాము యొక్క ఆత్మీయ మరణము, (ఆది 3:14-19) అది మానవజాతి యొక్క భౌతిక మరణమునకు దారితీసింది. (ఆది. 5) ఆదాము యొక్క పాపము మానవ అనుభవం లోనికి మరణమును తీసుకొని వచ్చింది (5:12-21) మనం అందరము స్వచిత్తంగా పాపములో పాల్గొంటున్నాము. మనం దానిలోనే ఉండినట్లయితే అది మసలను చంపుతుంది. "నిత్యముగా" (క్ర 20:6, 14 "రెండవ మరణము") క్రైస్తవులుగా పాపమునకు, స్వార్తమునకు మనం చనిపోయి దేవుని కొరకు మనం జీవించాలి (రోమా. 6)

- **"ఆత్మ చేత శారీర క్రియలను చంపిన యెడల జీవించెదరు"** క్రైస్తవుల జీవిత విధానం ద్వారా విశ్వాసులు రక్షణ నమ్మిక ప్రత్యక్ష పర్చబడుతుంది. (యాకోబు మరియు 1 యెహాను) విశ్వాసుల వారి స్వంత ప్రయత్నవ వలన ఈ నూతన జీవితమును జీవించలేరు కాని ఆత్మ కారకము వలనను మాత్రమే (14వ) ప్రతిదినము ఆత్మ ఆధీనమునకు సమర్పించుకోవాలి (ఎఫెసి 5:17-18) ఈ సందర్భములో "శారీరక క్రియలు" పాత పాపయుగపు జీవితంగా కనిపిస్తుంది. ఇది భౌతిక ఉనికి యొక్క నిత్యత్వము కాదుగాని (8:23) అంతరంగపు ఆత్మ (నూతన యుగము)కును పాపముతో పోరాటము (పాతయుగం)నకు మధ్య విభేదమును చూపిస్తుంది.

**8:14 "దేవుని ఆత్మ చేత ఎందరైతే నడిపించబడుదురో"** ఇది భూత కర్మర్థకమై ఆత్మనుండి నిరంతరం వచ్చే నడిపింపును వివరిస్తుంది. ఆత్మ క్రీస్తులో మనలను ఉంచి క్రీస్తు సారూప్యమును మనకిస్తుంది (29వ) ఒక నిర్ణయము కంటే క్రైస్తవ్యమునకు అధికం కలదు. ఇది ప్రత్యేక సంఘటనలు, కాలాలు, లేక పరిచర్యలు కొరకు కాదు గాని దైనందిక కార్యములు.

- **"దేవుని కుమారులు"** ఈ బహువచనము పాత నిబంధనలలో దేవదూతల కొరకు రియు ఉతరచుగా మానవుల కొరకు వాడబడినది. ఏకవచం, ఆదాము, ఇశ్రాయేలు ఆమె రాజులు మరియు మెస్సియా కొరకు వాడబడేది. ఇది ఇక్కడ విశ్వాసులలందరిని సూచిస్తుంది. 14వ॥తో గ్రీకు పదము హాఐ (కుమారులు), 16వ॥లో టెక్నా (పిల్లలు) అని వాడబడినది. అవి ఈ సందర్భంలో పర్యాయయ పదములుగా వాడబడినవి.

**8:15 "ఆత్మ"** 10వ వలె ఇదికూడా అనేక అర్థములను కల్గియున్నది. ఇది క్రీస్తులో విమోచించడిన మానవులు ఆత్మను లేక పరిశుద్ధాత్మను సూచించవచ్చు. రెండునూ 16వలో కనిపిస్తాచి.

పౌలు రచనలలో చాలా సందర్భములలో ఈ వ్యాకరణ నిర్మాణము పరిశుద్ధాత్మ వ్యక్తిగత విశ్వాసులలో కలిగించే దానిని వివరించుటకు వాడబడేది.

1. "దాస్యపు ఆత్మ" కాదు, "దత్తతపు ఆత్మ" 15వ
2. "సాత్వికపు ఆత్మ" 1కిరి 4:21
3. "విశ్వాసపు ఆత్మ" 2కొరి 4:13
4. "జ్ఞాన వివేచనపు ఆత్మ" ఎఫెసి 1:17

చాలా స్థలాలలో, ప్రత్యేకంగా 1కొరిందిలో న్యూమాను ఆత్మ సూచనగా చెప్పినాడు (1కొరి 2:11; 5:3;, 14; 7:34; 16:8; మరియు కొలస్సి 2:5) ఈ సందర్భంలో 10 & 15వ॥లు ఈ వర్గమునకు అమరుతుంది.

- **"మరలా భయపడుటకు దాస్యపు ఆత్మ"** పాత స్వభావము యొక్క గుణము భయము క్రొత్త స్వభావము యొక్క గుణములు 14–17వ॥లలో వివరించబడినది.

- **"దత్తపుత్రాత్మ"** రోమా ప్రభుత్వము దత్తత చేసుకోవటం చాలా కష్టతరం చేసినది. కాని ఒక్కసారి జరిగితే, అది శాశ్వతము (గలతీ 4:4–600 ఉపమాన అలంకారము విశ్వాసి యొక్క భద్రత అన్న వేదాంత సిద్ధాంతమును బలపరుస్తుంది. సహజ కుమారులు స్వాస్థ్యం లేకుండా చేయబడవచ్చు కాని దత్తత తీసుకున్న కుమారులకు కాదు. రక్షణను వివరించుటకు కుటుంబపరమైన ఈ ఉపమానం పౌలునకు ఎంతో అభిమానము (15, 23వ॥లు) యెహాను, పేతురులు కుటుంబ సంబంధిత ఉపమానమును "తిరిగి జన్మించుట"తో ఉపయోగించినారు (యెహాను 3:30; 1 పేతురు 1:3, 23)

- **"అబ్బ"** ఈ అరమియపదము, పిల్లలు ఇంటి వద్ద వారి తండ్రిని పిలిచే మాట ఇది ("డాడీ" లేక "పాపా") యేసును మరియు అపొస్తలులు అరమియను మాట్లాదేవారు. క్రీస్తు రక్తము ద్వారా, అంతరంగపు ఆత్మ ద్వారా, స్థిరమైన విశ్వాసములతో మరియు కుటుంబ నమ్మకతో పరిశుద్ధ దేవుని యొద్దకు రాగలరు. (మార్కు 14:36; గలతీ 4:6) పడిపోయిన మానవులు, దేవునిని తండ్రిగా పిలువటం అశ్చర్యం కాదా. నిత్యుడైన దేవుడో దీనిని ఆశించాడు. ప్రత్యేక అంశం : తండ్రి 1:7లో చూదండి.

**8:16 "ఆత్మతానే"** ఆత్మ కొరకైన గ్రీకు పదము న్యూటర్, కాబట్టి కెజెవి దీనిని "ఆత్మ, తానే" అని అనువదించినది. కాని ఆత్మ ఒక వ్యక్తి అతడు దుఃఖపడగలడు (ఎఫెసి 4:30; 1థెస్స 5:19) కావునా "తానే" అనేది శ్రేష్టఅనువాదము.

- **"మన ఆత్మతో కూ సాక్ష్యమిచ్చుచున్నాడు"** 13వ॥లో చెప్పిబడినట్టుగానే, విశ్వాస నమ్మకం యొక్క దృక్పధము విశ్వాసి మారిని మరియు మరుతున్న జీవితాలు (యాకోబు మరియు 1 యెహాను) నమ్మిక యొక్క వేరొక దృక్పథము ఏమిటంటే దేవుని యెడల ఉన్న భయమును కుటుంభ ప్రేమతో కప్పే అంతరంగపు ఆత్మ. ఆర్ఎస్వి & ఎన్ఆర్ఎస్వి అనువాదములను గమనించండి "అబ్బా! తండ్రీ! అని మనము పిలిచినప్పుడు ఆత్మతానే మనము దేవుని పిల్లల మని సాక్ష్యమిచ్చుచున్నది (గలతీ 4:6) ఆత్మవలన విశ్వాసి దేవుని తండ్రి అని పిలిచినపుడు ఈ నమ్మిక సూచన కనిపిస్తుంది.

ఆత్మ యొక్క అంతరంగికపు సాక్ష్యము వినబడదు కాని అభ్యస పూర్వకమైనది.

1. పాపము మీద అపరాధం.
2. క్రీస్తు వలె ఉండాలనే ఆశ.
3. దేవుని కుటుంబంతో ఉండాలనే ఆశ.
4. దేవుని వాక్యము కొరకు ఆకలి.
5. సువార్త చేయాలనే అవసరత యొక్క భావన
6. క్రైస్తవ త్యాగ పూరితంగా ఇవ్వవలసిన అవసరత భావన. మారు మనస్సు యొక్క ఋజువులను ఇటువంటి అంతరంగిక ఆశలు నిరూపిస్తాయి.

రక్షణ యొక్క నిశ్చయత మతవర్గముల విసయముగా మారిపోయినది. (1) రోమన్ కథోలిక్ వేదాంతము, రక్షణ యొక్క నిశ్చయతను తృణీకరిస్తూత "సత్య" సంఘంలో ఒకడు సభ్యుడిగా ఉండుటనైన నమ్మికను ఆధారం చేసుకుంది; (2) జాన్ కాల్విన్ (సంస్కరణ సాంప్రదాయము) ఎన్నిక (పూర్వనిర్ధారణము)పై ఒకని నిశ్చయత ఆధారపడినది అని, కాని తీర్పుదినము వరకు ఎవరో అని తెలియదు; (3) జాన్వెస్లీ (మెథడిస్ట్ సాంప్రదాయం) పరిపూర్ణప్రేమపై ఆధారపడినది (తెలియబడిన పాపముల దాటి జీవించడం); (4) అధిక బాప్టిస్ట్ వారు బైబిల్ వాగ్దానమైన ఉచిత కృపపై ఆధారపడుతారు (కాని అన్ని హెచ్చరికలను మరియు శిక్షలను విడిచిపెట్టుదురు). క్రైస్తవ రక్షణ యొక్క విరుద్ధ ప్రదర్శనకు రెండు ప్రమాదాలు కలవు. (1) "ఒక్కసారి రక్షింపబడితే, ఎప్పటికి రక్షింపబడటమే" పై అధకంగా ఒక్కానించటము,

మరియు (2) "రక్షణను సాధించుట కొరకు మానవుల పని" పై అధికంగా వక్కాణించటం. హెబ్రీ 6 స్పష్టంగా బోధిస్తుంది. "ఒక్కసారి వెలుపల అయిఏత, ఎల్లప్పుడూ వెలుపలే" మానవ ప్రయత్నాలు (సత్ క్రియలు)విశ్వాసి రక్షణను కాపాడలేవు. (గలతీ 3:1-14) కాని సత్‌క్రియలు క్రైస్తవ జీవితం యొక్క గురి (ఎఫెసి 2:10) దేవుని కలుసుకొనుట మరియు అంతరంగంలో ఆత్మ నివసించుట ద్వారా అవిసహజంగా వచ్చేవి. అవి ఒకని నిజ మార్పునకు ఋజువులు. నిశ్చయత అనేది పరిశుద్ధులుగా ఉండుటకు పిలువబడిన దానిని మెత్తన చేయటం కాదు. వేదాంతపరంగా ఒకని నిశ్చయత దేవుని గుణముపైన మరియు త్రియేక దేవుని కార్యమువలన కల్గుతుంది. (1) తండ్రి ప్రేమ మరియు జాలి; (2) కుమారుని సంపూర్ణ త్యాగపూరిత కార్యము మరియు (3) ఆత్మనింపుదల మరియు మారుమనస్సు పొందిన విశ్వాసిలో క్రీస్తు సారూప్యతను కల్గించటము మార్చబడిన దృక్పథముః, మార్చబడిన హృదయము మార్చబడిన జీవిత విధానము మరియు మార్చబడదిన నిరీక్షణము రక్షణకు ఋజువుల, జీవిత విధాన ఋజువులేని గతకాలపు మానసిక భవనాలపై ఇది ఆధారపడదు (ఫలము మత్తయి 7:15-23; 13:20-22) నిశ్చయత, రక్షణవలె, క్రైస్తవ జీవితంవలె, దేవుని కనికరమునకు స్పందించి మరియు స్పందిస్తూ జీవితమంత స్పందించటంతో ప్రారంభమవుతుంది. ఇది మారిన మరియు మార్పు చెందుతున్న విశ్వాస జీవితం.

- **"సాక్ష్యమిచ్చుచున్నాడు"** ఇది మరియొక సన్ మిశ్రమపరం విశ్వాసి ఆత్మతో ఆత్మ యొక్క జతసాక్షి. పౌలు ఈ మిశ్రమ పదమును 2:15; 8:16 మరియు 9:1లో ఉపయోగించినాడు.

**8:17 "యెడల"** ఈ వచనంలో మూడు మిశ్రమ పదములు సిన్ ()న, ఉపయోగిస్తున్నాయి. దీని అర్థము "సంయుక్తంగా పాల్గొనుట" క్రీస్తుతో విశ్వాసుల భాగము; క్రీస్తు శ్రమమలతో విశ్వాసుల వాటి; అదేవిధంగా క్రీస్తు మహిమలో కూడా విశ్వాసులు పాలిభాగస్తులే. 22(రెండుసార్లు)లో, 26 & 28లో ఒంకా మరిన్ని సిన్ మిశ్రమ పదములు కలవు. ఎఫెసి 2:5-6లో కూడా మూడు సిన్ మిశ్రమ పదములు కలవు, అవి క్రీస్తులో విశ్వాసుల జీవితమును వివరిస్తున్నవి.

- **"వారసులము"** విశ్వాసులను వివరించుటకు వాడే మరి యొక కుటుంబ ఉపమాన అలంకారము (4:13-14; గలతీ 3:29; 4:17)

- **NASB, NKJV "ఆయతో శ్రమపడిన యెడల"**

**NRSV "నిజంగా, ఆయనతో శ్రమపడితే"**

**TEV "మనం క్రీస్తు శ్రమలలో భాగస్తులమైతే"**

**JB "ఆయన శ్రమలను పంచుకొంటే"**

పతనలోకంలో శ్రమలు విశ్వాసికి ఒక ప్రమాణం (మత్తయి 5:10-12; యెహోను 15:18-21; 16:1-2; 17:14; అపో 14:22; రోమా 5:3-4; 8:17; 2 కొరి 4:16-18; పిలి 1:29; 1థెస్స 3:3; 2 తిమోతి 3:12; యాకోబు 1:2-4; 1 పేతురు 4:12-19) చేసు మాదిరిని ఉంచెను హెబ్రీ 5:8) మిగిఇన అధ్యాయమంతా ఈ అంశంను వృద్ధి చేస్తుంది.

- **"ఆయనతో మహిమ పొందుట"** యెహోను రచనలలో యేసు మరణమును గురించి మాట్లాడునప్పుడెల్లా దానిని "మహిమపర్చబడుట"గా వర్ణించినాడు. యేసుక్రీస్తు, ఆయన శ్రమల వలన మహిమ పర్చబడినాడు. విశ్వాసులు స్థానియంగా, తరుచుగా అనుభవ పూర్వకంగా యేసుని జీవిత సంఘటనలను పంచుకొనెదరు (రోమా 6) ప్రత్యేక అంశం : దేవుని రాజ్యగిలో పరిపాల చూడండి

**NASB (నవీన) వాక్యము 8:18-25**

**18. మనయెడల ప్రత్యక్షము కాబోవు మహిమయెదుట ఇప్పటికాలపు శ్రమలు ఎన్నతగినవి కావని యెంచుచున్నాను. 19. దేవుని కుమారుల ప్రత్యక్షత కొరకు సృష్టి మిగుల ఆశతో తేరి చూచుచు కనిపెట్టుచున్నది. 20. ఏలయనగా సృష్టి, నాశనమునకు లోనయిన దాస్యములో నుండి విడిపించబడి, దేవుని పిల్లలు పొంద బోవు మహిమగల స్వాతంత్ర్యము పొందుదునకు నిరీక్షణకలదై, స్వేచ్ఛగా కాక దనాని లోపరిచిన వాని మూలముగా వ్యర్థపరచబడెను. 22. సృష్టియావత్తు ఇదివరకు ఏకగ్రీవముగా మూలుగుచు ప్రసవవేదన పడుచునున్నదని యెరుగుదుము. 23. అంతేకాదు, ఆత్మయొక్క ప్రథమ ఫలముల నొందిన మనము కూడా దత్త పుత్రత్వముకొరకు, అనగా మన దేహము యొక్క వియోచనము కొరకు కనిపెట్టుచు మనలో మనము మూలుగుచున్నాము. 24. ఏలయనగా మనిము నిరీక్షణ కలిగినవారమై రక్షింపబడితిమి. నిరీక్షింపబడునది కనబడునప్పుడు, నిరీక్షణతో పనియుండదు; తీను చూచుచున్న దాని కొరకు ఎవడు నిరీక్షించును! 25. మనము చూడని దానికొరకు నిరీక్షించిన యెడల ఓపికతో దానికొరకు కనిపెట్టుదుము.**

**8:18 'యెంచుచున్నాను"** ఇది అక్షరార్ధముగా" కలుపటము క్రీస్తు శ్రమమలలోని భావలమును తెలియజేస్తున్నాడు. ఇది జాగ్రత్తగా పరిశీలించి ముగింపునకు చేరే ఒక లెక్కల పదము. ఇది రోమాలో పునరావృతమైన అంశము (2:3 నోట్ చూడండి) విశ్వాసులు వారు అర్ధం చేసుకున్న ఆత్మీయ సత్యపు వెలుగులో నడవాలి.

- **"శ్రమలు"** 1కొరి 4:9-12; 2కొరి 4:7-12; 6:4-10; 11:24-27; హెబ్రీ 11:35-38ల నుండి క్రీస్తును సేవించుటలో దాగియున్న శ్రమలను గురించి కొంత ఆలోచన కల్గియున్నాము.

- **"ప్రస్తుత కాలపు శ్రమలు"** యూదులు నమ్మెదేమిటంటే, ప్రపంచ చరిత్ర రెండుయుగాలుగా విభజించబడిందని, అది ప్రస్తుత దుష్టయుగము మరియు రానైయున్న నీతియుగము మెస్సియా నీతి రాజ్యమును స్థాపించునని పాత నిబంధన ఎదురు చూస్తుంది. ఎలాగైననూ, క్రీస్తు యొక్క రెండు రాకడలు, ఒకటి రక్షకనివలె (అవతారం), మరియు రెండవది ప్రభువువలె (రెండవరాకడ), ఈ రెండు యుగములు ఒకదానిపై ఒకటి పడినట్టుగా చేసింది. విశ్వాసులు "ఇప్పుడే" మరియు "ఇంకా కాని" దేవుని రాజ్యము తన్యతల మద్య జీవించుదురు.

**ప్రత్యేక అంశం : ఈ యుగము మరియు రానైయున్న యుగమును 12:2లో చూడండి.**

- **"ఎన్నతగిన.... మహిమ"** ఈ రెండు పదములు పాత నిబంధన అంశం అయిన బరువు ....... బరువు విలువైనది "ఎన్నతగిన" అనేది వాణిజ్య పదము, దాని అర్ధము "ఎంతైన తూచుటకు" హీబ్రూ పదం "మహిమ" అనేది కూడా"బరువుగా ఉండు" అన్న మూలపదం నుండి వచ్చి విలువైనదిగా ఉండుటకు, బంగారం వలె అని అర్ధమునిచ్చేది. 3:23లో పూర్తినోట్ను చూడండి.

  పౌలు రచనలలో **"మహిమ"** అనేది అంత్యకాలమును తెలిపెడిదిగా కనిపిస్తుంది. ఇది రానైయున్న మహిమ పొందిన హెచ్చింపబడిన క్రీస్తు మహిమను మరియు ప్రభావమును సూచిస్తుంది (కొలస్సి 3:4) ప్రత్యేక అంశం : మహిమను 3:23లో చూడండి.

- **"మన యెడల ప్రత్యక్షంగా కాబోవు"** ఈ కర్మార్ధకపు వాక్యము దేవుని కారకము లేక ఆత్మను సూచిస్తుంది. (20వ) విశ్వాసులు ఈ యుగమునందు కనుచూపుతో కాక విశ్వాసంతో బ్రతుకుదురు. (24 & 2 కొరి 2:9; 3:12; 2కొరి 5:7 & హెబ్రీ 11:1)

**8:19 "సృష్టి మిగుల ఆశతో ఎదురుచూసుచున్నది"** భౌతిక సృష్టి మనుష్య గుణారోపచేయబడి మెడఎత్తి దిక్కులను చూసినట్లుగా చూస్తుందని చెప్పబడుతుంది. ఆదాము మరియు అవ్వల తిరుగుబాటు వలన సృష్టి ప్రతికూలంగా ప్రభావం చేయబడింది. (ఆది 3:17-19) సృష్టి అంతయు చివరిగా రక్షింపబడును (తిరుగుబాటు చేసిన దూతలు) విశ్వసించని మానవులు, ఒంటరిగా ఉండుటకు సిద్ధపర్చబడిన స్థలము తప్ప బ్రూస్ కోర్లీ మరియు కర్టిస్ వాగన్, రోమన్స్, పి. 95 ఫుట్నోట్ 46)

**ప్రత్యేక అంశం : సహజవనరులు**

1. ఉపోద్ఘాతము :

   ఎ. సృష్టి అంతయు మానవులతో దేవుని యొక్క ప్రేమ వ్యవహారమునకు ఒక వెను తెర

   బి. ఇది పతనములో చేర్చబడినది (ఆది 3:17; 6:1; రోమా 8:18-20) ఇది అంత్యకాలపు విమోచనలో కూడా చేర్చబడుతుంది. (యెషయా 11:6-9; రోమా 8:20-22; ప్రకటన 21-22)

   సి. పాపభరిత పతన మానవుడు సహజ పరిసరములను తన స్వార్ధముతో విడనాడుచున్నాడు. ఈ క్రింది మాటను ద కేనాన్ ఆఫ్ వెస్ట్ మినిష్టర్, అడ్వర్డ్ కార్పెంటర్ చెప్పెను.

   "మానవుని యొక్క చాలని శ్రద్ధ తన పరిసరాల చుట్టూ దేవుని సృష్టి యెడల కొద్దిగా ఉండి తను కాలుష్యము చేస్తున్న గాలి, పాడుచేస్తున్న నీరు, విషపూరితము చేస్తున్న నేల, నేల మట్టం చేస్తున్న అడవులు ద్వారా శాశ్వత కాల పరిణామాలతో నాశనమును తెచ్చుకొనుచున్నాడు. చాలని పట్టింపు మరియు కొద్దిపాటి భాధ్యత భావన ఒక తరము నుండి వేరొక తరమునకు వృద్ధి చెందుతుంది."

   డి. కేవలము మనము కాలుష్యము యొక్క ఫలితమును మరియు మన విశ్వము యొక్క దుర్వినియోగమును అనుభవించడమే కాకుండా మన సంతతి మనకంటే అధికమైన, తీవ్రమైన మార్చలేని పరిణామములను ఎదుర్కొనును

2. బైబిల్ వాక్యములు :

   ఎ. పాత నిబంధన

      1. ఆది 1-3

ఎ. మానవులతో దేవుని యొక్క ప్రత్యేక సహవాసము కొరకు సృష్టికి దేవుడు ప్రత్యేక స్థానమును కలిగించెను (ఆది1:1-25)

బి. సృష్టి మంచిది (ఆది. 1:4, 10, 12, 18, 21, 25) చాలా మంచిది (ఆది. 1:31) ఇది దేవునికి సాక్షిగా ఉండుటకు ఏర్పరచబడినది. (కీర్తన 19:1-16)

సి. మానవతం సృష్టి యొక్క ఉద్దేశ్యములో సింహాసనమైనది. (ఆది 1:26-27)

డి. మానవులు పాలించుటకు నియమించబడినారు. (ఆది. 1:28-30; కీర్తన 8:3-8; హెబ్రీ 2:6-8) దేవుడు సృషి& యొక్క సృష్టికర్తగా పోషించేవాడిగా విమోచించే వాడిగా ప్రభువుగా ఉండును. (నిర్గమ 19:5; యోబు 37-41; కీర్తన 24:1-2; 95:3-5; 102-25; 115:15; 121:2; 124:8; 134:3; 146:6; యెషయా 37:16)

ఇ. ఆది 2:15లో సృష్టిలో మానవుని యొక్క బాధ్యత కనిపిస్తుంది. "సేద్యపరుచుటకును, కాచుటకును" (లేవి. 25:23; 1దిన 29:14)

2. దేవుడు సృష్టిని ప్రత్యేకముగా జంతువులను ప్రేమించుచున్నాడు.

ఎ. జంతువులను సరిగా చూచుటకు మోషే ధర్మశాస్త్రము

బి. లేవియాతాన్‌తో దేవుని ఆట (కీర్తన 104:26)

సి. దేవుడు జంతువుల పట్టించుకొనును (యెన 4:11

డి. ప్రకృతి యొక్క అంత్యకాలపు స్థితి (యెషయా 11:6-9; ప్రక 21-22)

3. ప్రకృతి కొద్దివరకు దేవుని మహిమపరుస్తుంది

ఎ. కీర్తన 19:1-6

బి. కీర్తన 29:1-9

సి. యోబు 37-41

4. ప్రకృతి ద్వార దేవుడు తన ప్రేమను మరియు నిబంధనకు గల విధేయతను చూపించుచున్నాడు.

ఎ. ద్వితి 27-28; 1రాజులు 17

బి. ప్రవక్తలద్వారా

బి. క్రొత్త నిబంధన

1. దేవుడు సృష్టి కర్తగా కనిపించును ఒకేఒక్క త్రియేక సృష్టికర్త కలదు (యెలోహీమ్ ఆది. 1:1; ఆత్మ ఆది 1:2; మరియు యేసు, క్రొ॥ని॥). అన్నియూ సృష్టింపబడినవి

ఎ. అపొ 17:24

బి. హీబ్రూ 11:3

సి. ప్రక 4:11

2. యేసు క్రీస్తు సృష్టి కారకుడు

ఎ. యెహాను 1:3, 10

బి. 1కొరి 8:6

సి. కొలస్సీ 1:16

డి. హీబ్రూ 1:2

3. యేసుక్రీస్తు తన వర్తమానములలో పరోక్షంగా సృష్టికొరకు దేవుని శ్రద్ధను గురించి మాట్లాడినాడు.

ఎ. మత్తయి 6:26, 28-30; ఆకాశ పక్షులు మరియు అడవి పువ్వులు

బి. మత్తయి 10:29; పిచ్చుకలు

4. సృష్టిలో దేవుని యొక్క జ్ఞానము కొరకు మానవులందరు బాద్యులు అని పౌలు ధృడపరుస్తున్నాడు. (సహజ ప్రత్యక్షత, రోమా 1:19-20; ప్రక 21-22)

3. ముగింపు

ఎ. మనము ప్రకృతి క్రమమునకు బాద్యులము

బి. పతనమైన మానవులు దేవుని యొక్క ఇతర మంచి బహుమానములవలే దేవుని యొక్క సృష్టి యొక్క బహుమానమును కూడా దుర్వినియోగ పరచినారు.

సి. ప్రస్తుత ప్రకృతి క్రమము అశాశ్వతమైనది ఇది గతించిపోవును (2పేతురు 3:7) దేవుడు మన లోకమును ఒక చారిత్రాత్మక ఘట్టమునకు మార్చుచున్నాడు. పాపము తన పని చేయును కాని దేవుడు దీనికి హద్దులను నియమించెను. సృష్టి విమోచింపబడును (రోమా 8:18-25)

▣ **"ప్రత్యక్షత కొరకు"** ఈ పదము యొక్క అర్ధము చూపించుటకొరకు "తెరను వెనుకకు లాగటం" అదేవిధంగా క్రొ॥ని॥ యొక్క చివరి పుస్తకం యొక్క పేరు, "అపొకాలిప్స్" రెండవ రాకడ ఒక ప్రత్యక్షత లేక రాకడగా తరుచుగా సూచించబడుతుంది. (1కొరి 1:7-8; 1 పేతురు 17, 13)

▣ **"దేవుని కుమారులు"** క్రైస్తవులను వర్ణించుట కొరకు సాధారణంగా వాడబడే కుటుంబసంబంధ ఉపమానము (8:14, 16) ఇది దేవుడు తండ్రిగా మరియు యేసు ఆయన యొక్క సాటిలేని కుమారునిగా మాట్లాడుతుంది. (యోహాను 1:18; 3:16-18; హెబ్రీ 1:2; 3:6; 5:8; 7:28; 1 యోహాను 4:9)

పాత నిబంధనలతో ఇశ్రాయేలు దేవుని కుమారుడు (హోషేయా 11:1); అదేవిధ:గారాజు దేవుని కుమారుడుగా (2సమూ. 7) సూచించబడినది. ఈ అంశము మొదట క్రొ॥ని॥లో మత్తయి 5:9లో ప్రస్తావించబడింది. (యోహాను 1:12, 2కొరి 6:18; గలతీ 3:20; 1యోహాను 3:1, 10; ప్రకటన 21:7)

**8:20**

**NASB, NKJV, NRSV "సృష్టి నాశనమునకు లోనయిన"**

**TEV "సృష్టి విలువలేనిదిగా శిక్షింపబడినప్పుడు"**

**JB "సృష్టి యొక్క ఉద్దేశ్యము సాధించుటలో విఫలమగులలో సృష్టి వైపు నుండి ఏతప్పిదంలేదు"**

ఇది "వ్యర్ధంగా"అనువదించబడవచ్చు. గ్రీకు బైబిల్‌లో ఇది వేర్వేరు రీతులుగా ఉపయోగించబడినది – అర్ధము లేనిదిగా, విలువలేనిది, ఉపయోగంలేనిది, అబద్దదేవుడులు (విగ్రహాలు) మరియు శూన్యంగా తెలుపబడింది. దేవుడు తలంచిన ఉద్దేశ్యం విషయంలో సృష్టి అంతయూ ఉపయోగం లేనిదిగా మారిపోయినది (ఆది 3:17-19), కాని దేవుడు ఒక దినమున పతనము యొక్క శాపమునంతటిని తొలగిస్తాడు (ప్రకటన 22:3) ఇది దేవుడు ఆశించిన లోకము కాదు !

▣ **"నిరీక్షణ కలదై, దానినిలో పరచిన వాని మూలముగా"** ఈ క్రియ ఆరిస్ట్‌పాసిల్ మరియు స్పష్టంగా దేవునిని సూచిస్తుంది (......) దేవుడు భౌతిక సృష్టిని వ్యర్ధముగా చేసినాడు!

1. మానవుని తిరుగుబాటు వలన

2. మానవుని ఆయన వైపునకు త్రిప్పుకొనుటకు కొరకు (ద్వితి 27-29)

ఈ ఉద్దేశ్య పూర్వకమైన నాశనం కొంతకాలము మట్టుకే విమో,ఇంపబడిన మానవులకు భౌతిక భవిష్యత్ (శరీరము మరియు ప్రపంచము) దేవునికి ఆదాము యొక్క తిరుగుబాటు ముందు తెలుసు దేవుడే దీనిని అనుమతించి పతన లోకములో పడిపోయిన మానవునితో కలిసి పనిచేయుటకు ఎన్నుకొన్నాడు. ఈ ప్రపంచము ఏవిధ:గా ఉండాలని దేవుడు తలంచాడో అలాంటికాదు. ఒకరోజు ఉండేడి ఇలాంటి ప్రపంయము కాదు (2పేతురు 3:10; ప్రకటన 21:1-3) "నిరీక్షణ" 5:2లోని

**8:21 "సృష్టి, నాశనమునకు లోనయిన దాస్యములో నుండి విడిపింపబడి"** ప్రకృతి నిత్యత్వములో ఒక భాగము (యెషయా 11:6-10) తిరిగి సృష్టింపబడిన భూమికి పరలోకము తిరిగివస్తుంది. (మత్తయి 5:18; 24-35; 2పేతు 3:10; ప్రకటన 21:1) భవిష్యత్ ఏదేను యొక్క పరమానందముగా ఉంటుంది. దేవునికి మనుష్యునికి మధ్య సహవాసము, వ్యక్తికిని వ్యక్తికి, మానవునికి జంతువులకి, మానవునికి, భూమికిని మధ్య సహవాసము బైబిల్ దేవునితో మానవునితో, మరియు జంతువులతో సహవాసమలోను మరియు పూర్వ ఐక్యతలోని వన అమరికి (ఆది 1-2)తో ప్రారంభమై మరియు ఇదే రీతిలో ముగియుతుంది. (ప్రకటన 21-22)

- **"దేవుని పిల్లలు పొందబోవు మహిమగల స్వాతంత్ర్యము పొందుదురను"** 14వ వచనంలో విశ్వాసులు" దేవుని కుమారులుగా; 16వ వచనంలో "దేవుని పిల్లలుగా"; మరియు 17వ వచనంలో "దేవుని వారసులు" అని పిలువబడుతున్నారు. 18వ వచనంలోని అంత్యకాల సంబంధమైన మహిమ విశ్వాసులు ప్రత్యక్షమైనది ఇప్పుడు 19వ వచనంలో సృష్టి దేవుని పిల్లలు ప్రత్యక్షం కొరకు ఎదురుచూస్తున్నది ఎందుకంటే అది వారి అంత్యకాల మహిమను పంచుకుంటుంది. (21వ) ఈ సృష్టితిరిగి నెలకొల్పబడటం మరియు ప్రత్యేకంగా మానవులు సృష్టియొక్క అసలైన ఉద్దేశ్యమును నెరవేర్చబడుటకు అనుమతించెదరు మానవుడు దేవుని పోలికలో సృష్టింపబడి సన్నిహిత సంబంధము కొరకు చేయబడ్డాడు.

**8:22 "సృష్టి యావత్తు మూలుగుచు"** ఇది మరియొక పౌలు యొక్క సన్ మిశ్రిత పదము "కలిసి మూలుగుతో" ఆయన అనేకమైన వాటిని కలిపి ఉండవచ్చు. పౌలు యిర్మియా 12:4, 11) ద్వితి 27-29)ను ఉపమానించవచ్చు. అక్కడ ఇశ్రాయేలు భూమి మానవుని పాపము వలన అరణ్యంగా మార్చబడినందుకు మూలుగుచున్నది.

- **"ప్రసవ వేదన పడుచున్నది"** యూదుల వర్గములలో ఈ అంశము "నూతన యుగము యొక్క ప్రసవవేదన"గా పిలుచుదురు" (మార్కు 13:8) నీతియొక్క నూతన దినము యొక్క ఉదయము సమస్యలు లేనిదిగా ఉంటుంది. పతనలోకము యొక్క నైతిక మరియు ఆత్మీయ స్థితులు ఇంకాను క్షీణిస్తాయి. (2థెస్స 2:1-12; అదేవిధంగా ఏడుముద్రలు, బూరధ్వనులు, పాత్రలు ప్రకటన 5-18)

  ఈ సందర్భంలో మూడు "మూలుగులు"కలవు (1) సృష్టి (22వ); (2) విశ్వాసులు (23వ); (3) విజ్ఞాపన కర్తగా ఆత్మ (26వ) ఇవి అన్నియూ ఆది.3 వలననే (16వ వచనం నుండి ఈ రూపక అలంకారం వచ్చినది.

**8:23 "మనము....మన.....మనలో"** ఈ సర్వనామములు వక్కానింపబడుటకొరకు మరియు పుపరావృతమయమైనది.

- **"ఆత్మ యొక్క ప్రథమ ఫలముల"** కొరకు పదము అదునాతన గ్రీకులో "ఒక వివాహపు ఉంగరము" కొరకు వాడబడినది. ఇది 2కొరి 1:22లో ఆత్మ ముద్రకు; మరియు 2కొరి 5:5; మరియు ఎఫెసి 1:14 "ఆత్మవిజ్ఞప్తి"కి సాదృశ్యముగా వాడబడినది.

  పాత నిబంధనలోని ప్రథమ ఫలములు రానైయున్న కోత కొరకైన వాగ్దానం అవి కోత అంతటి మీద దేవుని యాజమాన్యతను గురుతుగా ఉన్నవి. యేసు క్రీస్తు పునరుత్థానుడై ప్రథమ ఫలంగా ఉండి, ఊతన యుగమునకు ఆత్మ ప్రథమ ఫలమైఉన్నది. (1కొరి 15:20) విశ్వాసులు, వారిలో నివసించుచున్న ఆత్మవలన, పిల్లలవలె పరలోక ఆనందమును అనుభవించుచున్నారు. ఇది యూదులు కొరకు రెండు యుగముల యొక్క "అప్పటికే" కాని "ఇంకా కాదు" అనే తన్యత విశ్వాసులు పరలోక పౌరులు మరయు భూమి మీద నివసించే వారు.

- **"మనలో మనము మూలుగుచున్నాము"** ఇది "ఇప్పుడే" మరియు "ఇంకా లేదు" అనే తన్యతను సూచిస్తుంది. దేవుని రాజ్యము ఇప్పుడే ఉండి కాని అంతమవ్వలేదు. విశ్వాసులు పునరుత్థాన జీవితమును కలిగినవారు, అయినా అందరునూ భౌతికంగా చనిపోవుదురు. (2కొరి. 5:2-4) మనము రక్షింపబడని వారము అయినా మనము పాపము ఇంకనూ చేయుదురు (రోమా. 7)

- **"దత్త పుత్రత్వము కొరకు కనిపెట్టుచు"** దత్తత అనేది రక్షణను వివరించుటకు ఉపయోగించే పౌలు అభిమాన కుటుంబ సంబంధ ఉపమానం (15వ) రక్షణ అనేది ఒక నిర్ణయంతో, మారుమనస్సు మరియు విశ్వాసముతో ప్రారంభమై, క్రీస్తు వంటి సారూప్యంలోనికి వృద్ధిచెందుతుంది. పునరుత్థానము దినము వరకు విశ్వాసులు సంపూర్తిగా రక్షింపబడరు. (30వ & 1యోహాను 3:2)

  గ్రీకు ప్రతులలో (....... మరియు కొన్ని పాత లాటిన్ వెర్షన్స్‌లలోనూ) ఈ "దత్తత" అనేది తొలగించబడినది అదేవిధంగా ..... కొన్ని లాటిన్, వల్గేట్, సిరియక్, కొప్టిక్ మరియు అర్మేనియన్ వెర్షన్స్‌లో చేర్చబడింది. ది .... దీనిని చేర్చుటకు "ఎ" (నిశ్చయం) అని రేటింగ్‌ను ఇచ్చారు.

- **"దేహము యొక్క విమోచనము కొరకు"** ఈపద అర్థము "తిరిగి కొనుట" ఈ అంశము పాత నిబంధనలలో ఒక బంధువుచే ఒకడు భానిసత్వము నుండి విడిపించుటకొరకు వాడబడింది. ఇది దేవుడు పతనమైన మానవుని పాపపు భానిసత్వము నుండి విడిపించుటను ఉపమానరీతిగా వాడబడింది. అవతార కుమారుని పాపరహిత జీవితం చెల్లించబడటం ద్వారా వెలచెల్లించబడింది.

ప్రత్యేక అంశం 3:24లో చూడండి

క్రైస్తవ్యం, యూదామతం వలె (యోబు 14:14-15; 19:25-26; దాని 12:2) విశ్వాసులు నిత్యత్వంలో భౌతిక (మానవుల వలె ఉండుటం కానవసరలేదు) శరీరమును కల్గియుంటారని విశ్వసిస్తున్నారు. విశ్వాసుల ఆత్మీయ శరీరము నూతన యుగములోని జీవితము కొరకు, మరియు దేవునితో సన్నిహిత సంబంధం కొరకు సిద్ధపర్చబడి ఉంటాయి.

**8:24 "నిరీక్షణ కలిగినవారమై రక్షింపబడితిమి"** ఇది ఒక ఆరిస్ట్ పాసివ్ ఇండికేటివ్. 23వ వచనంలో మన భవిష్యత్ రక్షణను సూచించినట్లు, 24వ వచనం ఆత్మ కారకము ద్వారి మన వర్తమాన రక్షణను సూచిస్తుంది. రక్షణను వివరించుటకు క్రొ॥ని॥ వేర్వేరు క్రియకాలములను ఉపయోగించినది (1) ఆరిస్ట్, అపో 15:11 (రోమా 8:24; 2తిమో 1:9; తీతుకు 3:5; మరియు రోమా 13:11 ఆరిస్ట్‌ను భవిష్యత్ కాలముతో కలిపినది); (2) గతంలో సంపూర్తి అయినది, ఎఫెసి 2:5,8; (3) భూతకాలం, 1కొరి 1:18; 15:2; 2కొరి 2:15; 1పేతు 3:21; 4:18; మరియు (4) భవిష్యత్ కాలం (క్రియలలో), రోమా 5:9,10; 1కొరి 3:15; ఫిలి 1:28; 1థెస్స 5:8-9; హెబ్రీ 1:14; 9:28; కాబట్టి రక్షణ ఒక ప్రారంభ విశ్వాస నిర్ణయముతో ప్రారంభమై జీవిత విధాన విశ్వాసమును కలిగి ఒక దినమందు దృష్టిలోనే సంపూర్తి అవుతుంది (1 యోహ 3:2)

**8:25 "నిరీక్షణ"** పౌలు ఈ పదములను వేర్వేరు రీతులలో ఉపయోగించినప్పటికి సంబంధము కల్గిన భావనలతో ఉపయోగించినాడు. తరుచుగా ఇది విశ్వాసుల విశ్వాసము యొక్క అంతముతో కలిసి వస్తుంది. ఇది మహిమగా, నిత్యజీవముగా, సంపూర్ణ రక్షణగా, రెండవ రాకడగా వ్యక్తీకరించబడినది. సమాప్తం నిశ్చయం, కాని సమయపాలన అనేది భవిష్యత్ సంబంధమైనది మరియు తెలియ నిధి ఇది తరుచుగా "విశ్వాసం" మరియు "ప్రేమ"తో కలిసి కనిపిస్తుంది. (1కొరి 13:13; 1థెస్స 1:3; 2థెస్స 2:16)

పౌలు యొక్క వాడుక పదాలు :

1. రెండవ రాకడ, గలతీ 5:5; ఎఫెసి 1:18; 4:4; తీతుకు 2:13
2. యేసు మన నిరీక్షణ, 1 తిమో 1:1
3. విశ్వాసి దేవునికి సమర్పించబడుటకు, కొలస్సి 1:22-23; 1థెస్స‘ 2:19
4. పరలోకముపైన నిరీక్షణ, కొలస్సి 1:5
5. సువార్త యందు నమ్మకం, కొలస్సి 1:23; 1థెస్స 2:19
6. సంపూర్ణ రక్షణ, కొలస్సి 1:5; 1థెస్స 4:13; 5:8
7. దేవుని మహిమ, రోమా 5:2; 2కొరి 3:7-12; కొలస్సి 1:27
8. యేసుక్రీస్తు ద్వారా అన్యజనుల రక్షణ, కొలస్సి 1:27
9. రక్షణ నిశ్చయత, 1థెస్స 5:8
10. నిత్యజీవము, తీతుకు 1:2; 3:7
11. క్రైస్తవ పరిపక్వత యొక్క ఫలితము, రోమా 5:2-5
12. సర్వసృష్టి యొక్క విమోచనం, రోమా 8:20-22
13. దత్తత యొక్క సమాప్తం, రోమా 8:23-25
14. దేవుని కొరకు బిరుదు, రోమా 13:13
15. విశ్వాసుల కొరకైన పౌలు కోరిక, 2కోరి 1:7
16. క్రొ॥ని॥ విశ్వాసులకు పా॥ని॥ మార్గదర్శిణిగా, రోమా 15:4

▣ **"ఓపికతో"** ఈపదం హుపోయోనో 5:3లో మరియు 15:4-5లో కూడా వాడబడినది. విశ్వాసుల రక్షణ పరిపక్వత విధానంలో ఉండి ఒక దినము సంపూర్తి అవుతుంది. ఓపిక (ప్రకటన 2:8, 11, 17, 26; 3:5, 12, 21; 21:7) అనేది "ఒక్కసారి రక్షింపబడితే, నిరంతరం రక్షింపబడినట్లే" అనే బాప్టిస్ట్ యొక్క అధిక వక్కానింపుకు బైబిల్ సమతూకం అవసరం అనేక బైబిల్ సత్యాలు ద్వంద్వ రీతిలో తన్యత నిండిన జతలుగా వ్యక్తం చేయబడినవి.

**ప్రత్యేక అంశం : సహనం యొక్క అవసరత**

క్రైస్తవ జీవితమునక సంబంధించిన బైబిల్ సిద్ధాంతములను వివరించడము కష్టతరము అవిఅన్నిమూ తూర్పు ద్వంద్వ జతలుగా ప్రదర్శింపబడినవి ఈ జతలు విభేదించినట్లుగా కనిపించినప్పటికినీ అవి రెండునూ బైబిల్ సంబంధమైనవి. ప్రాశ్చాత క్రైస్తవులు ఒక సత్యమును ఎంచుకొని వేరొక దానిని నిర్లక్ష్యము చేయడము అలవాటు చేసుకున్నారు.

1. రక్షణ క్రీస్తును నమ్ముటకు ఒక ప్రారంభ నిర్ణయమా లేక జీవిత కాలపు శిష్యరికమునకు సమర్పణమా ?
2. రక్షణ సార్వభౌమిక దేవుని నుండి ఎన్నిక వలన కృపనుండి వచ్చినదా లేక మానవుల యొక్క విశ్వాసము మరియు మారు మనస్సు ద్వారా దైవిక బహుమానమునకు స్పందించుట ద్వారా ?
3. రక్షణ ఒకేసారి స్వీకరించబడి, పోగొట్టుకొనుటకు అసాధ్యమా లేక జాగ్రత్తగా దానిలో కొనసాగవలసిన అవసరత ఉన్నదా ?

సహనము యొక్క అంశము సంఘ చరిత్ర అంతటి ద్వారా కొనసాగుచూఉన్నది. ఈ సమస్య వివాదపరమైన కొన్ని క్రొ॥ని॥ వాక్య బాగముల వలన ప్రారంభమైనది.

1. నమ్మికపైన వాక్య బాగములు
   - ఎ. యేసుని యొక్క మాట (యోహాను 6:37; 10:28-29)
   - బి. పౌలు యొక్క మాటలు (రోమా 8:35-39; ఎఫెసి 1:13; 2:5,8-9;ఫిలి1:6;2:13;2థెస్స3:3;2తిమో1:12; 4:18)
   - సి. పేతురు యొక్క మాటలు (1పేతురు 1:4-5)
2. సహనము యొక్క అవసరతను తెలిపే వాక్యములు
   - ఎ. యేసుని యొక్క మాటలు (మత్తయి 10:22; 13:1-9, 24-30; 24:13; మార్కు 13:13; యోహాను 8:31; 15:4-10; ప్రక 2:7, 17, 20; 3:5,12,21)
   - బి. పౌలు యొక్క మాటలు రోమా (11:22; 1కొరి 15:2; 2కొరి 13:5; గలతీ 1:6; 3:4; 5:4; 6:9; ఫిలి 2:12; 3:18-20; కొలస్సి 1:23)
   - సి. హెబ్రీ గ్రంథకర్త యొక్క మాటలు (2:1; 3:6, 14; 4:14; 6:11)
   - డి. యోహాను యొక్క మాటలు (1యోహాను 2:6; 2యోహాను 9)
   - ఇ. తండ్రి యొక్క మాటలు (ప్రక 21:7)

బైబిల్ పరమైన రక్షణ సార్వభౌమిక త్రియేక దేవుని ప్రేమ, కనికరము మరియు దయ నుండి వచ్చును పరిశుద్ధాత్మ ఆకర్షణ లేకుండా ఏ వ్యక్తియు రక్షింపబడలేదు (యోహాను 6:44, 65) దేవుడు ముందు కార్యమును సిద్ధపరిచి మానవుల నుండి విశ్వాసమును మరియు మారుమనస్సును అడుగుచున్నాడు. ఇది ప్రారంభించి దానిలో కొనసాగబడాలి. దేవుడు మానవునితో నిబంధనా సంబంధములో పనిచేయును దానిలో బాధ్యతలు మరియు ధన్యతలు కూడా కలవు.

రక్షణ మానవులందరికీ ఇవ్వబడింది. యేసు యొక్క మరణము పతన సృష్టి యొక్క పాపపు సమస్యతో వ్యవహరించింది. దేవుడే ఒక మార్గమును ఏర్పరచి ఆయన పోలికలో సృష్టింపబడిన మానవులందరూ యేసులో దేవుని యొక్క ప్రేమను మరియు ఏర్పాటునకు స్పందించాలని కోరుచున్నాడు.

నాన్‌కాల్వినిస్టిక్ దృక్పధము నుండి ఈ అంశమును గురించి చదువదలచినట్లయితే

1. డేల్‌ముడి, ద వర్డ్ ఆఫ్ ట్రూత్, ఎర్డ్మెన్స్ 1981 (348-365 పే.)
2. హోవార్డ్ మార్షల్, కెప్ట్‌బై ద పవర్ ఆఫ్ గాడ్, బేదని ఫెలోషిప్ 1969
3. రోబోట్ శాంక్, లైఫ్ ఇన్ ద సన్, వెస్ట్ కోర్ట్ 1961

ఈ విషయములో బైబిల్ రెండు వేర్వేరు సమస్యల గురించి మాట్లాడుచున్నది. (1) నమ్మికను ఒక ఉత్తరువుగా తీసుకుని ఫలములేని స్వార్థపూరిత జీవితమును జీవించడం. (2) పరిచర్యతో మరియు వ్యక్తిగత పాపముతో ఇబ్బందులు పడుతున్న వారికి ప్రోత్సాహాన్ని ఇచ్చుటకు. సమస్య ఏమిటంటే తప్పుడు వర్గములు వారు తప్పుడు వర్తమానములను తీసుకొని పరిమితమైన బైబిల్ వాక్య భాగముల పైన వేదాంత వ్యవస్థను నిర్మించుచున్నారు. కొంతమంది క్రైస్తవులు నిశ్చయత యొక్క వర్తమానము యొక్క అవసరతను కలిగియున్నారు. మరికొందరు కఠిన హెచ్చరికల అవసరతలో ఉన్నారు. నీవు ఏ వర్గములో ఉన్నావు ?

**NASB (నవీన) వాక్యము 8:26-27**

**26. అటువలె ఆత్మీయ మ బలహీనతను చూచి సహాయము చేయుచున్నాడు. ఏలయనగా మనము యుక్తముగా ఏలాగు ప్రార్ధన చేయవలెనో మనకు తెలియదు గాని, ఉచ్చరింప శక్యముకాని మూలుగులతో ఆ ఆత్మతానే మన పక్షముగా విజ్ఞపనము చేయుచున్నాడు. 27. మరియు హృదయములను పరిశోధించువాడు ఆత్మ యొక్క మనస్సు ఏదో యెరుగును; ఏలయనగా ఆయన దేవుని చిత్త ప్రకారము పరిశుద్ధులకొరకు విజ్ఞపము చేయుచున్నాడు.**

**8:26 "అటువలె"** ఇది 23-25లోని మూలుగుట మరియు నిరీక్షించుట" అనే ఆత్మ విజ్ఞాపణ పరిచర్యను కలుపుతుంది.

- **"ఆత్మయు సహాయము చేయుచున్నాడు"** ఇది భూత తటస్త సూచిక వాక్యం. ఇది సిన్‌లో రెండింతల మిశ్రిత పదము (28వ.) మరియు ఏంటి. ఇది "పట్టుకొని తీసుకొనుట" అనే శ్రేష్ట అను వాదము. ఈ పదము ఇక్కడ మరియు లూకా 10:40లో మాత్రమే కనిపిస్తుంది. త్రిత్వం అంతా విశ్వాసుల కొరకే మానవుల తరపున చనిపోవుటకు తండ్రి కుమారుని పంపెను, మరియు అతడు ఇప్పుడు కూడా విజ్ఞాపనం చేయుచుండెను. (34వ; 1యోహాను 2:1) పతనమైన మానవుని ఆత్మ క్రీస్తు యొద్దకు నడిపించి వానిలో క్రీస్తు సారూప్యతను కలిగిస్తుంది.

  యోహాను 16:8-15) ఎలాగైననూ "సహాయము" అన్న పదము "ఒకనితో తీఁసుకొని పట్టుకొనుట" అనేది ఆత్మ సహాయాలలో (విజ్ఞాపణలో) విశ్వాసి కూడా భాగం కలదు అని సూచిస్తుంది.

- **"ఉచ్చరింప శక్యముకాని మూలుగులతో ఆ ఆత్మతానే మనపక్షమున విజ్ఞానఫ చేయుచున్నాడు"** విశ్వాసులు వారి పాప స్వభావంతో మూలుగుచునుంటే, ఆత్మవారి కొరకు విజ్ఞాపణలో మూలుగుచున్నది. విమోచింపబడిన వారిలో ఆత్మ వారికొరకు ప్రార్థిస్తుంది. అదేవిధంగా తండ్రి కుడి పార్శ్వమున యేసు కూడా వారి కిరకు విజ్ఞాపణము చేయుచున్నాడు (27, 34; హెబ్రీ 9:24; 1 యోహాను 2:1) ఈ విజ్ఞాపణ ప్రార్థించుటకు విశ్వాసులను బలపరుస్తుంది. (15వ గలతీ 4:6) ఈ వాక్యభాగ సందర్భము అన్యబాషల ఆత్మీవరము కాదుగాని, ఆత్మవిశ్వాసుల పక్షమున తండ్రికి విజ్ఞాపణము చేయుచున్నాడు.

**"విజ్ఞాపణ చేయు" ప్రత్యేక అంశం : పౌలు యొక్క హుపర్ మిళిత పదములు 1:30లో చూడండి**

**8:27 "హృదయములను పరిశోదించువాడు"** ఇది పాత నిబంధనలో పునరావృత అంశము (1సమూ. 2:7; 16:7; 1రాజులు 8:39; 1 దిన. 28:9; 2 దిన. 6:30; కీర్తన 7:9; 44:21; సామె 15:11; 20:27; 21:2; యిర్మియా 11:20; 17:9-10; 20:12; లూకా 16:15; అపో 1:24; 15:8) దేవుడు నిజంగా మనలను ఎరుగును అయినా మనలను ఆయన ప్రేమించును (కీర్తన 139)

- **"ఆయన పరిశుద్దుల కొరకు విజ్ఞాపనము చేయుచున్నాడు"** యోహాను 16:2-15లో ఆత్మ యొక్క విధులు స్పష్టంగా చెప్పబడింది. వాటిలో విజ్ఞాపనము ఒకటి "పరిశుద్దులు" అన్న పదం ఎల్లప్పుడు బహువచనమైయుంటుంది. ఇది ఫిలిప్పి 4:21లో తప్ప, అక్కడ అది విశ్వాసులందరిని గూర్చి చెప్పబడింది. క్రైస్తవులు దేవుని కుటుంబ సభ్యులు, క్రీస్తు శరీరము, వ్యక్తిగత విశ్వాసుల ద్వారా కట్టబడుతున్న నూతన ఆలయము ఇది ప్రాశ్చాత్య (అమెరికన్) వ్యక్తిగత వాదమునకు బైబిల్ సమతూకము అవసరం

**ప్రత్యేక అంశం : పరిశుద్దులు 1:7లో చూడండి**

**NASB (నవీన)వాక్యం : 8:28-30**

**28. దేవుని ప్రేమించు వారికి, అనగా ఆయన సంకల్పము చొప్పున పిలువబడినవారికి, మేలుకలుగుటకై సమస్తమును సమకూడి జరుగుచున్నవని యెరుగుదుము. 29. ఎందుకనగా తన కుమారుడు అనేక సహోదరులలో జ్యేష్టుడగునట్లు, దేవుడెవరిని ముంఉ ఎరిగెనో, వారు తన కుమారునితో సారూప్యముగలవారవుటకు వారిని ముందుగా నిర్ణయించెను. 30. మరియు ఎవరిని ముందుగా నిర్ణయించెనో వారిని పిలిచెను; ఎవరిని పిలిచెనో వారిని నీతిమంతులుగా తీర్చెను. ఎవరిని నీతిమంతులుగా తీర్చెనో వారిని మహిమపరచెను.**

**8:28 "సమస్తమును"** పురాతన గ్రీకు యునిషియల్ ప్రతులు ఎ మరియు బి "దేవుడే అన్నిటికి కారణము" అని కలిగియున్నది. పాపిరి ప్రతి పి46 "సమకూడి జరుగుటకు "దేవుడే"కర్త అని కలిగియున్నది. 28వ.లోని వ్యాకరణరీతిగా కూడా "ఆత్మ"యే కర్తగా (27వ మరియు ....) ఈ వచనం 17-18వ.ల క్రమలకు సంబంధించినదిగా కనిపిస్తుంది; మరియు 23వ॥లోని "మూలుగులు" కూడా దాని సంబంధమైనదే విశ్వాసికి సంబంధించి, అదృష్టం, కర్మ లేక దైవయోగము అనేవి లేవు.

- **"సమాకూడా మేలు కొరకు"** ఇది భూతకాలపు ఎక్టివ్ ఇండికేటివ్ ఇదికూడా"సిన్"తో మిశ్రమ పదమే (26వ.) కాబట్టి ఇది అక్షరార్ధముగా "మంచి కొరకు ఒకనితో ఒకటి కలిసి పనియేయుచునుండటం"య్ుదుష్ట మరియు శ్రమల లోకములో ఇది కష్టతరమైన అంశము (ఈ అంశము పైన రెండు మంచి పుస్తకములు, లెన్హమ్ & హన్నా వెట్‌హోల్ స్మిత్ యొక్క దా గుడ్‌నెస్ ఆఫ్‌గాడ్, మరియు దాక్రిష్టియన్స్ సీక్రేట్ ఆఫ్ హ్యాపీ లైఫ్) ఇక్కడ "మేలు" 29వ. లోని "తన కుమారునితో సారూప్యము గలవారువుటకు ఆరోగ్యము కాదు, గాని ప్రతి విశ్వాసి నిమిత్తము దేవుని చెప్ప శక్యముకాని ప్రణాళిక, క్రీస్తు సారూప్యము.

- **"దేవుని ప్రేమించువారికి, అనగా ఆయన సంకల్పము చొప్పున పిలువబడినవారికి"** ఇవి రెండునూ భూతకాలపు ఎక్టివ్ పార్టిసిపల్ వచనాలే ఇవి రెండునూ విశ్వాసుల పరిస్థితులకు వేరుగా ఒక ప్రతికూల వెలుగులో జీవితమును చూసి కొనసాగుటకు విశ్వాసిన అనుతించును (15వ.) మానవ స్వేచ్ఛ యొక్క ద్వంద్వ నిబంధన పరమైన దృక్పదములు ("ప్రేమ") మరియు దేవుని సార్వభౌమత్వము ("పిలువబడిన") ను గమనించండి.

**8:29-30** ఈ వచనములోని క్రియలు అన్నియూ ఆరిస్ట్ ఎక్టివ్ ఇండికేటివ్స్ అని కలమునకు మందు ప్రారంభమైఒక కాలములేని గోలుసును రూపొందించినవి. మనము దేవునికి తెలుసు, దేవుడు మన కొరకు ఉన్నాడు, మనము ఆయనతో ఉండాలని ఆశిస్తున్నాడు. ఇది వ్యక్తిగతమైది కాదుగాని సమైఖ్య సందర్భము. మహిమ పర్చబడటము అనేది భవిష్యత్ కార్యము, కాని ఈ సందర్భములో సంపూర్తి చేయబడిన కార్యముగా చెప్పబడింది.

**8:29 "ముందు ఎరిగెనో"** పౌలు ఈ పదమును రెండుసార్లు ఇక్కడ మరియు 11:2లో ఉపయోగించినాడు. ఇశ్రాయేలు గురించి ముందునుండె దేవునికి ఉన్న నిబంధన ప్రేమ ఇది. "ఎరుగుట" అన్న పదము హీబ్రూలో సన్నిహితమునకు, వ్యక్తిగత సంబంధమునకు సంబందించినదిగా ఉంది. (ఆది 4:1; యిర్మీయా 1:5) అది ఇక్కడ కొన్ని సంఘటనల యొక్క గొలుసుగా చేర్చబడింది. (29-30 వ॥లు) ఈ పదము పూర్వనిర్ధారణతో ముడిపడిఉంది. దేవుని యొక్క పూర్వజ్ఞానము ఎన్నికకు ఆధారము కాదు. కాబట్టి అలా అయినట్టయితే ఎన్నిక పతనమైన భవిష్యత్ స్పందనపై ఆధారపడుతుంది. అది మానవుల కార్యమవుతుంది. ఈపదము అపొ 26:5; 1 పేతురు 1:2, 20 మరియు 2పేతురు 3:7లో కూడా కనిపిస్తుంది.

- **"ముందుగా నిర్ణయించెను"**

- **"ముందే ఎరుగుట"** (ప్రొగినొస్కొ) లేక "ముందు నిర్ణయం" (ప్రూరిజో) "ముందు అనే విభక్తితోటి మిశ్రిత పదములు కాబట్టి అవి "ముందుగా తెలుసుకొని" "ముందు హద్దులను ఏర్పరుచు", లేక "ముందు గుర్తించు అని అనువదించబడాలి.

పూర్వనిర్దారణ / నిర్ణ సిద్దాతంమునకు, రోమా 8:28-30; ఎఫెసి 1:3-14 మరియు రోమా 9. ఖచ్చితమైప వాక్యబాగములు ఈ వాక్యభాగములన్నియూ దేవుడు సార్వభౌముడు అని నొక్కి పలుకుతున్నవి. దేవుడు సమస్త విషయాలను మానవ చిత్రను కూడా తన ఆదీనములో ఉంచుకొనుచున్నాడు. సరిఅయిన కాలములోనే కార్యరూపం దాల్చిన విమోచన ప్రణాళిక నిర్దేశించబడింది, అయిననూ ఈ ప్రణాళిక స్వతంత్రమైనదిలేక కొంతమందికి సంబందించినదికాదు. ఇది కేవలము దేవుని సార్వభౌమత్వము మరియు పూర్వజ్ఞానము పైన మాత్రమే ఆధారపడకుండా దేవుని మార్పు చెందని ప్రేమ, కనికరము మరియు కృపలపైన ఆధారపడి ఉంది.)

ఈ అద్భుత సత్యమునకు రంగులద్దే పాశ్చాత్య (అమెరికన్) స్వకీయ వాదము లేక మన సువార్త ఆశల విషయములో జాగ్రత్తపడాలి. అదేవిధంగా అగస్టిన్ మరియు పెలెగియస్ లేక కాల్వినిసమ్ మరియు అర్మినియసమ్‌ల వేదాంత వివాదములలో ధృవీకరణం చెందుకుండా జాగ్రత్త పడాలి.

పూర్వనిర్దాణం, దేవుని ప్రేమను, కృపను మరియు కనికరమును పరిమితలము చేయుటకు కొంతమందిని సువార్తనుండి తొలగించుట కైనదికాదు. ఇది విశ్వాసుల దృక్పథమును బట్టి వారిని బలపరుచుటకొరకు ఉద్దేశించబడినది. అదేవుడు మానవులు అందరికొరకు ఉన్నాడు. (యోహాను 3:16; 1తిమో 2:4; 2 పేతురు 3:9) దేవుడు అన్నిటిని తన ఆధీనంలో ఉంచుకొనుచున్నాడు ఎవరులేక ఏమిటి, ఆయన ప్రేమ నుండి మనలను వేరుపరిచేది. (రోమా 8:31-39)? పూర్వ నిర్ధారణము, రెండింటిలో నుండి ఒక్కటిని రూపొందిస్తుంది. దేవుడు చరిత్ర అంతటిని ప్రస్తుతంగానే చూస్తున్నాడు.మానవులు కాలమునకు కట్టబడిఉన్నారు. మన దృష్టిమరియు మానసిక సామర్ధ్యాలు స్వేచ్ఛ చిత్తము మద్య ఎటువంటి విబేధము లేదు. ఇది నిబంధన ఏర్పాటు ద్వంద్వ తన్యతలలో ఇవ్వబడిన మరియొక బైబిల్ సత్యము బైబిల్ సిద్దాంతములు వేర్వేరు దృక్పదముల నుండి చెప్పబడినది. అవితరచూ విరోధ భావంగా కనిపిస్తాయి. సత్యము కనిపిస్తున్న వ్యతిరేక జతల మద్య ఉన్న తన్యత ఒక్క సత్యమును తీసుకొని తన్యతను మనం తొలగించకూడదు. ఎ బైబిల్ సత్యమును వేరుచేసి దానియొక్క వర్గముగా చేయకూడదు.

అదేవిధంగా, పూర్వనిర్ధారణం యొక్క గురి కేవలము చనిపోయినప్పుడు పరలోకమునకు వెళ్లటమే కాదుగాని, ఇప్పుడు క్రీస్తు మనిము "పరిశుద్ధులుగా, నిందారహితులు"గా ఉండుటకు పిలువబడ్డాము దేవుడు మనలను మార్చటం ఎంచుకొని, మార్చబడిన మన జీవితములును చఊచీసి క్రీస్తులో విశ్వాసంతో ఆయనకు స్పందించాలని కోరిక కలిగియున్నాడు. పూర్వనిర్ధారణము ఒక వ్యక్తిగత ధన్యత కాదుగాని ఒక నిబంధన భాద్యత.

- **"తన కుమారునితో సారూప్యముగల వారగుటకు"** ఇది ఈ వాక్యభాగములోని విశాల సత్యము. ఇది క్రైస్తవ్యము యొక్క గురి (గలతీ 4:19; ఎఫెసి 4:13) పరిశుద్ధత అనేది ప్రతి విశ్వాసి కొరకైన దేవుని చిత్తము. దేవుని ఎన్నిక క్రీస్తు సారూప్యము కొరకు (ఎఫెసి 1:4) గాని ప్రత్యేక స్థానము కొరకు కాదు. సృష్టిలో మానవునికి ఇవ్వబడిన దేవుని పోలిక (ఆది 1:26; 5:1,3; 9:6) అనేది తిరిగి కలిగించబడాలి (కొలస్సి 3:10) 8:21లోని నోట్ మరియు ప్రత్యేక అంశం : 1:6 పిలువబడును చూడండి.

- **"అనేక సహోదరులలో జ్యేష్ఠుడగునట్టు"** కీర్తన 89:27లో "జ్యేష్ఠుడు" అనేది "మెస్సియ" కొరకైన బిరుదు పాత నిబంధనలలో జ్యేష్ఠుడు ఔన్నత్యమును మరియు ధన్యతను కలిగి ఉంటారు. కొలస్సి 1:15 వచనంలో సృష్టిలో యేసు యొక్క ఔన్నత్యమును మరియు కొలస్సి 1:18 మరియు ప్రకటన 1:5లో పునరుత్థానములో యేసుని ఔన్నత్యమును చూపుట కొరకు వాడబడినది. ఈ సందర్భంలో విశ్వాసులు ఆయన ద్వారా ఆయన యొక్క ఔన్నత్యములోనికి తీసుకురాబడినారు.

ఈ పదము యేసుని అవతారమును సూచించుట లేదుగాని, ఒక నూతన జాతి యొక్క శిరస్సుగా చెప్పబడుతుంది (5:12-21), మన విశ్వాసమునందు ముందు ఉన్నవాడు, విశ్వాస ఇంటికి దేవుని ఆశీర్వాదములు తెచ్చే మార్గము.

**8:30 "మహిమ పరచెను"** దేవుడు బైబిలో తరచుగా "మహిమ" అన్న పదముచే వివరించబడెను. ఈ పదము వాణిజ్యముల పదము నుండి వచ్చినదై "బరువైనది" బంగారం వలె విలువైనదిగా సూచించబడినది 3:23లో ప్రత్యేక అంశం చూడండి. వేదాతపరంగా దేవుడు పతనమైన మానవులను కొన్ని మెట్టుల వరుసలో రక్షిస్తున్నాడు. (29-30) చివరిమెట్లు "మహిమ పర్చబడటము" ఇది విశ్వాసుల సంపూర్ణ రక్షణ ఇది పునరుత్థాన దినమందు వారికి ఆత్మీయ శరీరములు ఇవ్వబడినప్పుడు జరుగుతుంది. (1కొరి 15:50-58). అప్పుడు వారు త్రియేక దేవునితో మరియు ఒకరితో ఒకరూ ఐక్యపర్చబడతారు (1 థెస్స 4:13-18; 1యోహాను 3:2)

**NASB (నవీన) వాక్యము 8:31-39**

**31. ఇట్లుండగా ఏమందుము? దేవుడు మనపక్షముననుండగా మనకు విరోధియెవడు? 32 తన సొంతకుమారుని అనుగ్రహించుటకు వెనకతీయక మన అందరి కొరకు ఆయనను అప్పగించినవాడు ఆయనతో పాటు సమస్తమును మనకెందుకు అనుగ్రహింపడు. 33. దేవునిచేత ఏర్పరచబడిని వారిమీద నేరము మోపునాడెవడు 34. నీతిమంతులుగా తీర్చువాడు దేవుడే; శిక్ష విధంఉచువాడెవడు చనిపోయిన క్రీస్తుయేసే; అంతేకాదు, మృతులలో నుండి లేచినాడును దేవుని కుడి పార్శ్వమున ఉన్నవాడును మనకొరకు విజ్ఞాపనముకూడా చేయువాడును ఆయనే 35. క్రీస్తు ప్రేమనుండి మనలను ఎడబాపు వాడెవడు శ్రమయైనను బాధయైనను హింసయైనను కరవైనను వస్త్రహీనతయైనను ఉపద్రవమైనను ఖడ్గమైనను మనలను ఎడబాపునా 36. ఇందును గూర్చి వ్రాయబడినదేమనగా నిన్ను బట్టి దినమెల్ల మేము వధింపబడిన వారము వధకు సిద్ధమైన గొఱ్ఱెల మని మేము ఎంచబడినవారము. 37. అయినను మనలను ప్రేమించినవాని ద్వారా మనము వీటన్నిటిలో అత్యధిక విజయము పొందుచున్నాము. 38. మరణమైనను జీవమైనను ప్రధానులైనను ఉన్నవ వియైనను రాబోవునవియైనను అధికారులైనను ఎత్తయినను 39. లోతైనను సృష్టింపడిన మరియు ఏదైనను, మన ప్రభువైన క్రీస్తు యేసునందలి దేవుని ప్రేమనుండి మనలను ఎడబాప నేరవని రూఢిగా నమ్ముచున్నాను.**

**8:31 "ఇట్లుండగా ఏమందుము**? ఇది పౌలు యొక్క అభిమాన సాహిత్యరూపమైన డయాట్రైబ్ (3:5; 4:1; 6:1; 7:7; 9:14, 30) ఈ ప్రశ్న ముందుగా ఇవ్వబడిన సత్యములకు సంబందించినది. ఇది ఎంతగా వెనకకు సూచించబడుతుందో అనిశ్చయము. ఇది 3:21-31, లేక 8:1 లేక 8:18 లను సూచించవచ్చు. 8:1లోని "కాబట్టి" మరియు 8:18లోని సందర్భములోని వాడకను బట్టి ఈరెండింటికి అని ఊహించవచ్చు.

- **"ఉండగా"** ఇది మొదటి తరగతి షరతులతో కూడిన వాక్యమై, గ్రంథకర్త ఉద్దేశ్యం నుండి సత్యమైనది. పాపముతో మన పోరాటముల మధ్య దేవుడు మనతో ఉన్నాడు అన్నది ఆశ్చర్యభరితం.

- **"మనకు విరోధియెవడు" "ఎవరు"** అన్న సర్వనామము 33, 34 & 35వలో పునరావృతం అయినది. ఇది సాతానును సూచిస్తుంది. 31-30 నుండి ఈ వాక్య భాగము పాత నిబంధన ప్రవక్తల సాహిత్యసాంకేతికమై కోర్టుకేసును వినియోగిస్తున్నాడు. (మికా 1 &6) యెహవ్హాన ప్రజలను ఆత్మీయ వ్యభిచారమును బట్టి కోర్టునకు తీసుకువెళ్ళును. ఇది యెషయా 50:8-9నకు మాదిరి. 31వలో "విరోధి" అన్న న్యాయ సంబంధ పదమును చూడండి; "నేరము మోపు" 33వ. "నీతిమంతులుగా తీర్చు" 33వ. "శిక్షవిధించు" 34వ.; మరియు "విజ్ఞాపణము చేయు" అను గమనించండి. దేవుడు న్యాయాధిపతి క్రీస్తు వాదించే న్యాయవాది. సాతాను నిందించేది (కాని అతడు నిశ్శబ్దంగా ఉండును) దేవదూతలు చూసేవారుగా ఆదరణమును నింపుతారు. (1కొరి 4:9; ఎఫెసి 2:7; 3:10)

**8:32 "తన స్వంత కుమారుని అనుగ్రహించుటకు వెనుతీయక"** దేవుడు పతన మానవులకు తన శ్రేష్టతను ఇచ్చెను. దేవుడు విశ్వాసులను ఇప్పుడు విడువడు అదేవిధంగా తక్కువ నివ్వడు. (యోహాను 7:16; రోమా 5:8) నితిమంతుడైన దేవుడు మరియు ప్రేమగల యేసు అన్న అంశము ఎంతగొప్పది ఈ శ్రేష్టమైన బహుమానము ఆది 22:12,16లో దేవుడు అబ్రహామునకు చెప్పి మాటను ప్రతిబింబిస్తుంది. యూదులు ఈ పాతనిబంధన వాక్యభాగమును అబ్రహాము సంతానము కొరకైన పాపప్రాయశ్చిత్త సిద్ధాంతమును బలపరుచుటకు వాడుదురు.

▣ **"మన అందరి కొరకు ఆయనను అప్పగించెను"** ఈ సందర్భంలో "అందరి" అన్నవాక్యం చాలా గమనించదగినది. యేసు లోక పాపముల నిమిత్తము మరణించెను. (లూకా 2:10-11, యోహాను 3:10; 4:42; 11:51; 1తిమో 4:10; 1 యోహాను 2:2; 4:14) ఇది 5:12-21లోని ఆదాము - క్రీస్తుల మాదిరిని చూపిస్తుంది. యేసుని మరణము పాపపు సమస్యను పరిష్కరించింది.

▣ **"సమస్తమును అనుగ్రహించును"** ఈ క్రియ కృపకొరకైన మూలపతము "సమస్తము" 17వ ను సూచిస్తుంది.

**8:33-34 "నేరము మోపు.... నీతిమంతులుగా తీర్చు..... శిక్షవిధించు.... విజ్ఞాపదము చేయు"** ఇవి అన్నియూ న్యాయ సంబంధ పదములు 31-39 వచనాలు పరలోకమందు కోర్టు దృశ్యములు ఇది యెషయా 50:8-9నకు మాదిరి

**8:33 "దేవుని చేత ఏర్పాటు చేయబడిన"** యేసు మానవులందరి కొరకు దేవునిచే ఏర్పాటు చేయబడినవాడు (బార్త్) క్రొ॥ని॥లో ఈ సత్యముపైన స్పష్టమైన మరియు సరి అయిన వాక్యభాగములు ఎఫెసి 1:3-4 & రోమా 9:14-26 మానవులందరిని ఏర్పాటు చేసుకొనుటకు దేవుడు యేసుని ఏర్పాటు చేసుకొన్నాడు. యేసు పతనమైన మానవుల "కాదు" నకు "అవును"

**ప్రత్యేక అంశం : ఎన్నిక / పూర్వనిర్ధారణ సిద్ధాంతమునకు వేదాంత సమతూకము అవసరము.**

ఎన్నిక అనేది అద్భుతమైన సిద్ధాంతము కాని ఇది పక్షపాతము కొరకు కాదుకాని ఒక మార్గమునకు ఇతరుల విమోచనమునకు ఒక పరికరముగా మాత్రమే. పాత నిబంధనలో ఈ పదము ప్రాథమికముగా పరిచర్యకొరకు వాడబడినది; క్రొత్త నిబంధనలో ఈ పదము ప్రాథమికముగా రక్షణ కొరకు వాడబడినది. బైబిల్ ఎన్నడూ దేవుని సార్వభౌమత్వమునకు మరియు మావన స్వేచ్ఛ చిత్తమునకు గల మధ్య విభేదముతో సమాధాన పడదు. కాని వాటి రెండింటిని రూఢిపరుస్తుంది. దీనికి ఒక మంచి ఉదాహరణ రోమా 9లో దేవునియొక్క సార్వభౌమిక ఎంపిక మరియు రోమా 10లోని మానవుని యొక్క అవసరమైన స్పందన నిలుస్తుంది. (10:11, 13).

ఈ వేదాంత తన్యతకు ఎఫెసి 1:4 ముఖ్యముగా కనిపిస్తున్నది. యేసుక్రీస్తు దేవుని యొక్క ఎన్నిక పురుషుడు ఆయనలో మానవులందరు ఎన్నిక చేయబడినారు. (కార్ల్‌బార్త్) యేసు క్రీస్తు పతన మానవ అవసరతకు "అవును" (కార్ల్‌బార్త్). ఎఫెసి 1:4 పూర్వ నిర్ధారణ యొక్క గురి పరలోకము కాదుగాని, పరిశుద్ధతకొరకై (క్రీస్తు పోలిక) అని తేటతెల్లంచేస్తుంది. మనము తరచుగా సువార్త యొక్క ప్రయోజనాలకు ఆకర్షింపబడతాము కాని బాధ్యతలను నిర్లక్ష్యము చేస్తాము. దేవుని పిలుపు ప్రస్తుతమునకు మరియు అదేవిధముగా నిత్యత్వముకొరకు.

సిద్ధాంతములు ఇతర సత్యములతో సంబంధము కలిగి వచ్చును కాని ఒంటరిగా సంబంధములేని సత్యములు కావు. దేవుడు సత్యమును తూర్పు సాహిత్యములో ప్రదర్శించెను కాని, ప్రాశ్చాత శైలిలో కాదు. మనము సిద్ధాంత సత్యాలలోని విరుద్ధబావము గల జతల తన్యతను తొలగించకూడదు.

వేదాంత ఆంశమైన "నిబంధన" దేవుని యొక్క సార్వభౌమత్వమును ఆజ్ఞాపూర్వకమైన మరియు కొనసాగు మారుమనస్సు, మానవులనుండి విశ్వాస స్పందనను ఐక్య పరుస్తుంది. (మార్కు 1:15; అపొ 3:16, 19; 20:21) ఒక వైపు సత్యమును నిరూపించే వాక్య భాగములతో జాగ్రత్త వహించండి. మీ స్వంత అభిమాన సిద్ధాంతములను లేక వేదాంత వ్యవస్థను మాత్రమే రూఢిపరిచే విషయములో జాగ్రత్త.

**8:34** ఈవచనము యేసు ప్రభువు యొక్క పరిచర్యల పట్లీ (1) యేసు చనిపోయెను, (2) యేసు లేపబడెను (3) యేసు దేని కుడి పార్శ్వమున ఉన్నాడు, మరియు (4) యేసు విశ్వాసుల కొరకు విజ్ఞాపనము చేయును.

యేసుని మరణము మన పాప శిక్షవలను చెల్లించినది. (యెషయా 53; మార్కు 10:45; 2కొరి 5:21) యేసుని పునరుత్థానము యేసుని పరిచర్య కొరకు తండ్రి ఆమోదరమును మరియు శ్రమలు మరియు మరణములో కూడా నిరీక్షణను కల్గిస్తుంది. తండ్రి కుడి పార్శ్వమునకు యేసు మహిమ పర్చబడటము మనము మంచి పోరాటము పోరాడుటకు ధైర్యమునిస్తుంది.

▣ **"దేవుని కుడిపార్శ్వము"** ఇది దేవునికి మనుష్య గుణారోపణము చేయవడిన ఉపమానము. దేవుఇనిక భౌతిక శరీరము లేదు. దేవుడు "నిత్యఆత్మ" ఈ ఉపమానము అదికరాము యొక్క స్థలమును మరియు ఔన్నత్యమును సూచిస్తుంఇ పౌలు తరుచుగా ఈ వ్యక్తీకరణను ఉపయోగించలేదు. (ఎఫెసి 1:20; కొలస్సి 3:1) పౌలు 34వలోని ఆది క్రైస్తవ సిద్ధాంత ఉదహరిస్తున్నాడు. (ఫిలిప్పి 2:6; 1తిమోతి 3:16)

▣ **"విజ్ఞానము చేయు"** యేసుని పరిచర్య కొనసాగుతుంది. యేసు మనకొరకు విజ్ఞాపనము చేయుచున్నాడు. (హెబ్రీ 4:4-16; 7:25) ఆత్మవలె ఆయన కూడా విజ్ఞాపనము చేయుచున్నాడు 26-27) ఇది "పారక్లేట్" అన్న పదము. ఇది యోహాను 16:14లో ఆత్మ గురించి చెప్పబడినది శ్రమనొందిని సేవకుని పాట యొక్క ఇంకొక ఉపమానం (యెషయా 53:12)

**8:35 "యేసుని ప్రేమ"** ఇది బాహ్యమైనది లేక అంతరంగికమైనది. ఇది (1) విశ్వాసుల కొరకైన క్రీస్తు ప్రేమ లేక (2) క్రీస్తుకొరకు విశ్వాసుల ప్రేమ కావచ్చు 1వది సందర్భమునకు సరిగా అమరుతుంది. (2కొరి 5:14) విశ్వాసుల ప్రేమ వచ్చి పోతుంది, కాని క్రీస్తు ప్రేమ నిశ్చయమైనది మరియు స్థిరమైనది.

ఈ వాక్యమునకు సంబంధించి గ్రీకు ప్రతులలో వ్యత్యాసం కలదు ఒక పురాతన గ్రీకు వాక్యము "దేవుని ప్రేమ" అన్నమాటను కల్గియున్నది.

శ్రమయైననూ, భాదయైననూ, శ్రమ అయిననూ క్రైస్తవులు ఈ లోకములో శ్రమను కల్గియుంటారు. కాని ఈ సమస్యలు లేక దుష్టశక్తులు దేవుని నుండి వేరుచేయవు. ప్రత్యేక అంశం 5:3లో శ్రమలును చూడండి.

8:36, ఇది కీర్తన 44:22 నుండి ఉదహరించబడినది ఈ కీర్తనలో భాదింపబడుతున్న తన ప్రజ.లకు విడుదల విచ్చే వాడుగా కనిపిస్తున్నాడు.

**8:37**

**NASB "మనము వీటన్నిటిలో అత్యధిక విజయము పొందుచున్నాము".**

**NKJV "అయినా వీటిఅన్నిటిలో జయించిన వారికంటే గొప్పవారము".**

**NRSV "కాదు, వీటి అన్నిటిలో జయించిన వారికంటే గొప్పవారము".**

**TEV "కాదు, వీటన్నిటిలో ఆయనద్వారా మనకు సంపూర్ణ విజయం కలదు".**

**JB "ఇటువంటి శ్రమలలో మనం జయిం పొందితిమి".**

ఇది **"అత్యధిక విజయం"** యొక్క తీవ్రతమైన రూపము. పౌలు దీనిని (హైపర్ + నికావో)ను కలిపి ఉండవచ్చు. ఇది విజయం పొందిన గొఱ్ఱెల యొక్క అద్భుథ మిశ్రమ ఉపమానం. విశ్వాసుల క్రీస్తుద్వారా విజయమును పొందుదురు. (యోహాను 16:33; 1యోహను 2:13-14; 4:4; 5:4) ప్రత్యేక అంశం : పౌలు ఉపయోగించిన హుపర్ మిళిత పదములు 1:30

▣ **"మనలను ప్రేమించిన వాని ద్వారా"** ఈ సర్వనామము తండ్రిని గాని కుమారునిగాని సూచించవచ్చు.

**8:38 "రూఢిగా నమ్ముచున్నాను"** ఇది పెర్ఫెక్ట్ పాసిల్ ఇండికేటివ్ దీని అర్ధము "నేను నమ్మినాను మరియు నమ్ముచున్నాను".

▣ **"దేవదూతలు"** దేవుడువు మానవులు యెడల కలిగియున్న ప్రేమను బట్టి అసూయ కలిగి మనకు విరోధ:గా ఉంటాయని రబ్బీలు అందురు. జ్నాస్టిన్ తప్పుడు భోదకులు, రక్షణ విరోద దేవదూతల రహస్య గుర్తులు వలన వస్తుందని నమ్ముదురు. (కొలస్సి & ఎఫెసి)

జార్జ్ ఎల్డోన్ లాడ్ తన "ఎథజయాలజీ ఆఫ్ న్యూటెస్టమెంట్లో పౌలు ఉపయోగించిన దేవదూతల సంబంధ పదములు సంగ్రహమును తెలిపినాడు.

పౌలు కేవలము మరిము చెడ్డ దూతలు, సాతాను మిరయు అపవిత్రత్మలు మాత్రమే కాకుండా దేవదూతల ఆత్మలకు హోదాల గురించి ప్రస్తావించినదు . ఈ క్రింది విధ:గా పదజాలం ఉంది.

**"పాలించు" (ఆర్కే), 1కొరి 15:24; ఎఫెసి 1:21; కొలస్సి 2:10**

**"నాయకులు" (ఆర్కాై), ఎఫెసి 3:10; 6:12; కొలస్సి 1:16; 2:15; రోమా 8:38**

**"అధికారము" (ఎక్సోసియా) 1కొరి 15:24; ఎఫెసి 1:21; కొలస్సి 2:10**

**"శక్తి (డైనామిస్) 1కొరి 15:22; ఎఫెసి 1:21**

**"శక్తులు" (డైనామైస్) రోమా 8:38**

**"సింహాసనములు" (త్రోనై), కొలస్సి 1:16**

**"ప్రభుత్వం (క్రైరిటోస్) ఎఫెసి 1:21)**

**"ప్రభుత్వాలు" (క్రైరియోటెటస్) కొలస్సి 1:16**

**"అందకారా లోకనాయకులు" ఎఫెసి 6:12**

ఆకాశ మండల ముందున్న దురాత్మల సముహము; ఎఫెసి 6:12 అందకార సంబంధమైన అధికారులు కొలస్సి 1:13 పేరుపొందిన ప్రతినామము ఎఫెసి 1:21

పరలోకమందున్న భూమి మీద ఉన్న భూమిక్రిందిఉన్నవి ఫిలిప్పి 2:10 క్రొ॥ని॥ దురాత్మ శక్తులకు పాత నిబంధనలోని పడిన దేవదైతలతో ఏవిధమైన సంబంధం కల్గియున్నావో స్పష్టమైన సమాచారం కలదు. చాలామంది అవి సమరూపమైనవి నమ్ముదురు. యూదుల అపొకాలిప్టిక్ సాహిత్యంలో, దురాత్మలు, ఆది 6లోని నెఫిలిమ్ యొక్క ఆత్మలు. అవి సగము దూతలు మలిసగము మానవులు వారి శరీరములు వరదలో నాశనం చేయబడినవి కాబట్టి అవి శరీరము కొరకు ఎదురుచూస్తాయి. ఇది ఒక ఉహ మాత్రమే. ఉత్పత్తి గురించి బైబిల్ అన్ని జవాబులు ఇవ్వటం లేదు. బైబిల్ ఉద్దేశ్యము మానవుల విమోచనమే గాని వారి జిజ్ఞాస కాదు.

- **"ప్రదానులు.....అధికారులు"** ఇవి (1) దుష్టదేవదూతలు లేక ఈ యుగపు దయ్యపు శక్తులు (ఎఫెసి 2:2; 6:12; 1కొరి 15:24; కొలస్సి 1:160 లేక (2) పతనమైన మానవుని దేవునినుండె వేరుగా ఉండమని ప్రెరేపించిన ఆవ్యక్తి అమరికలు కావచ్చు. (మతము, ప్రభుత్వము, విద్య, వైద్యం మొ॥) హెండ్రిక్ బెర్కహప్ (ప్రిన్సిపాలిటీస్ & ఫవర్స్).

**8:39 "ఎత్తయునను లొతైనను"** ఇవి నక్షత్రములు యొక్క తుంగము మరియు నీచతమనేదిష్ఠస్థానములు. ఇవి మానవజీవితాలను ఆధీనములో ఉంచే దేవుళ్ళు అని విశ్వసిస్తారు. (జ్యోతిష్య శాస్త్రం) ఇవి తరువాత తప్పుడు సిద్దాంతమైన ఇస్టిసిసమ్‌నకు దారితీసినవి.

- **"సృష్టింపబడిన మరి ఏదైననూ"** అక్షరార్ధముగా ఇవి వేరొక జాతి జీవులు" (హెటెరోస్) ఈసందర్భము దూతల శక్తులను సూచించేరి కనిపిస్తుంది. గ్రీకు విభక్తి అయిన హెటెరోస్ వేరేజాతికి చెందిని మరియెకటి, మరియు ఆల్లోస్, ఒకేజాతికి చెందిన మరియొకటి కొచినేగ్రీకులో వడుకలో లేనిదిగా మారిన, ఈ సందర్భము కొంత ప్రత్యేకతను చూపిస్తుంది.

- **"దేవుని ప్రేమనుండి ఏడబాపరనేను"** నమ్మిక యొక్క ఎంత అద్భుతమైన వాక్యము ఈ అధ్యాయము శిక్షావిధిలేదు. ఎలాదైననూ, ఒకదు మొదట (3:21-13) స్పందించాలి ఎవరునూ విశ్వాసుల రక్షణను తీసుకొలేరు. ఎలాదైననూ, ఒకదు మొదట (4-8 అ॥లు) ఆత్మ కారకము తీసి మరియు విశ్సాము అవసరము (మార్కు 1:15; అపొ 3:16,19; 20 - 21 2

అవసరము (మార్కు ల 3:16,19, 20:21) అదేవిధంగా విదేయత మరియు సహనము అవసరము.

**చర్చాప్రశ్నలు :**

ఇది ధ్యాన మార్గదర్శక వ్యాఖ్యానం కావునా బైబిల్ యొక్క మీ స్వంత వ్యాఖ్యానమునకు మీరు భాద్యులు. మనమందరం మన కివ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, బైబిల్ మరియు పరిశుద్ధాత్మ భావ వ్యక్తీకరణలో ప్రముఖులు నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు దానిని విడిచి పెట్టకూడదు. ఈ పుస్తకంలోని బహుళ విషయములను ఆలోచించుటకు ఈ చర్చా ప్రశ్నలు సహాయపడతాయి. అవి ఆలోచింపజేసేవే కాని, నిశ్చితమైనవి కావు.

1. ఈ అద్యాయము 7వ సం॥ ఎలా సంబందిచంనది.
2. శిక్షావిది లేనట్టయితే విశ్వాసి జీవితములో పాపము.
3. ఆత్మ లేక యేసా.
4. మానవుని పాపమువలన ప్రకృతి ఎలా ప్రభావితం చేయబడినది (19-22)? ప్రకృతి కూడా పరలోకంలో భగమేనా.
5. ఆత్మ మన గురించి ఎలా ప్రార్ధిస్తుంది ? 26-27)? ఇది (అన్యబాషలను సూచిస్తుంఇ.
6. దుష్టలోకములో సమస్తమును సమకూడి మేలుకొరకే జరుగుతున్నవని బైబిల్ చెప్పుతుంది ?
7. 30వలో పరిశుద్ద పర్చబడటం అనేది వేదాంతగొలుసులో నుండి ఎందుకు విడుదల సిబ్బాండి.
8. 31-39వ కోర్టువని బైబిల్ చెప్పుతుంది
9. 34వలోని యేసుని గూర్చి చెప్పిన 4 విషయములు వ్రాయండి?

# ద్వితీయోపదేశకాండము - 9వ అధ్యాయము

నవీన అనువాదముల యొక్క వాక్య విభజన

| UBS | NKJV | NRSV | TEV | JB |
|---|---|---|---|---|
| దేవుని ఎన్నిక | ఇశ్రాయేలు యొక్క క్రీస్తు తృణీకారం | ఇశ్రాయేలు అవిశ్వాస సమస్య | దేవుడు మరియు ఆయన ప్రజలు | ఇశ్రాయేలు ధన్యతలు |
| 9:1-5 | 9:1-5 | 9:1-5 | 9:1-5 | 9:1-5 |
| | ఇశ్రాయేలు తృణీకారము మరియు దేవుని ఉద్ధేశ్యము | ఇశ్రాయేలునకు దేవునికి వాగ్ధానము విఫలము కాలేదు | | దేవుడు తన వాగ్ధానమును నెరవేర్చెను |
| 9:6-13 | 9:6-13 | 9:6-13 | 9:6-9 | 9:6-13 |
| | | | 9:10-13 | |
| | ఇశ్రాయేలు తృణీకారము మరియు దేవుని న్యాయము | ఎన్నుకొనే దేవుని హక్కు | | దేవుడు అన్యాయస్తుడు కాడు |
| 9:14-18 | 9:14-29 | 9:14-18 | 9:14-18 | 9:14-18 |
| | | | దేవుని కోపము మరియు కనికరము | |
| 9:19-29 | | 9:19-26 | 9:19-21 | 9:19-21 |
| | | | 9:22-29 | 9:22-24 |
| | | | | పాతనిబంధనలు అందరును ముందుగా చెప్పబడినారు |
| | | | | 9:25-29 |
| | | 9:27-29 | | |
| ఇశ్రాయేలు మరియు సువార్త | ఇశ్రాయేలు ప్రస్తుత పరిస్థితి | విశ్వాసము వలన నిజమైన నీతి | ఇశ్రాయేలు మరియు సువార్త | |
| 9:30-10:4 | 9:30-33 | 9:30-10:4 | 9:30-10:4 | 9:30-33 |

వాక్యపు పరిధి యొద్ద అసలైన గ్రంధకర్త ఉద్దేశ్యంను అనుసరించుట....

ఈ వ్యాఖ్యానం చదువుటకు ఉపయోగపడే మార్గదర్శిని......

కావున బైబిల్ యొక్క వ్యాఖ్యానమును నీవు సొంతంగా చేసుకొనుటకు భాద్యుడవు. మనమందమం మనకు ఇవ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, పరిశుద్ధ గ్రంధం మరియు పరిశుద్ధాత్మ వ్యాఖ్యానంలో ప్రాధాన్యత వహించవలెను. దీనిని నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు విడిచిపెట్టకూడదు.

అధ్యాయమంతటినీ ఒకేసారి చదవాలి, అంశాలను గుర్తించాలి. నీ అంశ విభజనము పైన ఇవ్వబడిన నవీన అనువాద విభజనలతో సరి పోల్చుకోవాలి. విభజన అనేది ప్రేరణ కాదు. కాని ఇది అసలు గ్రంధకర్త యొక్క ఉద్దేశ్యమును తెలుసుకొనుటకు ఉపయోగపడును వ్యాఖ్యానమునకు ఇది కేంద్రమై వున్నది. ప్రతి వాక్య విభజనకే ఒక్క విభజనను కలిగి ఉండును.

1. మొదటి వాక్య భాగం
2. రెండవ వాక్య భాగం
3. మూడవ వాక్య భాగం
4. మొదలగునవి.

అధ్యాయములు 9-11లకు అధ్యాయములు 18-లకు సంబంధము

ఎ. 1-8 అధ్యాయములకు ఇక్కడ రెండు విధముల అర్థము చేసుకొనుటకు అక్షరార్ధ భాగముల సంబంధములు కలవు.

1. ఇది పూర్తిగా ప్రత్యేక అంశము : వేదాంత సంబందిత విషయములు

ఎ. అక్కడ కఠినమైన వ్యత్యాసము మరియు తర్కసంబంధమైన పోలిక లేకపోవు 8:39-9:1 మద్యలో వస్తాయి

బి. ఇది సరాసరి రోమా సంఘములో విశ్వాసులైన యూదులు అవిశ్వాసులైన అన్యుల మద్యనున్న చారిత్రాత్మకమై తీవ్రతకు సంబంధించినవి. ఇది సాధ్యమైనంతమంతవరకు సంఘము వెలుపల ఉన్న అన్యుల వారి నాయకత్వపు అభివృద్ధికి సంబంధించిన సమస్య కావచ్చును.

సి. ఇశ్రాలీయులకు సంబందించిన బోధ విషయములోను మరియు అన్యజనులకు ఆయన యొక్క అపొస్తులత్వము విషయములోను అపార్ధములు కలవు. కావున ఈ బాగములో ఈ అంశముతో పౌలు వ్యవహరిస్తున్నాడు.

2. ఇది పౌలు సువార్త యొక్క తార్కిక ముగింపు మరియు చివరి అంకము

ఎ. పౌలు 8వ అద్యాయములో దేవుని ప్రేమనుండి ఎవరు వేర్పాటు చేయలేరని వాగ్దానముతో ముగించినాడు. కాని నిబంధన ప్రజల అవిశ్వాసము సంగతి ఏమిటి ?

బి. రోమా 9 నుండి 11 ఇశ్రాయేలు యొక్క అవిశ్వాసమునకు సంబందించిన విరోధ భావ సువార్తకు జవాబునిచ్చును.

సి. పౌలు ఈ విషయమును పత్రిక అంతటా ప్రస్తావించుచున్నాడు. (1:3, 16; 3:21, 31 & 4:1)

డి. దేవుడు ఆయన యొక్క మాట విషయములో సత్యవంతుడని పౌలు పట్టించుచున్నాడు. పాత నిబంధనలో ఇశ్రాయేలుకు సంబందించిన దేవుని మాట సంగతి ఏమిటి ? అవి అన్నియు వ్యర్ధమైపోయినవా ?

బి. ఈ సాహిత్య బాగమును వివరించుటకు అనేక మార్గములు కలవు

1. పౌలు డయాట్రైబ్ ఉపయోగము వలన

ఎ. 9:6

బి. 9:14

సి. 9:19

డి. 9:30

ఇ. 11:1

ఎఫ్. 11:11

2. రోమా 9 నుండి 11 ఒక సాహిత్య భాగమును ఏర్పరుస్తుంది. ఇదిఅంతయు సంపూర్తిగా కలసి వాక్యానించబడాలి. దీనిలో కనీసము 3 విస్తార అంశ విభాగములు కలవు.

ఎ. 9:1-29 (దేవుని సార్వభౌమత్వము)

బి. 9:30-32 (మానవుని బాధ్యత)

సి. 11:1-32 (దేవుని యొక్క నిత్య మరియు సమస్త విమోచన ఉద్దేశ్యము

3. థోమస్ నెల్సన్ పబ్లిషర్స్ యొక్క **NKJV** ఒక మంచి క్రమపట్టికను ఈ బాగమున కొరకు ఇచ్చినది.

ఎ. ఇశ్రాయేలు క్రీస్తును తృణీకరించడం 9:1-5

బి. ఇశ్రాయేలు దేవుని ఉద్దేశ్యమును తృణీకరించడం 9:6-13

సి. ఇశ్రాయేలు దేవుని న్యాయమును తృణీకరించడం 9:14-29

డి. ఇశ్రాయేలు యొక్క ప్రస్తుత పరిస్థితి 9:30-32

ఇ. ఇశ్రాయేలు మరియు సువార్త 10:1-13

ఎఫ్. ఇశ్రాయేలు సువార్తను తృణీకరించుట 10:14-21

జి. ఇశ్రాయేలు సంపూర్ణముగా తృణీకరించబడలేదు 11:1-10

హెచ్. ఇశ్రాయేలు తృణీకరణము సంపూర్ణమైనదికాదు 11:11-36

సి. ఈ వాక్యభాగము హృదయము, మనస్సునుండి వచ్చే ఒక స్వరము ఇది ఇంకొకసారి హోషియా 11:1-4, 8-9లోని తిరుగుబడు ఇశ్రాయేలు యెడల దేవుని హృదయము పగిలిపోవడంను గుర్తుచేస్తుంది. 7వ అధ్యాయంలోని ధర్మశాస్త్రము యొక్క నొప్పి మరియు దాని మంచితనము 9 - 10 అధ్యాయాలలో సాదృశ్యముగా చాలారీతులలో కనిపిస్తుంది. ఈ రెండు సందర్భములలోను దేవుని నుండి వచ్చే ధర్మశాస్త్రము జీవమునకు బదులుగా మరణమును తీసుకొనివచ్చుటను బట్టి పౌలు హృదయము పగిలిపోవుచున్నది.

డి. 9-11 అధ్యాయాలలో పౌలు సుమారు 25కు పైగా పాత నిబంధన మాటలను వాడినాడు. ఇది పాత నిబంధన వనరుల నుండి ఇశ్రాయేలు యొక్క విరోధబావమును ఉపమానించుటకు 4వ అధ్యాయంలో చేసినట్టుగానే ఆయన ఆశను చూపిస్తుంది. అబ్రహాము యొక్క భౌతిక సంతానము గతములో కూడా దేవునిని తృణీకరించినారు.

ఇ. ఈ వాక్యము ఎఫెసి 1:3-13 ఏవిధముగా అయితే సర్వమానవాళి విమోచనకొరకైన దేవుని నిత్య ఉద్దేశ్యముతో వ్యవహరిస్తుంది. ఇది మొదట దేవుడు కొంతమందిని ఎన్నుకొనునట్టుగా మరికొంతమందిని తృణీకరించినట్లుగా కనిపిస్తుంది. కాని ఇది వ్యక్తులపైన దృష్టికాదుగాని దేవుని యొక్క నిత్య విమోచన ప్రణాళిక సంబంధమైనది (ఆది 3:15; అపొ 2:23, 3:18, 4:28 & 13:29)

జెరోం బైబిల్ కామెంటరీ పుట. 2 జోషప్‌చే ఎడిట్ చేయబడిన ద న్యూటెస్టమెంట్ ఈవిధంగా చెప్పతుంది

"పౌలు దృక్పదము సమాఖ్యమైనదని గుర్తించడం చాలా ప్రాముఖ్యము ఆయన వ్యక్తుల యొక్క బాధ్యతను గురించి చర్చించడము లేదు. ఇది దేవుని యొక్క పూర్వనిర్ధారణ సిద్ధాంతపు ప్రశ్నను పైకి తీసుకొనివచ్చుటకు వ్యక్తులను ముందుగానే మహిమ కొరకు ఏర్పాటు చేసినట్లుగా కనిపించడం లేదు." పే. 318

**9 అధ్యాయమునకు సందర్భోచిత తలంపులు**

ఎ. 8 మరియు 9 అధ్యాయముల మధ్య స్వభావపు మార్పు ఎంత తీవ్రముగా ఉంది.

బి. సాహిత్య భాగము (1) రక్షణ ఆధారము, (2) ఏర్పాటుచేసే దేవుని ఉద్దేశ్యము మరియు (3) యెహోవా యందు విశ్వాసముంచిన ఇశ్రాయేలు అవిశ్వాసులైన ఇశ్రాయేలు అవిశ్వాస్యత

సి. 9వ అధ్యాయము దేవుని సార్వభౌమత్వముపైన క్రొత్త నిబంధనలోని ఒక బలమైన వాక్య భాగము (ఎఫెసి (1:3-14) పౌలు ఎన్నడూ ఈ వేదాంత తన్యతను సమాధాన పరుచుటకు ప్రయత్నించలేదు. అవి రెండునూ సత్యమే. చాలా బైబిల్ సిద్ధాంతములు విరోధ బావముగల లేక ద్వంద్వ అర్ధములతో తెలుపబడినవి. చాలా చారిత్రాత్మక వృద్ధిచెందిన వేదాంత వ్యవస్థలు తార్కికమైనవి. కాని వారి యొక్క ఋజువు వాక్యములు ఒక బైబిల్ సత్యం యొక్క దృక్పదములు ఆగస్టీనియానిజం మరియు కాల్వినిజం, సెమిపెలిజియానిజం మరియు అర్మేనియనిజములు సత్యమును మరియు అసత్యమైన మూలకములను కలిగియున్నవి. సిద్ధాంతములు మధ్య ఉన్న తన్యత ఋజువాక్యములు హేతువాదములు బైబిల్‌ను వ్యాఖ్యానపూర్వపు గ్రిడ్‌లోనికి బలవంతము చేస్తున్నవి

డి. 9:30-33 9వ అధ్యాయము యొక్క సాంగ్రహము మరియు 10వ అధ్యాయము యొక్క సారాంశము

పదము మరియు వచనముల మీద ద్యానము

**NASB (నవీన) వాక్యము 9:1-6**

**1. నాకు బహుదుఃఖమును, నాహృదయములో మానని వేదనయు కలవు. క్రీస్తునందు నిజమే చెప్పుచున్నాను, అబద్ధమాడుట లేదు. 3. నరిశుద్ధాత్మయందు నా మనస్సాక్షి నాతోకూడ సాక్ష్యమిచ్చుచున్నది. సాధ్యమైన యెడల, దేహ సంబంధులైన నా సహోదరుల కొరకు నేను క్రీస్తు నుండి వేరై శృపగ్రస్తుడనై యుండగోరుదును. 4. వీరు ఇశ్రాయేలీయులు; దత్తపుత్రత్వమును మహిమయు నిబంధనలును ధర్మశాస్త్ర ప్రధానమును అర్చనాచారాదులను వాగ్దానములను వీరివి. 5. పితరులు వీరివారు; శరీరమునుబట్టి క్రీస్తు వీరిలో పుట్టెను. ఆతయన సర్వాధికారియైన దేవుడైయుండి నిరంతరము స్తోత్రార్హుడై యున్నాడు. ఆమేన్.**

**9:1-2** వచనము 1,2 గ్రీకులో ఒకే వాచనం. పౌలు ఇక్కడ రోమాలో ఉన్న సంఘం వారు, తాను చెప్పినవి సత్యములను ఎలా తెలుసుకోగలరో అను దానికి అనేక కారణాలు ఇస్తున్నాడు: (1) ఆత్మనడిపింపుతో కూడిన తన మనస్సాక్షి; వ. 1; (2) క్రీస్తుతో తన ఐక్యం వ.1, మరియు (3) ఇశ్రామేలుల కొరకై తన ఉన్నతభావం, వ.2 9:1 "నేను క్రీస్తు నందున సత్యము చెప్పుచున్నను". పౌలు ఈ ప్రకటన తరుచుగా చేసినాడు (2. కొరి, 11:10; గలతే 1:20 , 1 తెమె 2:7, లేద అదే అర్ధమిచ్చు దేవుని గూర్చి ఆయన సాక్ష్యం (రోమా 1:9, 2.కొరి 1:23 ఫిలిప్పీ 1:8, 1 థెస్స 2:5, 10) ఇది ఆయన చెప్పే సరళమైన మార్గం సత్య భోద, మరియు ప్రసంగం.

▣ **"నామనస్సాక్షి"** ఇది విశ్వాసులకు చెందన, దేవుని చేత ఇవ్వబడిన ఆత్మ అది నీతిక్రియలు జరిగించుటకు నడిపించే జ్ఞానేంద్రియము ఒక విధంగా చెప్పాలంటే ఇది విశ్వాసుల అదికారము కొరకు ఉపయోగించే ముఖ్య వనరులు. అది ఏమిటంటే. దేవుని వాక్యము,, అర్ధమయ్యేరీతిలో మన మనస్సులలో దేవుని ఆత్మచేత నాటుకుపోయేవి. (1 తిమో 1:5,19) ఇక్కడొక సమస్య తలెత్తే అవకాశం వున్నది ఎప్పుడైతే విశ్వాసులు ఆవిషయం గురించి, అవిశ్వాసులు క్రమం తప్పకుండా దేవుని వాక్యాన్ని ఆత్మన్ని తిరస్కరిస్తే అప్పుడు అది చాలా సుళువుగా ఒకని యొక్క పాపం గుర్తించగల్గును. (1 తిమో 2: 14-16, 4:2) మన మనస్సాక్షి సంప్రదాయబద్దంగా, అనుభవపూర్వంగా నియమితం చేయబడింది.

**NASB "పరిశుద్దాత్ముని యందు నాతో పరిశోదన చేయుచున్నావు".**

**NKJV "పరిశుద్దాత్ముని నా కొరకు సాక్ష్యం పలుకుచున్నావు"**

**NRSV "పరిశుద్దాత్ముని చేత దీన్ని స్థిరపరుస్తున్నావు"**

**TEV "పరిశుద్దాత్ముని చేత పాలించబడింది"**

**JB "ఐక్యతలో పరిశుద్దాత్ముతో పూనుకొనుచున్నాను"**

పౌలు, ప్రత్యేక పిలుపు క్రీస్తునుండి కల్గియుండినవి విశ్వసించెను.

(అపో॥కా. 9:1-22, గలత 1:1) ఆయనొక అపోస్తలుడు మరియు దైవ అదికారంతో పలుకుచున్న మాటలు (1. కొరి 7:25, 40) అతను దేవుని యొక్క దు:ఖాన్ని అవిశ్వాసుల పట్ల మరియు లెక్కపట్టలేనంత ఇశ్రాయేలు దేవప్రజలకు భోదింప సాగెను. (----) వారు అధిక లాభాలుకు కల్గియుండెడివారు.

పౌలు చెప్పే సత్యాన్ని ఆయన ఎందుకు విశ్వసించాడో అని చెప్పడానికి మూడు కారణాలు వివరిస్తున్నాడు

1. క్రీస్తుతో ఆయన ఐక్యత
2. అతని మనస్సాక్షి
3. అతని ఆత్మవడిపింపు అర్ధమయ్యేవిధంగా

**9:3**

**NASB, NKJV, NRSV "నేను కోరుకుంటున్నాడు"**

**TEV "వారి నిమిత్తం నేను కోరుకుంటున్నాను"**

**JB "నేను ఇష్టపూర్వకంగా కోరుకుంటున్నాను"**

పౌలు తన ప్రజలైన ఇశ్రాయేలుయిలు కొరకు చాలా విచారించెను. ఎందుకంటే అతను వారు నుంచి వేరుపడుట ద్వారా ఇశ్రాయేలుయిలు మదనపడి పోతారేమోనని -- ఈ వచనం చాలా గట్టిగా, ఖండితముగా వ్యాకరణ పరంగా నిర్మితమైనది........

పౌలు ప్రార్ధన యొక్క ఉద్దేశ్యం మరియు ఆయన భారము, ఏవిధంగా ఉన్నది అంటే మోషే తన పాప ఇశ్రాయేలు ప్రజల నిమిత్తమై గోజాడతున్నట్టుగా కనమదుతున్నది. (నిర్గమ 32:30-35).........

**ప్రత్యేక అంశము:- విజ్ఞాపన ప్రార్ధన**

1. పరిచయం

(అ) ప్రార్ధన అనేది ప్రాముఖ్యనమైనది ఎందుకనగా యేసు చూపిన మాదిరి కనుక

(1) వ్యక్తిగత ప్రార్ధన మార్కు 1:35, లూకా 3:21, 6:12, 9:29, 22:29-46

(2) దేవాలమ శుద్ధీకరణ మత్తయి 21:13, మార్కు 11:17, లూకా 19:46

(3) మాదిరి ప్రార్ధన మత్తయి 6:5-13, లూకా 11:2-4

(ఆ) ప్రార్ధన అనేది మన వ్యక్తిగత నమ్మకం దేవుని పట్ల ఉంచడం మరియు ఆయన మన తరుపున వ్యాజ్యమాడెవాడు అనియు, మన కొరకు గొప్ప కార్యాలు చేయగలడని ప్రగాడ విశ్వాసము నమ్మకం కలిగి ఆదరించేదేవుడు, ఇచ్చేదేవుడు, అని గుర్తించి వేడుకొనడం.

(ఇ) దేవుడు తన బిడ్డల పట్ల తన వ్యక్తిగత సరిహద్దులో వుండి ప్రార్ధనలక కార్యాలు చేయును.

(ఈ) ప్రార్ధన యొక్క ప్రధాన ఉద్దేశ్యం ఏమిటంటే దేవునితో సమయం, సహవాసం కల్గింవుండట.

(ఉ) ప్రార్ధన అనేది విశ్వాసులకు సంబంధించినది. మనం ఒక్కసారి ప్రార్ధన చెయ్యగలం, లేరా నమ్ముతూ మరల, మరల సమాదానం వచ్చేవరకు చేయగలడమే.

(ఊ) ప్రార్ధనలో ఇమిడియున్న కొన్ని విషయాలు

(1) త్రియేక దేవుని స్థుతి, ఆరాధన

(2) దేవునిక కృతజ్ఞత స్తుతులు చెల్లించుట ఆయన సన్నిధిని బట్టి, సహవాసాన్ని బట్టి, మన అనుదిన అవసరతులు తీర్చుటను బట్టి.

(3) మనం గతంలోను, ఇపుడు చేసిన పాపాల ఒప్పుదల

(4) మన విన్నపముల కొరకు, అవసరతలు కొరకు విజ్ఞాపన

(5) ఇతరుల కొరకు, వారి అవసరతల కొరకు ప్రార్ధన చేయడం.

విజ్ఞాపన ప్రార్ధన అనేది ఒక మిస్టరీ. ఎవరి కొరకైతే మనం ప్రార్ధన చేస్తామో దేవుడు వారిని ప్రేమించును, అయినను మన ప్రార్ధనలు తరచుగా మార్పులు, ప్రత్యుత్తరం, అవసరతను గుర్తించటం, లాంటివి మనలోనే కాకుండా, ఎవరి కొరకైతే ప్రార్ధన చేస్తున్నామో వారిలో కూడా చూడగలము.

2. బైబిల్‌కి సంబందించిన విషయాలు

(అ) పాతనిబంధన

(1) విజ్ఞాసన ప్రార్ధన కొరకు కొన్ని ఉదాహరణలు

(అ) సొదామో అను పట్టణం కొరకు అబ్రహాము విజ్ఞాపన ఆది 18:22

(ఆ) ఇశ్రాయేలు ప్రజలు కొరకు మోషే విజ్ఞాపన ప్రార్ధన

(1) నిర్గమ 5:22-23

(2) నిర్గమ 32:31

(3) ద్వితియో 5:5

(4) ద్వితియో 9:18,25

(ఇ) ఇశ్రాయేలు ప్రజలు కొరకు సమూయేలు యొక్క విజ్ఞాపన ప్రార్ధన

(1) 1 సమూయేలు 7: 5-6, 8-9

(2) 1 సమూయేలు 12: 16-23

(3) 1 సమూయేలు 15: 11

(ఈ) దావీను తన బిడ్డ కొరకు విజ్ఞాపన ప్రార్థన చేసెను 2 సమూ 12:16-18

(2) దేవుడు విజ్ఞాపన ప్రార్థనలు చేసే వారి కోసం వెదుకుతున్నాడు (యెషయ 59:16)

(3) చేసిన పాపాలు ఒప్పుకొక, పశ్చాత్తాపపడని జీవితాలు ప్రార్థనలకు ముప్పు కల్గించును.

(అ) కీర్తనలు 66:1

(ఆ) సామెతలు 28:9

(ఇ) యెషయ 59:1-2, 64:7

(ఆ) క్రొత్త నిబంధన

(1) కుమారుడు మరియు పరిశుద్ధాత్మ యొక్క విజ్ఞాపన ప్రార్థన పరిచర్య

(అ) యేసు

(1) రోము 8:34

(2) హెబ్రీ 7:25

(3) యెహము 2:1

(ఆ) పరిశుద్దాత్మ, రోము 8:26,27

(2) పౌలు యొక్క విజ్ఞాపన ప్రార్థన పరిచర్య

(అ) యూదుల కొరకు ప్రార్థన చేసెను

(1) రోమా 9:1

(2) రోమా 10:1

(ఆ) సంఘముల కొరకు ప్రార్థన చేసెను

(1) రోమా 1:9

(2) ఫెసే 1:16

(3) ఫిలిప్పీ 1:3-4,9

(4) కొలస్సీ 1:3,9

(5) 1 థెస్స 1:2,3

(6) 2 థెస్స 1:11

(7) 2 తిమోతి 1:3

(8) ఫిలెమోను 4

(ఇ) తన కొరకు ప్రార్థన చేయమని పౌలు సంఘములకు మనవి చేసెను.

(1) రోమా 15:30

(2) 2 కొరి 1:11

(3) ఎఫెసీ 6:19

(4) కొలస్సీ 4:3

(5) 1 థెస్స 5:25

(6) 2 థెస్స 3:1

(3) సంఘముల యొక్క విజ్ఞాపన ప్రార్ధన పరిచర్య

(అ) ఒకరి కొరకు ఒకరు ప్రార్ధన చెయ్యుట

(1) ఎఫెసీ 6:18

(2) 1 తిమోతి 2:1

(3) యాకోబు 5:16

(ఆ) ప్రత్యేక గుంపుల కొరకు ప్రార్ధన అవసరత

(1) మన శత్రువులు (మత్తయి 5:44)

(2) క్రైస్తవ పనివారు (హెబ్రీ 13:18)

(3) పరిపాలకులు (1 తిమో 2:2)

(4) రోగుల కొరకు (యాకోబు 5:13-16)

(5) విశ్వాసం నుండి తొలగిపోయినవారు (1 యోహాను 5:16)

(ఇ) ప్రతి ఒకరు కొరకు ప్రార్ధన అవసరత (1 తిమో 2:1)

(3) జవాబురాని ప్రార్ధనలకు గల అడ్డంకులు.

(అ) క్రీస్తుతో, మరియు పరిశుద్దాత్మలో వున్న విశ్వాసుల యొక్క సంబందము

(1) ఆయనలో నిలిచియుండుట (యొహాను 15:17)

(2) ఆయన నామములో (యొహాను 14:13,14, 15:16)

(3) ఆత్మలో (ఎఫెస 6:18 యూదా 20)

(ఆ) విశ్వాసుల కార్యకలాపాలు

(1) ఆందోళన చెందకూడదు మత్తయి 21:22, యాకోబు 1:6,7

(2) మానవత్వము, మరియు పశ్చాత్తాపం లూకా 18:9-14

(3)

(4) స్వార్ధం ( యాకోబు 4:2-3)

(ఇ) విశ్వాసుల జీవిత లక్షణాలు

(అ) కనుగొనుట

(1) లూకా 18: 1-8

(2) కొలస్సీ 4:2

(3) యాకోబు 5:16

(ఆ) అడుగుతూ వుండాలి

(1) మత్తయి 7:7,8

(2) లూకా 11:5-13

(3) యాకోబు 1:5

(ఇ) ఇంటివద్ద అక్రమముగా వుండుట (1 పేతురు 3:7)

(ఈ) తెలిసిన పాపంనకు దూరముగా ఉండుట

(1) కీర్తన 66:18

(2) సామెతలు 28:9

(3) యెషయ 59:1,2

(4) యెషయ 64:7

(4) వేదాంత పరమైన ముగింపు

(అ) ఎంత చక్కని అవకాశం! ఎంత చక్కని భాద్యత! ఎంత చక్కని పని!

(ఆ) యేసే మన ఉదాహరణ. పరిశుద్దాత్మ మనులను నడిపించువాడు తండ్రి ఆతురతగా ఎదురు చూచువాడు.

(ఇ) అది నిన్ను మార్చును, నీ కుటుంబాన్ని, నీ స్నేహితుల్ని

సి. విశ్వాసుల జీవిత లక్షణాలు

1. కనుగొనుట

(ఎ) లూకా 18:1-8

(బి) కొలస్సీ 4:2

(సి) యాకోబు 5:16

2. అడుగుతూ వుండాలి

(ఎ) మత్తయి 7:7-8

(బి) లూకా 11:5-13

(సి) యాకోబు 1:5

3. ఇంటి వద్ద అక్రమముగా వుండుట (1పేతురు 3:7)

4. తెలిసిన పాపంన దూరముగా ఉండుట

(ఎ) కీర్తన 66:18

(బి) సామెతలు 28:9

(సి) యెషయా 59:1, 2

(డి) యెషయా 64:7

4. వేదాంతపరమైన ముగింపు

(ఎ) ఎంత చక్కని అవకాశం! ఎంత చిక్కని భాద్యత! ఎంతచక్కని పని!

(బి) యేసే మన ఉదాహరణ. పరిశుద్దాత్మ మనలను నడిపించువాడు తండ్రి ఆతురతగా ఎదురు చూచులాడు.

(సి) అది నిన్ను మార్చును, నీ కుంటుంబాన్ని, నీస్నేహితుల్ని ప్రపంచాన్ని మార్చును.

**NASB** "శాపగ్రస్తులై క్రీస్తునుండి వేరు పడ్డారు"

**NKJV** "క్రీస్తు నుంచి శాపగ్రస్తులైనారు"

**NRSV** "శాపగ్రస్తులైరి మరియు క్రీస్తు నుండి తొలిగింపబడినారు"

**TEV** "దేవుని శాపము క్రింద వుండి క్రీస్తు నుండి వేరు పడ్డారు"

**JB** "తప్పుచేసినట్లు నిర్ధారించబడి క్రీస్తు నుండి తొలగిపోయారు"

- **"శాపము"** అనుపదానికి హెబ్రీ భాషలో అనేక పదాలు కలవు. "హెర్మ్" అనే పదం ఉపయోగించిరి. దీని అర్ధం ఏమిటంటే "ఏదో కొంత దేవునికి ఇవ్వబడెను" (**CF LXX** అనాతను, లేవీ 27:28), సాధారణంగా నాశనం కొరకు **CF** (ద్వితియా 7:26, యెహోషువ 6:17, 18; 17:12) ఇది ఒక పదము ఉపయోగించబడింది. "పవిత్రయుద్దం" అనే భావము వచ్చేవిధంగా దేవుడు చెప్పెను. కానానీయులకు నాశనం చెయ్యమని అందులో యెరికో పట్టణం మొదటి అవకాశముగా ఇవ్వబడింది. "మొదటిఫలాలు" క్రొత్త నిబంధనలలోయినా తమ మరియు ఇది అనేక రకాల అర్ధం వచ్చే పదాలకు సంబంధితమైయునాన్దఇ. (1) బహుమతిగా లేదు దేవునికి ఇచ్చు అర్పణ (పి.ఎప్. లూకా 21:5) (2) మరది ప్రమాణముగా (అపొ॥కా॥ 23:14) (3) శాపమునకు , ప్రయాణమునకు (మార్కు 14:71) (4) ఒక శాప పద్దతి యేసుకి సంబందించినది (1కొరింది 12:3) (5) ఏదో ఒకటి ఇచ్చుట దేవుని యొక్క తీర్పుకి మరియు నాశనానికి (రోమా 9:3) (1కొరిందీ 16:22) గలతీ 1:8-9)

- **"పవిత్రం"** అనే మాటయొక్క అసలు ఉద్దేశ్యం ఏమిటంటే దేవునికి కొంత ప్రత్యేక పర్చుడి, ఆయన యొక్క ఉపయోగము కొరకు అటువంటే భ్రూవం వచ్చే మాటకి సంబందించినది "శాపం" ఏదో కొంత దేవునికి ప్రత్యేక పర్చుడి, ఇది ఒక నైతిక అనుభవముగా ఉండవచ్చును. (లేవి 27:28; లూకా 21:5) లేదా అనైతిక అనుభవము (యెహ 6-7; రోమా 9:3) సందర్భాన్ని బట్టి ఆధారపడింది.

  **9:4-5** ఈ యొక్క భాగములో నామవాచక రూపాల్లో వుండే పదాలు విస్తరించి విజ్ఞాన సంబందిత (లేదా) కంప్యూటర్ జ్ఞానంలో ఇశ్రాయేలీయుల యొక్క అవకాశాలు ఏమిటో వివరణ ఇవ్వబడింది. వారి యొక్క అపనమ్మకము అధికముగ ఉన్నది. వారి పొందుకున్న ప్రయోజనాలు యందు ఎవరికైతే ఎక్కువగా ఇవ్వబడెనో వారికే కావలసియున్నది (లూకా 12:48)

  **9:4 "ఇశ్రాయేలీయులు"** ఇద అబ్రహము విత్తనము కొరకు ఇవ్వబడిన పాతనిబంధన పేరు. యాకోబు అనే పదము దేవునితో పోరాడిన తర్వాత ఇశ్రాయేలుగా మార్చబడింది. (ఆది 32:28) తర్వాత ఆది అందరికి తెల్సిన ఇశ్రాయేలీయులు దేశముగా అవ్వబడినది. దీనియొక్క లోతైన అర్ధమేమిటంటే "ఎల్" అనగా దేవుడు "కనుగోనుట" మరియు నిజాయితీగా, యాకోబు చేసిన మోసపూర్వకంగా కాదు.

- **"ఎవరికి చెందిన దత్తత కుమారులుగా"** పాత నిబంధనలో బహువచనం "కుమారులు" సాధారణంగా దేవతలకి సంబంధించినది. (యోబు 1:6, 2:1) (యోబు 38:4) (దాని 3:25, కీర్తన 29:1, 89:6-7) ఏకవచనం 1) ఇశ్రాయేలు రాజుకి సంబందించినది. (2సమూ 7:14) 2) దేశము (నిర్గమ 4:22, 23, (ద్వితీ 14:1, హెషయ 11:1) 3) మెస్సయ (కీర్తన 2:7) లేదా 4) ఇది మానవులకి కూడా సంబందించనది (ద్వితి 32:5; కీర్తన 73:15 యెహేజ్కేలు 2:1; హెషయ 1:10; ఆది 6:2) క్రొత్త నిబంధనలో ఇది ఎవరైతే దేవుని కుటుంబంలో వున్నారో వారికి సంబందించినది.

  పౌలు యొక్క ముఖ్య పదం రక్షణ కొరకు ఏమిటంటే "దత్తత" పేతురు జాన్ తిరిగి జన్మించిరి. వారిద్దరు కూడా ఒకరినొకరు బాగా పరిచయం కల్గిన వ్యక్తులు. ఇది యూడా రూపంకాదు, కాని రోమా సామ్రాజ్యానికి చెందినది. కాలం గిచిన కొద్ది "దత్తత" అనేది విస్తరిస్తుపోతున్నది. రోమా ప్రభుత్వ షరతులు ప్రకారం. ఎవరైతే ఒకసరా దత్తత తీసుకోబడ్డారు. ఆ వ్యక్తి నూతన వ్యక్తి అని పరిగణింపబడి, అతనిని చంపే అధికారం హక్కు దత్తత తీసుకున్న తండ్రికి ఉండదు, రోమా ప్రభుత్వ చట్టం ప్రకారముగా

- **"మహిమ"** హీబ్రూ మూలపదము చాలా "కఠినము" గా ఉండును.

  విలువైన వస్తువు కొరకు ఉపయోగించే చిహ్నము లేదా గుర్తు దీనికి సంబందించినది. 1) దేవుని ప్రత్యక్షత సీనాయి కొండమీద, (నిర్గమ 19:18-19) (2) షెకన్యా మహిమగల మేఘము అని ఇశ్రాయేలు ప్రజల్ని నడిపించింది అరణ్య మార్గంలో నున్నప్పుడు (నిర్గమ 40:34-38) **YHWH** "యావే" ఐక్యత్యగా అతను ప్రత్యక్ష పర్చుకొనెను. ఇశ్రాయేలు ప్రజలికి "యావే" సన్నిధఇ అతని యొక్క మహిమ అని తెలియపరుస్తుంది. (1రోజులు 8:10-11, యెహేజ్కేలు 1:28)

**"నిబంధనలు"** పూర్వ గ్రీకు ప్రతులలో P[46] B మరియు ఏకవచనం "నిబంధన" అని ఉపయోగించిరి. ఎలాగైనను, బహువచనం "మెసానిక్" MSS N,C దీనిలో కొంత లాటిన్ బాష జతపర్చడమైనది, మరియు వల్గేట్, కాప్టిక్ వచనాలు USB[4] బహువచనంగా అర్ధనిచ్చును. బహువచనము X "B" ఏమైనను బహువచనం అనేది పాత నిబంధనలో ఉపయోగించబడలేదు. కొన్ని ప్రత్యేక నిబంధనలు పాతనిబంధనలో కలవు, ఆదాము నోవా, అబ్రహాము, మోషే మరియు దావీదు ధర్మశాస్త్రం ఇచ్చిన దగ్గర నుండి లిఖితమైది. ఇది అబ్రహాము దగ్గర నుండ మొదలు కావచ్చు. అబ్రహాము నిబంధన అదేమిటంటే పౌలు పునాదిగా చూసెను. (4:1-25; గలతీ 316-17) మరియు దీన్నే అనేకసార్లు రిపీట్ చెయ్యడం జరిగింది. ప్రతీ ఒక మన పితరులకి రిపీట్ చేశారు. బహువచనంకి ఉన్న మరియొక అవకాశం ఏమిటంటే అది ఈవిధంగా సంబందితమైయున్నవి (1) సీనాయి కొండ (నిర్గమ 19-20) (2) మోయాబు (ద్వితీ) (3) షెకెము వద్ద తిరిగి ఇవ్వబడిన నిబంధన ప్రసంగము (యెహో 24)

**ప్రత్యేక అంశము : నిబంధన**

పాత నిబంధన పదం బెరిలక (నిబంధన) ఇది అంత తేలిక కాదు వర్ణించడానికి దీనికి సరియైన జోడి క్రియాపదము హీబ్రూ బాషలో లేదు. అసంతృప్తి కరమైన నిర్వచనం అనేక ప్రయత్నాల తర్వాత ఇవ్వడం జరిగింది. ఏమైనను నిజముగా కేంద్రమైన ఆభావయుతో కూడి అర్ధం వచ్చుటకు బైబిల్ వేత్తలు కృషిచేసారు. "నిబంధన" అనగా నిజదేవునికి, తన సృష్టి అయిన ప్రజలకి కల్గివున్న బంధుత్వము. నిబంధన భావమేమిటంటే, ఒప్పందం (లేదా ఒడంబడిక ఇది చాలా కఠినం అర్ధం చేసుకోడానికి బైబిలు యొక్క ప్రత్యక్షత ఏమిటో. దేవుని జ్ఞానం, మానవుని చిత్తం రెండు మనము సరిగ్గా ఈ కాన్సెప్ట్‌లో చూడగలము. కొన్ని నిబంధనలు దేవుని స్వభావం పనులు, ఉద్దేశాలు మీద ఆధారపడియున్నాయి.

1. సృష్టి (ఆది 1-2)
2. అబ్రహాము పిలుపు (ఆది 12)
3. అబ్రహాములో నిబంధన (ఆది 15)
4. భద్రపర్చుట మరియు నోవాకిచ్చిన వాగ్ధానం (ఆది 6-9)

ఏమైనను నిబంధన యొక్క లక్ష్యం జవాబుని తెలియపరుస్తుంది.

1. విశ్వాసం చేత ఆదాము దేవునికి విధేయుడుకావాలి. ఏదెను తోట మద్యలో నున్న చెట్టు యొక్క పండు తినకూడదు.
2. విశ్వాసం చేతనే అబ్రహాము తన కుటుంబ సభ్యుల్ని విడిచిపెట్టాలి. దేవునిని వెంబడించాలి, మరియు రాబోయే తరాలు మీద విశ్వాసం కల్గివుండాలి.
3. విశ్వాసం చేతనే నోవా ఓడను సిద్దపరిచి, దేవుని ఉగ్రత అనగా, జలప్రలయం నుండి జంతువుల్ని కాపాడెను.
4. విశ్వాసం చేతనే మోషే ఐగుప్తు నుండి ఇశ్రాయేలీయుల్ని విడిపించి వారిని దేవుని సహాయంచే నడిపించి వారిని దేవునికి సత్సంబందంకులిగా చేసెను.

**"నూతన నిబంధన"**లో మానవునితో దేవుని సంబంధం యొక్క తన్యత కూడా నిమగ్నమైఉన్నది. ఈ తన్యత యెహెజ్కేలు 18ని యెహెజ్కేలు 36:27-37 పోల్చుటద్వారా స్పష్టంగా కనిపిస్తుంది. దేవుని కృపగలకార్యములకు నిబంధన ఆదారమా, లేక మానవ స్పందన? ఇది పాత క్రొత్త నిబంధనలలో మందుతున్న విషయము రెండింటి గురులు ఒక్కటే; ఆది 3లో పొగొట్టబడిన సహవాసము తిరిగి నెలకొల్పబడుట, మరియు (2) దేవుని గుణమును ప్రతిబింబించే నీతిమంతులైన ప్రజలను స్థాపించటము.

యిర్మీయా 31:31-34 యొక్క క్రొత్తనిబంధన, అంగీకారమునకు మానవ ప్రయత్నంను తొలగించి ఈ తన్యతను తొలగించినది. దేవుని ధర్మశాస్త్రము బాహ్యకార్యమునకు బదులుగా అంతర్గత కోరికగా మారినది. దైవిక నీతిమంతులైన ప్రజలు అనే గురి మారలేదు. కాని పద్దతి మారినది. పతనమైన మానవజాతి దేవుని స్వభావమును ప్రతిబింబించలేని స్థితిని ఋజువు చేయబడినది. (రోమా 3:9-18) సమస్య నిబంధన కాదు గాని మానవ పాపము మరియు బలహీనము (రోమా 7; గలతీ 3)

రక్షణ సంపూర్తిగా ఉచితము, కాని మారుమనస్సు మరియు ప్రశ్చాత్తాపము అవసరము (ప్రారంభములోను మరియు కొనసాగిస్తూ) ఇది న్యాయపరమైన ధృవీకరణ మరియు క్రీస్తు వంటి జీవితమునకు ఒక పిలుపు, అంగీకారము యొక్క గుర్తింపు వాక్యము మరియు పరిశుద్దత కొరకైన ఆజ్ఞ విశ్వాసులు వారి కార్యములను వలన రక్షింపబడలేదు. కాని విధేయత కొరకు రక్షింపబడినారు. (ఎఫెసి 2:8-10) దైవిక జీవితము రక్షణకు ఋజువు అవుతుంది. కానిరోణ యొక్క మార్గము కాదు.

- **"ధర్మశాస్త్ర ప్రధానమును ఆర్చనాచారాదులను వాగ్దానములను వీరిని"** ఇది (1) మోషే సీనాయి పర్వతము మీద ధర్మశాస్త్రమును స్వీకరించడము (నిర్గమ 19–20) మరియు దావీదు మందిర సేవలను వృద్ధిచేయడం లేక (2) ఆరణ్యము లోని ప్రయాణము యొక్క ప్రత్యక్షగుడారము కలము (నిర్గమ 25–40 మరియు లేవియకాండము)ను సూచించవచ్చును.

- **"వాగ్దానములు"** దేవుడు పాతనిబంధన ద్వారా (1:2; అపో 13:32; ఐతుకు 1:2; హెబ్రీ 1:1) ఆయన భవిష్యత్ ప్రణాలికలను ప్రత్యక్షపర్చినాడు. "నిబంధనలు" ముందుగానే ప్రస్తావించబడిన కారణముగా, ఈ వాగ్దానములు మెస్సియాను సూచించవచ్చు. (ఆది 3:15; 49:10; ద్వితి 18:15, 18–19; 2 సమూ 7; కీర్తన 16:10, 22; 118:22; యెషయా 7:14; 9:6; 11:1–5; 53; దాని 7:13, 27; మికా 5:2–5క; జకర్యా 2:6–13; 6:12–13; 9:9; 11:12 ఈ వాగ్దానములు (నిబంధనలు) షరతులు లేనివి అదేవిధంగా షరతులు కలది. దవుని కార్యము మట్టునకు అది షరతులు లేనివి (ఆది 15:12–21) మానవులు విశ్వాసము మరియు విధేయత విషయంలో అది షరతులు కలవి (ఆది 15:6 మరియు రోమా 4) క్రీస్తు రాకడ ముందు ఇశ్రాయేలునకు మాత్రమే దేవుని స్వయం ప్రత్యక్షత కలిగినది.

**9:5 "పితరులు"** ఇది ఆదికాండము యొక్కక పితరులైన (ఆది 12–50) అబ్రహము, ఇస్సాకు మరియు యాకోబులను సూచిస్తుంది. (రోమ 11:28, ద్వితి 7:8; 10:15)

- **"శరీరముబట్టి క్రీస్తు వీరిలో పుట్టెను"** ఇది దేవుని వాగ్దానములను ప్రణాళికలను నెరవేర్చు దేవుని ప్రత్యేకింపబడిన సేవకుని అభిషిక్తుడైన మెస్సియా యొక్క శారీరక వంశావళిని సూచిస్తుంది. (10:6) "క్రీస్తు" అన్నపదము "అభిషిక్తుడు" అనే హీబ్రూ పదము యొక్క గ్రీకు అనువాదము పాతనిబంధనలో మూడు వర్గముల నాయకులు పరిశుద్ధ తైలముతో అభిషేకించబడేవారు. (1) ఇశ్రాయేలు రాజులు (2) ఇశ్రాయేలు ప్రధాన యాజకులు, మరియు (3) ఇశ్రాయేలు ప్రవక్తలు. ఇది దేవుడు వారిని ఎన్నుకొన ఆయన పరిచర్య కొరకు సన్నద్ధం చేస్తున్నాడనటానికి గురుతు. యేసు ఈ మూడు అభిషిక్త పరిచర్యలను నెవవేర్చినాడు. (హెబ్రీ 1:2–3) యేసు దేవుని సంపూర్ణ ప్రతత్యక్షత ఎందుచేతనంటే ఆయనదేవుని అవతారము (యెషయా 7:14; 9:6; మీకా 5:2ఎ; కొలస్సి 1:13–20)

**NASB "శరీరముబట్టి క్రీస్తు వీరిలో పుట్టెను. ఈయన సర్వాధికారియైన దేవుడైయుండి నిరంతరము స్తోతార్హుడైయున్నాడు.**

**NKJV "శరీరముబట్టి క్రీస్తు వీరిలో పుట్టెను. ఈయన సర్వాధికారియైన దేవుడైయుండి నిరంతరము స్తోతార్హుడైయున్నాడు.**

**NRSV "శరీరముబట్టి క్రీస్తు వీరిలో పుట్టెను. ఈయన సర్వాధికారియైన దేవుడైయుండి నిరంతరము స్తోతార్హుడైయున్నాడు.**

**TEV "శరీరముబట్టి క్రీస్తు వీరిలో పుట్టెను. ఈయన సర్వాధికారియైన దేవుడైయుండి నిరంతరము స్తోతార్హుడైయున్నాడు.**

**JB "శరీరముబట్టి క్రీస్తు వీరిలో పుట్టెను. ఈయన సర్వాధికారియైన దేవుడైయుండి నిరంతరము స్తోతార్హుడైయున్నాడు.**

వ్యాకరణము ప్రకారము ఇది తండ్రికి స్తోత్రవచనము (**TEV**)కాని సందర్భము పౌలు యొక్క యేసు క్రీస్తు దైవత్వపు ధృవీకరణను బలపరుస్తుంది. పౌలు తరచుగా యేసు కొరకు థియోస్‌ను వాడలేదు. కాని అక్కడ మాత్రమే వాడినాడు. (అపో 20:28; తీతుకు 2:13; ఫిలి 2:6) ఆది సంఘ పితరులు అందరు ఈ వాక్యమును యేసునకు సంబంధించినదిగా వ్యాఖ్యానించినారు.

"ఈయన సర్వాదికారియై" ఇది కూడా తండ్రియైన దేవుని లేక కుమారుడైన యేసుని వివరించే వాక్యబాగము ఇది మత్తయి 28:19లోని యేసు మాటను చూపిస్తుంఇ. మరియు కొలస్సి 1:15–20లోని పౌలు మాటను ప్రతిబింబిస్తుంది. ఇది నజరేయుడైన యేసుక్రీస్తుని తృణీకరించిన ఇశ్రాయేలీయుల తప్పిదము యొక్క ఎత్తును చూపిస్తుంది.

"నిరంతము" "తరతరములకు" అని చెప్పె గ్రీకు జాతీయం ఇది. (లూకా 1:33; రోమా 1:25; 11:36; గలతీ 1:5; 1తిమో 1:17) ఇది వేర్వేరు వాక్యములతో సంబంధం కలిగినది (1) యుగముల వరకు మత్తయి 21:19 మార్కు 11:14; లూకా 1:55; యోహాను 6:5; 58; 8:35; 12:34; 12:8; 14:16; 2కొరి 9:9) లేక "తరతరములు" 'ఎఫెసి 3:21) "యుగములు" అన్నపదము బహువచనముగా ఉండి చాలా "యుగములు" అంశమును యూదుల భావనలో అయిఉండువచ్చు. అజ్ఞన యుగము "దుష్టయుగము" "రానైయున్నయుగము" లేక "నీతి యుగమును"ను సూచించవచ్చు. ప్రత్యేక అంశము. ఈ యుగము మరియు రానైయున్న యుగము 12:2లో చూడండి.

**"ఆమెన్" ప్రత్యేక అంశం 1:25లో చూడండి**

**NASB (నవీన) వాక్యము 9:6-13**

**6. అయితే దేవునిమాట తప్పిపోయినట్టు కాదు; ఇశ్రాయేలు సంబంధులందరును ఇశ్రాయేలీయులు కారు. 7. అబ్రాహాము సంతానమైనంత మాత్రము చేత అందరును పిల్లలు కారుగాని 8. ఇస్సాకువల్లనైనది నీ సంతానము అనబడును, అనగా శరీర సంబంధులైన పిల్లలు దేవుని పిల్లలు కారుగాని వాగ్దాన సంబంధులైన పిల్లలు సంతానమని యెంచబడుదురు. 9. వాగ్దానరూపమైన వాక్యమిదే. మీదటికి ఈ సమయమునకు వచ్చెదను; అప్పుడు శారాకు కుమారుడు కలుగును. 10. అంతేకాదు; రిబ్కా మన తండ్రియైన ఇస్సాకు అను ఒకనివలన గర్భవతియైనప్పుడు, ఏర్పాటును అనుసరించిన దేవుని సంకల్పము, 12. క్రియల మూలముగా కాక పిలుచు వాని మూలముగానే నిలుకడగా ఉండు నిమిత్తము పిల్లలింక పుట్టి మేలైనను కీడైనను చేయకముందే పెద్దవాడు చిన్నవానికి దాసుడగును అని ఆమెతోచెప్పబడెను. 13. ఇందును గూర్చి నేను యాకోబును ప్రేమించితిని, ఏశావును ద్వేషించితిని అని వ్రాయబడి యున్నది.**

**9:6 "దేవునిమాట"** ఈ సందర్భములో ఇది పాతనిబంధన వాగ్దానములను సూచించవచ్చు. దేవుని వాగ్దానములు నిశ్చయము. (సంఖ్యా 23:19; యెషయా 40:8; 55:11; 59:21)

▣ **NASB, NRSV, TEV, JB "తప్పిపోయెను"**

**NKJV "ఏప్రభావం చేయలేదు"**

ఈ పదము (ఎక్‌పిస్టో) గ్రీకు బైబిల్‌లో చాలాసార్లు ఒకటి (యెషయా 6:13) లేక ఒక (యెషయా 14:12) పడిపోవటమును సూచించుటకు వాడబడినది. ఇది ఫలితంగా ఉన్న ఒక స్థితిని సూచిస్తుంది. దేవుని వాక్య నిశ్చయం కొరకు ఫైనోట్ చూడండి.

▣ **NASB "ఇశ్రాయేలు సంబంధులందరును ఇశ్రాయేలీయులు కారు"**

**NKJV "ఇశ్రాయేలునకు చెందిన వారందరు ఇశ్రాయేలీయులుకారు"**

**NRSV "ఇశ్రాయేలీయులందరూ నిజంగా ఇశ్రాయేలునకు చెందిన వారుకారు"**

**TEV 'ఇశ్రాయేలు ప్రజలందరూ దేవుని ప్రజలు కారు"**

**JB "ఇశ్రాయేలు నుండి దిగివచ్చిన వారందరూ ఇశ్రాయేలీయులు కారు"**

ఈ విరుద్ధ భావ వాక్యము యొక్క అర్ధము "ఇశ్రాయేలు" అనుపదమునకు గల వేర్వేరు బైబిల్ పరమైన అర్ధములు వివరించును: (1) ఇశ్రాయలు అనగా యాకోబు సంతతి (ఆది 32:22-32; (2) ఇశ్రాయేలు అనగా దేవుని ఎన్నిక జనాంగము (); లేక (3) ఆత్మీయ ఇశ్రాయేలు అనగా సంఘము (గలతీ 6:16; 1 పేతురు2:8,9; ప్రకటన 1:6) మరియు సహజ ఇశ్రాయేలు (3-6వ) యూదులు వారి వంశములను బట్టి దేవునితో సరిఅయిన సంబంధం కల్గియుండులేదు. (7వ.) కాని వారి విశ్వాసమును బట్టియే 2:28-29; 4:1; యోహాను 8:31-59; గలతీ 3:7-9; 4:23) విశ్వసించిన శేషము దేవుని వాగ్దానములను పొందుకొని విశ్వాసముతో వాటిలో నడిచినవారు (9:27; 11:5)

6వ వచనం చెప్పబడిన ఆక్షేపణముల వరుసతో ప్రారంభమవుతుంది. (9:14, 19, 30; 11:1) ఇది పౌలు యొక్క దయాట్రైబ్‌ను కొనసాగిస్తుంది. ఇది ఒక విషయమును చూపించి సత్యమును వివరిస్తుంది. (మలాకీ 1:2, 6,7 (రెండుసార్లు) 12, 13; 2:14, 17 రెండుసార్లు; 3:7, 13,14

**9:7** ఈవచనములో రెండవభాగము ఆది 21:12డి నుండి చెప్పబడినది. అబ్రహాము పిల్లలందరునూ దేవుని నిబంధన వాగ్దాన పిల్లలు కారు (ఆది 12:1-3; 15:1-11; 17:1-21; 18:-15; గలతీ 4:23) ఇది ఇష్మాయేలు మరియు ఇస్సాకు 8-9మలో మరియు యాకోబు మరియు ఏశావు, 10-11వ.లలోని వ్యత్యాసమును చూపిస్తుంది.

**9:8** పౌలు ఇక్కడ "శరీరము" అన్నమాటను జాతీయ సంతానమును సూచిస్తున్నాడు. (1:3; 4:1; 9:3,5) పౌలు అబ్రహాము యొక్క సహజ సంతానమును (యూదులు 9:3) అబ్రహాము యొక్క ఆత్మీయ సంతానము (వాగ్దాన సంతానం) మెస్సియా యందు విశ్వాసముంచువారు)తో విభేదించుచున్నాడు. ఇది 8:4-11లోని పతనమైన మానవులు మరియు విమోచింపబడిన మానవులు వంటి విభేదం కాదు.

**9:9** ఇది ఆది 18:10, 14 నుండి చెప్పబడినమాట. వాగ్దానపు కుమారుడు (సంతతి) దేవుని ఆరంభముతో శారానుండి పుట్టును. ఇది మెస్సియా యొక్క జన్మంతో ముగింపబడును. ఇస్సాకు, దేవుడు అబ్రహామున కిచ్చిన వాగ్దానపు నెరవేర్పు ఆది 12:1-3

**9:10** అబ్రహము ఇస్సాకు, యాకోబుల బార్యలు గొడ్రాండ్రు వారు సంతానంను కల్గియుండలేదు. వారు సంతానం కల్గియుండలేని అసమర్దత, వాగ్యాన నిబంధన వాగ్దానమైన యెస్సియా వంశావళి దేవుని ఆదీనములో ఉందని చూపించే దేవుని మార్గము.

నిజమైన మెస్సియా వంశము పితరుల యొక్క జ్యేష్టకుమారులో ప్రారంభించబడలేదని ఇంకొక రీతిలో చెప్పవచ్చు. దేవుని ఎంపిక మూలము (11-12వ.లు)

**9:11-12,** 11-12వచనాలు గ్రీకులో ఒకే ఒక్క వాక్యము ఇది ఆది 25:19-34 నుండి చెప్పబడినది. ఇది దేవుని ఎంపిక అని ఋజువు చేసే ఉదాహరణం (16వ.) (1) మానవ వంశావళజ లేక (2) మానవ శ్రేష్టత లేక ప్రయత్నం (16వ) కాదు ఇది సువార్తయొక్క హృదయము, నూతన నిబంధన (యిర్మియా 31:31-34; యెహెజ్కెలు 36:22-36) ఎలాగైననూ, దేవుని ఎంపిక అందర్నికలపటమే గాని బహిష్కరించటం కాదని గుర్తించుకోవాలి. మెస్సియా ఎన్నిక చేయబడిన సంతానము నుండి వచ్చును గాని అందరి కొరకు వచ్చును (విశ్వసించువారి అందరికి 10వ అ)

**9:11 "సంకల్పము"** ఇది మిశ్రమపదము (ప్రొ మరియు టి తెమి, దీనిక చాలా భావనలు కలవు.

1. రోమా 3:25
   - ఎ. బహిరంగంగా ఉంచటం
   - బి. ప్రాయశ్చిత్త దానం
2. ముందుగా ప్రణాళిక చేయటం
   - ఎ. పౌలు యొక్క, రోమా 1:13
   - బి. దేవుని యొక్క, ఎఫెసి 1:9

(ప్రితీసిస్) యొక్క నామవాచకరూపము, ఈ వాక్యములో "ముందుగానే ఉంచటం" అని అర్ధమిస్తుంది

1. ఆ మందిరపు రొట్టె కొరకు, మత్తయి 12:4; మార్కు 2:26; లూకా 6:4
2. ముందుగానే నిర్ణయించబడిని దేవుని సంకల్పము, రోమా 8:28-29; 9:11; ఎఫెసి 1:5, 11; 3:10 2తిమో 1:9; 3:10

రోమా 8,9 మరియు ఎఫెసి 1వ అ.లలో పౌలు ఆలా మిశ్రమ పదములను ప్రి (ముందు) విభక్తితో వాడినాడు.

1. ప్రొగినెస్కో (ముందుగానే యెరుగుట) రామో 8:29
2. ప్రూరిజో (ముందుగానే రూపించటం, రోమా 8:29 (ఎఫెసి 1:5, 11)
3. ప్రొతీసిస్ (ముందుగానే నిర్దేశించిన ప్రణాళిక), రోమా 9:11
4. ప్రొ ఎటోమైజో (ముందుగానే సిద్దపర్చటము), రోమా 9:29
5. ప్రొలెగొ (ముందుగానే చెప్పిన) రోమా 9:29
6. ప్రొ ఎల్పిజొ (ముందుగానే ఆశించిన) ఎఫెసి 1:12

**9:12** ఇది ఆది 25:23లోని ఏశావు మరియు యాకోబులకు సంబంధించిన ప్రవచనము. రిబ్కా, యాకోబులు ప్రవచన మూలంగాను ప్రవర్తించినారు. కాని వ్యక్తిగత లాభముకొరకు, ఇస్సాకును ఆశీర్వాదముల కొరకు మోసగించలేదు.

**9:13** "ఏశావును ద్వేషించితిని" ఇది మలాకీ 1:2-3 నుండి చెప్పబడిన మాట. "ద్వేషము" పోలిక యొక్క హీబ్రూ జాతీయము. ఇది ఇంగ్లీష్‌లో కఠినంగా వినిపిస్తుంది. కాని ఆది 29:31-33; దివతి 21:15; మత్తయి 10:37-38; లూకా 14:26; మరియు యెహాను 12:25లతో పోల్చండి. మానవ సంబంధపదమైన "ప్రేమ" మరియు "ద్వేషము" ఈ వ్యక్తుల యెడల దేవుని మానసిక భావనలు

కాదుగాని మెస్సియా వంశావళికిని మరియు వాగ్దానమునకు దేవుని సమర్పణము. యాకోబు ఆది 25:23లోని ప్రవచనమును ఆధారంచేసికొని వాగ్దాన కుమారుడు మలాకీ 1:2-3లోని ఏశావు, ఎదోము దేశమును సూచిస్తుంది (ఏశావుసంతానము)

NASB (నవీన) వాక్యము 9:14-18

**14. కాబట్టి యేమందుము దేవుని యందు అన్యాయము కలదా! అట్లనరాదు. 15. అందు మోషేతో ఈలాగు చెప్పుచున్నాడు. ఎవనిని కరణింతునో వానిని కరుణింతును; ఎవనియెడల జాలి చూపుదునో వానియెడల జాలి చూపుదును. 16. కాగా పొందగోరువానివలననైనను, ప్రయాసపడువాని వలననైనను కాదు గాని, కరుణించు దేవునివలననే అగును. 17. మరియు లేఖనము ఫరోతో ఈలాగు చెప్పెను. నేను నీయందు నా బలము చూపుటకును, నా నామము భూలోకమందంగల ప్రచురమగుటకును, అందు నిమిత్తమే నిన్ను నియమించితిని. 18. కావున ఆయన ఎవనిని ఎనికరింప గోరునో వానిని కనికరించును; ఎవని కఠిన పరచ గోరునో వాని కఠినపరుచును.**

**9:14 "కాబట్టి యేమందుము"** పౌలు తరుచుగా ఈ దయాట్రైబ్ రూపమును వాడుచున్నాడు (3:5; 4:1; 6:1; 7:7; 8:31; 9:14, 19, 30).

- **"దేవుని యందు అధ్యాయము కలదా"** దేవుని సార్వభౌమత్వము నిర్ణయించే కారకమైతే మానవులకు దేవుడు ఎలా బాధ్యులుగా చేయగలడు (19వ)? ఇది ఎన్నిక యొక్క మర్మము. ఈ సందర్భము యొక్క ముఖ్య అంశము ఏమిటంటే మానవులతో (తిరుగుబాటు చేసే మానవులు) దేవుడు తనకిచ్చవచ్చినట్లు చేయుటకు దేవుడు స్వతంత్రుడు అయినప్పటికి దేవుని సార్వభౌమత్తము యొక్క సార్వభౌమిక ఎంపికలు, మానవుల భవిష్యత్ ఎన్నిక మరియు చర్యలను ముందుగానే ఎరుగనివి అని చెప్పబడుతుంది. ఇవి సత్యమైనట్లుయితే చివరికి వ్యక్తుల ఎంపికలు మరియు చర్యలు మరియు యోగ్యతలు దేవుని ఎంపికకు ఆదారమవుతాయి. (16వ; 1పేతురు 1:2) దీని వెకనే యూదుల మరియు కీర్తన 73) కాని దేవుడు అయోగ్యులను విశ్వాసము ద్వారా రక్షివచి దీవించాలని కోరుచున్నాడు. దేవుడు సమస్తమును ఎరిగినప్పటికి ఆయన ఎన్నికను (1) కనికరము మరియు (2) వాగ్దానములో పరిమితం చేసుకొనెను. మానవ స్పందన అవసరము ఉంది, కాని ఇద జీవితమును మార్చే దేవుని ఎన్నికను రూఢిపరుస్తుంది.

- **"అట్లనరాదు"** పౌలు యొక్క డాయట్రైబ్ ప్రశ్నలను వర్ణించుటకు వాడబడిన రూపము (3:4, 6, 31; 6:2, 15; 7:7, 13; 11:1, 11 అదేవిధంగా 1కొరి 6:15; గలతీ 2:17; 3:21; 6:14)

**9:15** ఇది నిర్గమ 33:19 నుండి చెప్పబడినది దేవుడు తన స్వంత విమోచనాత్మక ప్రణాళికితో పనిచేయుటకు స్వతంత్రుడు మోషేకూడా ఈ దేవుని ఆశీర్వాదములకు యోగ్యతను సాదించలేకపోయాడు. ముఖ్యం ఏమిటంటే దేవుని ఏర్పాటులో ఆయన కరుణ యుంటుంది. (16, 18-23; 11:30, 31, 32)

**9:15-16 "దేవునికరుణ"** (ఎలోయిస్) అనే గ్రీకు పదము గ్రీక బైబిల్ ()లో ప్రత్యేక హీబ్రూ నిబంధన పదం అయిన హెసేడ్, అనగా స్థిరమైన నిబంధన విధేయతను అర్ధమిచ్చేదానిని అనువదించుటక వాడబడినది (15, 1618, 23; 11:30, 31, 32) దేవుని కనికరము మరియు ఎన్నిక బహువచనం, సమైఖ్యమైనది (యూదులు ఇస్సాకు), అనబ్బులు కాదు (ఇష్మాయేలు); ఇశ్రాయేలు (యాకోబు), ఎదోము (ఈశావు) కాదు, కాని ఇది అంతా విశ్వరోణ కొరకు మాత్రమే పూర్వనిర్ధారణ సిద్దాంతమును అర్ధము చేసుకొనుటకు ఇది ఇక తాళము (దేవుడు ఒక్క మనుష్యుని, ఒక్క కుటుంబమును, ఒక్క దేశమును ఎన్నుకొని, మెస్సియాను తీసుకొనివచ్చి అందరిని రక్షించుట కొరకు)

**9-11** అ సందర్భము వేరొక తాళపు చెవినిస్తుంది – దేవుని యొక్క మార్పులేని తనము – కనికరము (9:15, 16, 18, 23; 11:30, 31, 32) కాని మానవ ప్రయత్నం కాదు. క్రీస్తునందు విశ్వాసముంచు వారినందరిని ఎన్నిక గుండా కనికరము చేరును. విశ్వాసపు ద్వారమును ఒక్కడు అందరిక కొరకు తెరువును (5:18-19) 9:17-18 17వ నిర్గమ 9:16 నండి చెప్పబడినది 18వ. చెప్పబడినమాట నుండి తీయబడిన ముగింపు. ఫరో తన హృదయమును కఠిన పర్చుకొనినట్టుగా నిర్గమ 8:15, 32; 9:34లో చెప్పబడింది. దేవుడు ఫరో హృదయమును కఠినపర్చినట్టుగా 4:21; 7:3; 9:12; సార్వభౌమత్వమును చూపుటకు వాడబడింది. (18వ.) ఫరోతన ఎంపికల నిమిత్తము బాధ్యుడు. ఫరో యొక్క అహంకారము మరియు కాఠిన్యమును దేవుడు ఇశ్రాయేలు నిమిత్తము తన ఉద్దేశ్యమును నెరవేర్చుకొనుటకు వాడుకినెను (18వ)

ఫరోతో దేవుని విమోచన కార్యములు ఉద్దేశ్యంలో విమోచన మరియు కలుపు పరిధికలదు. అవి (1) దేవుని శక్తిని చూపించుట కొరకు, మరియు (2) ఐగుప్తునకు దేవుడు ప్రత్యక్ష పరుచుకొనుటకు తద్వారా లోకమంటికి (17వ) ప్రాశ్యాత్య ఆలోచన వ్యక్తులను ఘణపరుస్తుండగా తూర్పు ఆటోచన సంపూర్తిని, సమైఖ్యతను కోరుతుంది. దేవుడు అవసరత లోకమునకు ఆయనను ప్రత్యక్ష పరుచుకొనుటకు ఫరౌను

వాడుకొనెను. దేవుడు అవిశ్వాస ఇశ్రాయేలుతో ఇదే చేయును (11వఅ) పాతనిబంధన ఉదాహరణలు (1) యోబు యొక్క తొలి పిల్లలు సాతానుతో దేవుని చర్చ వలన చనిపోయినారు. (యోబు 1-2); (2) ఆకాను పాపమువలన ఇశ్రాయేలు సైనికులు మరణించినారు. (యెహో 7); మరియు (3) దావీదు పాపమువలన, బతెబుతో దావీదు మొదటి మరణించెను (2సమూ 12:15) మనము అందరము ఇతరుల ఎంపికల ద్వారా ప్రభావితం చేయబడుతున్నాము. ఈ సమైక భావన క్రొత్త నిబంధనలో రోమా 5:12-21లో చూడగలము.

NASB (నవీన) వాక్యము **9:19-26**

**19. అట్లయితే ఆయన చిత్తమును ఎదిరించిన వాడెవడు ఆయన ఇకను నేరము మోపనేల అని నీవు నాతో చెప్పుదువు. 20. అవును గాని ఓ మనుష్యుడా, దేవుని ఎదురు చెప్పుటకు నీ వెవడువు నన్నెందుకీలాగు చేసితివనిరూపించబడినది రూపించినవానితో చెప్పునా 21. ఒక ముద్దలో నుండియే యొక ఘలము ఘనతకును ఒకటి ఘనహీనతకును చేయుటకు మంటి మీద కుమ్మరివానికి అధికారము లేదా! 22. అలాగు దేవుడు తన ఉగ్రతను ఆగపరచుటకును, తన ప్రభావమును చూపుటకును, ఇచ్ఛయించినవాడై, నాశనమునకు సిద్ధపడి ఉగ్రతాపాత్రమైన ఘటములను ఆయన బహు దీర్ఘశాంతముతో సహించిన నేమి 23. మరియు మహిమ పొందుటకు ఆయన ముందుగా సిద్ధపరచిన 24. కరుణాపాత్ర ఘలముల యెడల, అనగా యూదులలో నుండి మాత్రము కాక, అన్యజనములలో నుండియు ఆయన పిలిచిన మన యెడల, తన మహిమైశ్వర్యము కనుపరచవలెననియున్న నేమి 25. ఆ ప్రకారము నా ప్రజలు కానివారికి నా ప్రజలనియు, ప్రియురాలు కానిదానికి ప్రియురాలనియు, పేరు పెట్టుదురు. 26. మరియు జరుగునదేమనగా, మీరు నా ప్రజలు కారని యేచోటను వారితో చెప్పబడెనో, ఆ చోటనే జీవముగల దేవుని కుమారులని వారికి పేరు పెట్టబడును అని హోషేయలో ఆయన చెప్పుచున్నాడు.**

**9:19 "ఆయన చిత్తమును ఎదిరించిన వాడెవడు**? ఇది వర్తమానకాలపు వాక్యము. ఇది ప్రస్తుతం ఫలితమిచ్చుచున్న స్థిరకార్యము (2 దిన 20:6; యోబు 9:12; కీర్తన 135:6; దాని 4:35) పౌలు యొక్క డయాట్రైబ్ రూపము కొనసాగుతుంది. పౌలు యొక్క ప్రశ్నకు అనుసరించటము పౌలు యొక్క ఆలోచను అర్ధము చేసుకొనుటకు మంచి మార్గము. దేవుని చిత్తము రెండు అంతస్తులలో చూడవలసిన అవసరము ఉండి. మొదటిది, పతన మానవుల అందరి రక్షణ కొరకైన దేవుని ప్రణాళిక (ఆది 3:15) ఈ ప్రణాళికలు మానవులు ఎంపికతో ప్రభావితం చేయబడవు. కాని రెండవ అంతస్తులో మానవ పరికములకు వాడుకొనుటకు దేవుడు ఎన్నుకోవటము (నిర్గమ 3:7-9 మరియు 10) దేవుని ప్రణాళికలను నెరవేర్చుట కొరకు ప్రజలు ఎన్నిక చేయబడ్డారు. (మోషే అనుకూలంగా ఫరో (ప్రతికూలంగా)

**9:20-21** ఈ ఉపమానము యెషయా 29:16; 45:9-13; 64:8 మరియు యిర్మీయా 18:1-12 నుండి తీయబడినది. యెహోవా, కుమ్మరివలె అన్న ఉపమానం దేవుని సృష్టి కర్తగా చూపించుటకు వాడబడినది. మానవులు మట్టినుండి చేయబడినారు (ఆది 2:7) పౌలు దేవుని సార్వభౌమత్వమును వివరించే తన వాదనలో మరి మూడు ప్రశ్నలను అడుగుచున్నాడు. మొదటి రెండు, 20వలోనూ మరియు మూడవది 21వలో ఉన్నవి. చివరి ప్రశ్న, దేవుని అనుకూల ఎంపిక మోషేలోనూ, ప్రతికూల ఎంపిక ఫరోలో ఉన్న ఉపమానమునకు తిరిగి వెళ్ళుతుంది. ఇదే విబేధము (1) ఇస్సాకు - ఇష్మాయేలు, 8-9వ; (2) యాకోబు ఎశావు, 10-12వలలో; మరియు (3) ఇశ్రాయేలు దేశము మరియు ఎదోము దేశము 13వలో కనిపిస్తుంది. ఇవే పోలిక పౌలు యొక్క ప్రస్తుత పరిస్థితి అయిన విశ్వసించిన మరయు అవిశ్వాస యూదులను సూచిస్తుంది. విశ్వసించిన అన్యజనులను చేర్చులో దేవుని అనుకూల ఎంపిక చివరిగా వ్యక్తమైనది.

**9:22 "అయిననేమి"**? ఇది మొదటి తరగతి షరతులతో కూడిన వాక్యమై గ్రంథకర్త దృక్పదము నుండి సత్యమైనది కాని వ్యాకరణ ముగింపుతో కాదు 22-24.వలు గ్రీకులో ఒకే వాక్యము 22వ దేవుని విమోచనాత్మక గుణమును సూచిస్తుంది. దేవుడు న్యాయముగల దేవుడు. మానవుల క్రియలను బట్టి వారికి లెక్కుఉ అడుగువాడు అదేవిధంగా ఆయన కనికరము గలదేవుడు మానవులందరి మరణమునకు పాత్రులు న్యాయము శుభవార్త కాదు! దేవుని గుణము ముఖ్యముగా కనికరము గాని, ఉగ్రత కాదు. (ద్వితి 5:9-10; 7:9; హోషెయా 11:8-9) దేవుని ఎన్నికలు రక్షణ కొరకు మాత్రమే (యెహె 36:22-33) దేవుడు పాపభరిత మానవులతో సహనం కల్గియున్నాడు. (యెహె18) దేవుడు తన విమోచనాత్మక ఉద్దేశ్యముల కొరకు దుష్టులను కూడా వాడుకొనును (సాతాను ఫరో, ఎండోర్ దయ్యము, అస్సీరియా, నెబుకర్నెజరు, కోరేషు మరియు 11వ అ.లోని అవిశ్వాసులైన ఇశ్రాయేలీయులు)

**NASB "దేవుడు తన ఉగ్రతను అగుపరుచుటకు"**

**NKJV "తన ఉగ్రతను చూపవలెనని కోరి"**

**NRSV "తన ఉగ్రతను చూపించుటకు కోరిక కలిగి"**

**TEV "తన కోపమును చూపించగోరి"**

**JB "కోపించుటకు సిద్దపడి"**

దేవుడు తన ఉగ్రతను చూపించి ఆయన యొక్క శక్తిన ఇ(22వ) మరియు ఆయన మహిమైశ్వర్యమును తెలియజేయచున్నాడు. (23వ) దేవుని కార్యములు ఎల్లప్పుడు విమోచనాత్మక ఉద్దేశ్యములు కల్గినవి (గెహెనా మినహాయించి, పాపము మరియు అవిశ్వాసము యొక్క చివరి వేర్పాటు)

- **"ఉగ్రతా పాత్రమైన ఘటములు"** ఈ పదము 20 & 21వలలో ప్రారంభమైన కుమ్మరివాని ఉపమానముల కొనసాగింపు అవి అవిశ్వాసులైన మానవులను దేవుడు తన విమోచనాత్మక ఉద్దేశ్యముల నిమిత్తము వాడబడుటను సూచిస్తున్నవి

- **NASB, NKJV "సిద్ధపర్చిన"**

  **NRSV "తయారుకాబడిన"**

  **TEV "చేయబడిన"**

  **JB "రూపించబడిన"**

ఇది వర్తమానపు అసమాపక క్రియపాపిరిలో వాడబడిన పదమేమిటంటే ఒక పూర్తిగమ్యము కొరకు సిద్దపర్చబడినది అని ఉంది. తిరుగుబాటు మరియు అవిశ్వాసము తీర్పు దినమును దాని ఫలితములను కల్గియుంది. ఎలాగైననూ అవిశ్వాసులను తన ఉద్దేశ్యములను నెరవేర్చుకొనుటకు దేవుడు ఉపయోగించుటకు ఎన్నుకొనెను.

ఎం.ఆర్. విన్సెంట్, వర్డ్‌స్టడీస్, పుట2, లో చెప్పుచున్నాడు. "నాశనము కొరకు దేవునిచే అమర్చబడలేదు, కాని విశేషణ భావనలో సిద్ధపడి నాశనము కొరక పంపబడినది. ఇది ముందుగా రూపింపబడిన దాని యొక్క ప్రస్తుత స్థితిని వివరిస్తుంది. కాని అది ఏవిధంగా రూపింపబడినదో చెప్పబడలేదు (716 పే)

**"నాశనము" ప్రత్యేక అంశం 3:3లో చూడండి**

**9:23 "మహిమ పొందుటకు ముందుగా సిద్ధపరిచిన"**

ఇదే సత్యము రోమా 8:29–30 మరియు ఎఫెసి 1:4–11లో చెప్పబడింది. ఈ అద్యాయము క్రొత్త నిబంధనలో దేవుని సార్వభౌమత్వమును బలంగా వివరించేది. దేవుడు సృష్టి విషయములెనూ మరియు విమోచన విషయములో సంపూర్ణ అధికారము కల్గియుండెను. అనుదానిలో ఎటుంటి వివాదము లేదు. దేవుడు నిబంధన ద్వారా మానవులతో సంబంధము కల్గించుకొనుచున్నాడని అర్ధము చేసుకోవాలి. పాత నిబంధనలు, ఆది 9:8–17 మరియు 15:12–21లోనివి షరతులు లేనివై మానవ స్పందనను‌కోవలేదు. కాని మరికొన్ని షరతులు కలవై మనవ స్పందనను కోరినవి (ఎదేను, నోవహు, మోషే, దావీదు) దేవుడు మానవులను రక్షంచుటకు ప్రణాళిక కలిగెను. ఈ ప్రణాళికను ఏ మానవుడు ప్రభావితం చేయలేడు. దేవుడు వ్యక్తులు ప్రణాళికలో పాల్గొనుటకు దేవువు అనుమతించెను. ఈ అవకాశము, దేవుని సార్వభౌమత్వమునకు సంబందించిన వేదాంత తన్యతను కల్గించింది. (రోమా) మరియు మానవుని స్వేచ్ఛ చిత్తపు తన్యతను కల్గించింది. ఒక బైబిల్ వర్ణనను తీసుకొని వేరొకదానిని నిర్లక్ష్యము చేయటము సరికాదు. తూర్పు ప్రజలు సత్యమును ద్వంద్వరూపములో లేక తన్యతతో నింపబడిన జతలతో చెప్పుట వలన సిద్ధాంతముల మధ్య తన్యత కలదు సిద్ధాంతములు. ఇతర సిద్ధాంతములతో సంబంధము కల్గియుండాలి. సత్యము అనేక సత్యముల అమరిక.

ఇక్కడ నిజంగా మర్మము కలదు. అవిశ్వాసులు ఉగ్రత కొరకు సిద్ధపడినట్లుగా (కొటాప్టిజో) (22వ) మరియు విశ్వాసులు మహిమ కొరకు సిద్ధపడినట్టు (ప్రొటాఐమాజో) 23వ) గా పౌలు ముగింపును తీసుకొనిరావటం లేదు. దేవుని ఎంపిక యోనా కారకము, లేక కనికరపు ఆధారిత దేవుని ఎంపికయా, కాని కొంతమంది దేవుని బహుమానమును తృణీకరించినారు? మానవులు వారి స్వంత భవిష్యత్‌లో ఏదైనా భాగమును కల్గియున్నారా?

- **"మహిమ" 3:23లోని నోట్ చూడండి.**

**9:24** ఈ వచనము దేవుని వాగ్దానములు ఇశ్రాయేలు జాతిమీద కంటే విశాలమైన చూపిస్తుంది. దేవుడు తన ఎంపికను ఆధారము చేసుకొని తన కనికరమును మానవులకు చూపించెను. ఆది 3:5లోని వాగ్దానము మానవులందరిది. అబ్రహాము పిలుపు మానవులందరికి సంబంధించినది. ఆది 12:3. ఇశ్రాయేలు ప్రజలు, రాజులైన యాజక సమూహంగా పిలుపు అందరికి సంబంధించినది (నిర్గమ. 19:5–6). ఇది దాచబడిన దేవని మర్మము కాని ఇప్పుడు పూర్తిగా ప్రత్యక్షమైనది (ఎఫెసి 2:11– 3:13).

24వ లో పౌలు ధృవీకరనలు పాత నిబంధన మాటల వరుసలో చెప్పబడింది.

1. 25వ వచనం, హోషెయా. 2:23
2. 26వ వచనం, హోషెయా, 1:106
3. 27వ వచనం, యెషయా, 10:22 /హోషెయా 1:10ఎ
4. 28వ వచనం, యెషయా. 10:23
5. 29వ వచనం, యెషయా 1:9

**9:25-26.** దీని సందర్భము గ్రీకు బైబిల్ (LXX) యొక్క హోషెయా 2:23 (కొన్ని సవరణలతో) మరియు 1:10, అది అక్కడ దక్షిణపు పది గోత్రములను సూచించినది. అయితే పౌలు ఇక్కడ అన్యజనులను సూచిస్తున్నాడు. ఇది క్రొత్త నిబంధన గ్రంధకర్తలు పాత నిబంధనను వాడే రీతి. వారు సంఘమును ఇశ్రాయేలు వాగ్దానముల నెరవేర్పుగా చూసినారు. (II. కొరి. 6:16; తీతుకు 2:14; I. పేతురు 2:5-9). ఈ సందర్భములోని ఇది అవిశ్వాసులైన ఇశ్రాయేలీయులను సూచిస్తుంది. విగ్రహారాధిత దక్షిణపు 10 గోత్రములను దేవుడు తిరిగి నెలకొల్పగలిగితే, పౌలు దీనిని విగ్రహరిత అన్యజనులను దేవుడు తన ప్రేమతో మరియు క్షమాపణ చేర్చుకొనును అనుదానికి ఋజువుగా వాడుకొనుచున్నాడు.

NASB (నవీన) వాక్యము : **9:27-29**

**27. మరియు ప్రభువు తన మాట సమాప్తము చేసి, క్లుప్తపరచి భూలోకము నందు దానిని నెరవేర్చును గనుక ఇశ్రాయేలు కుమారుల సంఖ్య సముద్రపు ఇసుకవలె ఉండినను శేషమే రక్షింపబడునని 28. యెషయాము ఇశ్రాయేలును గూర్చి బిగ్గరగా పలుకుచున్నాడు. మరియు యెనయా ముందు చెప్పిన ప్రకారము 29. సైన్యములకు అధిపతియగు ప్రభువు, మనకు సంతానము శేషింపచేయక పోయినయెడల సొదొమవలె నగుదుము, గొమొఱ్ఱాను పోలియుందుము.**

NASB, NKJV, NRSV, NJB **"ఉండినను"**

TEV **"అయినప్పటికిని"**

ఇది మూడవ తరగతి షరతుల వాక్యము. ఇది శక్తివంతమైన కార్యమును సూచిస్తుంది.

**9:27-28.** ఇది యెషయా 10:22-23 యొక్క మాట (గ్రీకు బైబిల్, LXX) టెకల్సస్ రిసెపటస్ ఒక ముగింపు వాక్యమును యెషయా 10:23 నుండి కలిపినది. కాని ఇది పురాతన గ్రీకు ప్రతుల నుండి లేకుండా పోయినది. P46, X, A, మరియు B . ఇది తరువాత చేర్చబడినట్టిగా గుర్తించడమైనది. UBS[4] దీని తొలగింపును "నిశ్చయం" అని తెల్పింది.

- **"సముద్రపు ఇసుకవలె"** ఇది దేవుడు అబ్రహాము వాగ్దానములను అధికసంఖ్యలో ఫలితము కొరకు వాడబడిన ఉపమాన భాషలో ఇది భాగము (ఆది. 15:5; 22:17; 26:4).

- **"శేషమే రక్షింపబడును"**. ఈ "శేషము" అన్న పదము పాత నిబంధన ప్రవక్తలు, చెరపట్టబడిన ఇశ్రాయేలు ప్రజలు. దేవుని తిరిగి తీసుకురాబడుటను సూచించుటకు వాడినారు. పౌలు ఉపయోగంలో ఈ పదము, విశ్వసించిన యూదులు లేక సువార్త విని స్పందించినవారినందరిని సూచించేది. నిబంధన ఇశ్రాయేలులో కూడా ఆత్మీక వేర్పాటు ఏర్పడింది. కొంతమంది మాత్రమే దేవునితో సరిగా ఉన్నారు. ఇశ్రాయేలు ఎంపిక, వారి విశ్వాసపు అవసరమును మినహాయించలేదు (యెషయా. 1:16-20)

  పౌలు ఉపయోగించుచున్న పాత నిబంధన వాక్యము యూదులలో చెరపట్టబడినవారిని సూచిస్తుంది. వారిలో కొంతమంది మాత్రమే పాలస్తీనాకు తిరిగి వచ్చినారు. ఇది సువార్త వినువారి గురించినది. ఎక్కువమంది విశ్వసించలేదు యేసుని స్వీకరించలేదని సూచిస్తుంది. కొద్దిమంది మొదటి శతాబ్దపు వినినవారు (యూదులు మరియు అన్యజనులు) సువార్త వర్తమానమునకు స్పందించినారు. ఆ విధంగా స్పందించినవారిని శేషమని పౌలు చెప్పుచున్నాడు.

- **"సైన్యములకు అధిపతి"** ఇది పాత నిబంధనలో యెహోవాకు ఉన్న బిరుదు (యాకోబు 5:4). ఈ సందర్భమును ఆధారము చేసికొని, ఇది సైన్యపు భాషలో దేవున్ని సూచిస్తుంది. "పరలోకపు సైన్యము యొక్క అధిపతి" (యెహో. 5:13-15) లేక నిర్వాహక భావనతో వాడబడింది. సాధారణముగా ఎబిలోను సందర్భములో ఇది పరలోకపు శరీరములను "పరలోకపు శరీరుల యొక్క ప్రభువు"ను సూచించేది. నక్షత్రములు దేవుళ్ళు కావు; అవి సంఘటనలను మార్చలేవు మరియు ఆదీనములో ఉంచలేవు(ఆది 1:16; కీర్తన 8:3; 147:4; యెషయా 40:26)

▣ NASB "మనకు సంతానమును శేషింపనియెడల"

NKJV "మనకు సంతతిని విడువనియెడల"

NRSV "మనకు కొంత సంతానమును విడువని యెడల"

TEV "మనకు కొంత సంతానమును విడువని యెడల"

NJB "మనకు కొంత సంతానమును విడువని యెడల"

యెషయా 1:9 యొక్క హీబ్రూ వాక్యము "శేషమును" కల్గియుంది. కాని గ్రీకు బైబిల్ దీనిని "సంతానము"గా అనువదించినది. (NKJV) ఇశ్రాయేలు మీద దేవుని తీర్పు ఎప్పుడు (1) విశ్వాసులు శేషమును లేక (2) మెస్సియా వంశమును రక్షించేది. దేవుడు, అనేకులను రక్షించుటకు కొద్దిమందిని విడిపించెను.

▣ **"సొదామ ... గొ మొర్రా"** 28వ వచనం దేవుని తీర్పునకు సంబంధించినది. ఈ వచనము ఆది 19:24-26లో దేవునిచే నాశనము చేయబడిన రెండు అన్య పట్టణములను ప్రత్యేకంగా ప్రస్తావించినది. కాని ఇది దేవుని తీర్పును సూచించే ఒక జాతీయము. (ద్వితి. 29:34; యెషయా. 13:19; యిర్మియా. 20:16; 49:18; 50-40; ఆమోసు 4:11.

NASB (నవీన) వాక్యము : **9:30-33**

**30. అట్లయితే మనమేమందుము! నీతిని వెంటాడని అన్యజనులు నీతిని, అనగా విశ్వాసమూలమైన నీతిని పొందిరి; 31. అయితే ఇశ్రాయేలు నీతి కారణమైన నియమమును వెంటాఇనను ఆ నియమమును అందుకొనలదు. 32. వారెందుకు అందుకొనలేదు! వారు విశ్వాసమూలముగా కాక క్రియల మూలముగానైనట్లు దానిని వెంటాడిరి. 33. ఇదిగో నేను అడ్డు రాతిని అడ్డుబండను సీయోనులో స్థాపించుచున్నాను; ఆయన యందు విశ్వాసముంచువాడు సిగ్గుపరచబడదు అని వ్రాయబడిని ప్రకారము అడ్డురాయి తగిలి, తొట్రుపడిరి**

**9:30-31.** ఇది ఆశ్చర్యము గొలిపే దేవుని ఎంపిక ముగింపు. 30-33 వచనములు 9వ అ. యొక్క సారాంశము మరియు 10వ అధ్యా. యొక్క ఉపోద్ఘాతము. విశ్వసించిన అన్యజనులు దేవునితో సరిచేయబడినారు. కాని యూదులు అందరూ కాదు. దేవుడు నిబంధన పద్ధతిలో అందరితో వ్యవహరించును. దేవుడే ఎప్పుడు ముందు ప్రారంభించి, షరతులను నియమించును. కాని ప్రతి ఒక్కరై మారుమనస్సు, విశ్వాసము, విధేయత, ఓర్పులతో స్పందించాలి. మానవులందరూ (1) దేవుని సార్వభౌమత్వము; (2) మెస్సియా సంపూర్తి కార్యములో దేవుని కనికరము వలన; (3) విశ్వాసపు కార్యము వలన రక్షింపబడుదురు. అవును.

▣ **"నీతి"** ప్రత్యేక అంశము **1:17లో చూడండి.**

**9:32 "క్రియల మూలముగా"** టెక్ట్స్ రిసెపటస్ దీనిని "ధర్మశాస్త్రము"ను చేర్చినది. ఇది తరువాత కాపియిస్ట్ యొక్క చేర్పు. పౌలు తరుచుగా దీనిని " ధర్మశాస్త్ర క్రియలు" అని చెప్పుచున్నాడు (రోమా 3:20,28; గలతీ 2:16; 3:25చ10) కాని ప్రాచీన గ్రీకుప్రతులు P46 X, A,B,F, మరియు G వక్యమును "B" నిశ్చయంగా చెప్పినది. దేవని నీతికి మూలము దేవుని గుణము మరియు క్రీస్తు ద్వారా దేవుని బహుమానము కాని మానవ ప్రయత్నం కాదు. నీతి అనేది పతన మానవులు సాధించుట అసాధ్యము కాని ఇది క్రీస్తునందు విశ్వాసముంచుట ద్వారా ఉచిత బహుమానము. ఇది స్వీకరించబడాలి (33. వ; యోహాను 1:12;3:16; రోమా 4:1; 20:9-13; ఎఫెసి. 2:8-9). ఈ సత్యమును, యదార్ధ, మతతత్వ, నైతిక యూదులు తప్పిపోయినారు. జార్జి ఎల్డోన్ టాడ్ ఎథియాలజీ ఆఫ్ ద న్యూ టెస్టమెంట్ లో ఒక మంచి వాక్యమును చెప్పెను. "పౌలు ధర్మశాస్త్రపు సంబంధ బోధను, పౌలు తనగురించి, ఒక రబ్బీగానైననూ లేక ధర్మశాస్త్రము క్రింద ఉన్న మొదటి శతాబ్దపు యూదుడిని గాని సూచిస్తూ బోధించవచ్చు. అదే విధంగా పౌలు ఆలోచనను అది ఆయన యొక్క ఆత్మీయ స్వీయ చరిత్ర ఒప్పుదలగా గాని, లేక మొదటి శతాబ్దపు పరిసయ్యకపు ధర్మశాస్త్రపు గుణం యొక్క వివరణగా చూడకూడదు. కాని రెండు రీతుల నీతిని చెప్పి క్రైస్తవ ఆలోచనకారుడి వేదాంత వ్యాఖ్యానంగా చూడాలి. "ధర్మశాస్త్రము మరియు విశ్వాసము" (495. పే)

**9:33** ఇది యెషయా 28:16 నుండి తీసుకొనబడినదై. 8:14తో కలుపబడినది. "ఇదిగో సీయోను నేను ఒక రాతిని వేయుచున్నాను" 28:16 ఎ. "అడ్డు రాతిని, అడ్డు బండను " 8:14బి "ఆయన యందు విశ్వాసముంచువాడు సిగ్గుపరచబడదు" 28:16బి.

ఈ విధముగా ఈ వచనములును కలుపుట ద్వారా (రబ్బీల పద్ధతి) యెషయా 28:16 యొక్క అర్ధమును అనుకూలత నుండి వ్యతిరేకతను మార్చినాడు. పౌలు తన స్వంత ఉద్దేశ్యముల కొరకు పాత నిబంధనను వాడుకొనుచున్నాడు.

1. ఆయన ఎ అనువాదమును ఎంచుకొనెను. (LXX, MT, లేక తన స్వంత)
2. ఆయన రిఫరెన్సును మార్చెను (చెరలోని యూదుల నుండి అన్యజనులకు)
3. ఆయన వాక్యములను కలిపేవాడు
4. యెహోవా యొక్క పేరులను, సర్వనామములను యేసు కొరకు వాడేవాడు.

- **"ఆయన యందు విశ్వాసముంచువాడు సిగ్గుపరచబడడు".** ఇది యెషయా 28:166 నుండి చెప్పబడింది. అదే విధంగా రోమా. 10:11 లోను మరియు ఇదే రూపంలో యెవేలు 2:32, రోమా. 10:13 లోనూ చెప్పబడింది. రక్షణకు మూలం (1) వస్తువు (మూలరాయి) మరియు (2) సరి అగు స్పందన (ఆయనయందు విశ్వాసము).
- **"ఒక రాయి"** ఇది నిజముగా దేవునికి ఒక పేరు. (కీర్తన 18:1-2 31, 46; ద్వితి. 32:18; I. సమూ. 2:2; కీర్తన 28:1;31:3; 42:4; 27:3; 78:15), కాని ఇది మెస్సియా బిరుదులోనికి వచ్చినది. (ఆది 49:24; కీర్తన 118:22; యెషయా 8:14; 28:16; దాని 2:34-35, 44-45; మత్తయి 21:42-44). దేవుని నిబంధన వాగ్దానము యూదుల మెస్సియా ఉద్దేశ్యమును మాత్రమే అపార్ధము చేసికొనలుదు గాని, దేవుని నిబంధన యొక్క మూల విధిని అపార్ధం చేసుకొనినారు. క్రీస్తు యూదులకు అడ్డురాతిగా (యెషయా 8:14; లూకా 2:34), కాని విశ్వసించు వారికందరికి యూదులకు మరియు అన్యజనులకునూ పునాదిరాతిగా మారెను. (యెషయా 28:16; I. పేతురు 2:6-10).

**ప్రత్యేక అంశము : మూలరాయి**

**1. పాత నిబంధన ఉపయోగము**

ఎ. రాయి అనే అంశము గట్టిగా ఉండి, ఒక మంచి పునాదిని చేయులాగున ఇది యెహోవాను వివరించుటకు వాడబడినది. (కీర్తన 18:1)

బి. ఇది తరువాత మెస్సియా బిరుదుగా మారినది (ఆది 49:24; కీర్తన 118:22; యెషయా 28:16)

సి. ఇది మెస్సియా వలన యెహోవా నుండి వచ్చు తీర్పును సూచిస్తుంది. (యెషయా 8:14; దాని 2:34-35, 44-45)

డి. ఇది ఒక భావన రూపక అలంకారముగా మారినది.

1. ఒక పునాదిరాతిగా, మొదట వేయబడి మిగిలిన భవనము అంతటికి భద్రతను మరియు కోణములను ఏర్పరచి "మూలరాయి"గా పిలువబడింది.
2. ఇది చివరిగా వేయబడి, గోడలన్నింటిని కలిపి ఉంచేదానిని సూచిస్తుంది. (జకర్యా. 4:7; ఎఫెసి. 2:20,21) హీబ్రూ రుస్ నుండి "మూలరాయి" అని పిలువబడింది.
3. ఇది "ముఖ్యరాతిగా" ద్వారబందపునకు మధ్యవుండి గోడ అంతటి బరువును ధరించేదిగా సూచిస్తుంది.

**2. క్రొత్త నిబంధన ఉపయోగము:**

ఎ. యేసు, కీర్తన 118ని తనను గురించి సూచించుటకు వాడినాడు (మత్తయి 21:41-46; మార్కు 12:10-11; లూకా 20:17)

బి. పౌలు, కీర్తన 188ని అవిశ్వాసులైన తిరుగబడే ఇశ్రాయేలీయులు యెహోవాను తృణీకరించుటను సంబంధించి వాడినాడు (రోమా 9:33)

సి. పౌలు, ఎఫెసి 2:20 లో క్రీస్తును సూచించుటకు "మూలరాయి" అంశమును వాడినాడు.

డి. పేతురు, I. పేతురు 2:1-10లోని యేసుని అంశమును వాడినాడు. యేసు మూలరాయి మరియు విశ్వాసులు సజీవరాళ్ళు (విశ్వాసులు దేవాలయముగా I. కొరి. 6:19), ఆయన మీద కట్టబడి (యేసు నూతన మందిరము, మార్కు 14:58; మత్తయి 12:6 యెహాను 2:19-20) యూదులు యేసుని మెస్సియాగా తృణీకరించటంతో వారి నిరీక్షణ ఆధారమును తృణీకరించుటే.

**3. వేదాంతపరమైన వాక్యములు :**

ఎ. యెహోవా దావీదు। సొలొమోను మందిరమును నిర్మించుటకు అనుమతించెను. వారు నిబంధనను నిలిపినట్లయితే వారితో ఆయన ఉండి వారిని ఆశీర్వదించుదునని, అలా వారు చేయకపోయినట్లయితే మందిరము పాడు అగునని చెప్పెను. (I రాజు 9:1-9).

బి. రబ్బీల యూదా మతము, రూపము మరియు పూజలపై దృష్టి సారించి, వ్యక్తిగత విశ్వాసమును నిర్లక్ష్యము చేసినారు. దేవుని స్వరూపమందు చేయబడినవారు దినదినము, వ్యక్తిగతంగా దైవిక సంబంధము కల్గియుండాలని దేవుడు వెదుకుచున్నాడు. (ఆది. 1:26-27) లూకా 20:17-18, భయం గొలిపే తీర్పు మాటలను కల్గియున్నవి.

సి. యేసు తన భౌతిక శరీరమునకు ప్రతినిధిగా దేవాలయపు అంశమును వాడినాడు. ఇది వ్యక్తిగత విశ్వాసము రూపములోను యెహోవాతో సంబంధం విషయములోనూ అది వ్యాప్తి చెంది కొనసాగింపబడింది.

డి. మానవులు కోల్పోయిన దేవుని స్వరూపమును తిరిగి నెలకొల్పటమే రక్షణ అర్ధము. ఆ విధంగా దేవునితో సహవాసము తిరిగి నెలకొల్పబడుతుంది. క్రైస్తవ్యము యొక్క గురి ఏమిటంటే, క్రీస్తు పోలికలో ఇప్పుడే ఉండటం. విశ్వాసులు సజీవమైన రాళ్ళు, క్రీస్తుని మాదిరిగా చేసుకొని (నూతన మందిరము) కట్టబడుచున్నారు.

ఇ. యేసు మన విశ్వాసమునకు పునాది మరియు మూలరాయి (అల్ఫా మరియు ఒమేగా) అదే విధంఅ అడ్డురాయి మరియు అపరాధం యొక్క రాయి ఆయనను పోగొట్టుకోవటము సమస్తమును పోగొట్టుకొనుటయే ఇక్కడ మధ్య నేల లేదు!

**చర్చాప్రశ్నలు :**

ఇది ధ్యాన మార్గదర్శక వ్యాఖ్యానం కావునా బైబిల్ యొక్క మీ స్వంత వ్యాఖ్యానమునకు మీరు భాద్యులు. మనమందరం మన కివ్వబడిన వెలుగులో నడవాలి. నీవు, బైబిల్ మరియు పరిశుద్ధాత్మ భావ వ్యక్తీకరణలో ప్రముఖులు నీవు వేరే వ్యాఖ్యాన కర్తకు దానిని విడిచి పెట్టకూడదు. ఈ పుస్తకంలోని బహుళ విషయములను ఆలోచించుటకు ఈ చర్చా ప్రశ్నలు సహాయపడతాయి. అవి ఆలోచింపజేసేవే కాని, నిశ్చితమైనవి కావు.

1. 9వ అధ్యాయం (పూర్వ నిర్ధారణము) 10వ అ. నకు ఎలా సంబంధం కల్గియుంది.
2. 9:1-29 యొక్క ముఖ్య అంశమేమిటి?
3. దేవుడు ఇశ్రాయేలు యెడల తన వాగ్దానమును మరిచెనా ?
4. ఇశ్రాయేలు రాజ్యమునకున్న ధన్యతను వ్రాయుము (9:4-5)
5. యూదులందరూ దేవునితో సరిగా ఉన్నారా? ఎందుకు; లేక ఎందుకు కాకూడదు?
6. దేవుని చిత్తము చేయుటకు ఒక వ్యక్తి ఒత్తిడి చేయబడితే అతడు నైతికంగా భాద్యుడా?
7. పూర్వ నిర్ధారణకు “కనికరము” ఎలా ముఖ్యము (15, 16, 18, 23; 11:30-32)?